1

# మాతృభూమి

(గోవా ప్రజా జీవితాన్ని చిత్రించే నవల)



రచన:

లాంబర్టు మాస్కరినస్

అనువాదం:

శ్రీ ప్రతాప రామసుబ్బయ్య

# పరిచయం



లాంబర్టు మాస్కరినస్ ఇంగ్లీషులో వ్రాసిన "Sorrowing Lies y Land" అన్న నవలానువాదమే ఈ "మాతృభూమి".

మాస్కరినస్ గోవాలోనే పుట్టి పెరిగాడు. ఉన్నతవిద్య నభ్యసించడానికి బొంబాయి చేరాడు. 1939లో సెంటు జేవియర్సు కాలేజీలో పట్టభద్రుడయినాడు. తదనంతరం పత్రికా రచయితగా జీవితం ప్రారంభించాడు.

గోవా ప్రజల స్వాతంత్ర్యాకాంక్షనుగూర్చి, పోర్చుగీసు పాలకుల పైశాచిక చర్యలగురించీ లాంబర్టో తన రచనలద్వారా బైటప్రపంచానికి తెలియ చెప్పటం ప్రారంభించాడు. ఇది సహించలేని పోర్చుగీసు ప్రభుత్వం 1949లో మాస్కరినస్‌కు రెండు సంవత్సరాల జైలుశిక్షను విధించింది.

మాస్కరినస్ మొదటి నవల ఇదేఅయినా, గోవా ప్రజల యదార్థస్థితిగతులను — వారి ఆచార వ్యవహారాలు, పోర్చుగీసు పైశాచికపాలన. ఈ పైశాచిక శక్తిని నిరసించి ముందుకు పోతున్న స్వాతంత్ర్య ఉద్యమం—వీటిని చక్కగా చిత్రించారు. సామాన్య ప్రజలలోనుండి పాత్రల నేరుకొని, వారిభిన్న మనస్తత్వాలను చక్కగా చిత్రించారు. చదివి పుస్తకం మూసినతర్వాతకూడా ... కండ్లలో మెదులుతా...

వేమన పంచాయతీ

తెల్ప్రోలు

చర్చిగంట గణగణా మోగింది. దిరిశ్సెన చెట్టుక్రింద పూలేరుకుంటూ, మాఅమ్మా, మాచెల్లాయిలూ యింటికి వస్తున్నారేమో అని రోడ్డువంక తలెత్తిచూశాను.

మేరియాను, రూత్‌నూ ప్రతిఉదయం చర్చికి వెంటతీసికెళ్లడం మాఅమ్మకలవాటు. మితిమీరిన దైవభక్తంటే మానాన్నకిష్టముండేదికాదు. ఇంటిపద్దనే ఉండి యింత గ్రంధపఠనం చేసుకుంటే కాలాన్ని సద్వినియోగం చేసినట్లవుతుందని ఆయన తరుచుగా అభిప్రాయం వ్యక్తీకరిస్తుండేవాడు. అయితే మాఅమ్మ మానాన్న సలహాను అలక్ష్యం చేస్తుండేది చెల్లాయీలను చర్చికి విధిగా వెంటబెట్టుకుని చక్కా వెళుతుండేది ప్రతిఉదయం - మాటకారితనంతో మాగ్రామంలో కల్లా మానాన్నదే పైచేయని అందరూ అనుకునేమాటే. గడుసుదనంలోగూడా మాఅమ్మనుగూడా తీసి కట్టనిపించేవాడు. అయినా మతవిషయాల్లో మాఅమ్మదే అఖరుమాటగా చెలామణీ అవుతుండేది.

ఆనాడుదయం యెంతో శోభాయమానంగాఉంది ప్రకృతి. దిరిసెన చెట్టు యెర్రనిపూలతో విరగబూచి అరుణకాంతులు విరజిమ్ముతోంది. ాలచాటున దాక్కుని ఒక్క ఆకుకూడా కనిపించడంలేదు. దట్టంగా ెరాలిన పూలు మొఖమల్లుతో తయారైన యెర్రనిపట్టుపాన్పులా ది. మాగ్రామాన్ని రెండుగా చీలుస్తూ, మాయింటి సరసగా రోడ్డుగూడా యెరగ్రానే ఉంది. ఈరోడ్డుమరికొన్ని గ్రామాల్ని,

పచ్చనిపంట పొలాల్ని అధిగమించి, చివరకు దాని స్వరూపాన్నే మార్చుకొని, ఒకకాలిబాటతో కలిసిపోయింది. ఈకాలిబాట ఒక పెద్దపర్వతానికి తీసుకొనిపోయి, అంతటతో ఆగిపోతుంది. ఈ పర్వతానికి సంబంధించిన ఒక పూర్వగాధ యిప్పటికిగూడా చెప్పుకుని భయపడతారు మాప్రజలు. తల్లులు, బిడ్డలు అల్లరి చేసినప్పుడల్లా, "ఇస్స్! పిల్లాడా! అల్లరి చేయకు! అల్లరిచేశావా చూడు, కొండమీద దయ్యం పరుగెత్తుకుని వచ్చి అమాంతం మింగివేస్తుంది జాగ్రత!" అని బెదురుపెట్టేవాళ్ళు.

దిరిసెనచెట్టు క్రింద నిలబడి నిమ్నోన్నతమైన ఆ కొండ అందచందాలను చూస్తూ ఆనందిస్తున్నాను. అప్పుడే బారెడుపైకివచ్చినసూర్యుడు కొండ ఉపరిభాగాన్ని తన అరుణకాంతులచేత మనోహరంగా ప్రకాశింపజేస్తున్నాడు. ఈమనోహర దృశ్యాన్నిచూచి ఆనందిస్తున్ననేను, అమాంతంగా కొండపైకెక్కి అక్కడినుండి గ్రామసీమలపైనా, పచ్చనిపైరులపైనా దృష్టిసారించి చూస్తే యెంత ఆహ్లాదకరంగా ఉంటుందో అనిపించింది నాకు. త్రాగుబోతైన 'మానోల్' ఒకసారి కొండమీదెక్కినప్పుడు తనకు ఒక పెద్దదయ్యం ప్రత్యక్షమైందని అంటూ ఉండేవాడు. అయితేనేం, అతనిమాట యెవరూ నమ్మేవాళ్లుకారు. ఎలాగైతేనేం, యీపర్వతం నన్ను అన్నివిధాలా ఆకర్షించింది. నన్నాకర్షించినట్లుగా తక్కినవాళ్ల నెందుకాకర్షించలేదా అని నాకు విచారంకల్గింది.

మాఅమ్మా, చెల్లాయిలూ యింటిముఖంపట్టి వస్తున్నారు. ముసలితాత అనస్తాసియోను వెంటబెట్టుకుని మావాళ్లు తాపీగా అడుగులో అడుగేసుకుంటూ రోడ్డుదిగి యిరుకైన కాలిబాటనుపడి యింటికివస్తున్నారు ఆతురతతో నేనువాళ్లకెదురెళ్లి, క్రితంరోజు తెల్లావు యీనిన బుజ్జాయి యోగక్షేమాన్ని గూర్చి అనస్తాసియోను అడిగి తెలుసుకున్నాను.

"అన్నా, నన్ను మీయింటికి తీసుకొనిపోయి, మీబుజ్జాయిని చూపించవూ! ఇవ్వాళ్లే తప్పనిసరిగా చూపించాలి" అన్నాను.

అనస్తాసియో ఆప్యాయంగా నన్ను గుచ్చెత్తి మళ్ళీ నేలమీద దించాడు. అతని ముఖం, నా ముఖం సమతలంలో ఉండేట్టుగా తన రొండిమీద కూర్చుని, ఆవుదూడను వర్ణించడం మొదలెట్టాడు.

"ఆదూడ యెంత ముద్దుగా ఉందని! అదంటే నాకెంతో ప్రాణం. అది గోధుమవన్నె కోడెదూడ గూడా! నా అదృష్టం పండిందోయ్ బాబూ! ఈ ప్రాంతంలో దాన్ని యీడులేని కోడెగా తయారు తినిపించి. పందేలకు వదలాలని ఉంది!" అన్నాడు ఆనందం పట్టలేక.

"అయితే కోడెదూడల పందేలంటే నాకసహ్యం అన్నా! మమ్మాటికీ అసహ్యమంటే నమ్ము! నిజం చెబుతున్నా విను, మా నాన్నకు గూడా అసహ్యమే ఆ పందేలంటే!

అనస్తాసియో ఆశ్చర్యంతో, "ఏంబాబూ! నీకూ కోడెల పందేలంటే అసహ్యమేనా? ఎందుకని బాబూ? ఈ పల్లెటూళ్ళలో కోడెదూడల పందేలంటే, పిల్లల్కు మొదలు పెద్దలదాకా చెవి కోసుకుంటారే!" అన్నాడు.

"కావచ్చు అన్నా! నాకుమాత్రం అ పందేలంటే సుతరామూ యిష్టంలేదు. సరేగాని నాకిప్పుడే మీ బుజ్జి పాపాయిని చూపించు. దాన్నెప్పటికీ పాడుపందేలకు పంపనని నా ముందిప్పుడే ఒట్టేసుకో అన్నా!" అన్నాను.

"ఇప్పుడుకాదు బాబూ, యిప్పుడుకాదు! ఇప్పుడు పొలం పోవాలి నేను. కావాలంటే నిన్నుగూడా పొలం తీసికెళ్ళుతాను. మరివస్తావా బాబూ? రేపు తప్పని సరిగా మా యింటికి తీసికెళ్ళి మా బుజ్జాయిని చూపుతాను!" అన్నాడు అనస్తాసియో.

నేనూ, అనస్తాసియో మాట్లాడుకుంటూ ఉండగానే, మా అమ్మా, చెల్లాయిలూ యిల్లు చేరుకొన్నారు. తాతయ్యతో కూడా పొలం వెళ్ల డానికి మా అమ్మ అనుమతి తీసుకునేందుకు గబగబా యింట్లో జొర

బడ్డాను. అంతకు క్రితమే మా అమ్మ గుడ్డలు మార్చుకుంటూ, ముఖాని కడ్డం పడ్డ గౌనును వదిలించుకోడానికి తంటాలు పడుతూంది. విచిత్రంగా వున్న ఆ దృశ్యాన్ని చూసి నవ్వబోయాను. ఇంతలో మా అమ్మ మోకాళ్లు ఒక భయంకర దృశ్యంగా కనిపించాయి నాకు. ఆమె మోకాళ్లు శ్రద్ధగా పరిశీలించడం నాకిదే మొదటిసారి.

"చూడమ్మా! నీ మోకాళ్లు అలా నల్లగా అసహ్యంగా ఉన్నాయేమి అమ్మా?" అన్నాను విస్మయాశ్చర్యాలతో.

"అదే పనిగా గంటలు గంటలు చర్చిలో మోకాళ్ల మీద కూర్చునడంవల్ల!" అని సమాధానమిచ్చింది. అక్కడే నిలబడి వున్న మా మేరియా "అమ్మ విసుగులేకుండా యెంతసేపయినా మోకాళ్ల మీద కూర్చుని ప్రార్థన చేస్తూనే ఉంటుంది! అంచేతనే మోకాళ్ళపైన నల్లటి కాయలు కూడా కాచినాయి తెలిసిందా!"

"కాయలా! ఎంత ఘోరం! ఎంత భయంకరం! నీకవి బాధ కలిగించవా అమ్మా? ఏదీ, ఒక్కసారి వాటిని తాకి చూడనీ నన్ను!" అన్నాను ఆశ్చర్యపోతూ,

మా అమ్మ డ్రస్సు విప్పుకుని చిలక కొయ్యకు తగిలించింది. ఫ్రాకు తొడుక్కుంటూ నాతో, "చెల్లాయిలు, నీవూ నాకిన్ని చిక్కులు తెచ్చి పెట్టకపోతే మోకాళ్లు పోయ్యేటట్టు అంతసేపు చర్చిలో కూర్చునే దాన్నేకాదు. మిమ్మల్నందర్నీ బుద్ధిమంతులుగా చేయడానికీ, మీ పాపాలను క్షమించడానికి, మోకాళ్లు తీపులు పుడుతున్నా, అంతసేపూ దేవుని ప్రార్థించి తీరాల్సిందే! మరి తప్పదు! మీ రెలాగూ ఆ భగవంతుని తలచనైనా తలచరు! మీ బదులు నేనైనా కష్టపడక యెలా తప్పుతుంది చెప్పు?" అన్నది మా అమ్మ గంభీరంగానూ, ప్రశాంతంగానూ. మా అమ్మ మాట్లాడే ప్రతి మాటా కొలిచి మాట్లాడినట్లుంది నా మనస్సుకు.

మోకాళ్ళ మీది గాయల్ని తాకడానికి నేను ప్రయత్నించగానే.మా అమ్మ చటుక్కున వెనక్కు తప్పుకొని నన్ను పక్కకు నెట్టి వేసింది మెల్లగా.

" బాబూ నీవిక్కణ్ణుంచి తక్షణం వెళ్ళిపో! ఆడవాళ్ళు బట్టలు కట్టుకుంటుంటే నీకు సిగ్గుండ వద్దూ! నీవిక్కడెందు కసలు? వెంటనే వెళ్ళి పుస్తకాలు ముందేసుకొని కూర్చో. వెళ్లుతావా లేదా? అని గద్దించింది మా అమ్మ.

నేను గదిలోకి వెళ్ళినపని జ్ఞప్తికి వచ్చింది నాకు. అనస్తాసియోతో కలిసి నేను పొలం పోవాలనుకున్నట్లు గ్రహించుకుంది మా అమ్మ. ఆదరా బాదరా మా అమ్మ డ్రస్సువేసుకుని, ముసలాయనతో కలిసి నిజంగా పొలం వెడుతున్నానో లేదో కనిపెట్టడానికి వ రం డా లో కి వచ్చింది.

"అన్నా, మా అబ్బాయిని త్వరగా యింటికి తీసుకొనిరా మళ్ళీ. మధ్యాహ్నంలోగా వాడిని స్నానం చేయించాలి. దార్లో అల్లరీ, ఆటకాయి తనం చేయకుండా కనిపెట్టి ఉండు అన్నా" అన్నది మా అమ్మ.

"మరేం భయం లేదమ్మా! ఊరికే పొలం చూడ్డాని కెళ్ళుతున్నాను. ఇప్పుడురామూ యిద్దరం! మీ అబ్బాయి కొచ్చిన భయం యేమీలేదు! జాగ్రతగా కనిపెట్టే ఉంటాన్లే. గాభరా పడకమ్మా!" అన్నాడు అనస్తాసియో.

"సరేలే!" అంటూ లోపలికెళ్ళింది మా అమ్మ యింటిపనుల చక్కపెట్టు కోడానికి.

మా గ్రామం బలే అందమైనది - అంత పెద్దదీకాదు. అంత చిన్నదీ కాదు. మావూళ్ళో ఒకర్నొకరు యెరగని వాళ్ళంటూ యెవ్వరూ లేరు. గోవా అంతట్లోనూ, "కోపీనా" అన్నవూరు అన్నిటికన్నా అందంగా ఉంటుంది. సాల్‌సెటీ జిల్లాకు కేంద్రస్థానం మార్గోనగరం.

మూర్గోనుంచి దుమ్ములు రేగుతూ ఒక కంకరరోడ్డు బయల్దేరి రెండు చిన్న కొండలమధ్యగా సాగిపోతుంది. ఈ రోడ్డు నిమ్నోన్నతమైన సుందర దృశ్యంగా కనిపిస్తుంది. చిట్టచివరకీ రోడ్డు కొండశిఖరాన్నంటి కొంతసేపక్కడ విశ్రాంతి తీసుకుంటుందా అనిపిస్తుంది. కొండ కావలి ప్రక్క ప్రశాంతమైన సంతృప్తికర వాతావరణంలో జీవించే మా గ్రామంలో ప్రవేశిస్తుందీరోడ్డు. రోడ్డిప్పుడు పల్లపు ప్రాంతానికి సాగి పోవడంతో దానికి అడకువ, మర్యాద, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అల వడ్డట్లుగా కన్పిస్తుంది. మా గ్రామ పొలిమేరలు సమీపించగానే, అక్క డక్కడా పల్చపల్చగా ఉన్న యిండ్లూ, గొడ్ల సావళ్ళవద్దా, గడ్డి వాముల వద్దా అల్లరి చిల్లరగా తిరుగాడే కోళ్ళూ, కొక్కిరాయిలూ, పందులూ కనిపిస్తాయి. కుక్కలు మెట్లముందు నీరెండలో అరమోడ్పు కండ్లతో సోమరితనంగా పడుకుని ఉన్నాయి. గాలి తాకిడికి కదిలే ఆకుల అలికిడికి కుక్కలు మొరగడం ప్రారంభించాయి. ఆ తర్వాత రెండు ఫర్లాంగుల వరకూ యిండ్లేలేవు. ఇరుపైపులా ఉన్న పచ్చని పొలాలే రోడ్డుకు సహవాసం. తర్వాత ఒక పెద్ద మర్రిచెట్టు కన్పిస్తుంది రోడ్డు పక్కనే. అక్కడే రోడ్డు మలుపు తిరుగుతుందికూడా. అక్కడి నుంచి రోడ్డు కిరుప్రక్కలా బారులు తీరిన యిండ్ల వరస లుంటాయి. ఎర్రని యిండ్ల కప్పులతో, తెల్లని గోడలతో విసనకర్ర ఆకృతిలో ఉన్న యీ యిండ్ల వరసల మధ్యనే, మా గ్రామవాసులు జీవాత్మజ్ఞే పదిలంగా పరిరక్షించే కాపలా భటుడా అన్నట్లు ఒక చర్చి కన్పిస్తుంది. మా జీవిత సర్వస్వం నిజానికి యీ చర్చిని ఆశ్రయించుకునే ఉంది. మత సంబంధ మైన ఉత్సవాల్లో, తిరునాళ్ళల్లో మా గ్రామంలోని చిన్నా, పెద్దా అందరూ ఉత్సాహాతిశయంలో మైమరచిపోతాం. ఆడపిల్లలు ఆప్యాయంగా కొనుక్కున్న కొత్త ఫ్రాకులను అలంకరించుకొని ముచ్చటగా ఆడుతూ పాడుతుంటారు. మగపిల్లలు సంతల్లో అటూ యిటూ పచార్లు కొడుతూ,

షాపుల్లో అలంకరించిన అందమైన వస్తువులమీద దృష్టి కేంద్రీకరిస్తారు. ఆ రోజుల్లో రైతులంతా పనులు కట్టిపెట్టి, యేనాడో ముద్దు ముచ్చటల్తో కొని దాచుకున్న బూట్లను, మేజోళ్ళను, పట్టురుమాళ్ళనూ, రకరకాలైన లాగూ చొక్కాలనూ ధరించి హుషారుగా చర్చికి తయారౌతారు. అలవాటులేని బూట్లు కరిచి అవస్థపెట్టినా, విడిచిపెట్టరు. పండుగలూ, పబ్బాలూ ప్రతిరోజూ వస్తాయి గనకనా! అరుదుగా వచ్చే ఉత్సవాల రోజుల్లో, చీకాకులెన్నైనా భరించి, ప్రతిరైతు కుటుంబం కావలసినంత ఆనందం అనుభవించాలనే కోరుకుంటుంది.

చర్చి ఒక్కటే మాకు ఏడుగడ. కష్టపు దినాల్లో మాకు ఊరట కల్గించి, ఉపశమనం కల్పించేదే చర్చి. ఇది మా గ్రామవాసుల అచంచల విశ్వాసం. రోడ్డుకు ఎడమ పక్కగా శిలువతో యెంత గంభీరంగా ఉన్నదో చూడండి మాచర్చి! చుట్టూ సువిశాలమైన బహిరంగ స్థలం! మధ్యలో ఊరేగింపు కోసం విడిచి ఉంచబడ్డ చక్కని మార్గం. మార్గాని కిరుపక్కలా బారులుదీరి ఉన్న కొబ్బరి చెట్లూ, దిరిసెన చెట్లూ, తిరునాళ్ళనాడు చిత్ర విచిత్రాలైన వస్తువులతో అలంకరించబడ్డ దుకాణాలూ, దుకాణాల కత్యంత శోభను గూర్చి పెట్టే రకారకాలైన ఫలపుష్ప వృక్షజాతులూ. రోడ్డు కిరుపక్కలా చెట్లనీడను కూర్చుని గాజులు, అద్దాలు, దువ్వెనలు, రబ్బరు బెలూన్లు వందలకొద్ది ఆటవస్తువు లమ్మే దుకాణదార్లు, నోరూరించే మిఠాయి సామాన్లూ, కూల్ డ్రింక్స్, ఐస్ క్రీమ్, చెరుకు గడలు, వేరుసెనగపప్పు ఉండలూ, బఠానీ, సెనగపప్పులూ ఇనుం, ఇత్తడి, జర్మన్ సిల్వరు సామాన్లు - అన్నిటినీ మించి పసిబిడ్డల్ని అమితంగా ఆకర్షించే రంగుల రాట్నాలూ — ఇవీ తిరునాళ్ళనాడు చర్చి ఆవరణలో కనిపించే అద్భుత దృశ్యాలు. ఎప్పుడో ఒకసారి బస్తీముఖం చూసే మా బోటి పల్లెటూరివాళ్ళం చర్చి పండుగంటే చెవి కోసు

కొనడంలో ఆశ్చర్య మేముంది! అదేమాకు స్వర్గం! అదే మాకు వైకుంఠం!!

చర్చిని మేం ఉత్కృష్ట సంస్థగా పరిగణిస్తాం. చర్చికి సంబంధించిన పండుగ దినాలన్నిటికీ మేమెంతో ప్రాధాన్యత యిస్తాం. ప్రతిపండుగకూ, యెవరి చుట్టపక్కాలు వాళ్ళ పసిపాపలతో సహా యిరుగుపొరుగు గ్రామాలనుండి ప్రేమాభిమానాలతో మా యిండ్ల కతిథులుగా వచ్చి పండగ నాలుగు రోజులు ఆనందంగా కాలం గడిపి యెవరి యిండ్లకు వాళ్ళు చక్కా పోతారు. మా చెల్లాయి రూత్‌కు ఒక చక్కని చిన్న క్యాలెండ రున్నది. ఆ క్యాలెండరు పైన పండగల తారీఖుల్ని యెర్రపెన్సిల్‌తో గుర్తులు పెట్టి ఉంచింది. ప్రతి ఉదయం లేవగానే అయిపోయిన పండుగల్ని నల్ల పెన్సిల్‌తో కొట్టివేసి, రాబోయే పండుగ యింకా ఎన్నిరోజులుందో లెక్కపెడుతూ కూర్చుంటుంది. మా రూత్ దినచర్యలో యిదొక అంశం.

చెట్టపట్టాలు పట్టుకుని అనస్తాసియో, నేనూ రోడ్డు వెంట నడుస్తున్నాం. ఎదురైన ప్రతివ్యక్తినీ అభినందిస్తున్నాం. తిరిగి వాళ్ళ నుంచి అభినందనలు స్వీకరిస్తున్నాం. మధ్య మధ్య అనస్తాసియో రోడ్డు మీదనే నిలబడి కనిపించిన రైతులతో నాట్లను గురించీ, వర్ష యోగాన్ని గురించీ సంభాషించడం మొదలెట్టాడు. చర్చి దగ్గరకు రాగానే మరణించిన వాళ్ళ ఆత్మశాంతికై ముసలాయన యేసుక్రీస్తును ప్రార్థించడం ప్రారంభించాడు. రోడ్డుకు ఒక పక్కన భూస్వాముల భవంతులూ, మరొక పక్కన బీదరైతుల, కూలీల పూరిగుడిసెలూ దాటిపోతూ ముందుకు సాగాం. ఇంకా నాలుగడుగులు ముందుకు వేయగానే రైతు, కూలీలు, వాళ్ళ ఆడవాళ్ళతో కలిసి పొలాల్లో విత్తు లెదపెట్టడం చూశాం.

అనస్తాసియో పొలం ఊరికి చిట్ట చివరగా ఉంది. పొలం చేరు కొనగానే నన్ను కాలవగట్టు మీద కూర్చో బెట్టాడాయన. ఆ కాలవే

మా గ్రామానికి పొలిమేర హద్దు. నన్ను కూర్చో బెట్టి ముసలాయన పొలంలో దిగాడు. ఆ తొలినాడే విత్తులు నాటారు పొలంలో. అంచేత ఎలా ఉందో తనిఖీ చేయడానికని పొలం రావలసి వచ్చిందారోజు. గంట గంటన్నర సేపు పరిశీలించాడు. విత్తులు పొలం అంతా సమంగా కలిశాయో లేదో అని. నేనీలోగా ఆ పరిసరాలన్నీ కలియ చూచాను. నేనా ప్రాంతానికి వెళ్ళడం అదే మొదటిసారి. ఇంతలో రోడ్డు కపతల పక్క బీడులో నిరుత్సాహంగా కదలకుండా, మెదలకుండా నిలబడిఉన్న పశువుల గుంపొకదాన్ని చూశాను.

సుడిగాలి ఎక్కడినుంచో ప్రచండగా బయిల్దేరింది. తెరలు తెరలుగా ఎర్రని దుమ్మును ఆకాశానికి ఎగజిమ్మడం ప్రారంభించింది. అక్కడక్కడ సొమ్మసిల్లి పడిఉన్న గిత్తదూడలూ, పెయ్యదూడలూ యీ దుమారపు దెబ్బకు తత్తర బిత్తరై గాభరా పడుతున్నాయి. పచ్చనిగడ్డి కలికానికికూడా లేక కరవైంది. కనుచూపు మేరలో ఒకగడ్డిపరకగూడా కనిపించదు. తమతల్లులు దూరాన పచ్చిగడ్డికోసం తారట్లాడడం చూసి ఆవుదూడలాశ్చర్య పడుతున్నాయా అనిపించిందినాకు. తమతల్లులు నాలుగెండు పరకలు పంటికింద పెట్టుకుని నమలడంచూసి దూడలు ఆశ్చర్యపోతున్నట్లు మేం గ్రహించాం-ఇహ దూడల బాధో! ఆఎర్రదుమ్ములో ముట్టెలు పెట్టి వెతకగా వెతకగా, దుమ్ము కంపు కొడుతున్న నాలుగెండు పరకలు తప్ప వాటికి గత్యంతరం లేకపోయింది. మండుటెండల మూలంగా పరిసర ప్రాంతమంతా పచ్చిగడ్డికరవై, పశుజాతికి రుచికరమైన ఆహారమే లేక అలమటించి పోతున్నాయి.

మేనెల మంటగాడ్పులకు మాప్రాంతమంతా, ముఖ్యంగా పశువులకు నరకప్రాయమైంది. అవిగడ్డి దొరకక విలవిలలాడుతుంటే నాప్రాణం ఎలాగో పోయినట్లయింది. మరొకపక్క చెమటలు దిగజారేట్లు శ్రమించేవైరు, కూలీలపాట్లు చూస్తుంటే గుండెలు తరుక్కొని పోతున్నాయి.

కండ్లనీళ్ళు పర్యంతమయిందంటే నమ్మండి-క్రితం సంవత్సరం కన్న యీయేడు మంచిపంట పండించాలని రైతు, కూలీలు, ముక్తకంఠంతో ప్రార్థనలు చేయడంచూస్తే నాకు జాలితోపాటు ఆశ్చర్యంవేసింది.

మానవజాతి యింత కష్టించి, నెత్తురూ చెమటా ఓడ్చి పనిచేయడం యెందుకో! పొరుగూళ్ళవాళ్ళు మాగ్రామాన్ని అదృష్టదేవత వరించిందని అంటూ వుంటారు. మా చర్చిలో సెయింట్‌ఫ్రాన్సిస్ క్సేవియర్ విగ్రహానికి అద్భుతమైన మంత్రశక్తి ఉందనీ, యీశక్తివల్ల వాళ్ళపొలాల కన్న మావూరిపొలాలు అధికంగా పండుతాయనీ వాళ్లనమ్మకం. నిజానికి మేం కరిబూజాపండ్లు, చిలగడం, మిర్చి, ఉల్లిగడ్డలు మిక్కుటంగానే పండిస్తున్నాం. మేం పండించే సరుకులకు సాంసెటీ మార్కెట్లలో మంచి లాభసాటిధరే పలుకుతుందిగూడా. అయితేనేం! మారైతులు, మాకూలీలూ బానిసల్లాగా తెల్లవారుఝామునుండి చీకటి పడేవరకూ రెక్కలు ముక్కలయ్యేట్లుచాకిరిచేయడం తప్పటంలేదు.ఇంతకష్టించినావాళ్ళగొంతు జారడమనేది లేదుగదా! ఆరోజున యండగాడ్పులో నాకళ్లయెదుట ప్రత్యక్షంగా చూశాను వాళ్ళపాట్లు. నాశరీరం జలదరించి పోయింది. రైతు పండించే పంటలకు మంచి మంచి ధరలు వస్తున్నా, కూలీలకు గంజినీళ్లేనా గతి అనిపించిందినాకు. కడుపుకులేని కూలీలూ, బక్కచిక్కిన పేదరైతులూ రక్తంధారపోసి యెన్నాళ్లు కష్టించగలరు?

పొలాలపైన ఆహారానికై ఆరాటపడుతున్న పశువుల్నిచూస్తుంటే యిదివరలో నేనుచూసిన కోడెల పందేలు ఒక్కసారి నాస్మృతిపథంలోకి వచ్చాయి. ఛీ! పాడుపందేలు! తలనొప్పిపుట్టించే పందేలు! ఒక కోడెను మరొకకోడె చీల్చి చంపుతుంటే శరీరం కంపించిపోతుంది! మానవ హృదయంలో యేమూలనైనా కరుణఅనేది రవ్వంత ఉంటే, యీదృశ్యాన్ని సహించలేరు! కోడెల పందేలలో రక్తమెంత యెక్కువగా యేరులైపారుతే, సభికుల్లో ఉద్రిక్తత అంత హెచ్చుగా పెరుగుతుంది.

ఉద్రిక్తతలో వాళ్ళు తన్మయులై పోతారుగూడా. ఈపందేలు చూడవచ్చిన వాళ్ళల్లో రైతులూ, కూలీలుగూడా ఉంటారు. రైతు,కూలీలు రాత్రింబగళ్ళు పొలాల్లో పడే పాట్లనుగురించి విచారిస్తాం. కంట తడిపెడతాం. మానవులైన మనం యెంత దయాశూన్యులమో, యెంత క్రూరులమో అనిపిస్తుంది. ప్రతి పండుగరోజునా, ఒక్కొక్కప్పుడు ఆదివారంనాడు కోడెల పందేలు జరుగుతాయి. అయితే రెండేండ్ల క్రితం కోడెల పందేనికి ప్రత్యామ్నాయంగా మాగ్రామానికీ, 'వెలిమ్' గ్రామానికీ మధ్య గొప్ప ఫుట్ బాల్ పందెం జరిగింది. ఫుట్ బాల్ పందెంఅంటే మావూరిపెద్దలకు మహామంట. ఈపందేల్లో పాల్గొనే ముందు పిల్లలు తండ్రులవద్ద అనుమతిపొందాలి-పెద్దవాళ్ళకు నచ్చచెప్పి అనుమతి పొందడం అంటే తల ప్రాణం తోకకువచ్చేది కుర్రాళ్ళకు. ఈఫుట్ బాల్ పందేలకుగూడా అన్ని తరగతుల ప్రజలూ అమితోత్సాహంతో హాజరయ్యేవాళ్ళు అయితె దురదృష్టవశాత్తు గ్రామపెత్తందార్ల తాలూకు కుర్రాళ్ళకు ఆటల్లో కాలికో, చేతికో కాస్తంత గాయంతగిలినా, గ్రామపెద్దలారాత్రే సమావేశమై పంచాయతీపెట్టి తీరాలి! ఎవరిది దుందుడుకు తనమో తేల్చి వాడిపనిపట్టాలి! ఇకముందెన్నడూ ఫుట్ బాల్ పందేలు ఆడగూడదని నిర్ణయం గూడా జరిగి తీరాలి. ఈనిర్ణయం ఒక్కొక్కప్పుడు తిరుగులేని నిర్ణయం అవుతుంది గూడా.

కోడెల పందేలు! ఎంత నిర్దయ! ఎంత అమానుషం! అవి కోడెలకూ, కోడెలకూ మధ్య పందేలేగా! వాటివల్ల ప్రమాదం కోడెలకేగా! చస్తే అవే చచ్చిపోతాయి! మనషికేం వచ్చింది ప్రమాదం! గుండ్రాయి లాగా బాగానే ఉంటాడు మనిషి!

తరంగాలవలె ఆలోచనల వెంట ఆలోచనలు నా మనస్సును చీకాకు పెడుతున్నాయి. అప్పటివరకూ మా అన్నా కూర్చొమన్న కాలవగట్టు మీద కూర్చునే ఉన్నాను. ఇంతలో అనస్తాసియో వెనక

నుంచి నా ముందుకు వచ్చి ప్రత్యక్షమై నా ఆలోచనల కంతరాయం కల్పించాడు.

"ఏంబాబూ ! మళ్లీ యేవేవో ఆలోచిస్తూనే కూర్చున్నావ్ ! ఎప్పుడూ విడవకుండా ఆలోచనలు నిన్ను వెంటాడుతూనే ఉన్నాయి !"

"ఏంలేదు తాతా ! ఏంలేదులే !" అన్నాను గొణుక్కుంటూ. "తాతా ! నీ పొలం బాగానే ఉందికదూ ? విత్తనాలు చేనంతా కలిశాయా సమంగా ?"

"ఆ ! దేవుని దయవల్ల ! వర్షాలు యెంత త్వరలో కురిస్తే అంత మంచిదని దేవుని తలుచుకుంటున్నాను."

భుజంమీద ఉన్న యెర్ర తువ్వాలుతో అనస్తాసియో ముఖం తుడుచుకుని, జేబులో పొగాకుతుంపు తీసి నమలడం ప్రారంభించాడు.

"నీవు కూర్చున్న కాలవగట్టును గురించి నీకేమైనా తెలుసా బాబూ ?" అడిగాడు ముసలాయన,

"నా కేమీ తెలియదు తాతా !" అన్నాను. అనస్తాసియో అడిగిన ప్రశ్నలో అర్థం యేమిటా అనుకుంటూ ప్రయత్న పూర్వకంగా గట్టును పరిశీలించడం మొదలెట్టాను.

అనస్తాసియో బిగ్గరగా నవ్వడం ప్రారంభించాడు. "దేనికోసం వెతుకుతున్నావు బాబూ ? ఎంత వెదికినా అక్కడ నీకేమీ దొరకదు కీలకం. 'ఫంచూ' కాలు పరిశీలిస్తే, యీ గాధకు సంబంధించిన రహస్యం బోధపడుతుంది." అన్నాడు.

ముసలాయన మాటల్లో గూడార్థం నాకు బోధపడలేదు. "'ఫంచూ' కాలికీ, యీ కాలువకూ సంబంధం యేమిటి అన్నా ?" అని అడిగాను.

"ఏమిటీ? ఎవరూ చెప్పలేదా నీకు? అయినా ఊహించి చెప్పు చూద్దాం! సరైన సమాధాన మివ్వగలిగితే, ఒక పైసా బహుమానం గూడా యిస్తాను. ఉహు! ఒట్టిదే! ఊహించలేవు! ఏమంటావ్? సరే నేను చెబుతా విను. ఫంచూ అనే అతను డాన్ కార్లస్, ఫెలిప్‌ల హత్యా వార్తను మా గ్రామస్తులకు తక్షణం చేరవేయాలనే ఆతురతతో ఆఘ మేఘాల మీద ఉరుకులెత్తే టప్పుడు యిక్కడే అతనికి ప్రమాదం సంభవించింది." అన్నాడు అనస్తాసియో. తనలో తాను, "ఇక్కడ ఫంచూ తన కాలు యెలా విరగ్గొట్టుకున్నాడో నాకైతే బోధపడదు! ఎలా జరిగిందో ఆసంఘటన! అతను పూర్తిగా తప్పతాగి ఉండాలి!" అనుకున్నాడు అనస్తాసియో.

"ఏం జరిగింది అన్సూ? ఆ గాధంతా నాకర్ధమయ్యేట్లు చెప్పు! ఇప్పుడే నాకు చెప్పాలి మరి!" అన్నాను.

అనస్తాసియో నాపంక చూసి చిరునవ్వు నవ్వాడు. భుజంమీది యెర్ర తువ్వాలు తీసి నడుముకు చుట్టుకున్నాడు.

"జరిగిందంతా వినాలని తొందర పడుతున్నావు గమా! అయితే ఇంటికి బయల్దేరుదాం పద: దార్లో అంతా వివరిస్తాను. తక్షణమే బయల్దేరి పోవాలి. ఇప్పటికే ఆలస్యమైంది. మీ అమ్మ మనకోసం కనిపెట్టుకుని కూర్చుంటుంది గూడా" అన్నాడు అన్సూ.

ఎండ మలమల మాడిపోతూంది. ఆ తీక్షణతకు కంట్లు గూడా చీకట్లు కమ్ముతున్నట్లుంది. ఇంటిదారి పట్టాం. పది సంవత్సరాలనాడు జరిగిన సంఘటనలన్నీ పూసగుచ్చినట్లు యేకరువు పెట్టు తున్నాడు అనస్తాసియో. డాన్ కార్లస్, ఫెలిప్‌ల ఘోరహత్య ప్రతి పౌరుణ్ణీ విచార సముద్రంలో ముంచివేసిందనీ, దుఃఖ సూచకంగా కొన్ని రోజులవరకూ చర్చి గంటలు మోగుతూనే ఉన్నాయనీ, వాళ్ళ మనశ్శాంతికోసం ప్రజలు

యెడతెగకుండా ప్రార్థనలూ జరిపారనీ అనస్తాసియో. వివరించాడు. చర్చి సర్వీసుకు వర్గ బేధాల్లేకుండా ప్రజలందరూ హాజరైనారనీ, ముఖ్యంగా స్త్రీల దుఃఖావేశం మితిమీరి పోయిందనీ, యీ ఘోర విపత్తు వల్ల కలిగిన దుఃఖభారాన్ని ధైర్య సాహసాలతో దిగమ్రింగే సహన శక్తిని దేవుడు "అమీలియా" రాణికి ప్రసాదించేట్లుగా ప్రార్థనలు జరిపారనీ అనస్తాసియో ఆవేదన పడుతూ వివరించాడు.

ఆనాటి విషాదగాధ మా గ్రామ ప్రజలపైన యెలాంటి ప్రభావాన్ని ప్రసరింప జేసిందో అనస్తాసియో వల్ల తెలుసుకున్నాను. అనస్తాసియో దుఃఖావేశముతో చెబుతూంటే నా మనస్సు గూడా చెడిపోయింది. హత్యా వార్తను గ్రామానికి చేరవేయాలనే తొందరలో ఉరుకు లెత్తుతూ గట్టుకు కొట్టుకుని కాలవలో పడి మూలుగుతున్నాడు ఫంచూ. ఆ దారినే పోతున్న బండి మనిషి యీ సంఘటన కండ్లారా చూశాడు.

అనస్తాసియో వివరించిన గాధను శ్రద్దగా ఆలకించాను. "అన్నా! రాజుగారి పరిపాలన యెలా ఉండేదారోజుల్లో? ఆనాటికీ యీ నాటికీ తేడా యేమిటి? అనడిగాను.

"అలాంటి ప్రశ్నలు నన్నడగ వద్దు బాబూ! మా బోటి వాళ్ల కెందుకా గొడవలన్నీ! రైతులం. పొలం దున్నుకుని బతికేవాళ్ళం! రాజుగారిని గురించీ, ఆయన పరిపాలన గురించీ మీ నాన్నకు బాగా తెలుసు. విసుగులేకుండా చెప్పిందే పదిసార్లయినా చెప్పుతాడాయన. మాబోటి వాళ్ల కెవరి పరిపాలనైనా ఒక్కటే బాబూ! నేను ఆనాడూ కష్టించి పనిచేశాను; యీనాడూ చేస్తున్నాను. మాకష్టాలెవరు పాలించినా తప్పేవి కావు. ఏ కాలమూ మాకు కష్టాలొకటే. నేను చెప్పదలచు కున్నదింతే" అన్నాడు అనస్తాసియో.

"అయితే పూర్వంకన్న మనమిప్పుడు కొంచెం స్వేచ్ఛా స్వాతంత్ర్యా లనుభవిస్తున్నా మంటాడే మా నాన్న? ఇంకేవేవో

సౌకర్యాలున్నా యంటున్నాడే? వాటి మాటేమన్నా తెలుసా నీకు?" అన్నాను.

"హుం! స్వేచ్ఛా స్వాతంత్ర్యాలా! నాకేమీ తెలియదు వాటిసంగతి! అనుభవిస్తున్నామేమో మరి! అన్ని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ ఆ భూస్వాములవే అనుకుంటున్నాను నా మట్టుకు నేను. ఆ అదృష్టానికి వాళ్లే నోచుకున్నట్లున్నారు. ఒక్క తాగుడుకు మాత్రమే మేం నోచుకున్నాం. మాకున్న స్వాతంత్ర్య మల్లా అదొక్కటే. ఆనాటికీ యీ నాటికీ యీ స్వాతంత్ర్యంలో యే మార్పూ కనపడ్డంలేదు. రాజరికంలోనూ కడవడేసి త్రాగాం; ఈ నాడూ కడవడేసి తాగుతున్నాం. ఇవేనా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు!"

అనస్తాసియో ఉపన్యాస ధోరణి పూర్తయింది. నాకు వెంటనే నవ్వు వచ్చింది. ఆ తర్వాత అతని ముఖం గంభీరంగా పెట్టుకున్నాడు. రెండోసారి నా కెందుకో అపరిమితంగా నవ్వు వచ్చింది.

"ఎవర్ని చూసి నవ్వుతున్నావు బాబూ?" అన్నాడు అనస్తాసియో కండ్లు ముడుచుకుంటూ. "నేను చెప్పింది అక్షరాలా నిజం. దైవంగూడా అలాగే పలుకుతున్నాడు. ఆనాడైతే నేను వూళ్ళో లేను గాని, రాజరికం అంతరించిందని అక్టోబరులో వార్త రాగానే, మన రాజకీయ నాయకుల్లో కొందరు దుఃఖ సూచకంగా బ్రాందీ సేవించారట. అవే గ్లాసులతో రిపబ్లిక్ ప్రభుత్వానికి స్వాగతమిస్తూ "చాంపాంగ్" పానీయాన్ని గూడా పుచ్చుకున్నారట. హుం! ఇవీ మన దగుల్బాజీ రాజకీయాలూ! మన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు! సిగ్గు! సిగ్గు!"

అనస్తాసియో నోటికి వచ్చిన పదజాలాన్ని ప్రయోగించి మా రాజకీయ నాయకుల మీద తన అక్కసు వెళ్ళగక్కాడు. పోర్చుగీసు అధికార్లకు గూడా అదే మోతాదులో వడ్డించాడు. ఉన్నట్టుండి నావంక తిరిగి "బాబూ, నీ వయస్సెంత?" అన్నాడు.

"ఏడు సంవత్సరాలు !"

"ఏడు సంవత్సరాలేనా ? ఈ గాధ జరిగినప్పుడు నీ వింకా పుట్టనే లేదన్నమాట ?" మళ్ళీ తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ "దీని తస్సాగొయ్యా. యివ్వాళ యెండ మంట మండిస్తున్నది. ఈ సాయంత్రంలోగా చినుకులు పడవచ్చు !" అన్నాడు అన్నా.

మేమింటికి వెళ్ళే సరికల్లా మా అమ్మ వరండాలో నిలబడి ఉంది. "ఇదిగోనమ్మా మీ అబ్బాయి! అరిగేపోలేదు, విరిగేపోలేదు. కట్టే కంపా సావట్లో భద్రం చేసుకున్నావటమ్మా ? సాయంత్రం లోగా చినుకులు పడేట్లున్నాయి :" అన్నాడు అనస్తాసియో మా అమ్మ వంక తిరిగి.

వర్షం మాట వినగానే మా అమ్మ గాభరాతో అటూ యిటూ చూడ నారంభించింది.

"అవునమ్మా ! చినుకులు పడతవనే అనుకుంటున్నారు. ఆరు బయటి సామాను తెచ్చి సావట్లో సర్దుకోవమ్మా ! ఎందుకైనా మంచిది. నా పని చక్కదిద్దు కోడానికి నేనూ యింటికి పోతున్నాను."

ఆనాటి మధ్యాహ్నపు టెండ భరించలేనంత తీవ్రంగా ఉన్నట్లుంది. ఆ యెండ తీక్షణత పిల్లలు సహించి నంతగా పెద్దవాళ్ళు సహించలేరంటారు ! నిజమేమో మరి ! పిల్లలకు కొద్దో గొప్పో బాధ కలిగినా, పెద్దవాళ్ళంతగా తపన పడరు. ఆ సాయంత్రం యెవరినోట విన్నా వర్షంమాటే. రైతులు ఆరుబయటకు వచ్చి ఆకాశం వంక దృష్టి నిగిడించడం మొదలెట్టారు. అనుభవంగల ప్రతి ముసలి రైతూ ఆ సాయంత్రం వర్షం కురిసి తీరుతుందని జోశ్యం చెప్పాడు. ఎందుకైనా ముందు జాగ్రత పడడం వివేకమని తొందర పనులు చూసుకో బోయినారు రైతులూ, కూలీలూ.

వర్షాకాలం వచ్చేముందు కొంత కర్మకాండ జరపడం మా గోవాలో కొందరి కలవాటూ, ఆచారమైంది. ఏప్రిల్ నాటికే సంవత్స

రానికి సరిపడా ఉప్పు కొనుక్కొని భద్రం చేసుకుంటాం. ఇంటి కప్పు తిరగ నేయించుకొనడం, కట్టెలు కొట్టించుకొని యెండ బెట్టుకొని జాగ్రత చేసుకొనడం మా కలవాటు. మా అమ్మ దూరాలోచనతో యీ పని పాటలన్నీ ముందుగానే పూర్తి చేసుకుంటుంది. అదును తప్పి వర్షాలు ఒక వేళముందే కురిస్తే చిక్కుపడతామని ఆమె అన్ని జాగ్రతలు తీసుకుంటుంది.

కాని అదును తప్పిముందుగా వర్షించడం గోవాలో అరుదు. ఒక్కొక్క సంవత్సరం మొండికి వేసి, జూన్ ఆఖరులో, యింకా ఆలస్యంగానో కురవడం కూడా కద్దు. ఆ సందర్భాల్లో రైతులు వాన దేవుని మీద కారాలూ మిరియాలూ నూరుతారు. వర్షాలు కురవక పెద్ద వాళ్ళు చిరాకు పడుతుంటే, మాబోటి కుర్రాళ్ళం ఆ రోజు పండుగ చేసుకొంటాం. పాలకీలాంటి దాన్నొకటి తయారుచేసి సెయింట్ ఆంథోనీ విగ్రహం దాన్లోపెట్టి యింటింటికీ ఊరేగిస్తాం త్వరలో వర్షాలు కురిపించమని వానదేవుని ప్రార్థిస్తాం. పాటలు పాడుతాం. తోచినవాళ్ళు కానో అర్ధనో మా దిబ్బెంలో వేస్తారు. వసూలైన డబ్బుతో జయరాం అంగడికి పోయి పిప్పరమెంటు బిళ్ళలు, సెనగ పప్పు, బతానీలూ కొనుక్కొని పదిమంది పిల్లలకు పందేరం చేసుకుంటాం. వర్షాలు అదును తప్పి కురవబట్టేగా మేమంతా పండుగ చేసుకునే అవకాశం కల్గింది!

"రోజూ! మేరీ! రూత్! మీరంతా వెంటనేవచ్చి నాకుసహాయ పడండి. నాకొక్కదానికీ పని తెమిలేటట్టులేదు!" అని పిలిచింది మా అమ్మ- మధ్యాహ్నం పెరట్లో కొబ్బరిమట్టలు యెండవేసింది మాఅమ్మ. వర్షపుచినుకులు యేనిమిషాన పడతాయో అని భయంవేసిందామెకు.ఎండిన మట్టల్ని త్వరత్వరగా పోగుచేసి సావట్లోకి చేరవేయడంకోసం మమ్మల్ని కేకవేసి పిలిచింది. ఆకాశం నిండా కారుమేఘాలు అట్టహాసంగా

కమ్ముకున్నాయి. ఉరుములూ, మెరుపులతో ఆకాశము దద్దరిల్లిపోతున్నది. ఏనిమిషాన దబాటువాన కురుస్తుందో అని అనుమానిస్తూ భయపడుతూనే ఉంది మాఅమ్మ.

నాఅన్నలూ, తమ్ముళ్ళు, చెల్లాయిలూ అంతా అమ్మకు సహాయం ఇచ్చారు. ఎవరికితోచినట్లు వాళ్ళు తట్టల్లో, బుట్టల్లో కట్టె, కంపా, పిడాకలూ పెట్టుకుని సావిట్లోనూ, వంటయింట్లోనూ కుమ్మరిస్తున్నారు-అంతా తొక్కిసలాటగా ఉంది.

"నేనుగూడా సహాయంచేసేదా అమ్మా?" అని అడిగాను. ఆ అల్లరిలో నాభాగం నేనుగూడా పంచుకోవాలని సరదా పుట్టింది. మా అమ్మ ఒక్కతే యేసరదాలూ పట్టించుకోకుండా ప్రశాంతంగా ఉంది.

"వద్దు బాబూ! వద్దు! నీవు పసివాడవు. నీవుగూడా యీగుంపులో చేరితే యింకా గందరగోళం యెక్కువౌతుంది. ఇప్పటికే వీళ్ళు పెట్టె అల్లరితో చిరాకుపడి చచ్చిపోతున్నాను"

"లేదమ్మా! ఒక్క తట్టమాత్రం యెత్తుకుని పోయి వంటయింట్లో కుమ్మరించివస్తాను. ఒక్కతట్టంటే ఒక్కతట్టేనమ్మా!" ఎంతబ్రతిమాలినా మాఅమ్మ వినలేదు.

అప్పటికే యెవరిమట్టుకు వాళ్ళు అల్లరిచేస్తూ, ఆడుతూ, పాడుతూ, గీ బా అని అరుచుకుంటూ తట్టలుతిట్టలు చేరవేస్తున్నారు. మాఅమ్మకు సహనం దాటిపోయింది. రూత్ గంపనెత్తిమీద పెట్టుకుని, వెక్కిరించినట్టుగా యెవరినడకినో అనుకరిస్తూ, పాముమెలికలుతిరుగుతూ, వయ్యారంగా నడవడం ఆరంభించింది. మాఅమ్మ దాన్నిచూసి మండిపడి చెప్పు విడిచి పిర్రమీద రెండంటించింది.

"అమ్మా, అల్లరిచేయనే, అల్లరిచేయనే" అంటూ మాఅమ్మను బొడ్డల్లా తిప్పితిప్పి తప్పించుకుని పోయింది. చివరకు దూరానికి పారిపోయి

తలపైన తట్టపెట్టుకుని నాట్యంచేయడం ప్రారంభించింది. తట్ట నేలమీద దొర్లి దానిలోని చితపలన్నీ చెల్లాచెదరై పోయాయి.

"పాపిష్టిదానివి పుట్టావే నాకు! మగ వెధవలకన్న అన్యాయమై పోయావ్! హద్దుపద్దూ లేకుండా ఐపోయింది నీపని! ఈసారి చిక్కావంటే చూడు ఏంచేస్తానో! వొళ్ళు హూణం హూణంచేసి మరీ వదులుతాను భడవా ఖానా!" అని తిట్టడం మొదలెట్టింది.

ఆకాశం అంతకంతకూ నలుపెక్కింది. సామానంతా యింట్లో యెప్పుడు చేరుతుందా అని ఆందోళన పడుతోంది మాఅమ్మ. ఇంతలో మాఅన్న ఆంటోనియో అక్కడినుంచి మాయమైపోవటం ఆకస్మికంగా కనిపెట్టింది మాఅమ్మ. "అంటూ! ఎక్కడున్నావురా అంటూ! వెంటనే వస్తావా రావా?" అంటూ బిగ్గరగా కేకవేసింది.

మాఅమ్మ రెబటగా బలహీనంగా కన్పించినా. 'పిట్టకొంచెం కూత ఘనం' అన్నట్లు. ఆమె కంఠస్వరం చాలాపెద్దది. ఆమె కేకయెంత దూరమైనా వినపడుతుంది. ఆమె పొలికేక పెట్టినప్పుడు, కంఠంచుట్టూ ఉన్న రక్తనాళాలు బ్రద్దలైపోతాయా అన్నంతగా ఉబుకుతాయి. రెండు సార్లు కేకవేసినా, ఆంటోనియో జవాబివ్వలేదు. మాఅమ్మ నావంక తిరిగి, "ఇంతకుముందే నాకేదో పనిచేసి పెడతానన్నావుగదూ! నామాట విని, ఆంటోనియోను తక్షణం పిల్చుకుని రాబాబూ! ఈకాస్తంత పనిచేసి పెడితే నన్ను కొండెక్కించినట్లే!" అన్నది. వెంటనే నేను పరుగెత్తుకుని పోయి ఎక్కడెక్కడ వెతకాలో అక్కడల్లా వెదకాను. కేకలు పెట్టాను గొంతుపోయేట్లు. ఆంటోనియో జాడపోపడలేదు. తిరిగి మాఅమ్మవద్దకువచ్చి యీసంగతి చెప్పాను చేస్తూచేస్తూన్న పని వదలి పెట్టి ఆంటోనియోను వెదకడానికి మాఅమ్మ బయల్దేరిపోయింది.

ఆరాత్రి వర్షం రాలేదు. కాని మాఅమ్మ ఒకతుపాను లేవగొట్టింది. ప్రొపెర్షియా కూతురు క్లారాను. సావిడి వెనకపక్క మా ఆంటోనియో

రహస్యంగా ముద్దు పెట్టుకున్నట్లు మాఅమ్మ చూసింది. ఆమె హడావిడీ, ఆందోళనా యింతకూ యిది. వయస్సుమళ్ళిన తల్లిదండ్రులు, తమబిడ్డలకుగూడా ప్రకృతిసిద్ధమైన ప్రేమానుబంధాలుంటాయని తెలుసుకోలేనంత మందమతులైనారేమా అని నాకొక్కొక్కప్పు డాశ్చర్యంవేస్తూ ఉంటుంది. యువకులు తాము ప్రేమించిన యువతులను ముద్దు పెట్టుకొనడం మనం లోకంలో వింటున్నాం, చూస్తున్నాం. ఇక నావంటి పసివాడు ప్రేమకొద్దీ పసిబిడ్డలను ముద్దు పెట్టుకొనడం తప్పా ?

పాకావెనక అంటోనియో, క్లారాలిద్దరూ తారట్లాడడం చూసి మాఅమ్మ కంగారెత్తిపోయింది. తనబిడ్డ లిప్పట్నుంచీ ముద్దులు అలవాటు చేసుకొనడం యెంతమాత్రం ఆరోగ్యకరమైన అలవాటు కాదని మాఅమ్మ దృఢనమ్మకం. అందుకే మొక్కప్పుడే యీ దురలవాట్లను తుంచివేయాలని అంటోనియోను తక్షణం రమ్మని మాఅమ్మ ఊపిరాడని కేక వేసింది.

"పాకా వెనక యేంజేస్తున్నావురా అంటూ ? ఉన్న విషయం ఉన్నట్లు చెప్పు ! నా ముందు అబద్ధాలాడకు !"

మా అమ్మ కుర్చీలో కూర్చున్నది. అంటూ ముఖం చిన్నబోయింది. విస్మయుడై ఆమెముందు నిలబడ్డ అంటోనియో పైన ఆమె దృష్టి నిగిడ్చి అదే పనిగా చూస్తున్నది. మా అమ్మ బహుదొడ్డ యిల్లాలు. ఆమె అంతరాత్మ అతి నిష్కల్మషమైనది. అయితే కోపంవచ్చినప్పుడు మాత్రం ఆమెకు వళ్ళు తెలియదు; బుగ్గలు కందగడ్డల్లాగా యెర్ర బారుతాయి. నీటినుండి బయటపడ్డ చేప శ్వాసేంద్రియాల్లా ఆమె ముక్కులు యీలావున ఉబ్బి అదే పనిగా వణక నారంభిస్తాయి.

"ఏంలేదమ్మా ! అక్కడ కూర్చుని క్లారాతో ఆడుకుంటున్నా ! అంతేనమ్మా !"

"ఆడుకుంటున్నావూ ! ఏం ఆట నాయనా చెప్పు కొంచెం ! ఉన్నదున్నట్లు నిజం చెప్తావా లేదా నాకు ?"

ఆంటోనియో తడబడుతూ కధను మరో విధంగా మార్చడం మొదలెట్టాడు.

"అది కాదమ్మా! క్లారాతో కలిసి యింగ్లీషు నేర్చుకుంటున్నా నమ్మా!"

"ఇంగ్లీషా! ఎలాంటి యింగ్లీషురా అది? ఇప్పటికైనా నిజం బయట పెడతావా పెట్టవా?"

ఆంటోనియో తన ముఖవైఖరి మారుస్తూ, మరోవంక తల గోక్కుంటూ ఆలోచించి ఆలోచించి చివరకు నిజం బయటికి చెప్పెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

"క్లారాను ముద్దు పెట్టుకున్నా నమ్మా!" అన్నాడు ఆంటోనియో నిస్సారంగా.

"ఏమిటీ! మళ్ళీ అనరా ఆ మాట!

ఆంటోనియో నొసలుపైన చెమటబిందువులు రాలడం మొదలెట్టాయి. నోటివెంట మాట పెగిలిరావడం లేదు. కాసేపు మౌనంగా నిలబడి పోయాడు. ఉన్నట్టుండి మా అమ్మ ఆకస్మికంగా వెలవెల బోయింది. ఏదో విచిత్రమైన రోగం ఆమెను ఆవహించి నట్లనిపించింది నాకు. ఆంటోనియో మా అమ్మను విపరీతంగా బాధ పెట్టినట్లు తెలుసు కున్నాను. మా అమ్మవంక ఒక్కమాటు తేరిపార చూశాను.

ఇంతలో, "అమ్మా! నేనేమీ తప్పుగా భావించలేదమ్మా! ఊరికే ఆడుకుంటున్నా నమ్మా! అంతే!" అంటూ ఆంటోనియో క్షమార్పణ వేడుకో బోయాడు.

"ఆడపిల్లలతో అలాంటి ఆటలు పనికి రావురా నాయనా! నా బిడ్డల్లో యే ఒక్కరూ గూడా యిలాంటి ఆటలు మరగడం నాకెంత మాత్రం యిష్టం లేదురా! నీవు పెరిగి పెద్దవాడివై విద్యాబుద్ధులు నేర్చి వివాహ

మాడిన తర్వాత ఒక్క నీ భార్యనే ముద్దు పెట్టుకో! అంతే! అడ్డం వచ్చిన ప్రతి ఆడపిల్లనూ ముద్దు పెట్టుకుంటే నేను క్షమించేది లేదు."

ఆంటోనియో కొంచెం ధైర్యం తెచ్చుకుని బిగ్గరగా మాట్లాడడం మొదలెట్టాడు.

"అయితే ఆస్సుల్‌క్వెటానూ, ఆంటోనిటానూ ముద్దు పెట్టుకున్నప్పుడు క్లారాను మాత్రం యెందుకు ముద్దు పెట్టుకో గూడదమ్మా? ఆ యిద్దరికన్నా క్లారా యెంతో అందగత్తె గూడాను. క్లారాను ముద్దు పెట్టుకుంటే యెంత కమ్మగా వుంటుందో తెలుసా?"

ఆంటోనియో పలుకులు ములుకులుగా తోచినై మా అమ్మకు. వాడిని చూడలేకా, వాడి మాటలు వినలేకా, మా అమ్మ కండ్లు రెండూ మూసుకుంది. తన రెండు చేతులతో కుర్చీ రెండు చేతులను గట్టిగా అదిమి పట్టుకున్నది. చేతులు రెండూ నల్లబారాయి.

"ఆంటూ! ఎంతవాడ వైనావురా నీవు! ఈ ధోరణిలో నీవు మాట్లాడడం సహించలేనురా! ఇదే వరస సాగిస్తే నీ కథంతా నాన్నకు చెప్పక తప్పదు. చెప్పుమరి! బుద్ధి కలిగి ఉంటావా లేక నాన్నతో చెప్పమంటావా? సమాధానం చెప్పు వెంటనే!"

ఆంటోనియో తల వంచుకున్నాడు. ఒకటి రెండు నిమిషాలు పెదవి కూడా కదప లేదు. వినపడీ వినపడనట్లు, "మళ్ళీ ఆపని చేయనమ్మా! ప్రమాణంచేసి చెబుతున్నా విను." అన్నాడు.

మా అమ్మ శరీరానికి మళ్ళీ మామూలు రంగు వచ్చింది. వెలవెల బోతున్న పెదవులతో నీరసంగా ఒక్క చిరునవ్వు నవ్వింది. ఆంటోనియోను దగ్గరకు తీసుకుని వాడి కండ్లల్లోకి నిశితమైన దృష్టి నిగిడ్చింది మా అమ్మ. వానిని ఆరుబయటికి పోయి ఆడుకోమని పంపి వేసింది.

అయితేనేం! మా అమ్మ మనస్సూ, శరీరం నిజంగా బెజారెత్తి పోయినట్లుయింది. ఇంతకన్న విపత్కరమైన దుస్సంఘటన మా అమ్మ కిదివర కెన్నడూ సంభవించి ఉండదు. పాప భీతిగల మా అమ్మ, తన బిడ్డలు నైతిక మార్గం తప్పినప్పుడు, తనజీవితాన్ని నరకప్రాయంగా భావిస్తుంది. ఆకలి దప్పులనూ, ఆఖరుకు మరణాన్నైనా భరించగలదు కాని, తనబిడ్డలు దుర్వ్యసనాలకు బలికావడం మా అమ్మ సహించదు. ఈ దుర్వ్యసనాలే మానవుణ్ణి క్రమంగా శాశ్వతమైన పతనావస్థకు దారి తీస్తాయని మా అమ్మ దృఢంగా విశ్వసించేది. ముఖ్యంగా ఆడపిల్లల్ని ముద్దు పెట్టుకొనడం యీ దుర్వ్యసనాల్లో ఒకటిగా జమకడుతుంతేది మాఅమ్మ.

---

# ౨

క్లారా ఆడే అందగత్తె అని చెప్పడానికి వీల్లేదు. అందం అంటే యేమిటో వర్ణించలేని నా కండ్లకు కూడా ఆ పిల్ల రూపసిగా కన్పించదు. నా సోదరుల్లో చాలామంది నా అభిప్రాయాన్నే బలపరుస్తారు. ఎటొచ్చీ ఒక్క సీజరే క్లారా అందమైన పిల్ల అనీ, తన మనస్సుకు నచ్చినంత బొద్దుగా ఉంటుందనీ ఒకటే మెచ్చుకునేవాడు. నాకన్నా సీజర్ ఒక సంవత్సరం పెద్ద. కార్లస్, సీజరూ కవల పిల్లలు. సీజరు కండ్లకు ఆడపిల్లలు యెంత యెక్కువ నల్లగా ఉంటే అంత అందగత్తెలౌతారు. వాడి అందచందాల నిర్ణయాని కదీ కొలబద్ద. వాడి తిక్క మనస్సుకు అంద చందాల నిర్ణయం గూడా తిక్కగానే ఉండక మరెలా ఉంటుంది! వాడిది అదో గుబులు మనస్సు. ఒక్క ఆంటోనియోకు మాత్రం క్లారా అందాల రాణి. క్లారా ఆకర్షించినట్లుగా ఆంటోనియోను మరేదీ ఆకర్షించ లేదు. క్లారాతో కలిసి యింగ్లీషు నేర్చుకోవాలనే వంకతో మాటిమాటికీ మా ఆంటోనియో ఆ అమ్మాయి యింటికి పోతాడు. క్లారా యింగ్లీషులో గబగబా అనర్గళంగా మాట్లాడ గలదు. ఆ పిల్ల మాట్లాడుతూంటే మా గ్రామంలో యింగ్లీషు కాద్దో గొప్పో వచ్చిన వాళ్ళగ్గూడా ఒక్కముక్క అర్థం కాదు. అలాంటి క్లారాతో గంటలుగంటలు గడిపేవాడు మా ఆంటోనియో.

మా అమ్మ గూడా క్లారాను ఆడే మెచ్చుకునేది కాదనుకుంటాను. ఆంటోనియో మా అమ్మకు తొలుచూరు కొడుకు. వాడి వయస్సు 14

సంవత్సరాలు. ఆంటోనియో దృక్కుల తీరు తెన్నులు మా అమ్మ కని పెడుతూనే ఉంది. క్లారాను కాకుండా. అంతకన్న అందగత్తెలైన భాగ్యవంతుల బిడ్డల్ని ఆంటోనియో ముద్దు పెట్టుకుంటే బాగుండు ననిపించింది మా అమ్మకు. క్లారా తండ్రి పేదవాడు. పూనాలో గుమాస్తాగిరి చేస్తున్నాడు. మా అమ్మ ఆలోచనలు వింటున్న నేను "అంతే కాబోలు!" అనుకునేవాణ్ణి. దైవభక్తీ అధ్యాత్మిక చింతనా గల మా అమ్మ క్లారాను కాకుండా అంతకన్న అందమైన పిల్లల్ని ఆంటోనియో ముద్దు పెట్టుకున్నా. సహించి ఊరుకుండేదనుకున్నారా? నాకూ పెద్ద సందేహమే!

చర్చి దగ్గర ఒక చిన్న పూరియింట్లో క్లారా. ఆపిల్ల తలిదండ్రులూ కాపురం ఉన్నారు. ఒక్క మే నెలలో తప్ప. తక్కిన సంవత్సరం పొడుగునా వాళ్ళ యిల్లు తాళం పెట్టే ఉండేది. ప్రతి సంవత్సరం మే నెలలో క్లారా తలిదండ్రులు. కూతుర్ని వెంట పెట్టుకుని మా గ్రామం వస్తుండేవాళ్ళు. పొట్ట చేతపట్టుకుని జీవయాత్రకై దూర ప్రాంతాలకు ప్రయాణమై పోయే ప్రతి గోవా పౌరుడూ మాతృభూమిపై ఉన్న మమకారం వల్ల. కొన్ని రోజులైనా సుఖంగా గడపడానికి ప్రతి మే నెలలోనూ గోవాకు తిరిగి వస్తుంటాడు. కొంతమంది భూమార్గాన పెండ్లినడక నడిచి రైలులో పడమటి కనుమల ద్వారా ప్రయాణంచేసి గోవా చేరుకుంటారు. మరికొందరు పశువుల మందల్లాగా ఓడల్లో పడి అరేబియా సముద్రంపైగా ప్రయనిస్తారు. ఎవరెన్ని అవస్థలతో యెలా వచ్చి చేరినా. మితిమీరిన ఉత్సాహాతిశయాలతో మా ప్రజలంతా గోవాను ఆనంద దాయకమైన దృశ్యంగా మార్చివేస్తారు.

సంవత్సరం మొత్తంలో మే నెల మా గోవా ప్రజలకు ముఖ్యమైనది. మామిడి పండ్లు, పనస పండ్లు, జీడిమామిడి పండ్లు విరియకాస్తాయి యీ నెలలో. కాయల భారానికి చెట్ల కొమ్మలన్నీ నేల కానేట్లుగా, వాలి పోతాయి. ప్రజల మనోభావాలకు శ్రుతి కలుపుతున్నట్లుగా. కోయిల

మొదలైన పక్షులు మధురంగా పాడుతుంటాయి. తెల్లని యిసుకతో సముద్ర తీరమంతా అందాలు చిందుతూంటుంది. సంగీతం ఆలపిస్తున్నయా అన్నట్టు సముద్రతీరంలో కొబ్బరాకులూ, తాటాకులూ తలలూపుతూ, ఉత్సాహం ఉట్టిపడుతూ జుమ్మున శబ్దం చేస్తుంటాయి.

మేనెల దాదాపు సగాన పడ్డది. నిరుడు సంవత్సరంలాగానే ప్రతి రైలుబండీ, ప్రతి స్టీమరూ వందలకొద్దీ గోవా పౌరుల్ని మాతృదేశానికి చేరవేస్తున్నాయి. కేరింతలు కొట్టుకుంటూ పిల్లలు మాతృభూమికి రావడంచూసి ప్రేమంతా స్వాగతాలర్పిస్తున్నాం. పదిరోజుల పాటు నిర్విచారంగా, హాయిగా కాలక్షేపం చేద్దామని మా మిత్రులందరూ ఆతురతతో యిండ్లకు చేరుతున్నారు. మూసాలుగా మూతపడి ఉన్న యిండ్లన్నీ ఒక్కసారి భార్లాగా తెరవబడ్డాయి. గ్రామాలూ, పట్టణాలూ జనంతో క్రిక్కిరిసి పోతున్నాయి. యువకులూ, యువతులూ సంతోషం పట్టలేక సరస సల్లాపాల్లో నిమగ్నమైనారు. తండ్రులందరూ ఉత్సాహంతో మైమరచి త్రాగడం ప్రారంభించారు. తల్లులంతా ఒకచోట చేరి కబుర్లతో మునిగారు. ఎవరిమట్టుకు వాళ్ళు యింత విశాలమైన ప్రపంచంలో గోవా వంటి అందమైన ప్రాంతం మరెచ్చటా లేదని మురుసుకుని పోతున్నారు.

మే నెలలో గోవా ప్రకృతి సౌందర్యం అతి రమణీయంగా ఉంటుంది. ఒక్క ఆ గాలిదేవుడికే మా మీద దయలేదు. కాళ్ళు బ్రద్దలయ్యే మండు ఎండలతో మా ప్రాణాలు అలమటించి పోతాయి. ఈ నాడు గూడా యెండ మాడ్చివేస్తూనే ఉంది. ఆ నాడు సాయంకాలం లోగా వర్షం జల్లు పడితీరుతుందని అనస్తాసియో నమ్మకంగా జోశ్యం చెప్పాడు. రైతులూ, కూలీలూ ఆశతో అదేపనిగా ఆకాశం వంక నిమిష నిమిషానికీ తొంగిచూశారు. సంతోష చిహ్నంగా మాటిమాటికీ అరచేతులు రుద్దుకున్నారు. చెరువులూ. కుంటలూ, బావులూ అన్నీ

ఒక్కసారిగా నిండిపోతాయని యెంతో ఆశపడ్డారు. గడ్డీ, గాదం, పైరూ, పంటా పుష్కలంగా పండుతుందని కలలు గన్నారు. వాళ్ళ ఆశలన్నీ అడియాశ లైనాయి. తీవ్రమైన ఆశాభంగం కలిగింది. ఆ రాత్రి వర్షపు చినుకే పడలేదు. ఇంట్లోకీ, బయటకూ కాలు గాలిన పిల్లిలాగా రైతు లెన్నిసార్లు ఆతురతతో తిరిగినా, వారికి కలిగిన ఆశాభంగం యింతంత గాదు.

ఆ మర్నాడైనా నాలుగు చినుకులు పడ్డాయా అంటే అదీలేదు. తర్వాత వారానికి గాని తృప్తిగా వర్షం కురవలేదు. చినుకులు పడడం ప్రారంభం కాగానే యెక్కడి పిల్లలక్కడ యెప్పటికి మల్లే అపరిమితానందంతో ఆరుబయటికి పరుగుతీశాం. క్రమంగా వర్షం ధారాపాతంగా కురవడం సాగించింది. మాలాగులూ, చొక్కాలూ ముద్దముద్దయినాయి. వర్షంలో స్నానాలాడాం - మా కండ్లల్లోకీ, ముక్కుల్లోకీ, నోట్లోకీ నీళ్ళు పోయాయి. ఊపిరాడక కండ్లవెంట నీళ్ళొచ్చాయి చివరకు.

కుండపోతగా కురిసే వర్షంలో మేం పొందే ఆనందం యింతంత కాదు. ఆనాడు మేం చేసిన అల్లరికి అంతులేదు. వర్షం కురవడమే ఆలస్యం- పిల్లలంచరం వానలో పడి స్నానాలాడడం, గోలీలాడడం మామూలే. ఇదంతా మా అమ్మ చూసి చిరాకు పడుతుండేది. వర్షం కురిసిందీ అంటే సరీ, ఆంటోనియో సైడు కాలవలో ఉరవడిగా ప్రవహించే నీళ్ళలో పావుకోళ్ళను వదిలి గుడ్లప్పగించి చూస్తూ ఊరుకుండేవాడు. ఆ వేగానికి అవి అందకుండా యెక్కడికో కొట్టుకొని పోయేవి. నిరుటి సంవత్సరమే మా నాన్న కొత్తపావుకోళ్ళు ఆంనిటో యొకు కొనిపెట్టాడు. ఆడ్రియానో వాటిల్లో ఒకదాన్ని లంకించుకొని పడవగా తయారుచేసి రోడ్డు పక్క కాలవలో వదిలాడు. నీటి ఉరవడికి అదికాస్తా కనిపించకుండా కొట్టుకుని పోయింది.

వర్షాకాలంలో మా అమ్మ మాట బొత్తిగా వినేవాళ్ళం కాదు. లబో దిబోమని కొట్టుకున్నా, వర్షంలో పడి మా దోవ మాదే. జోరున వర్షం కురుస్తున్నా, వానపాముల కోసం తడుస్తూ యెంత దూరమైనా నానుతూ వెళ్ళే వాళ్ళం. వానపాముల వేటంటే మా కంత ప్రీతి. ఖాళీ నిప్పుపెట్టెల్లో వాటిని పట్టుకొచ్చి, మేరియా, రూత్ చెవులవద్ద విసిరి వేసే వాళ్ళం. వాళ్ళిద్దరూ గాభరాపడి గంతులేసేవాళ్ళు.

ఇదంతా మా కెంతో సరదాగా ఉండేది. ఒక రోజున వర్షం కురుస్తుండగా, రాబర్టో యింటి కప్పుపై కెక్కి రెండు పెంకులు ఊడ లాగాడు కొంటెతనానికి. మా భోజనాల గదినిండా దొడదొడా నీళ్ళు కారడం ప్రారంభించింది. మా నాన్నా, మా అమ్మా మండిపడి రాబర్టోను చావ చితక కొట్టారు.

వర్షం, వర్షం, వర్షం, వర్షం,
ఇవ్వాళ పోతే పోయావు, మళ్లీరా రేపు,
మా చెరువులూ, కుంటలూ యేకంచేసి, మాపంటలు పండించు
వర్షం, వర్షం, వర్షం, వర్షం!

ఈ వరసగా వర్షంలో నానుతూ, ఆటలాడుతూ పాటలు పాడుతూ ఆనందిస్తుండే వాళ్ళం. మరీ కుండపోత పోస్తూ, భరించ శక్యం కాన ప్పుడు మాత్రం, యిండ్లల్లో దూరి అక్కడినుంచి కాగితపు పడవలు చూరు నీళ్ళల్లో విసిరి వేస్తుండే వాళ్ళం. ఈ వర్షపు కాలవలె మా ప్రాణాలకు గంగానదీ ప్రవాహంలా తోస్తుండేది. ఈ కాలవల గుండా ప్రయాణం చేసే కాగితపు పడవలు దూర దేశాలకు పోయి చేరుతాయి కాబోలని ఊహించుకునే వాళ్ళం. త్రాగుబోతు మానోల్ తన ఊహా చిత్రంలో, దూర దేశాలన్నీ అదో రకంగా విచిత్రంగా ఉంటాయనీ, వాళ్ళ జీవిత విధానం మా జీవిత విధానానికి భిన్నమైనదనీ, వాళ్ళ రోడ్లన్నీ గాజుతో తయారు చేయబడతాయనీ, వాళ్ళ భవనాలన్నీ ఆకాశాన్నంటి ఉంటా

యనీ భ్రమ పడేవాడు. మేమూ యీ కథలన్నీ నమ్మేవాళ్ళం. మా కాగితపు పడవలూ, కొయ్య పడవలూ సరుకులతోనూ, మనుష్యులతోనూ యీ దూర దేశాలకు పోతున్నాయని భ్రమించి వెర్రి ఆనందం అనుభవించే వాళ్ళం.

ఈ రోజున కురిసిన వర్షం యింతా అంతా కాదు. అస్తమానం కుండపోత పోస్తూనే ఉంది. మేమంతా దిగ్భ్రాంతి చెందాం. నీళ్ళు ఉరవడికి మట్టి కొట్టుకు పోకుండా, మా నాన్న పెంకు ముక్కలు చూరు క్రింద పరసగా పోయించాడు. ఆ తమాషా యెలా ఉంటుందో అని నేనూ, మా రాబర్టో చొక్కాలూ, లాగూలూ రెప్పపాటు కాలంలో విప్పి అవతల పారేసి, చూరుక్రిందకు దూకాం. తల దిమ్మెక్కేట్లుగా మంచు గడ్డలాంటి చూరునీళ్ళు మా తలలపైన బరువుగా పడుతూంటే, ఊపిరాడక పోయింది మా పని.

ఎదురుగా వరండాలో నిలబడి మా చెల్లాయిలూ, అక్కయ్యా, అన్నదమ్ములూ మేం చేసే తమాషా చూసి ఆనందిస్తున్నారు. మాతో కలియరండని కేక లేశాం; మా వాళ్ళు రావడానికి నిరాకరించారు. ఒక్కసారిగా వాళ్ళపైనా, వాళ్ళ ప్రక్కగా ఉన్న గోడలపైనా నీళ్ళు చిమ్మికొట్ట నారంభించాం. దానితో కంగారెత్తి కేకలు పెట్టారు వాళ్ళు. వంట యింట్లో పిండి రుబ్బుతున్న మాఅమ్మ యీ కేకలు విని కంగ్రపట్టుకు వచ్చింది. ఇంట్లోకి తక్షణం నడవండని అదిలించింది మమల్ని.

" అల్లరి కుంకల్లారా! లోలికికి నడవండి! కదలక పోయారా, వీపులు బద్దలయాయన్న మాటే! కదులుతారా, లేకపోతే నన్ను........"
అంటూ పెద్దపెట్టున అరచింది అమ్మ.

" ఇంకా ఒక్క నిమిషమేనే అమ్మా! ఒక్క నిమిషం అంటే ఒక్క నిమిషం! ఇప్పుడేకదే మేం వర్షంలో దిగింది.!" అని బ్రతిమాలుకున్నాం.

" ఒక్క క్షణం గూడా వద్దు! వర్షపు నీళ్ళలో యింతసేపు తెగ నానితే జలుబు చేసి ఆరోగ్యం చెడిపోదట్రా? రేపట్నుంచి మీరంతా కొత్తస్కూలుకు్కూడా పోవాల్సి ఉంది. నన్ను విసిగించక. తక్షణం బయట పడండి వర్షంలో నుంచి!"

వర్షంలో నుంచి కదిలి లోపలకు రావడం మా కెవరకీ యిష్టం లేదు. కాని యేం జేస్తాం! తప్పని సరైంది. చివర వానబొట్టు మా మీద పడేవరకూ ఆనందిస్తూ. అడుగులో అడుగేసుకుంటూ మెల్ల మెల్లగా సాగాం లోపలికి.

" పెండ్లి నడకలు మానేసి త్వరగా నడవండి లోపలికి! ఇవ్వాళ నన్ను కట్టుక పోయేటంత చాకిరీ ఉంది కనిపెట్టుకుని. నా పనంతా పాడు చేస్తున్నారు మీరంతా కలిసి!" అంటూ మా అమ్మ తలో చెంప కాయా లాగికొట్టింది. ముతకతుండు గుడ్డతో మమ్మల్ని తుడుస్తుంటే, రాపిడికి మా చర్మం అంతా దోక్కుని పోతున్నట్టు బాధపడ్డాం.

" అంత గట్టిగా తుడవకే అమ్మా! వొళ్ళంతా మంటలు మండి పోతున్నదే అమ్మా! చూడిక్కడ పైతోలు యెలా లేచిపోయి నెత్తురు చిమ్ముతున్నదో!" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు రాబర్టో.

" నీకే మంచిదిరా నాయనా! జలుబు చేయకుండా ఉంటుంది! వర్షంలో యెవరు నాన మన్నారు నిన్నింతసేపు? స్నానం చేస్తే బావి నీళ్ళు లేవూ కావలసినన్ని? రోగం పెట్టుకు వస్తే. యెవరు చేస్తారను కున్నావురా? మీ నాన్నే మందూమాకూ యిప్పించి నయం చేస్తాడేమో లే! మీమీద సహనం గూడా పోతున్నదిరా అబ్బాయీ నాకు!"

" వర్షం నీళ్ళైతే యేమే అమ్మా? బావి నీళ్ళంతో వర్షం నీళ్ళు అంతేగా! ఆకాశం నుండి పడేనీళ్ళు యెంతో నిర్మలంగా ఉంటాయి గూడా. పైపెచ్చు రెక్కలు పడేట్లు తోడుకొనడం తప్పుతుంది గూడా! అంతే గదటే అమ్మా?"

"ఛీ! నీవెధవ వేదాంతాలు కట్టిపెట్టు యింతటితో. వర్షం నీళ్ళలో స్నానం చేయగూడదని చెప్పాను. అంతే! మారు మాటాడకుండా నేను చెప్పినట్లు చేయడమే నీ పని!" అని గద్దించింది మా అమ్మ.

"అయితే. అమ్మా.........."

"అమ్మాలేదు గిమ్మాలేదు! నోరుముయ్ అంతటితో! మీ వాదనలు కట్టిపెట్టండి! విన్నారా లేదా? ఏంబాబూ. నీవు మళ్ళీ యెప్పుడైనా వర్షంలో తడుస్తావా చెప్పు? తడుస్తానని చెప్పావా. నీ చర్మం ఒలుస్తా యిప్పుడే జాగ్రత! చెప్పుమరి!" అంటూ కండ్లెర్రజేసి ఆగ్రహ పరవశురాలై అరిచింది మా అమ్మ.

"లేదమ్మా! ఎన్నటికీ వర్షంలోకి పోను" అన్నాను.

"నీవు. రోబూ?"

"నేనూ పోనే ఎన్నటికీ!"

"రేపు స్కూలు తెరుస్తారు. వర్షంలో నానినాని జలుబులు పట్టుకుంటాయి మీకు! ఎలా చచ్చేదిరా నేను! రేపటినుంచి వర్షంలో తిరగండి. మీ పని చెబుతాను" అని దబాయించే సరికల్లా మా నోళ్ళు పడ్డాయి. ఈ సారి మా అమ్మకు నిజంగా కోపం వచ్చింది. దాని ఫలితం గూడా కొద్దోగొప్పో రుచి చూశాం.

మా అమ్మ చెబుతున్న స్కూలు కొత్తగా ప్రభుత్వాధికార్లు యీ సంవత్సరం యేర్పాటుచేశారు. కొత్తకట్టడాలు మొన్నమొన్ననే పూర్తయినాయి. రాజరికం అంతరించి రిపబ్లిక్ ప్రభుత్వం అవతరించడంతో పోర్చుగల్ ప్రజలకు ఆశారేఖ లంకురించాయి. మాతృ దేశంతో పాటు గోవా వంటి వలస దేశాల్లో గూడా నిరక్ష్యరాస్యత నిర్మూలించి, నాగరికతా విజ్ఞానాలను, ప్రజా జీవితాన్ని అభివృద్ధి చేయాలని ఆశించారు. గోవాలో. ప్రతిగ్రామంలోనూ ఒకొక్క స్కూలు యేర్పాటు చేయబడ్డవి.

కొత్తగా తెరవబోతున్న స్కూలులో ఎప్పుడెప్పుడు ప్రవేశిద్దామా అని ఉర్రూతలూగుతున్నాం మేమంతా.

ఈ రోజువరకూ మధ్యతరగతి రైతు బిడ్డలమైన మా బోటివాళ్ళం మాత్రమే జయరాం మాస్టరుగారి స్కూలుకు వెళ్ళుతూ వస్తున్నాం. స్కూలుగది జయరాంగారి అంగడికి వెనకప్రక్క అనుకునే ఉంది. అంగట్లోని కమ్మని బెల్లం. పిప్పరమెంట్లు సువాసన పీల్చుకుంటూ పాఠాలు నేర్చు కుంటున్నాం.

పైచదువు ఆశలేని రైతు. కూలిల పిల్లలందరూ చర్చి బడికి వెళ్ళు తుండేవాళ్ళు. ఈ స్కూల్లో మా ప్రాంతీయ భాష కొంకిణం చదవనూ వ్రాయనూ నేర్చుకునే వాళ్ళు. పిడేలు వాయిస్తూ పాడటం గూడా నేర్చు కున్నారు. ఈ ఫావరీ స్కూల్లో నానా గొడవగానూ ఉండేవి. చేపల మార్కెటు మెరుగు దానికన్నా. ఒకటే రొద. ఒకటేశబ్దం. ఈ శబ్దానికి పంతులుగారి కెన్నడో చెవుడు వచ్చేసింది. పంతులుగారిని పిల్లలు "మేస్త్రి" అని పిలుస్తుండే వాళ్ళు - పోర్చుగీస్ భాషలో "మెస్టర్" అనే పదానికి వికృతరూపం "మేస్త్రి". పంతులుగార్ని ఎన్నిపేర్లు పెట్టి అప హాస్యం చేసినా. ఆయనకు వినబడితేగా! చదువనే పేరుతో యింటి కప్పులెగిరి పోయే ఆ గందరగోళానికి ఆయనగారి చెవిగూబ లేనాడో పగిలిపోయాయి.

జయరాం పంతులుగారు చాలా పెద్దమనిషి. ఆయన వయసు మళ్ళిన వాడు గూడా. ఒక్క యీ స్కూలు పిల్లనే ఆయన పొట్ట నిండేది కాదు. కిరాణా దుకాణం గూడా పెట్టుకుని జీవితం గడుపుతూండే వాడు. ఆ గ్రామంలో యిలాంటి దుకాణాలు యిదిగాక యింకా రెండున్నాయి. అయినా గ్రామంలో కల్లా జయరాంగారు మంచివాడని ప్రతీతి. అందరూ యితని అంగడికే అలవాటైనారు.

పిల్లలందరికీ జయరాం గారంటే యెంతో అభిమానమూ, ప్రేమానూ. ఆయన అదో రకంగా విచిత్రంగా గూడా ఉండేవాడు. నునుపు దేలి, ముందుకు పొడుచుకు వచ్చిన ఆయన బొజ్జా, పక్షిముక్కు మాదిరిగా ఆయన ముక్కూ, ముక్కు చివరభాగం మీద ఆని ఉన్న కండ్లజోడు, చూడసొంపుగా ఉండేవి. ఆయన వేసే ప్రశ్నలకు గబగబా కిపిరాడకుండా ఆయనే స్వయంగా జవాబు లిచ్చేవాడు గూడా. ఆయన ట్టూ మమ్మల్ని వలయాకారంగా నిలబెట్టుకొని, యెక్కాలు చెప్పించే ప్పుడు తమాషా జరుగుతుండేది. ముఖ్యంగా "ఏడు తొమ్మిదు లెంత ?" అని ప్రశ్నవేసి వెంటనే, "అరవైమూడు !" అని తక్షణం ఆయనే సమాధాన మిస్తుండేవాడు మెల్లగా. దాన్నందుకుని పిల్లలందరూ - అరవైమూడు" అని గట్టిగా ధైర్యంగా వప్పజెప్పే వాళ్ళం. దీనితో యింటి దగ్గర నోరు పడేటట్లు యెక్కాల పుస్తకం చూసి చదవడం ప్పేది మాకు.

ఏ పక్కనుండి వాసన చూసినా, కమ్మగా ఆప్యాయంగా ఉండేది. కొత్తగా అప్పుడే దిగిన బెల్లం బుట్టలు చూసి మా నోళ్ళూ రేవి. అనుకుంటూండగానే, మాకు కావలసినంత బెల్లం కూడా దొ కేవి. ఆల్బర్టో బెల్లం బుట్టలు రావడం యెలా పసి గట్టేవాడో ! ఈ రహస్యం స్కూలంతా పాకేది. అతిగా మెక్కడం వల్ల ఆల్బర్టోకు కడుపు నొప్పి లంకించుకునేది ఒక్కొక్కప్పుడు. కూపీలు తీయడంలో వాడిని మించిన చేయి మరోటి లేదనిపించు కున్నాడు. హోంవర్కు చేయక తరుచుగా తప్పించుకు తిరిగేవాడు మా ఆల్బర్ట్. పంతులుగారు నిర్దాక్షి ణ్యంగా వాడిని యీడ్చుకెళ్ళి వీధిలో వున్న చీకటి కొట్లో పడేసి నల గొట్టేవాడు. ఆ చీకటి కొట్టే జయరాం పంతులుగారి స్టోరుగూడా. కొత్తసరుకూ, పాతసరుకూ యీ చీకటి కొట్లోనే దాచేవాడాయన. చివరకు కట్టె, కంపా గూడా ఆ గదిలోనే కుక్కేవాడు. మన ఆల్బర్టో

సావకాశంగా పరిశీలించి, యేసరుకు పాతదో యేది కొత్తదో వాసన పట్టేవాడు. పొట్ట పట్టినంత వరకు పంచదార, బెల్లం, వేయించిన సెనగ పప్పు బొక్కేవాడు. జేబులు పట్టినంత వరకు నింపుకునేవాడు. కడుపులో యెంత విప్లవం కలిగిస్తుందనే ఆలోచన గూడా లేదు వాడికి. ఆల్బర్టోను చూసి మేం గూడా హోంవర్కు చేయడం మానేసేవాళ్ళం అప్పు డప్పుడూ. మాస్టరుగారు విధించే శిక్షను హృదయ పూర్వకంగా స్వీకరించేవాళ్ళం. అంతకన్న మాకు కావలసింది మరేముంది కనుక.

పాపం, అమాయకుడైన జయరాంగారికి మా దొంగ ఉపా యాలు అర్థం కాలేదు. పంచదార, బెల్లం, సెనగపప్పు యెలుకలే ఫలహారం చేస్తున్నాయని నోటికి వచ్చినట్లు తిట్టి పోస్తున్నాడు. సగాని కన్నా సరుకును దిగమించిన తర్వాత గూడా మా మీద ఆయనకు అను మానమే కలగలేదు.

గవర్నమెంటు కట్టించిన కొత్త భవనాల్లో రెండు పెద్ద గదులూ, ఒక పెద్ద వరండా మాత్రమే ఉన్నాయి. ఈ భవనం కట్టడానికి ఒక సంవత్సరమల్లా పట్టింది. అది కట్టినన్నాళ్ళు పిల్లలం అందరం అక్కడ కుప్ప పోసిన యిసుక దిబ్బలమీద పడి దొర్లాడుతూనే ఉండే వాళ్ళం. జేల్దారీ పనివాళ్ళు యిటుకపైన యిటుక పేరుస్తూ కట్టడం గూడా చూస్తూ ఉండేవాళ్ళం. ఈ స్కూలు కట్టుతున్నారంటే, మా కెంతో సంబరంగానే ఉండేది. కాని రైతుల కెందుకో ఆటే యిష్టం ఉండేదికాదు.

మేస్త్రీలు స్కూలు కట్టుతుండడం చూసి అసంతృప్తి చెందిన రైతులు మా నాన్నతో, "చర్చి స్కూలు ఉన్నది గదండీ! దానికేం లోటు చెప్పండి! ఇన్ని తరాల నుంచి యింత పెద్ద స్కూలు లేకుండానే గడిపాం కదా! గవర్నమెంటు వాళ్ళు మా పొలాల్లో మరిన్ని బావులు తవ్వించి యింతనీరు సప్లయి చేయించగూడదండీ! ఎందుకు చెప్పండి యిన్నివేలు పోసి యీ స్కూళ్ళు!" అని అడిగారు.

"స్కూళ్ళంటే మీకెందుకిష్టం లేకపోవడం?" అడిగాడు మా నాన్న.

"బాబూ! స్కూళ్ళ వల్ల యేంప్రయోజనం చెప్పండి! మాపిల్లాళ్ళకు "మేస్త్రీ", మీబిడ్డలకు జయరాంగారూ చాలరటండీ?"

"వాటికన్నా యిది పెద్దస్కూలయ్యా! ఈస్కూల్లో కొంకణం బదులు పోర్చుగీస్ భాష నేర్పుతారయ్యా మీకేంతెలుసు! అదీగాక కొత్తస్కూల్లో పిల్లలకు జీతాల బెడద ఉండనే ఉండదు! తెలిసిందా?"

ఆపోర్చుగీస్ భాష పడిచావ! ఆ పాడుభాష చదివి మన పిల్లవెధవలు వెలగబెట్టేదేమిటండీ? మనవికాని ఆపాపిష్టి పోర్చుగీస్ భాషా, యింగ్లీష్ భాషా మనకు ఒరిగించేదేమిటండీ? మీరింత చదివారు గదా! ఏదీ చూద్దాం, మాలో ఏఒక్కరితోనైనా పట్టుమని పది నిమిషాలు పొలంలో నడుంవంచి పనిచేయండి చూద్దాం! చచ్చి యేలోకంలో ఉన్నాడో మహానుభావుడు మీనాన్నగారు, మీచదువు కోసం యెన్నివేలు పోశాడనుకున్నారు!"

"జీతాల్లేకుండానే ఉచితంగా చదువు చెబుతారంటున్నారు గదూ మీరు!" అన్నాడు కొత్తగా మాగ్రామంలోకి వలస వచ్చిన గణపతి. "ఆపోర్చుగీసోళ్ళను నమ్మకండి బాబూ మీరు! తల్లికి మొగుళ్ళు వాళ్ళు. కంకణ్‌లో మా బావమరిదికి కాస్తంత కొండర్రి ఉచితంగా యిచ్చినట్లే యిచ్చి, తీరా అది పంటకొచ్చే సరికల్లా, చచ్చినట్లు సొమ్ము కుమ్మరిస్తావా లేదా అని కూర్చున్నారు. మనపిల్లలు చదువుసంధ్యలు నేర్చుకుని విజ్ఞానవంతులయ్యే సరికల్లా, యీపోర్చుగీసోళ్ళు అదే నాటకం యెందుకాడరంటా?"

ప్రభుత్వంమీద రైతులు తెలియబరుస్తున్న అనుమానాలకు మానాన్న నవ్వడం ప్రారంభించాడు. "సరేలేవయ్యా! మీయిష్టం

వచ్చినట్లు అనుకోండి: మీఅభిప్రాయాలు మీవీ. మాఅభిప్రాయాలు మావీ।"

స్కూలు నిర్మాణం పూర్తికావడం దగ్గరపడ్డ కొద్దీ, రైతుల ఆగ్రహం ఎక్కువైంది. ప్రభుత్వాన్ని, ప్రభుత్వ భవనాన్ని చెడ్డ అనుమానాలతో చూడడం మొదలెట్టారు. ప్రతి సాయంత్రం సారాయి దుకాణంవద్ద రైతు, కూలీలు చేరినప్పుడల్లా, స్కూలు సమస్యపై వాదోపవాదాలు చెలరేగుతుండేవి.

"నాపిల్లల్ని ఆస్కూలుకు అసలు పంపనే పంపను।" అంటాడు ఒంటికంటి ఇస్సిడారో.

"నేనూ నాపిల్లాళ్ళను పంపను। నేనేమన్నా మీకు తీసిపోతానా!" అన్నాడు సారాయి దుకాణదారు ఫార్చునాటో.

"నేనూ పంపను।"

"నేనుగూడా పంపను।"

"నేనసలే పంపన్రా!"

అక్కడ చేరినవాళ్ళంతా ఒకర్నిమించి మరొకరు గొంతులు పెద్దవి చేసుకుంటూ వాళ్ళ పిల్లల్ని కొత్తస్కూలుకు పంపగూడదని నిశ్చయించుకున్నారు. అరిచి అరిచి అలిసిపోయారు. మధ్య మధ్యన రెండుగుక్కలు సారాయి సేవించి, మళ్ళీ తిట్లకు మళ్ళేవాళ్ళు. రాత్రి 8 గంటలకు చర్చిగంట మోగేవరకూ రణగొణ ధ్వనితో స్కూలు విషయమై చర్చలు సాగుతునే ఉండేవి. దుకాణందారు వ్యాపారం కట్టిపెట్టి తాళం బిగించాడు. ఆనిమిషంవరకూ పల్లెత్తు మాటైనా మాటాడని త్రాగుబోతు మానోల్ తృణీకార భావంతో అన్నాడిలా:

"బుద్ధిలేని వెధవల్లారా! ఈకొత్తస్కూలు మనపిల్ల వెధవల్ని ఉద్ధరించడానికే తయారౌతున్నదని ఎవఁడ్రా మీకు చెప్పింది?

భూస్వాములకూ. వాళ్ళ తాలూకు ఘరానా పెద్దలకూరా తయారైంది ! మిణుకు మిణుకులాడే మీకుర్రకుంకల కనుకున్నారేం, కట్టించింది పాపం ! మీపిల్లలా స్కూలుకు పోయినా ఒకటే, పోకపోయినా ఒకటే ! అడిగే వాడెవడురా ! పోకపోతే మరీసంతోషమే ! ఈ స్కూలు మూలంగా పాపం ఆపేదపంతులుకు వాగుడూ, శ్రమా తప్పి, పది కాలాలపాటు బ్రతకనైనా బ్రతుకుతాడు. ”

# 3

రాత్రి 8 గంటలు కొట్టేసరికల్లా సందడి సమసి పోయింది. వూరంతా మాటు మణిగింది. అస్తమానం అయ్యేసరికి మా వాళ్ళు కోళ్ళనూ. పందుల్నీ యిండ్లకు తోలుకొస్తారు. మిణుకు మిణుకులాడే బుడ్డి దీపాలు వెలిగించుకుంటారు. ఆ గుడ్డి దీపాల వెలుతురుకు పరిసర ప్రాంతాలకు మసక మసకగానే ఉండి పోతుంది. చేతిపనులు వృత్తిగా గలవాళ్ళు చిన్నచిన్న ఖాళీ సీసాలనే దీపపు బుడ్లుగా అమర్చుకుంటారు నైపుణ్యంతో. గట్టిగా గాలి వీస్తేచాలు యీ రకం దీపాలు ఒక క్షణంలో ఆరి కూర్చుంటాయి; వీటిల్లో స్త్రాణ యేముంది గనక. ఇక యీ పీడ వదిలింది గదా అన్నట్లు దీపపు బుడ్లు ఒక్క నిట్టూర్పు విడుస్తాయి.

భూస్వాములు దర్జాగా విదేశాల్లో తయారైన రకరకాల రంగు రంగుల లాంపులు వాడుతారు. అయినా అవిగూడా అమావాస్య చీకటి పోయేట్లయినా వెలుతురు నివ్వలేవు. మరేం లాంపులో అవి!

చీకటి పడ్డ తర్వాత ఆ రోడ్డుమీద నరసంచారం ఆసే ఉండదు. అక్కడొకరూ. యిక్కడొకరూ తప్ప. మాట్లాడే మనుష్యులే ఉండరు రోడ్డు పైన. అయితే. చనిపోయినవాళ్ళ ఆత్మశాంతికై యెవరి యింట్లో వాళ్ళు ప్రార్థనలు జరుపుకునేందుకు యెనిమిది గంటలకు చర్చి

గంట మోగే సరికల్లా రైతులు, కూలీలు, తాగుబోతులు, భూస్వాములు యెక్కడెక్కడి వాళ్ళు యిండ్లకు పరుగులు తీస్తారు. ఒక్క నిమిషం సేపు కండు మూస్తారో లేదో, యింతలోనే యేకుక్క మొరుగుడో, యేగుడగూబ కూతో వాళ్ళ మౌనాన్ని భగ్నం చేస్తుంది. అంతటితో వాళ్ళ ప్రార్థన చెలు।

ఆరోజు కార్యక్రమం అంతటితో ఆఖరైనట్లే. ఎక్కడెక్కడి వాళ్ళు యిండకు చేరుకున్న తర్వాత, తలుపులు బిడాయించుకుని భోజనాలు పూర్తిచేసుకుంటారు. తర్వాత వెంటనే నిద్రకు పడతారు. గ్రామ పౌరోహితుడు. ప్రతినిత్యా నిద్రపోయెముందు జపమాలిక తిప్పుతుని అప్పుడప్పుడూ ఉపన్యాసాల ధోరణిలో ఆదేశిస్తాడు. ఎవరో కొందరు భూస్వాములూ, స్త్రీలూ మినహా, తక్కిన వాళ్ళెవరూ పౌరోహితుని ఆదేశాలు పాటించరు.

ఒంటకంటి ఇసిడారో తప్పతాగి తూలుతూ యింటికొచ్చి పడ్డాడు ఆరాత్రి. తానూ, తన సహచరులూ పిల్లల్ని కొత్తస్కూలుకు పంపించబోమన్న నిర్ణయాన్ని చల్లగా భార్యచవిన వేశాడు. ఇంతలో భార్య అదిరిపడి దబాయించే సరికల్లా, యిసిడారో ఆశ్చర్యపోయాడు. నిషాదిగినంత పనైంది అతనికి.

"నీమాటలు యిక్కడెవరూ వినరు। పందుల్లాగా తప్పతాగి యిండ్లకువచ్చి, పిల్లల్ని యేలా పెంచాల్సిందీ శ్రీరంగనీతులు చెబుతారు మగవెధవలు। తక్కిన అడవాళ్ళు మేకల్లాగా మెత్తగా పడిఉంటే పడిఉండనీ। నేనుమాత్రం నీదబాయింపుకూ, నీశాసనాలకూ ఒదిగి పడి ఉండేదాన్ని కాదు ఏమనుకున్నావో। నామనస్సుకు తోచినట్లు పెంచి, నాబుద్ధికి నచ్చినట్లు చదువు సంధ్యలు నేర్పిస్తా।" అన్నది రోషంతో ఎస్ప్రిలీనా.

ఎస్ట్రిలీనా అతిగడుసు పెండ్లాం. తతిమ్మా కూలీల భార్యల మాదిరి కాదామె. వాళ్ళ మొగాళ్ళు యెన్నితిట్టినా, యెన్ని కొట్టినా చచ్చినట్లు పడుంటారు. ఎస్ట్రిలీనా అలాకాదు. ఇదివరలో బొంబాయిలో యీమె ఒక పార్సీ కుటుంబములో దాసీగా పనిచేసినట్లూ, అప్పట్నుంచీ మొగుణ్ణి అప్పుడప్పుడూ బడితెపూజ చేస్తున్నట్లు మావూళ్ళో అందరూ చెప్పుకుంటారు. బొంబాయిలో కాపురం చేస్తున్నప్పుడే ఎస్ట్రిలీనాకు మగాళ్ళతో బాగాపరిచయం ఉండేది. పెండ్లి కాక ముందునుంచీ యితర మగాళ్ళను మరగడం యీ అమ్మాయి తలిదండ్రులు అసహ్యించుకునే వాళ్ళట. తలిదండ్రుల బాధ పడలేక చివరకు నామమాత్రంగా యిసిడారోను వివాహ మాడాలసొచ్చింది ఎస్ట్రిలీనా. అయితే మొదట్నుంచీ ఎస్ట్రిలీనా మొగుణ్ణి చూచి అసహ్యించుకునేదే. ఒకసారి మాట్ల సాయిబ్బుతో లేచిపోవడానిగ్గుడా ప్రయత్నించిందట.

"అయితే ఆ కొత్త స్కూలుతో మనకేం అవసరమే అమ్మీ?" అన్నాడు ఇసిడారో అణకువతో.

ఎస్ట్రిలీనా మండిపడ్డి "మత గురువు పిల్లల్ని కొత్త స్కూలుకే పంపమన్నాడు తెలిసిందా?" అన్నది కుండ పగలగొట్టినట్లు నిష్కర్షగా.

"ఆ మత గురువు పాడైపోను! వాడెక్కడ దాపరించాడే! ఈ యింటికి యజమాని ఆమాయవారి మత గురువా. లేకనేనా?"

"ఎవ్వరూ కాదు! నీవు కాదు. ఆ మత గురువూ కాదు. నేనే యజమానీ, యజమానురాల్నీ గూడా! తెలిసిందా? తెలియకపోతే, యిప్పుడైనా తెలుసుకో. ఈ యింటికి సర్వాధికారిని నేనే. వాకేది మంచిదని తోస్తుందో, దాన్నే చేసి తీరుతాను!"

కొత్త స్కూలు ప్రారంభమైంది. చాలా మంది పిల్లలు హాజరైనారు గూడా. పంపనే పంపమని ఆనాడు డంబాలు పలికిన రైతులూ,

కూలీలు గూడా తమ పిల్లల్ని స్కూలుకు తీరా పంపనే పంపారు. అభిమానించ గూడదని నిర్ణయించుకున్న వాళ్ళంతా అనేక విధాలుగా స్కూలును అభిమానించారు. పెడ్రో, జో, కాటరీనా మొదలైన రైతులంతా ఆరోజంతా స్కూలు దగ్గరే ఉన్నారు, ఉత్సాహంగా కాలం గడుపుతూ.

సమీపంలో చెరువు గట్టునే యెత్తుగా పెరిగి ఉన్న దేవదారు వృక్షాలను పడగొట్టి, వాటితో బెంచీలు తయారు చేయించారు స్కూల్లోకి. బెంచీల పనితనం యేమీ బాగాలేదు. మొరటుగా ఉన్నాయి చూపులకు. యుక్త వయస్సు రాకముందే తొందరపడి లేతచెట్లను పడగొట్టారు. రంపం పెట్టి కోస్తుంటే లేతవాసన వచ్చింది గుప్పున. సజీవమై యీ నాటివరకూ కన్నుల పండుగగా ఉన్న చెట్లు మా కండ్లముందే నశించి బెంచీలుగా అవతారం తాల్చాయి. నాకు ఊహ తెలిసినప్పట్నుంచీ యీ దేవదారు చెట్లను కండ్లారా చూస్తూ, యెంతో ఆనందించేవాణ్ణి. ఎత్తైన చెట్లు, ఆకులతో, రెమ్మలతో కొమ్మలతో యెంతో గంభీరంగా ఉండేవి. మందమందంగా వీచే పిల్ల వాయువులు ఆకులను ముద్దు పెట్టు కున్నప్పుడు అవి కిలాకిలా నవ్వడం యెన్నటికీ మరచిపోలేను. ఆ మనోహర దృశ్యం జ్ఞప్తికి వచ్చి ఒళ్ళు పులకరిస్తుంది. ఒకసారి పక్షులు ఆకులచాటున కూర్చుని మధురాలాపాలు తీయడం, మరోసారి ఆడ పక్షులతో ప్రేమాభినయాలు చేయడం స్ఫురణకు వచ్చి నా మనస్సు ఉప్పొంగుతుంది. ఆ దృశ్యాన్ని చూసి, ఆనందం పట్టలేక నవ్వుకుంటూ, నవ్వుకుంటూ పైపైకి పోయి ఆ పక్షుల్ని పట్టుకో ప్రయత్నించాను. కాని సాధ్యమైతేగా నాకు!

ఇప్పుడా మనోహరమైన దృశ్యం ఎదీ! గంభీరమైన ఆ వృక్షాలు అంతరించి పోయాయి గద! జీవాలు లేని కర్కశమైన బల్లలుగా రూపొంది యీ స్కూలు గదుల్లో పడివున్నాయి. నేటి లోకపు పోకడ

గూడా యింతేననుకుంటా! ఒకర్ని దోచుకుని, మరొకడు సర్వ సౌఖ్యాలూ, సకల భోగభాగ్యాలూ అనుభవించడమే నేటి లోకపు తీరు! కొత్తగా మాకు పాఠాలు నేర్పడానికి ఒక పంతులమ్మగారు ఆ క్రితం రోజే మా గ్రామానికి వచ్చిందని విన్నాం. అయితే యింతవరకూ మే మెవరమూ ఆమెను చూళ్ళేదు. భయపడుతూ, భయపడుతూ, ఆ బల్లల పైన కూర్చుని కొత్తపంతులమ్మ వాలకం యేలా ఉంటుందో చూడ్డానికి ఆతురతతో నిరీక్షిస్తున్నాం. ముసిలిదో, కురూపో, చండశాసనురాలో, లేకపోతే జయరాంగారి స్కూల్లో మాదిరిగా మమ్మల్ని అల్లరిచేయనిచ్చే దాపతోఅని తెలుసుకోడానికి ఆతురత పడుతున్నాం.

మూడోవరస బెంచీమీద నాసరసనే కూర్చున్న భూస్వామి కొడుకు ఇనాసిన్హో, "నేనైతే ఆమెను చూళ్ళేదుగాని కొత్తగా దిగిన పంతులమ్మ బ్రాహ్మణ మనిషని మానాన్న చెప్పాడురా!" అన్నాడు.

"ఏమిటీ! బ్రాహ్మణ మనిషా!" అన్నాను ఆశ్చర్యంతో అదివర కెన్నడూ బ్రాహ్మణులన్న మాటే వినలేదు నేను.

"అవునురా! బ్రాహ్మణ పంతులమ్మేరా! నేను చెబుతున్నానుగా నమ్ము!" అన్నాడు మళ్ళీగట్టిగా.

"నీవు చెప్పేది నాకర్ధమే కాలేదురా! బ్రాహ్మణులంటే ఏమిటిరా అసలు?" అడిగాను చెవిలో రహస్యంగా.

"అది మనకులాల్లో ఒకటిరా! నీవు, నేనూ క్షత్రియులం. అయితే మనవెనక కూర్చున్న పెడ్రో, జో, యింకా మనవూళ్ళో రైతులూ, కూలీలు- వాళ్ళందరూ శూద్రులు!" అన్నాడు ఇనాసిన్హో వివరంగా.

నా కర్ధంకాక, "మనల్నెందుకురా అలా పిలుస్తారు?" అన్నాను.

"ఆవిషయం నాకు తెలియదురా! నిజంగా తెలియదు!"

నాకాసక్తి మరింత ఎక్కువై, "ఇదంతా ఎవరు చెప్పార్రా నీకు ?" అనడిగాను.

"నాకెవరూ చెప్పలేదుగాని, మాయింట్లో అప్పుడప్పుడూ మానాన్న కుల, మతాలను గురించి చెబుతుంటే విన్నానురా। ఇప్పుడిప్పుడే శూద్రులు చదువుకుంటూ తెలివితేటలు సంపాదించుకుంటున్నారనీ, అన్నివిధాలా తెనుగు మీరుతున్నారనీ. క్షత్రియులైన మనం యీ శూద్ర జాతుల్ని ఆదిలోనే కాళ్ళూ చేతులు అంటగట్టి పైకి రాకుండా తొక్కి వేయాలనీ గూడా మా నాన్న అంటుండే వాడురా।"

"ఎలా తెనుగు మీరి పోతున్నార్రా అబ్బాయ్ ?" అన్నాను.

"నీ ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పలేన్రా। అంత తెలివి తేటలూ, అనుభవం నాకు మాత్రం ఎక్కడి నుంచి వచ్చాయిరా! అయితే శూద్రులు గూడా మనమాదిరే చర్చీలలో ప్రార్థన సమయంలో ఎర్రకుచ్చులు ధరించుకుని మనతో సమదీటుగా వుండాలని కోరుతున్నట్లు మా నాన్న చెబుతుంటే విన్నాను. ఇంతవరకూ ఒక్క మన క్షత్రియకులం వాళ్ళే ఎర్రకుచ్చులు ధరించుకునే గౌరవ ప్రపత్తు లనుభవిస్తున్నట్లు నీ వెరిగిన విషయమేగా।"

మేమీ తీవ్రమైన చర్చలో పాల్గొంటుండగా. యింతలోనే ఆకస్మికంగా మగపిల్లలూ. ఆడపిల్లలూ లేచి నిలబడ్డారు. అందమైన ఒక యువతి మా గదిలోకి రావడం చూశాను. ఆమె అందచందాలకు నేను విస్మయం చెందాను. ఈమేనా నిజంగా మా పంతులమ్మ! జయరాంగారి స్కూలుకు చిన్నతనం నుండి అలవాటు పడడం వల్ల. పంతులమ్మ లనగానే, అందరూ కురూపులైన ముసలమ్మలే కాబోలనుకున్నాను. నాబోటి గాళ్ళంతా యీ అభిప్రాయంలో ఉండడం వల్ల, నా కళ్ళకు యీ పంతులమ్మగారెంతో ఆకర్షణీయంగా, అందంగా కనిపించింది.

"నమస్కారమండీ పంతులమ్మగారూ!" అన్నారు పిల్లలంతా, ఒక్కసారిగా చెవులు గింగురుమనేట్లు.

"నమస్కారం!" అంటూ పంతులమ్మగారు ప్రత్యభివందనం చేసింది. ప్లాట్‌ఫారం మీద అమర్చిన కుర్చీ, టేబుల్ వద్దకు సాగి పోయింది మెల్లగా.

ప్లాట్‌ఫారంపైకి వయ్యారంగా యెక్కిందామె. సంచీ, పుస్తకాలూ టేబిల్‌మీద ఉంచి మా వైపు తిరిగి చూసింది. అప్పటివరకూ మేమంతా నిలబడి ఉండడంచూసి, కూర్చోమని సంజ్ఞ చేసింది. ఆమె టేబిల్‌పక్కనే ఒక మోకాలు కొద్దిగావంచి నిలబడి, మావంక అదో రకంగా తమాషాగా చూడసాగింది. ఆకాసేపట్లోనే మమ్మల్ని చూసీ, మా నడతను చూసీ ఆశాభంగం చెందిందేమో అని నాకాశ్చర్యం, అనుమానం వేసింది.

"ముందు మీతో పరిచయం చేసుకోనివ్వండి!" అన్నది చిరునవ్వుతో ఆమె. ఆమెగారి పళ్ళు నిగనిగ తెల్లగా మెరుస్తున్నాయి. వెంట్రుకలు చక్కగా సున్నగా దువ్వుకొని గులాబీరంగు రిబ్బనుతో ముడివేసుకున్నది. ఇప్పటి ఫ్యాషనో యేమో, ముడి కొంచెంగా యెడమ ప్రక్కకు వాలి ఉన్నదామెకు.

ముందు వరస బెంచీమీద కూర్చున్న జోనాను చూసి, "నీపేరేమి అమ్మాయీ?" అని అడిగింది పంతులమ్మ.

"జోనా అండీ పంతులమ్మగారు!"

"మరి నీపేరో? నీపేరో? నీపేరో? ............?" అంటూ వరసాగా అందర్నీ అడుగుతూ పోయింది.

కొంచం గాభరాతో, "నాపేరు ఫిల్!" అన్నాను నావంతు రాగానే. నాపేరు తప్పుగా ఉచ్చరిస్తానేమో అని భయపడుతూ ప్రతి అక్షరం లోలోపల ముందుగా గుణకారం చేసుకుని చివరకు సరిగా

చెప్పగల్గాను. పేరు తప్పుగా ఉచ్చరిస్తే పంతులమ్మ గారికి నామీద తప్పుడభిప్రాయం యెక్కడేర్పడుతుందో అనే భయం లోపల నన్ను వేధిస్తునేఉంది. ఆమెవైపు దీక్షతో చూస్తునే బెంచీమీద కూర్చున్నాను. ఆకస్మికంగా ఆమెమీద నామనస్సుపోయి ప్రేమించాను. ఆమెకు సేవకుడుగానైనా ఉంటి, ఆమె చేయమన్న పనల్లా చేయాలని బుద్ధి పుట్టింది. ఈ ఆరాటమంతా ఎందుకు నాకు! ఆమె యెర్రని పెదవులపై చిందులుతొక్కే చిరునవ్వుకోసం! గులాబీ పువ్వులాగా అందమైన ఆమె మెత్తనిచేతుల్ని ఒక్కసారైన స్పృశించడాని కోసం! ఇంత సుకుమారమైన చేతుల్ని యిదివర కెన్నడూ చూచిఉండనే లేదంటే అత్యుక్తికాదు.

నావంటి పసిపిల్లవాడు ప్రేమించ గలడా? మానవ హృదయాల లోతుపాతులను, మనోభావాలను పరిశీలించ గలిగే విజ్ఞానులు, లౌకికులు నాప్రశ్నకు ప్రతికూలమైన అభిప్రాయాన్నే ప్రకటిస్తారు. అయితేనేం! నాహృదయంలో కలిగిన పరిణామం ప్రత్యక్షమైనదీ, యదార్థమైనదీగూడా. ఇదివర కెన్నడూ అనుభవించని విచిత్రమైన అద్భుత అనుభూతి యీనాడనుభవించాను.

"నీపేరు ఫిల్ కదూ?" అన్నదామె కనుబొమలు చిట్లిస్తూ. మా పినతండ్రి కూతురు ఆంటోనిటాకు మల్లే పంతులమ్మగారి కను బొమలు నల్లగా, సహజంగా వంపు తిరిగి తీర్చి దిద్దినట్లున్నాయి. మా పినతండ్రి కూతురు యేపూటకాపూట ప్రత్యేకమైన ఉపకరణాలతో కనుబొమల్ని వంపు తీసుకొని, నల్లరంగు వేసుకుని యెంతో శ్రమపడితే గాని సహజంగా ఉన్నట్లు కనిపించవు.

"అంటే నీపూర్తి పేరేమన్నమాట" అడిగిందామె.

నోటివెంట మాటరాక, గాభరాపడుతూ అట్టే నిలిచిపోయాను. ఇనాసిన్హా నాపాలిటి దేవుళ్ళాగా సాయంవచ్చి, "ఫిల్ అంటే ఫిలిప్

అన్నమాటండీ పంతులమ్మగారూ! ఇంటివద్ద వాడిని అందరూ బాబూష్ అనిగూడా పిలుస్తారు!" అన్నాడు పెద్దగాఅరుస్తూ.

"ఓహో! అలాగా!" అని చిరునవ్వు నవ్వింది అర్థమైనట్లు. నాఅసమర్థతకూ, నావికార చేష్టలకూ ఆమె జాలిపడి నవ్వినట్లు నేను భావించాను.

నేను నిజంగా అవమానంతో, సిగ్గుతో సగం చచ్చిపోయాను. నేనెంతో ధైర్యస్థుణ్ణనీ, సిగ్గెరగని వాణ్ణనీ నేనూ అనుకునేవాణ్ణి, అందరూగూడా అనుకునేవాళ్ళు.

అలాంటినేను, తోటి పిల్లల ముందూ, కొత్తగా వచ్చిన పంతులమ్మ ముందూ అపహాస్యం పాలైనానేమో అని ఆశ్చర్యం, అవమానం వేసిందినాకు. లోకానుభవంగలవాళ్ళు చెపుతున్నట్లు మగవాడిని యెందుకూ పనికిరాని వెధవను చేయడంలో ఆడదాన్ని మించిన శక్తి ప్రపంచంలో మరెవరూ లేరని అప్పుడు గ్రహించగల్గాను. మగవాణ్ణి ఆడది రెండుచేతుల్లో పెట్టుకుని బొమ్మ నాడించినట్లు ఆడించగలదు! ఇష్టంవచ్చినట్లు యెటుపడితే అటు వంచగలదు! ఆమె చేతిక్రింద అధమాధముడైన బానిసగా చేసుకోగలదు ఆడది.

అదృష్టవశాత్తుగా చిన్నతనంలోనే యీపరమసత్యాన్ని గ్రహించ గలాను. నన్ను నేనే అభినందించు కోవాలి దీనికి.

బడి తెరచిన మొదటిరోజునే జరిగింది అనుభవంనాకు. స్కూలంటే మంచిరోజుల్లోనే నాకొట్టే ఉత్సాహం ఉండేది కాదు. నాలాటి మనస్తత్వంగల కుర్రాడికి ఆనాడు స్కూలు ఆపరణలో. తోటి స్నేహితులముందూ. కొత్తగా వచ్చిన పంతులమ్మగారి ముందూ నాకు జరిగిన యీ విచిత్రానుభూతిని నాజీవితంలో మరవలేను. ఆరోజుల్లో జరిగిన విచిత్ర సంఘటనలెన్నో ఉన్నాయి. కాని యీసంఘటన నామెదడులో యెంతో బలీయంగా ముద్రపడ్డది తర్వాత రోజుల్లో

నేను ఏకాంతంగా ఉన్నప్పుడు కండ్లు మూసుకుని యీ విచిత్ర సంఘటనను స్ఫురణకు తెచ్చుకునేవాణ్ణి. నిన్న మొన్న జరిగిన అనుభూతి లాగా యిప్పుడుగూడా క్షణక్షణం అది మనస్సులో మెదులుతూ కలవర పెడుతూనే ఉంది. ఆనాడు వర్షపు చినుకులు పడగానే భూమినుండి గుప్పునవచ్చే కమ్మని సువాసనగూడా నా ముక్కు రంధ్రాలకు వెగటుగా తోచింది. అంత మధురమైన ఆసువాసన గూడా ఆనాటినుండీ యీనాటివరకూ పీల్చలేకపోయానంటే నమ్మండి. దీన్నిబట్టి నామనస్సెంత సున్నితమైనదో బోధపడుతుంది మీకు.

మేమంతా బుద్ధిమంతుల్లాగా మౌనం వహించి కూర్చున్నాం. జయరాంగారి స్కూలులోలాగా అల్లరీ, గొడవలూ లేవీస్కూల్లో. పంతులమ్మగారు చెప్పేది శ్రద్ధగా వింటున్నాం. మాముందు మొదటి వరసలోని మూడు బెంచీలమీదా ఆడపిల్లలు కూర్చున్నారు. వెనక బెంచీలమీద మగపిల్లలం కూర్చున్నాం. లాబినో, విటర్స్కో మొదలైన అల్లరి పిల్లలు గూడా మాపక్క చేరిఉన్నారు. రోర్డాఅనే కుర్రాడు మావైపు చూసి వెకిలిగా, వికృతంగా ముఖం పెట్టినప్పుడు వాణ్ణిచూసి నవ్వాలనిపించింది మాకు. అయితే మేం మంచివాళ్ళం అనిపించుకోవాలని, "గుడ్ ఫ్రైడే" నాడు చర్చిలో లాగా బుద్ధిమంతులుగా వ్యవహరించాలనీ మేం నిశ్శబ్దంగా ఉండిపోయాం. పొట్టలుబ్బేటట్లు లోపలినుండి వచ్చేనవ్వును యెంతో కష్టముతో ఆపుకున్నాం.

మాపంతులమ్మగారు సౌహార్ద పూర్వక వాతావరణంలో వినయ విధేయతల్నిగూర్చి, సత్ప్రవర్తననుగూర్చి ప్రశాంత హృదయంతో ఒకచిన్న ఉపన్యాసం గూడా యిచ్చింది. మొదటిరోజే పాఠాలతో మమ్మల్ని విసిగించక. ఆమె స్వగ్రామాన్ని గూర్చిగూడా కాసేపు వర్ణించింది. ఆమె గ్రామంపేరు 'లౌటులిం.' మావూరుకిది చాలా

దూరం. ఆమె యింటి సరసనే ప్రవహిస్తున్న ఒకచిన్న నదిని గురించీ, ఆమె వూరి సమీపంలో ఉన్న చిన్న కొండను గురించీ, వాళ్ళనూ, వాళ్ళ పండ్లతోటల్ని వేధించుకు తినే కోతుల గుంపుల్ని గురించీ మరికొంత సేపు పొట్టలు చక్కలయ్యేటు నవ్విస్తూ వర్ణించింది.

"మీవూరుగూడా అందమైనదనే చెప్పాలి!" అన్నదామె కిటికీగుండా బయటికి తొంగిచూస్తూ. మీచర్చి చాలా పెద్దది. దానిలో యేంచేస్తుంటారు?" అనడిగిందామె.

మా చర్చి మా గ్రామానికీ. మా ప్రజలకూ గర్వకారణం. దాన్ని గురించి వర్ణించినప్పుడల్లా మా వాళ్ళ శరీరాలు పులకరిస్తాయి. ఆనందంతో మైమరచి పోతారు. కొత్త వారెవరైనా మా వూరొచ్చినప్పుడు, చర్చిలోని అన్ని భాగాలనూ విపులంగా వర్ణించి చెప్పడం మా ప్రజలందరికీ అలవాటు. మా చర్చిగంట మోగించినప్పుడు వచ్చే మధురమైన నాదం యీ ప్రాంతంలోని మరేచర్చిగంటకూ రాదు. చర్చిలోని నేల భాగం మాత్రం గచ్చు చేయలేదు. ప్రతినిత్యా పేడతో అలుకుతున్నందుకు మా వాళ్ళు కొంచెం సిగ్గు పడతారు. నేలయెలా ఉంటేనేం గనక! ఆ నేల భాగం గూడా యిప్పుడు గచ్చు చేయిస్తున్నారు. మా గ్రామంలో మోతుబరి రైతు. 'రోక్ సంటానా' మార్గో పట్టణంనుండి అనుభవనీయులైన పనివాళ్ళను పిలిపించి రంగురంగులతో నేల గచ్చు చేయిస్తున్నాడు అందంగా. చర్చి సింహద్వారంలో ఒక పెద్ద పాలరాతిని గూడా అమర్చమని పనివాళ్ళను ఆదేశించాడు. ఈ పాలరాతిపైన దాతలపేర్లు గూడా చెక్కమని తెలియ జేశాడు.

క్రైస్తవ ధర్మం పేరుతో కనీసం యీ మాత్రమైనా చేసి తీరాలని మా నాన్న గూడా అభిప్రాయ పడ్డాడు.

చర్చి ఆవరణలో పనివాళ్ళ హడావిడి. నిర్విరామంగా వినవచ్చే శబ్దం మా పాఠాలకు కొంత అంతరాయం కల్గించాయి. ఒక్కొక్క

ప్పుడు బేల్దారీ మనిషి హుషారులో పాడే పాటవిని, మాకు పొట్ట చెక్కలయ్యే నవ్వు వచ్చేది. సాధారణంగా వాళ్ళు పాడే పాటలన్నీ నవ్వు పుట్టించే తమాషా బూతు పాటలు. ఆ బేల్దారు మనిషే ఆ సాయంత్రం పూట ఒక పడుచు పిల్ల ఒక పడుచు కుర్రాడితో కలుసుకొని హాయిగా నిద్ర పోతున్నట్లు వర్ణిస్తూ పాటపాడాడు. అయితే చిన్నపిల్లలం మాకెవరికీ స్పష్టంగా అర్థం కాలేదా పాట. మా పంతులమ్మగారు సిగ్గభినయించి ఒక పిల్లను పంపి కిటికీ తలుపులు మూయించింది.

ఓహో! ఆ సమయానికి కవిబ్రహ్మ యెవడూ అక్కడ లేకపోయెనే అనిపించింది నాకు. అబ్బ! ఏమిసిగ్గు! ముక్కు పచ్చలారని నాబోటి పిల్లవాడెలా వర్ణించగలడా సిగ్గును! ఇలాంటి అందగత్తె అభినయించే నునుసిగ్గును వాస్తవికంగా వర్ణించగల మహాకవి యెవడైనా యీ లోకంలో ఉన్నాడా? నునుపు దేరిన యెర్రని చెక్కిళ్ళనూ, కొలది మాత్రంగా ఉబ్బిన నాసికాపుటాన్నీ, ఆ క్రీగంటి చూపుల్నీ - ఊహకందని యింకెన్నెన్నో సంతృప్తికరంగా యేకవి వర్ణించ గలడు?

నేనింటికి తిరిగి రాగానే మా పంతులమ్మగారిని భక్తి భావంతో మెచ్చుకుంటానని మా అమ్మా, అక్కచెల్లెండ్లూ ఆశించారు. ఆమె అంచచందాలను గూర్చి, ఆమె ఆకర్షణ శక్తిని గూర్చి ప్రేమోద్రేకంతో వర్ణించ గలిగానే గాని, మా వాళ్ళాశించినట్లుగా ఆమె యితర లక్షణాలను శ్లాఘిస్తూ ఒక్క ముక్క గూడా మాట్లాడ లేదు. ఆమె యెవరి పోలికలో ఉందో వర్ణించి నచ్చ చెప్పడాని కోసం మా అమ్మను చేయి పట్టుకొని హాలులోకి లాక్కుని పోయి, గోడకు వేలాడ దీసి ఉన్న క్రీస్తు పటాన్ని చూపించా నామెకు.

"చూడమ్మా. క్రీస్తుకు యెడమ పక్కగా ఉన్న ఆ దేవతను. మా పంతులమ్మ అచ్చంగా అదే రూపంలో ఉంటుందమ్మా!"

" నోరుముయ్ వెధవా! బుద్ధి తక్కువ మాట మాట్లాడకు!" అంటూ మా అమ్మ అక్కడి నుంచి గిర్రున తిరిగి పోవడానికి ప్రయత్నించింది.

" నిజంగానే అమ్మా! ఆ దేవతకన్నా గూడా మా పంతులమ్మ చాలా అందంగా ఉంటుందే!" అని మళ్ళీ మళ్ళీ గట్టిగా నొక్కి చెప్పాను. అలాంటి పాపపు మాట లనవద్దని కోపంతో మా అమ్మ నా నోరు మూయించింది.

ఆ రాత్రి భోజనాల వద్ద మొదటి రోజు స్కూలు అనుభవాలను గూర్చి మా నాన్న ప్రశ్నించాడు మమ్మల్ని. తన సహజ ధోరణిలో రూత్ జరిగిన సమాచార మంతా మా నాన్నకు చెప్పేసింది.

" ఏమంటావ్ నాన్నా? పంతులమ్మగారిని మన బాబుష్ ప్రేమిస్తున్నా నంటున్నాడు! నీ అభిప్రాయం ఏమిటి? అన్నది రూత్.

మా నాన్న గంభీరంగా చూస్తూ. "చాలా బాగుంది! అందం అంటే యేమిటో మెచ్చుకోగల కళాత్మకమైన శక్తి మనవాడికైనా అలవడ్డందుకు యెంతో సంతోషంగా ఉంది నాకు. నేనీ ఉదయమే పొలం పోతూ పోతూ ఆ పంతులమ్మను చూడడం సంభవించింది. ఆమె కేవలం అపరదేవతనే చెప్పాలి! మరి తప్పదు!" అన్నాడు నా అభిప్రాయాన్ని ధృవ పరుస్తూ.

" చూడమ్మా! నేను చెప్పిందాంట్లో అబద్ధ మేమన్నా ఉందీ?" అన్నాను విజయ గర్వంతో.

" నోరుముయ్ బాబుష్!" అన్నది మా అమ్మ కండ్లెర్ర చేసి. మా నాన్న వంక చూసి, "చూడండి టాబ్! వాడిని నేను సరిదిద్ది సన్మార్గంలో పెట్ట బోతుంటే, యిలాంటి విషయాల్లో మగ పిల్లల్ని మీరెప్పుడూ వెనక వేసుకొచ్చి ప్రోత్సాహమిస్తారు!" అన్నది.

"నేనిప్పుడేం చేశాను? బాబుష్ నిజంగా మమ్మాటికీ పంతు లమ్మను ప్రేమిస్తూంటే, నేనాపగలనా చెప్పు? అలా కాకపోతే, యీ పంతులమ్మను మార్చివేసి, మరో ముసలి పంతులమ్మను మనవూరు పంపమని ప్రైమరీ స్కూళ్ళ డైరెక్టరు గారికి అర్జీవ్రాసి పంపమంటావా చెప్పుమరి?" అన్నాడు చలోక్తిగా మానాన్న.

రాత్రి భోజనాలంటే మా కెంతో సరదా. టేబిల్ చుట్టూ అంతా కూర్చునే వాళ్ళం. అందరికన్నా మా నాన్నది పెద్దకుర్చీ. ఆయన కుడి వేపున మేరియా యెడమవేపున ఆంటోనియో కూర్చునే వాళ్ళు, మేరియా పక్కనె రాబర్టో; తర్వాత కార్లస్; ఆ తర్వాత అడ్రియానో. మరో వైపున ఆంటోనియో పక్కన రూత్, తర్వాత ఫ్రాన్సిస్కో, వాడి తర్వాత సీజర్, చివర నేను. మా నాన్న కెదురుగా మా అమ్మ కూర్చునేది. వంటయింట్లోకి వెళ్ళే వాకిలి పక్కనే మా అమ్మ కుర్చీ వేసుకుని కూర్చోవడం అలవాటు. మా కంచాల్లో పదార్థాలు అయిపోగానే, మా అమ్మ త్వరత్వరగా వంటగది లోకి వెళ్ళగలిగేది సులభంగా. భోజనం చేస్తూ మా నాన్న పిట్టకథలనేకం చెప్పి మమ్మల్ని నవ్విస్తూండేవాడు. అవసరమైన దానికన్నా అతిగా మాట్లాడ వద్దని మా నాన్నా, మా అమ్మా చిన్నతనం నుంచీ మాకు క్రమశిక్షణ గరిపేవాళ్ళు. అయినా అన్నాల సమయంలో మాకు సంపూర్ణ స్వేచ్ఛ యిచ్చేవాడు మా నాన్న. చెప్పిన కథలు చాలవని అల్లరిచేస్తూ. యింకా యింకా చెప్పమని మా నాన్నను వేధించే వాళ్ళం. మా అమ్మ మమ్మల్ని చూసి గుడ్డురిమి, క్రైస్తవ మర్యాద ప్రకారం యిలా అల్లరి చేయడం సాగిస్తే, దేవుడు శపిస్తాడని మమ్మల్ని బెదిరించేది. మా నాన్న మాకు కనుసైగ చేయడం చూసి, మా అమ్మ బెదిరింపులు వట్టి బెదిరింపుల కింద జమకట్టి మరింత పెద్దగా నవ్వడం సాగించాం.

"చూశారూ! మిమ్మల్నే! పిల్లల్ని మీరే చెడగొడుతున్నారు నిజంగా. వీళ్ళ ఆగడం మరీ మితిమీరి పోతున్నది. ఇక సహించలేనండీ నేను! దీని అంతటికీ కారణం మీరు!" అన్నది మా అమ్మ కోపంతో పెదిమలు బిగబట్టి.

మా నాన్న మా అమ్మవంక చూశాడు. మా అమ్మ కోపంతో కుమిలిపోవడం చూసి, "నీ కోపంలో కనపడ్డదాన్నల్లా మింగేట్లున్నావు! ఇదుగో యీ పిల్లల్ని గూడా నమిలి మింగెయ్. ఆ స్వర్గంలో గూడా ఉడకేసిన యింత కూడు దొరకదు నీకు." అంటూ పరిహాసా లాడడం ప్రారంభించాడు. మా అమ్మకు పరిహాసాలన్నా, సరదాలన్నా చుక్కెదురు. ఎప్పుడూ ఏదో విషయం తీవ్రంగా ఆందోళన పడుతూ ఆలోచిస్తూనే ఉంటుంది. ఎప్పుడూ భక్తిమార్గంలో ఆధ్యాత్మిక చింతన చేస్తూ కాలం గడుపుతూంటుంది. మా నాన్న సరదాకు ఏం మాట్లాడినా వాటిని అక్షరాలా నిజమని నమ్మి అనవసరంగా చిరాకు తెచ్చుకుంటుంది. ఆ నిమిషం వరకు నర్మగర్భంగా మాట్లాడుతూన్న మా నాన్న తన ధోరణి మా అమ్మకు రుచించలేదని తెలుసుకొని తింటూ తింటూన్న అన్నం తినడం ఆపేశాడు. ఆదివారం నాడు చర్చిలో పౌరోహితుడు ఉపన్యసించి నట్లుగా ఆయన్ను అనుకరిస్తూ మా నాన్న మావంక తిరిగి గంభీరంగా, "ఈ నాడు అనవసరంగా సూటీపోటీ మాటలచేతా, పరిహాసాలచేతా, వ్యంగ్య సంభాషణలచేతా మీ అమ్మ మనస్సుకు బాధ కల్గించాను. అంచేత మీ అమ్మకూ నాకూ యీరోజున మనస్సులు కలియలేదు. కాబట్టి నేను చేసిన తప్పులకు పరిహారంగా తింటూతింటూ సగంలో అన్నం విడిచి పెట్టాను. మీ అమ్మ చేసిన పదార్థాలెంతో రుచికరంగా ఉన్నా ఆకలి యింకా పీకిస్తున్నా, యింతటితో నేను తినడం ఆపివేయ దలచు కున్నాను!" అన్నాడు. మా నాన్న రెండుచేతులు జోడించి గుండెలపై పెట్టుకున్నాడు. తల నిటారుగా బెట్టి రెండు కళ్ళూ మూసుకున్నాడు,

ముసలిస్త్రీలు చర్చీల్లో పెదిమలాడిస్తూ జపం చేసుకుంటున్నట్లుగా యేవో మంత్రా లుచ్చరిస్తున్నాడు. మేమంతా ఆయనవంక దృష్టి మరల్చాం. నాన్నమీద కొంచెమైనా మా అమ్మకు కనికరం లేదేమా అన్నట్లుగా, మా దృక్కులను తీవ్రంగా మా అమ్మమీదికి కేంద్రీకరించాం. కొంచెం సేపటికల్లా చడీచప్పుడు కాకుండా మా అమ్మ మానాన్న పక్కకు చేరింది. ఖాళీ అయిన కంచంనిండా అన్నం, యితర పదార్థాలూ వడ్డించింది. ఈ విచిత్రం చూసి మేమంతా పొట్టచెక్క లయేటట్లు నవ్వాం.

మళ్లీమానాన్నకూ, మా అమ్మకూ సమాధానం కుదరడంతో, మా అన్నాల టేబిల్‌దగ్గర మళ్ళీ సందడి ప్రారంభించింది. అయితే యీఉత్సాహం ఆటేసేపు నిలవలేదు—మరోబాంబు విసిరాను యింతలో నేను. అయితే ఉద్దేశ్య పూర్వకంగా అలా చేయలేదు. దీనితో మళ్ళా మాఅమ్మకు రేగింది కోపం.

"బ్రాహ్మణులంటే ఎవరు నాన్నా?" అడిగాను అమాయకంగా,

"ఎందుకురా బాబూష్ నీకదంతా? బ్రాహ్మణులను గురించి నెవరు చెప్పారా్రి నీకు?" అన్నాడు మానాన్న ఆశ్చర్యంతో.

"ఇనాసిన్హో మాపంతులమ్మ బ్రాహ్మణ మనిషని చెప్పాడు నాన్నా! మనం క్షత్రియులమని, రైతులూ, కూలీలంతా శూద్రులనీ చెప్పాడు గూడా!" అన్నాను.

"అలా అన్నాడా? మంచిది! మన భారత దేశపు విజ్ఞాన, సంస్కృతీ సంప్రదాయాల్ని గూర్చి అప్పుడే తెలుసుకొనడం ప్రారంభించా వన్నమాట! ఇంకా యేమేమి చెప్పాడురా వాడు?"

"ఇవ్వన్నీ కులాలని చెప్పాడు. కులాలంటే ఏమిటినాన్న?"

మానాన్న కాసేపు మౌనంవహించి, అన్నం నమిలి మింగుతూ యింకా యిలాఅన్నాడు:

"కులాలన్నీ శరీరంలో ప్రధాన అంగాల వంటివి. వచ్చేజన్మలో ఒక్కొక్క అంగం ఒక్కొక్క విధంగా రూపం తాలుస్తుంది...." ఇలా అంటూఉండగా మా నాన్న చూపులు మాఅమ్మమీద పడ్డాయి. మళ్ళీ మాఅమ్మకు చిరాకు రేగుతుందేమో అని తన ప్లేటువంక చూసి మౌనం వాల్చాడు మానాన్న.

"అయితే శూద్రుల సంగతేమిటి నాన్నా ?" అనడిగాను. నాకు తెలియని విషయాలెన్నో మానాన్న బోధిస్తున్నాడని నేనెంతో సంతోషిస్తున్నాను.

శూద్రులు చనిపోయిన తర్వాత చేరుకునే స్థలం వేరు. వాళ్ళు బ్రాహ్మణ క్షత్రియుల్లాగా స్వర్గానికి పోక నరకంలో పడతారు. నరకాని కేమ్మూలాన చేరుకుంటారో యెవరికీతెలియదు; యెవరూ చెప్పలేరు గూడా" అన్నాడు మానాన్న.

ఈచివర మాటతో అందరం విరగబడి నవ్వాం. మానవ్వుకు గదంతా దద్దరిల్లి పోయింది. పంజరాల్లో కునికిపాట్లు పడుతున్న బుల్ బుల్ పక్షులు మానవ్వులకు వులిక్కిపడ్డాయి. మాఅమ్మ ఒక్కతే ముఖం తీవ్రంగా బిగించి పెట్టుకుని కోపంతో కుములుతున్నది. తిరిగి మళ్ళీ యీగందరగోళాని కంతకూ మానాన్నే కారణమని వేలెత్తి చూపించింది. ఇష్టమొచ్చినట్లు మానాన్నను ఆడిపోసింది.

మానాన్న యెదురు మాట్లాడ లేదు. పెదిమలు మునిపంట కొరుక్కుంటూ కండ్లుమూసుకొని కూర్చున్నాడు. మాఅమ్మ మాటలు భరించలేనప్పుడల్లా కుర్చీనుంచి లేచి. తలకు టోపీ తగిలించుకుని, షికారుగా చీకట్లోకి చక్కా పోయేవాడు.

---

౪

మా నాన్నంటే మా అమ్మకు యెంతో ప్రేమ. అయినా ఆయన హృదయాన్నామె అర్థమే చేసుకోలా-నిజంగా యిది మాకుటుంబానికెంతో దురదృష్ట కరమైన విషయం. మతాభిమానం, భక్తితత్పరత ప్రధానాంశాలుగా భావించుకున్న మాఅమ్మ, క్రైస్తవ నీతి నియమాల విషయంలో మానాన్న అభిప్రాయాలతో సమాధాన పడలేక పోయింది. ఈఅంశం పైనే మాఅమ్మకూ, మానాన్నకూ అభిప్రాయభేధాలు పొటకరించాయి. పిల్లలందరిమీదా మానాన్నభావాలే ప్రబలంగా పడి, చివరకు చెడు నడతలకు దారితీశాయని గూడా మాఅమ్మ అనుమానం. మతగురువులను మానాన్న తీవ్రంగా విమర్శించడం ఆమె సహించలేక అప్పుడప్పుడూ నిర్మొగమాటంగా మందలించేది కూడా. "మతాన్నీ, మతగురువుల్నీ, దేవుణ్ణీ తృణీకార భావంతో విమర్శించ వద్దని ఎన్నిసార్లు చెప్పాను మీకు? దేవుడంటే మీరంత నిర్లక్ష్యంగా ఉండబట్టి గాదూ, పిల్లలకు నామీద అలక్ష్యం, అవిధేయత ప్రబలుతూంది?" అన్నదామె గట్టిగా ఒక రోజున.

మా నాన్న మా అమ్మతో హేతువాద ధోరణిలో శాస్త్రీయంగా వాదించడానికి ప్రయత్నిస్తాడు. ఆమెను పట్టుకుని పీడిస్తున్న మత

మౌఢ్యాన్ని వదిలించి, క్రైస్తవ మత విశిష్టతంటే కాళ్ళరిగేట్టు ప్రతిపూట చర్చికిపోయి గంటలు గంటలు ప్రార్థనలు చేయడం ఒక్కటేకాదని నచ్చ చెప్పడానికి చూస్తాడు మా నాన్న. విన్నకొద్దీ మా అమ్మ చిరాకు, అసహనం యెక్కువౌతుంది- "దేవుడెక్కడ లేడు" ఆ మాటకొస్తే, మనలో లేడూ! నా మనస్సులోని భావాల్ని నిర్భయంగా, నిర్మొగ మాటంగా వ్యక్తీకరించకుండా యెలా ఉండగలను? దేవుణ్ణిగానీ అతన్ని ఆరాధించే వాళ్ళనుగానీ హేతువాద దృష్టితో అర్థం చేసుకుని అవసరమని తోచినప్పుడు వాళ్ళను విమర్శించలేక పోతే, నేను వట్టి మూఢుణ్ణి, వెర్రివాడనూ అవుతాను. నేను అలాంటి వాణ్ణని అనిపించుకొనడం నాకు సుతరామూ యిష్టం లేదు. నేను పిరికి వాడుగా చలామణీ అయ్యే కన్నా, చావడం మేలనుకుంటాను. స్వతంత్ర ఆలోచనా శక్తితో, సంపూర్ణ వ్యక్తిత్వంతో మానవుడు మత మౌఢ్యాన్ని విసర్జించి హేతు వాది కావాలని నా నమ్మకం." అంటూ వాదించడం మొదలెట్టాడు మా నాన్న. ఇలాంటి వాదోపవాదాలు ప్రతిరోజూ జరుగుతూండేవి మా యింట్లో. తాను పట్టిన కుందేలుకు మూడేకాళ్ళన్నట్లు, మా అమ్మ తన మూఢనమ్మకాలను సడలించుకొనక పోవడం, యీ మూఢత్వాన్ని మొదలంటా ఛేదించి వేయాలని హేతువాద దృక్పథంతో మా నాన్న కంఠ శోషపడి వృథా వాగ్వివాదం చేయడం - ఇదీ నిత్య కార్యక్రమం మా యింట్లో. ఏ వాదన జరిగినా ముఖ్యంగా మతవిషయాల మీదనే జరిగేది. చివరకు మా నాన్న పోర్చుగీసు క్రూర నిరంకుశ విధానాన్ని కఠినంగా విమర్శించినా, అదీ మా అమ్మకు చిరాకు కల్గించేదే. పరిహాసాని కప్పుడప్పుడూ మా నాన్న మా అమ్మను కయ్యానికి కాలుదువ్వుతూ కన్పిస్తుండేవాడు,

ఒక్కొక్కప్పుడు యిద్దరూ గంటలు గంటలు వాదించుకునే వాళ్ళు. చివరకు మాఅమ్మ వాదించలేక కంటతడి పెట్టేదిగూడా.

ఆసమయం కనిపెట్టి యిక ముందెన్నటికీ మాఅమ్మతో వాదించనని మానాన్న ఒట్టేసుకునేవాడు.

ఇలాంటి వాగ్యుద్ధం చెలరేగినప్పుడే మాయింట్లో యెవరికీ మనశ్శాంతి ఉండేదికాదు. ఒక్కొక్కప్పుడు యీవాగ్యుద్ధం యెంతవరకు దారితీస్తుందో అని భయపడేవాళ్ళం గూడా.

నిజంగా మొత్తంమీద ఆరోజుల్లో మేమెంతో సుఖంగా కాలం గడిపామనే చెప్పాలి. కావలసినంత ఆత్మసంతృప్తి, పెల్లుబికే ఉత్సాహం. మనశ్శాంతీ మాయింట్లో అందరి మొహానా నాట్యమాడేది. మాబ్రతుకులు సార్థకమైనాయనుకునే వాళ్ళం. ఎడాపెడా విచ్చలవిడిగా ఖర్చుపెట్టడానికి డబ్బులేకపోయినా, ఉన్నదాంట్లో అతిధికీ, అభ్యాగతికీ యింతపెట్టి మేమింత తినా, కుడవా అనుభవించడానికి మాత్రం కరువుండేదికాదు. కష్టాలొచ్చినా, నష్టాలొచ్చినా, ధైర్యంతో భరించే గుండె నిబ్బరం కావలసినంతగా ఉండేది మాకు. ఈ సహనశక్తి మాకు శ్రీరామరక్షయింది.

మా కుటుంబ ఖర్చులు నానాటికీ యెక్కువౌతుండేవి. కనిపెంచేది తలిదండ్రులు కావడంవల్లా, జీవితావసర వస్తువుల ధరలు క్రమంగా పెరగడంవల్లా, మా సంసారభారం మరింత కష్టమైంది మా నాన్నకు. అయినా ఆయన అంతంత మాత్రానికి కుంగిపోయే మనిషికాడు. ఆత్మవిశ్వాసముతో యెట్టి చిక్కు పరిస్థితులనైనా చిరునవ్వుతోనే భరించే వాడాయన. ఎట్టి కష్టదశలోనైనా ఉత్సాహం, నిగ్రహం, కార్యదీక్ష ప్రకటించాలని మా నాన్న దృఢనమ్మకం. దిగులూ, విచారం మచ్చుకు గూడా రానిచ్చేవాడుకాదు మనస్సులోకి. ఎట్టి విషాద పరిస్థితుల్లో గూడా తాను నవ్వి, యితరులను నవ్వించి ఆనందించేవాడు. "నీవు నవ్వలేకపోతే, చచ్చినవాడిలో జమే!" అంటూఉండే వాడెప్పుడూ. పిల్లల్నెప్పుడూపైనా, పక్కనా వేసుకుని నవ్వుతూ, నవ్విస్తుండేవాడు.

ఏ నిమిషాన చూచినా ఆడుతూ, పాడుతూ, నవ్వుతూ, నాట్యం చేస్తూఉండే సుఖమైన జీవితం మాది. మా ఆంటోనియో మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసైనాడన్న వార్త తెలియగానే మా ఆనందానికి మేర లేకుండా పోయింది.

వణుకుతూ ఉన్న చేతుల్తో ఒక పసుపుపచ్చ కవరు పట్టుకొచ్చిం[ది] మా అమ్మ. ఆ కవరుగూడా వణుకుతూనే ఉంది. మా అమ్మకు పసుపు పచ్చకవరు చూస్తే యెప్పుడూ కంగారే. కవరు చేతి కందగానే ఆమె ముఖం పాలిపోయింది. ఏక్షణంలో మూర్ఛపోతుందో అని భయం వేసింది నాకు.

పై ప్రాణం పైనపోతూన్న మనిషిలాగా, "ఎవరికి నాయనా యీ టెలిగ్రాం?" అన్నది మా అమ్మ. దొడ్లో గుడ్డలుతుకుతుండే మనిషల్లా, నాలుగంగల్లో వీధిగుమ్మం వద్దకు వచ్చి వాలింది. బస్తీనుంచి యెర్ర దుమ్ము కొట్టుకున్న సైకిలేసుకొని టెలిగ్రాఫ్ కుర్రాడు కవరు తెచ్చివ్వగానే, వణకుతున్న చేతుల్తో మా అమ్మ ఒక నిమిషంపాటు నాపరాతి బండమీద ముడ్డి ఆనించింది. కాని ఆమెకు సిమితం చిక్కలేదు. కవరు చించే ధైర్యం చాలక పోయింది. గాభరాతో వొళ్ళంతా దిగ చెమటలు పెట్టిందామెకు.

పెద్దపెద్ద బస్తీల్లోనూ, మహా నగరాల్లోనూ ప్రతిరోజూ వందల కొద్దీ టెలిగ్రాములు చూస్తూన్న మీకేం తెలుస్తుంది. టెలిగ్రాముంటే మాకున్న గాబరా. మాబోటి పల్లెటూరి వాళ్ళకు టెలిగ్రాం కవరు చూడగానే విప్పి చదువుకునే వరకు చావు బ్రతుకుల మధ్య ఉన్నట్లుం టుంది. టెలిగ్రాం అందింది మొదలూ విప్పి చదివే వరకూ మేం అనుభవించే యమయాతన అడుగుతారా! మా మానసికాందోళన అనుభవించితేనే గాని తెలియదు: ఎంతని ఊహించగలం!

"కవరు తెరచి చూడమ్మా చూడు!" అన్నది మేరియా. ఎంతో ప్రయత్నంమీద మా అమ్మ చించి చదివింది. చేతుల్లో మడత పెట్టుకొని హృదయానికి హత్తుకుని ఒక వేడినిట్టూర్పు విడిచింది. "అమ్మ భగవంతుడా! బతికాన్రా నాయనా!" అంటూ ఆనంద బాష్పాలు విడిచింది.

ఈ లోగా పిల్లలందరం ఆమె చుట్టూ చేరాం. మా అమ్మ కళ్ళ వెంట నీళ్ళు కారడం చూసి, యేదో కొంపమునిగే వార్త వచ్చిపడ్డదిరా భగవంతుడా అనుకొని యేడ్వడం మొదలెట్టాం గూడా. రూత్, కార్లస్ కేకలెయ్యడం ప్రారంభించారు. మరే ప్రమాదం లేదని అందర్నీ సర్ది పంపివేసింది మా అమ్మ.

"అల్లరి చేయకండిరా నాయన్లారా!" అంటూ చెంగుతో కండ్ల నీళ్లు తుడుచుకుని, "ఆంటోనియో మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసైనాడని సాల్వడార్ టెలిగ్రాం పంపాడు! ఇంతే! మరేం ప్రమాదం లేదు!" అన్నది మా అమ్మ.

"అయితే మరి నీవెందు కేడుస్తున్నావమ్మా? చెప్పు నీ వెందు కేడుస్తున్నావో?" అనడిగాడు ఆడ్రియానో.

"మరెందుకూ లేదు! సంతోషం పట్టలేక నాయనా ఆకళ్ళ నీళ్ళు!" అన్నది మా అమ్మ. మేమంతా స్వయంగా టెలిగ్రాం చదువుకున్న తర్వాత. ఆదివరదాకా యెటూ తోచక నిలబడున్న టెలిగ్రాఫ్ కుర్రాణ్ణి మా అమ్మ యింట్లోకి తీసుకెళ్ళి టేబిల్‌ముందు కూర్చో పెట్టింది. ఇంత రొట్టె. మాంసం, తినిపించింది వాడిచేత. లొట్టలేసుకుంటూ మూడు నిమిషాల్లో మొత్తం మింగివేశాడు వాడు. ఆకలితో అవురావురున ముద్ద వెంట ముద్ద మింగుతూంటే మాలోమేం విరగబడి నవ్వుతున్నాం జాలివేసి.

ఆంటోనియో విజయం వీధి వీధికి పాకింది. టెలిగ్రాఫ్ కుర్రాడు ఆకలి తీర్చుకున్న తర్వాత దార్లో కనపడ్డ ప్రతివాడికీ యీవార్త చెపున

వేస్తూ సాగిపోయాడు. చివరకు పొలం పనులు చేసుకుంటున్న రైతు, కూలీలగ్గూడా తెలిసిందీవార్త. ఆ సాయంత్రమే వందలకొద్దీ బంధు మిత్రులు మాయింటికి వచ్చి ఆంటోనియోను అభినందించి పోయారు.

ఆరోజుల్లో యింగ్లీషు విద్యకాటే ప్రోత్సాహ మిచ్చేవాళ్ళుకారు. డబ్బున్న ప్రతీ ఆసామీ, ప్రతి సంసారీ తమ బిడ్డలకు పోర్చుగీసు భాషలో ఉన్నత విద్య చెప్పించేవాళ్ళు. ఇంగ్లీషు పాఠశాలల్లో తర్ఫీదైన కొద్ది మంది పిల్లలూ నాలుగైదు తరగతుల వరకూ చదువుకుని, ఆఫ్రికాకో, బొంబాయికో నౌకరీకోసం పోతుండేవాళ్ళు. మా గ్రామములో మెట్రిక్యులేషన్ ప్యాసైన మొదటి కుర్రాడు మా ఆంటోనియో ఒక్కడే. ప్రతి ఉదయం కాలి నడకమీద మార్కోనగరం పోతూ. అక్కడి హైస్కూల్లో చదువు కుండేవాడు మావాడు. అందుకని మావాణ్ణి మావూరి వాళ్ళంతా వీరాధి వీరుడుగా మెచ్చుకుంటుండేవాళ్ళు. కొన్నాళ్ళ వరకూ పెద్ద మోతుబరు రైతు వద్దనుంచి సామాన్యమైన కూలీవరకూ ప్రతివాడు ఆంటోనియోను అభినందిచడం సాగించారు.

మా వూరిరైతు కూలీలు త్రాగుడుకు అలవాటుపడ్డా ఒళ్ళుమరిచి అపభ్రంశపు పనులు చేసేవాళ్ళు కారు. నేను ఒకసారి ద్రాక్షసారాయి నాలుగుబొట్లు యెలా ఉంటుందో అని రుచి చూశాను. ఆ నాలుగు బొట్లకే నాతల గిర్రున తిరగడం మొదలెట్టింది. నామాదిరిగా తక్కిన వాళ్ళ కెందుకు తల తిరగదా అని మా నాన్న నడిగాను. నేను పెద్దవాడనై పోర్చుగీసు నాగరికతను మరింతగా అలవరచుకుని జీర్ణించుకున్న తర్వాత, యెంత తాగినా తల తిరగదని మా నాన్న అనేవాడు.

గ్లాసు మీద గ్లాసు సారాయి యెగరవేస్తున్న సాంటానా మా నాన్ననుచూసి, "మీ అబ్బాయిచేత యేం చేయిస్తావయ్యా? మీ కుర్రాడు అతి తెలివైనవాడుగా! చాకువంటివాడు!" అన్నాడు.

మా నాన్న అతన్ని చూసి చిరునవ్వు నవ్వాడు.

"మావాడు కాలేజీ చదువు చదువుతా నంటున్నాడయ్యా. నేను వాణ్ణి యింటి దగ్గరే ఉంచి పొలం పనుల్లో నాకు సహాయంగా ఉండమంటున్నాను" అన్నాడు మా నాన్న.

"అర్థంలేదు! నీకేమన్నా మతి పోయిందా ఏమిటి బాబు!" అంటూ పుక్కిటిలో ఉన్న సారాయిని తుబుక్కున వెళ్ళకక్కాడు సాంటాన్నా. "మీరు పెట్టే యిబ్బందులూ. మీరు చేసే అవమానాలూ చాలవూ మాకు? మాబోటి ఘరానా కుటుంబాలకు తలవంపులు తెచ్చావయ్యా నీవు! ధనిక రైతు కుటుంబంలో పుట్టి, మానమర్యాదలు, వ్యక్తి గౌరవం చంపుకుని పారా. గడ్డపారా పుచ్చుకుని పొలంలో చాకిరీ చేయాల్సినంత గతేం బట్టింది నీకు? నీవుగాక, నీ పిల్లాడికి గూడా వ్యయసాయపు పనులు నేర్పిస్తానంటున్నావు పైగా! మన చేతుల్తో మనం పొలం చాకిరీ చేయడం మనకు లాయికీ కాదయ్యా. నీవేమైనా అనుకో తర్వాత!" అన్నాడు.

మా నాన్న గూడా ఒక భూస్వామి కింద లెక్కే. అంచేతనే మా వూళ్ళో ఒక పెద్ద మనిషిగా జమకట్ట బడుతుండేవాడు. భూస్వాము లందరికీ కూలీలచేత పని చేయించు కొనడం అలవాటు. తమ చేతుల్తో ఒక్క పారమట్టి గూడా తీసి అవతల పోయరు. మా తాతలూ, ముత్తాతల హయాం నుంచీ గూడా మాకు వందల యెకరా లెప్పుడూ లేవు యితర భూస్వాముల మాదిరిగా. మేంమట్టుకు సుఖంగా బ్రతకడానికి సరిపడా పొలం ఉన్నది. అయినా మేమూ భూస్వాములుగానే పరిగణింప బడేవాళ్ళం. అంచేత పేదరైతులు మమ్మల్ని గౌరవ భావంతో చూచేవాళ్ళు. భూస్వామి వర్గంలో పుట్టడంచేత, యెదో రకంగా ఒక దర్పం, దర్జా నిలబెట్టైకునే అవసరం కల్గింది మా కుటుంబానికి.

మా నాన్నకి భూస్వామి పోకడలంటే చెడ్డ అసహ్యం. ఈ దర్జాలంటే అరికాలి మంట నెత్తి కంటుతుందాయనకు. సంప్రదాయ సిద్ధంగా

వస్తూన్న యీ జమీందారీ పోకడలకు మా నాన్న స్వస్తి చెప్పాడు. మా నాన్న వైఖరి మా తాతయ్యకు ఆశ్చర్యం. ఆగ్రహం గూడా కల్గించింది. మా తాతయ్యకు మా నాన్న ఒక్కడే కొడుకు. ఆ మమకారం చేత ఆ యన్ను పోర్చుగల్ పంపి, ఉన్నత విద్య చెప్పించాలని యెంతో ఆగాట పడేవాడు మా తాత. కాని మా నాన్నకు పోర్చుగీస్ విద్య అంటే చెడ్డ మంట. ససేమిరా పోనన్నాడు పోర్చుగల్‌కు. దానిపైన బెల్గాంలో ఉన్న ఒక బోర్డింగ్ స్కూలుకు మా నాన్నను పంపాడు, అక్కడైనా యింగ్లీషు చదువు కుంటాడేమో అని. ఆరు మాసాలక్కాశ కాలం గడిపి, మా నాన్న పెట్టే బేడా పుచ్చుకుని యింటికి చక్కా తిరిగి వచ్చాడు. మళ్ళీ పొమ్మని మా తాత కోప్పడ్డా, మా నాన్న బెల్గాం మొహం చూళ్ళేదు.

"ఈ చేతులు కష్టించి పనిచేయడాని కేర్పడ్డాయి. ఒక్క కలం పోటు పొడవడానికే కాదు!" అన్నాడు మానాన్న మాతాతతో ఒకరోజు. తర్వాత కొన్నాళ్ళకే మాతాత స్వర్గస్థుడైనాడు. కాని ఆయన బ్రతి కున్నంత కాలం ఒక్కగాను ఒక్కకొడుకు చదువు మాని మాలీల మాదిరిగా కష్టించి బ్రతకాల సొచ్చిందే అని ఆవేదన పడ్డాడు మా తాత.

"మీ అభిప్రాయాలతో, మీ వ్యాఖ్యానాలతో నాకు లెక్కలేదు. ఎవరి అభిప్రాయాలూ నేను పాటించను. నాసంగతి నీ వెరుగవూ సొంటానా?" అని చిరునవ్వు నవ్వాడు మానాన్న." అంటూ పై చదువు చదువుకుంటానంటే నేనడ్డం రాను. కాలేజీ చదువుమీద వాటికి మనస్సుంటే పోనివ్వండి. లేక నా మాదిరిగా వ్యవసాయంలో దిగాలని కోరకే ఉంటే, యింటి దగ్గరే ఉంచి వ్యవసాయంలో తర్ఫీదిప్పిస్తాను. మీ కిష్టమున్నా లేకున్నా జరిగేది జరిగే తీరుతుంది. నా మాదిరిగా నా పిల్లలందరూ కష్టించి పొలం పనులు చేసుకోవాలని మనస్సుంటే, నేను మరీ సంతోషిస్తాను. పోర్చుగల్ పోయి నిరంకుశాధికార్లుగా తర్ఫీదై

వచ్చే బదులు, వ్యవసాయం చేసి జీవిస్తూ, దేశాని కింత సేవ చేయడమే నా అభిమతం. అసలు బ్రిటిష్ నిరంకుశాధికారం కింద ఉద్యోగం చేయడమే ఘోరం. అంతకన్న అతినీచమైన పోర్చుగీస్ అధికారిగా నౌకరీ చేయడం మరింత ఘోరం! అమాయకుడైన మానాన్న యీ పాపాని కొడిగట్ట మన్నాడు నన్ను, ఆయన బ్రతికుండగా" అన్నాడు మానాన్న.

మా నాన్న నోటివెంట యెలాంటి భావాలైనా, యెటువంటి అభిప్రాయాలైనా నిర్భయంగా, నిర్మొగమాటంగా వస్తాయని యిదివరకే చెప్పాను. అందులో, కాద్దోగాపోప్ సారాయి సేవిస్తుంటే మరి చెప్పాలా ఇక! సోమరిపోతులైన పోర్చుగీసు అధికార్ల క్రింద నాగరకత పేరుతో మానవుల విలువను మంటగల్పుతున్నామంటూ సాంటానాతో మా నాన్న ఉద్రేకంగా అన్నాడు. కర్రపెత్తనం చేస్తూ అధికారం చెలాయించడం అన్యాయమని. ఒళ్ళుదాచుకుని బొజ్జలు పెట్టుకుని కూర్చునే కంటే, కష్టించి మర్యాదగా బ్రతకనేర్చుకొనడమే పౌరుష వంతుడైన మగవాడికి లాయకీ అనీ మా నాన్న ఆయన్ని యెత్తి పొడుస్తూ మాట్లాడాడు.

"మీ ఆంటోనియోను డాక్టరుగా యెందుకు చేయగూడదయ్యా?" అన్నాడు డాక్టరు ఆక్వినో. సాంటానా మీద మా నాన్న చేసిన విమర్శను మరోవేపుకు మళ్ళించడమే డాక్టరు ఉద్దేశ్యం. "మీవాడికి ప్రోత్సాహమిస్తే, మంచి సర్జన్‌గా గూడా తయారయ్యే అవకాశం ఉంది."

ఒక నిముషం ఆలోచించాడు మా నాన్న. "డాక్టరువృత్తి మంచిదే. కాని మావాడు పేదవాళ్ళను పీడించుకు తినే డాక్టర్ కాగూడదని నా కోరిక."

తిరిగి మళ్ళీ అందరూ తలాఒక మోతాదు సారాయి వేసుకున్నారు, ఎవరికి వారు స్వేచ్ఛగా మంచినీళ్ళ లాగా కావలసినంతా పోసుకుని త్రాగారు.

" ఎందుకు బాబూ! డాక్టర్లను అలా నిందిస్తారు ? " అన్నాడు డాక్టర్ ఆక్వినో అమాయకంగా నవ్వుతూ.

" నీవు మంచివాడవే నయ్యా! ముమ్మాటికీ మంచివాడవే! అందరు డాక్టర్లూ నీమాదిరే ఆదర్శంగా ఉంటారూ ? తక్కిన డాక్టర్లు నిన్నేమంటారో తెలుసా ? నీవు వట్టి అమాయకపు ఓబయ్యవనీ, సంపాదించడం చేతగాని వాజమ్మవనీ ఎగతాళీ చేస్తారు తెలుసా! ఇన్ని డిగ్రీలు ప్యాసై, యింత తెలివి తేటలు గలిగిన నీవు యీ పల్లెటూర్లో పడి పాకులాడక పోతే, బస్తీచేరి చేతినిండా పదిడబ్బులు సంపాదించుకో గూడదా అంటారు. దరిద్రంతో కుమిరి పోయే యీ బికారీ రైతుల్ని పట్టుకుని యేడవక పోతే, డబ్బున్న పట్నవాసంలో చేరి ఘనంగా యింత సంపాదించుకో గూడదా అని దెప్పి పొడుస్తారయ్యా! బస్తీలో అయితే ప్రతివాడి రక్తం పీల్చి, కార్లల్లో హాయిగా కాలక్షేపం చేయ వచ్చుగా మరి!"

" అయితే................."

సమాధానం చెప్పబోతున్న ఆక్వినోను ఊపిరాడ నివ్వకుండా మళ్ళీ ఉపన్యాసం లంకించుకున్నాడు మా నాన్న.

" ఆక్వినో! నేను చెప్పేది సాంతం వినవయ్యా ముందు! ఇంతకు ముందే మావాడికి డాక్టరు చదువు చెప్పిస్తే మంచిదన్నావు. మంచిదే మరి! వైద్య వృత్తియందు నాకు గొప్ప గౌరవమే ఉంది. కాని యీనాడు ప్రపంచంలో చూస్తున్న డాక్టర్లంటే నాకే మాత్రానా గౌరవం లేదు. మా అబ్బాయి నిజంగా డాక్టరే కాదలచుకుంటే, ఆపరేషన్ చేయించుకునే వ్యక్తి ధనవంతుడా పేదవాడా అనేప్రశ్నే రాగూడదు. ఫీజు చెల్లించినా, చెల్లించ లేకపోయినా ఆపరేషన్ చేసి తీరాల్సిందే! అర్ధ రాత్రియినా ధనికుడి యింటికి డబ్బు ఆశతో వెళ్ళి ఉత్సాహంతో పని చేసినట్లే, పేదవాడి యింటికీ అంత ఉత్సాహంతో

వెళ్ళి సేవచేయాలి. నిస్వార్థమైన ప్రజాసేవ చేయడానికి మా వాడికి ముమ్మాటికీ అంగీకారమైతే, డాక్టరుకోర్సు చదువుకుంటే, నాబోటి తండ్రి యెందుకు సంతోషించడు! అలా చేయలేకపోతే, నామాదిరే వాడూ యింటి వద్దనేఉండి కాయకష్టంచేసుకుని గౌరవంగా జీవిస్తాడు. కొమ్మలు తిరిగిన సర్జన్లకన్నా, మావాడే యీ వ్యవసాయ వృత్తిలో ప్రజలకూ, దేశానికీ యెక్కువసేవ చేయగలుగుతాడని నా నమ్మకం."

చర్చ మరింత తీవ్రరూపం దాల్చుతోంది. అక్కడ పోగైనవాళ్ళకు చర్చ వినడానికి తలనొప్పిగానే ఉన్నట్లుంది. ఒకర్నొకరు చూసుకుని భుజాలెగరవేసుకున్నారు. ముసలిరైతు అనిసిటో మరో సమస్యపై మాట్లాడమని మా నాన్నను కోరాడు. అందరు ముసలిరైతును అభినందించారు.

"మీ అంటోనియో ప్యాసైనందుకు జల్సాచేయటాని కిక్కడ చేరాం. మీ ఉపన్యాసం వినడానికి రాలేదు!" అన్నాడు అనిసిటో చలోక్తిగా. "మీ అబ్బాయిని యేంచేయాలో యెటూ తోచకపోతే, నేను చెబుతున్నా విను! మాట్లాడకుండా ఆఫ్రికాకు పంపెయ్! ఇదిగో నా వంక చూడు బాబూ! అక్కడికి పోతే, వాడు నిజమైన మనిషిలాగా తయారై వస్తాడు! నిజమైన మనిషిగా యేమనుకున్నావో! ఏమంటావ్?"

ప్రతి ఒక్కరూ నవ్వడం ప్రారంభించారు. కొన్నాళ్ళ క్రితం తూర్పు ఆఫ్రికాలో బ్రిటిష్ ప్రభుత్వంక్రింద నౌకరీచేసి అనిసిటో పించన్ పుచ్చుకున్నాడు. చుంచెలుక ముఖంలాగా తమాషాగా ఉంటుందతని ముఖం. పెళ్ళాం అంటే అతనికి హడలు! ఆమె యెదుట ఒక్కమాట గూడా మాట్లాళ్ళేడు. ఆమె లేనప్పుడు ఆఫ్రికా అడవుల్లో తనవేట అనుభవాన్ని గూర్చి కనిపించిన వాడికల్లా గంటలకొద్దీ ఉపన్యాసాలిస్తాడు. అయితే పసిబిడ్డలుగూడా యీ డబ్బాలు నమ్మరు. కాని తన మంచితనం వల్ల. కలుపుగోలు తనంవల్ల అనిసిటో మంచిపేరు తెచ్చుకొని తల్లో

నాలుకగా మెలుదుతూంటాడు. అతనంటే ఆబాలగోపాలం అందరికీ సరదే.

"నా వంకచూడు బాబూ!" అంటూ రొమ్ము విరుచుకుని బ్రహ్మాండ నాయకుళ్ళాగా గొప్పలు చెప్పుకోసాగాడు అనిసిటో. "ఈ నాటి కుర్ర కుంకలు పట్టి సోమరిపోతులు-వీళ్ళ సంగతేమీ దాగాలేదు. ఆఫ్రికాలో మేము రోజుకు నలభై గంటలు పనిచేసేవాళ్ళం తెలుసా! పొరపాటునైనా మేం ఒక్కటప్పుడు పనిచేసినట్లు చెప్పడానికి ధైర్యముందీ యెవరికైనా?"

"రోజుకు యిరవైనాలుగు గంటలుగదా. నలభై గంట లెక్క ణ్ణుంచి వచ్చాయి నీకు?" అన్నాడు ఆంటోనియో స్నేహితుడు వీనార్డో.

అనిసిటో వీనార్డోవంక మర్రి మర్రి చూసి, "తలకుమాసిన వెధవా! నలభై గంటలని చెబుతుంటే నేనొకవేపున! ఖచ్చితంగా నలభై గంటలని మళ్ళ చెబుతున్నా విను! ఆఫ్రికాలో రోజులూ, యీ దిక్కు మాలిన పల్లెటూళ్ళో రోజులూ ఒక్కటే అనుకోబోకు. అక్కడి రోజు పరిమాణం యిక్కడికన్నా యెక్కువని యిప్పటికైనా జ్ఞాపకముంచుకో!" అన్నాడు.

హాల్లోని వాళ్ళంతా అనిసిటో మాటలకు పొట్టలు చెక్కలయ్యేట్లు నవ్వారు. అదురు బెదురు లేకుండా అతనిచ్చిన జవాబు అంతా మెచ్చు కున్నారని భ్రమపడ్డాడు. హుషారుగా జేబులోఉన్న ఆకుపచ్చరుమాలు బయటకులాగి కేరింతలు కొడుతూ యెగరెయ్యడం ప్రారంభించాడు: డాన్సుగూడా చేశాడు. తక్కిన వాళ్ళంతాగూడా అతనితోచేరి డాన్సు చేయడం ప్రారంభించారు. హాలంతా ఒక్కసారిగా నవ్వులతో, సంగీ తాలతో మారుమ్రోగింది. ఎవ్వరికీ తెలియకుండానే రాత్రి యెంతో పొద్దు పోయింది. ఆ రాత్రి భాగోతం అంతా పూర్తయేసరికి తెల్లవారు ఝామయింది.

సోమవారంనాడు ఆంటోనియో కాలేజీలో చేరడానికి బొంబాయి ప్రయాణమైనాడు. ఆనాడు ఉదయం సన్నగా తుప్పరపడి వాతావరణం నిరుత్సాహకరమైంది. అదివరదాకా హుషారులోఉన్న ఆంటోనియో తీరా ప్రయాణమయ్యేసరికి నిరుత్సాహపడ్డాడు. మమ్మల్నందర్నీ విడిచి బొంబాయి వెళ్ళవలసి వచ్చినందుకు వాడికి బెంగపట్టుకుంది. ఎన్నాళ్ళనుండో బొంబాయి అందచందాలు చూడాలని మురిసిపోయేవాడు. కొత్తగా కుట్టించుకున్న డ్రస్సులూ, కొత్తబూట్లూ మాకు మాటిమాటికీ చూపించి ఉబలాటపడేవాడు. తాను బొంబాయినుండి డిగ్రీ తెచ్చుకున్న తర్వాత లక్కినవాళ్ళంతా వాడికి లోకువే అని గొప్పలు చెప్పుకున్నాదారోజునే.

తీరా బయల్దేరే సమయం వచ్చేప్పటికి బిక్కమొహంవేసి పెద్దపెట్టున యేడవడం ప్రారంభించాడు.

మా అమ్మగూడా బిక్కమొహం వేసుకుని కూర్చుంది. ఇల్లుదాటి దూరదేశం పోవడం మా పిల్లలకిదే మొదటిసారి. మా ఆంటోనియో ఊరు విడిచి బొంబాయి పోవడమంటే, మా అమ్మకు బొత్తిగా మనస్కరించలేదు. మమ్మల్నందర్నీ వదలి పోవడం మాకుమాత్రం యిష్టమా? అన్నదమ్ములం అంతాకలిసి గుర్రపుతోకల వెంట్రుకలు పీకడంలోనో, బండివాడిని చీకాకు పెట్టడంలోనో, కాలక్షేపంచేస్తూ వున్నాం. ఇంకో రెండు నిమిషాల్లో యీ బండిలోనే మావాడు స్టేషనుకు ప్రయాణం చేయాల్సిఉంది. ఎలాగైనా మాయోపాయంవన్ని మా వాడి ప్రయాణం తప్పించాలని మా ఉద్దేశ్యం.

ప్రయాణం సమయం రానేవచ్చింది. ఆంటోనియో వరసగా మమ్మల్నందర్నీ ముద్దులుపెట్టుకుని మాకు వీడ్కోలిస్తూంటే, మాఅందరి కండ్లవెంట బొటబొట నీళ్ళుకారాయి. గుర్రపుబండి యిల్లువదలి ముందుకు సాగిపోతూన్నకొద్దీ మా హృదయభారం భరించలేక పోయినాం. బండి మా దృష్టికానేవరకూ అలా చూస్తూనే నిలబడిపోయాం.

అంటోనియో బొంబాయివెళ్ళి రెండురోజులైంది. వాడు మాకండ్లల్లో మెదలని రోజులేదు. అన్నదమ్ములం మేమెప్పుడూ కలసికట్టుగా ఒక్క మాటమీదుగా ఉండేవాళ్ళం. ఇతర పిల్లలతో మాకు పేచీలు వచ్చినా. అబద్ధాలాడినందుకు మాలో యే వొక్కడైనా పట్టుకుని కొట్టినా. మేమంతా ఒకరికొకరు అండగా ఒకే పద్ధతిమీద నడిచే వాళ్ళం. మేమెప్పుడన్నా చిక్కుల్లో యిరుక్కున్నప్పుడు అంటోనియో మాకు సహాయంగా వచ్చి చిక్కుల్లోంచి మమ్మల్ని తప్పించేవాడు. ఒక అబద్ధాన్ని సమర్థించుకోడానికి నూరబద్ధాలైనా ఆడి సమర్థించుకునేవాడు. సమయస్ఫూర్తితో అప్పటి కప్పుడు సృష్టించిన అబద్ధాలు యదార్థమైన వని ప్రమాణాలుగూడా చేసేవాడు. అంటోనియో వట్టి అబద్ధాలకోరని మా అమ్మకు తెలిసిగూడా తరుచుగా వాడి మాటల్నే నమ్మేది.

అంత సందడిగా, చేదోడు వాదోడుగాఉన్న అంటోనియో మా మధ్య లేకపోవడం మాకు పెద్ద లోటనిపించింది. ఆ విషయం తలుచుకున్నప్పుడల్లా మాలో గుబులు గుబులుగా ఉండేది.

రాబోయే గణపతి ఉత్సవాల సందడిలో మా అంటోనియోను క్రమంగా మరిచిగూడా పోయినాం. మా వూళ్ళోవాళ్ళంతా యెక్కువ మంది క్రైస్తవులే అయినా! మా మధ్య పన్నెండు హిందూ కుటుంబాలు గూడా కాపురముంటున్నాయి. వాళ్ళల్లో యెక్కువమంది రైతులు. పూర్వంనుంచీ వాళ్ళ దీగ్రామం కాదు. 'నో వాస కాన్‌క్విస్టాస్' నుంచి పొట్టలు చేతపట్టుకుని బ్రతుకు దెరువుకై మా గ్రామం వచ్చిచేరారు. ఇక్కడే కొంపలు కట్టుకుని స్థిరనివాస మేర్పరుచు కున్నారు.

ఈ ప్రాంతాల్లో హిందువుల పండగల్లోకల్లా గణపతి ఉత్సవాలు చాలా గొప్పవి. మా క్రిస్మస్ పండగలు జరుపుకున్నంత వైభవంగా వాళ్ళు గణపతి ఉత్సవాలు జరుపుకుంటారు. ఆనాడు హిందువుల ఇండ్లన్నీ అలంకరించుకుని, గారెలూ, బూరెలూ, లడ్లూ, పరమాన్నాలూ

వండుకుని విందారగిస్తారు. అతిధులను ఆహ్వానించి మర్యాద చేస్తారు. పండగ మూడురోజులూ టపాకాయలూ, చిచ్చుబుడ్లూ, మతాబాలూ వెలిగించి జల్సా చేస్తారు. మాకు గూడా ఆనాడెంతో సరదాఅయినరోజు. మేము గూడా వాళ్ళ యిండ్లకుపోయి వాళ్ళతో కలిసిమెలిసి ఆడుకుంటాం. మాకూ వాళ్ళు టపాకాయలూ, చిచ్చుబుడ్లూ, మతాబాలూ, కాకర పువ్వొత్తులూ యిచ్చి వాళ్ళతో కలిసి కాల్చమంటారు. మా గ్రామంలో హిందువులూ క్రైస్తవులూ క్షీర నీర న్యాయంగా కలిసి అన్నదమ్ముల్లాగా జీవిస్తారు. హిందూ రైతులూ, క్రైస్తవ రైతులూ పగలల్లా పొలాల్లో కష్టించి పనిచేసి సాయంత్రానికల్లా కుతితీర్చుకోడానికి సారాయి అంగడికి పరుగెత్తుతారు.

స్కూల్లో గూడా మా జీవితం యెంతో ఉత్సాహంగా గడిచేది. స్కూలుకు వెళ్ళిందిమొదలు, స్కూలునుంచి తిరిగి వచ్చేవరకు అక్కడ జరగని తమాషా అంటూ ఉండదు. పరుగెత్తడం, ఆడుకోడం, కయ్యాలు పెంచుకోడం, వాగ్వివాదాలు పడడం, చాడీలు చెప్పుకోడం. ఇదంతా నిత్య కార్యక్రమం. ఆటల సమయంలో మా ఆంటోనియో ప్రతిరోజూ జ్ఞాపకం వస్తుంటాడు. ప్రతి సాయంత్రం నాటకం రిహార్సల్స్ చేసుకునేవాళ్ళం. క్రిస్మస్‌లో ఆడబోయే నాటకానికిప్పట్నుంచీ తయారీ అన్నమాట రిహార్సల్స్ అంటే.... రిహార్సల్స్‌లో పాల్గొనని పిల్లలందరూ చర్చిముందర ఉన్న కొలనులో స్నానాలాడో, స్కూలు ఆవరణలో గోలీలాడో కాలక్షేపం చేసేవాళ్ళు సరదాగా. స్కూలు నాలుగుగోడలమధ్య భలే తమాషా ఉండేది. స్కూలు పాఠాలు నేర్చుకునే విషయంలో, యిన్ని తమాషాల మధ్య గూడా, దీక్షా, పట్టుదలా, ఆసక్తీ చూపించేవాళ్ళం. తతిమ్మా విషయాలకన్నా, ఒక్క అంశంమాత్రం మా మనస్సులో అచ్చుగుద్దినట్లు నాటుకునిపోయింది. పోర్చుగల్

బ్రహ్మాండమైన ఒక గొప్ప దేశమనీ, దాన్నే మన మాతృభూమి అని పిలవాలని.

స్కూల్లో మేం నేర్చుకున్న భూగోళ శాస్త్రంలో పోర్చుగల్ చాలా అందమైన దేశమని తెలుసుకున్నాం. 'టెజో', డొరో', గాడియానా నదుల్ని గురించీ. విన్హో, మాటీస్, బైరాన్, వగైరా రాష్ట్రాల్ని గురించీ, లిస్బో. పోర్టో. కోయింబ్రా. సెటుబాల్ మొదలైన మహానగరాలను గురించీ భూగోళ శాస్త్రంలో వివరించబడ్డది గొప్పగా. ఈ భూగోళం ప్రకారం పోర్చుగల్ దేశమే సర్వ ప్రపంచమనీ, ఒకవేళ మరేదేశమైనా యింకొకటి ఉండడం సంభవిస్తే, అవన్నీ అప్రధానమైన వనీ. వాటినిగురించి తెలుసుకునే అవసరమే లేదని తేలిపోయింది.

మేమంతా పోర్చుగీస్‌వారలమని చెప్పుకుని గర్వపడేరోజులవి. వాస్కోడిగామా వంటి వీరుల గాథల్నిగురించి చదువుతున్నప్పుడు మా శరీరాలు పులకరించేవి. ఇలాంటి వీరాధివీరులు ప్రపంచంలో మరెవరైనా ఉండగలరా అని ఆశ్చర్యపడేవాళ్ళం. మరొకళ్ళెవరైనా నిజంగా ఉండి ఉంటే, మాకు బోధించే భూగోళ శాస్త్రాల్లో వాళ్ళ ఘనకార్యాలను గురించి గూడా వ్రాసి ఉండేవారు కారా! అని మాలో మేము నమ్మకంగా చెప్పుకుని సంతృప్తిపడ్డాం.

"అఫాన్సో కొంకణంబాష మాట్లాడేవాడే నా పంతులమ్మగారూ?" అనడిగాను ఒక రోజున.

"ఎంత గడుగాయవురా ఫిలిప్ నీవు! అతనెల్లా మాట్లాడగలడు కొంకణం నీవే చెప్పు! అతని మాతృభాష పోర్చుగీస్ అయితే!" జవాబిచ్చింది పంతులమ్మగారు ఆశ్చర్యం అభినయిస్తూ.

"అయితే మనమూ పోర్చుగీస్‌వాళ్ళమే కదండీ పంతులమ్మగారూ? మన మాతృభాష కొంకణం యెలా అయిందండీ?".

"మన మాతృభాష కొంకణం అని ఎవరన్నారు నీతో? మన మాతృభాషగూడా పోర్చుగీసే!" అన్నదామె.

"మన మాతృభాష గూడా పోర్చుగీసేనా అండీ? అయితే కొంకణం యెవరి మాతృభాషండీ?" అన్నాను.

పంతులమ్మగారికి కంగారెక్కింది. సమాధానమివ్వడానికి వచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్టయింది ఆమెపని. ఈ విషయాన్నిగురించి చర్చ కొనసాగించడం ఆమె కిష్టంలేకపోయింది. "కొంకణం అసలు భాషేకాదు! అది........అది.........ఏదైతే మనకేంలే. మన భాష పోర్చుగీసు భాష. ఇండ్లల్లోగూడా యీ భాషే మాట్లాడాలి మనం తెలిసిందా?" అన్నదామె పంతులమ్మ హోదాతో.

ఆ సాయంత్రం యింటిదగ్గర మా అమ్మ, యిరుగుపొరుగు వాళ్ళూ అడిగిన ప్రశ్నలన్నిటికీ పోర్చుగీసుభాషలోనే జవాబివ్వడానికి ప్రయత్నించాను. మా మాతృదేశమైన పోర్చుగల్ యెడల భక్తి ప్రపత్తులతో నిజాయితీగా సంచరిద్దామనుకున్నాను. పెద్ద పెద్ద భూస్వాములు యిండ్లదగ్గర గూడా పోర్చుగీస్‌భాషే మాట్లాడేవాళ్ళు. ఒకసారి ఇనసిన్హో యింటిదగ్గిర కొంకణంలో మాట్లాడిన పాపానికి అతనితల్లి చావా చితక మోదింది అతన్ని.

ఫెళ్ళున చెంపపెట్టుపెడుతూ కొడుకుతో, "ఈ సారి నీవు కొంకణం మాట్లాడినట్లు నేను చూడాలి! నీ పనేమవుతుందో తెలుసుకుందువుగాని! ఎముకల్లో సున్నం లేకుండా చితక్కొడతాను జాగ్రత!" అని బెదిరించిందామె.

మా వూళ్ళో పురానా భూస్వాముల్లాగా నేనూ దర్జాగా, ఆదర్శంగా బ్రతకాలని అభిలాష. వాళ్ళమాదిరే నాకూ కూలీలూ, పేదరైతులూ సలాములు కొడుతూ లోబడి ఉండాలని ఉద్దేశ్యం. ఇక ముందెప్పుడూ కొంకణం మాట్లాడగూడదని త్రికరణశుద్ధిగా నిర్ణయం చేసుకున్నాను.

సాయంకాలమైంది. పొలంనుంచి మా నాన్న తిరిగి యింటికి వచ్చాడు. ఏదో మునిగిపోయినట్టు రూత్ మా నాన్న కెదురుగా పరుగెత్తుకెళ్ళి, నేను పోర్చుగీస్‌భాష మాట్లాడుతున్నానని ఆయనకు చెప్పింది. మా నాన్న నన్ను వెంటనే పిలిచి, యిలాంటి పిచ్చి పిచ్చి వేషాలు చేయవద్దనీ. యికముందెప్పుడైనా అలాంటి తప్పుడు పనులు చేసినట్లు తెలిస్తే. వొళ్ళు వాయకొడతాననీ కఠినంగా హెచ్చరించాడు మా నాన్న.

"అయితే నాన్నా! మా పంతులమ్మగారు మన మాతృభాష పోర్చుగీసని చెప్పిందేం నాన్నా?"

మా నాన్న కోపంతో మండిపడ్డాడు. ఒక రెప్పపాటు కాలం పెదిమలు బిగించి, "మీ పంతులమ్మతో చెప్పు! ఇలాంటి పిచ్చి పిచ్చి బోధలు పసిబిడ్డలకు చేయడం తక్షణం మానమని! మానకపోతే నేనే స్వయంగావచ్చి ఆమెపని పడతానని చెప్పు!" అన్నాడు.

ఆ రాత్రి భోజనాలముందు మామూలుగా అక్కే యెక్కువగా మాట్లాడని మేరియా మా నాన్నతో, "ఎందుకు నాన్నా. ఎప్పుడూ నీవు పోర్చుగీస్ భాషంటే మండిపడతావ్? మనమంతా పోర్చుగీసు పౌరుల మని నీవు గర్వపడవూ?" అని ప్రశ్నించింది.

మా నాన్న కనుబొమలు ముడిచి, "నిజంగా నేను గర్వపడతా నమ్మా! మనమిన్నాళ్ళూ పతనావస్థలో పడరానిపాట్లు పడుతూంటే లోకులు, "వీళ్ళెంత నిరాడంబరులు, యెంత ఆదర్శప్రాయమైన విధేయులురా!" అంటూ మన సహనబుద్ధినీ, మన సౌమనస్యాన్నీ శ్లాఘిస్తూఉంటారు. మన బానిసత్వమే మనకు గర్వకారణమని మురిసి పడాలి; సిగ్గూ, స్వాభిమానం చంపుకొని!" అన్నాడు.

"ప్రపంచంలో పోర్చుగల్ ఒక గొప్ప దేశంకాదని నీవనగలవా నాన్నా? వాళ్ళ సహాయమే మనకు లేకపోతే, మనమంతా ఆటవిక

జాతులకుమల్లే జీవచ్ఛవాల్లా బ్రతికేవాళ్ళం! వాళ్ళ బోధలే లేకపోతే, మ
మేనాడో మత భ్రష్టులమయ్యేవాళ్ళం!" అన్నది మేరియా.

"ఎక్కడినుంచి మూటకట్టు కొచ్చావమ్మా అద్భుతమైన యీ సమాచారం?" అన్నాడు మా నాన్న అర్థంకానట్లు నటించి.

"పుస్తకాల్లో నుంచి నాన్నా!"

మా అమాయకత్వానికి మా నాన్న జాలిపడి మావంక చూశాడు. ఆ తర్వాత వెంటనే గంభీరమైన కంఠధ్వనితో పోర్చుగీసు పరిపాలకులు రాకపూర్వం గోవా చరిత్రగూర్చి ఉపన్యాసం ప్రారంభించారు.

"పోర్చుగీసువాళ్ళు మన గోవాలో అడుగుపెట్టక పూర్వం మన ముత్తాతలూ, వాళ్ళ పూర్వీలూ సమస్త సంపదలతో తులతూగుతుండే వాళ్ళని మీకు తెలుసునా అబ్బాయిలూ, అమ్మాయిలూ? ఐరోపా దేశీయులు తోళ్ళుకప్పుకుని పచ్చి మాంసం మెక్కే రోజులకెంతో పూర్వమే మన భారత వంశీయులు చదవనూ, వ్రాయనూ నేర్చుకుని చిత్రలేఖనము లాంటి కళాసంపదల్లో ఆరితేరారు."

"లేదు నాన్నా లేదు! నీవు చెప్పేదంతా వట్టి బూటకం! అలా అబద్ధాలాడబోకు!" అంటూ మేమంతా ఒకే గొంతుకతో అరిచాం.

"హుం! నా మాట నమ్మకన్నమాట మీరు! మిమ్మల్ని నిందించి యేం ప్రయోజనం రా! మీరింకా పసిబిడ్డలు! వయస్సువచ్చి, విజ్ఞానవంతులమని విర్రవీగే పెద్ద మనుష్యులే యీ సత్యాన్ని నమ్మకపోతే మీరెలా నమ్మగలరు పాపం!"

అశోకుణ్ణి గురించీ, గోవా సముద్రతీరం వరకూ వ్యాపించి ఉన్న అతని సామ్రాజ్యాన్ని గురించీ, ఏడు శతాబ్దాలకాలం పరిపాలించిన కదంబుల్ని గురించీ, వారి పాలనక్రింద గోవా ప్రజలనుభవించిన వైభవాన్ని గురించీ, మా నాన్న వివరించ సాగాడు. 11 వ శతాబ్దం

నుంచీ రాజుల అంతఃకలహాల్లో చిక్కుకుంది గోవా. 14 వ శతాబ్దంలో విజయనగర సామ్రాజ్యం క్రిందకు వచ్చింది. తర్వాత బీజాపురం సుల్తాన్ గోవాను కబళించివేయాలని కుట్రపన్నాడు. అదే అదను కని పెట్టి టిమోజా సహాయంతో ఆల్‌బుకర్క్ అనే అతడు 1510 లో గోవాలో ఒక పట్టణమైన పంజియ్‌వద్ద ప్రత్యక్షమైనాడు.

గోవా పూర్వ చరిత్రను మా నాన్న కళ్ళకు కట్టినట్లు అద్భుతంగా వర్ణించాడు. దాని పూర్వవైభవం, దాన్ని లోబరుచుకోవాలని రాజులుచేసిన మోసాలూ, కుట్రలూ, వాళ్ళుతలపెట్టిన దారుణకృత్యాలూ, ఆరోజున చెలరేగిన అవినీతీ, చివరకు ఆల్‌బుకర్క్ చేసిన ఘోరమైన ద్రోహం, మా నాన్న వివరంగా చిత్రించాడు.

"టిమోజా యెవరు నాన్నా?" ధైర్యంగా అడిగాను నేను.

"టిమోజా విజయనగరం రాజులవద్ద ఉండే ఒక ఉద్యోగి. వాడొక దేశద్రోహి. తర్వాత వాడికి కావగినశాస్తి కానేఅయింది. పోర్చుగీసు అధికార్లు వీడినుపయోగించుకుని, తమ పరిపాలన సుస్థిరంచేసుకున్న తర్వాత, కుక్కను కొట్టినట్లు తరిమికొట్టి పంపించారు వీణ్ణి. ఈ ద్రోహికి బహుమతిగా యిచ్చిన భూములన్నిటినీ తిరిగి పోర్చుగీస్ అధికార్లే స్వాధీనపర్చుకొని గెంటివేశారు. ఈ దేశద్రోహికి కావలసిన పనికాస్తా అయింది. మీ జీవితంలో యెన్ని అపభ్రంశపు పనులైనా చేయండి; వాటికి నేనే మనను—దొంగతనం చేయండి; రౌడీతనం చేయండి! హత్యలు చేయండి; సహిస్తాను నేను. కాని దేశానికి మాత్రం ద్రోహం యెన్నటికీ తలపెట్టకండి బిడ్డల్లారా! మానవుడు చేయగలిగిన ఘోరాతి ఘోరమైన నీచకార్యాల్లో దేశద్రోహాన్ని బోలింది మరొకటిలేదు. తల్లిపాలు తాగి తల్లిరొమ్ము గుద్దకండి నాయనల్లారా!"

అప్పటివరకూ మౌనంగా వింటూకూర్చున్న మా అమ్మ కల్పించు కుని, "చాలు చాల్లెండి! నిరర్థకమైన మీ గంభీరోపన్యాసాన్ని కావలసినంత

విన్నారు పిల్లలీరోజున. నోరు నొప్పిపుట్టేట్టు మీరెంతైనా వాగండి మీ యిష్టం వచ్చినట్టు! పోర్చుగీసు ప్రభుత్వం మనకు యితర ఉపకారాలు చేసినా చేయకపోయినా, మనకు క్రిస్టియన్ మతం ప్రసాదించి, క్రైస్తవ ధర్మాలనూ, నీతి నియమాలనూ బోధించినందుకు వాళ్ళను మనం అభి నందించితీరాలి! జన్మజన్మాలకైనా వాళ్ళరుణం మనం తీర్చుకోలేం." అన్నది.

"మనల్ని యెలా క్రైస్తవులుగా మార్చారో నీవు నిజం తెలుసుకుంటే............." అని యెదురు జవాబు మా నాన్న తకీమని చెప్పేసరికల్లా, మా నాన్న ఉపన్యాసం అంతటితో కట్టిపెట్టమని అమ్మ ఆయన్ని దబాయించి కొట్టింది. అంతటితో ఊరుకోక గదిలోనుంచి దీపంతీసివేసి, మమ్మల్నందర్నీ నిద్రపొమ్మని పంపివేసింది అక్కణ్ణుంచి.

మామూలుగానే ఆ రాత్రిగూడా మా పెద్దపరుపుమీద పడుకున్నాం పిల్లలం అందరం. అంతకుముందే మా నాన్న చెప్పిన కథంతా నిజమేనా అని మాలోమేం తర్కించుకుంటూ ఆశ్చర్యపడజొచ్చాం. అదంతా యెలా నిజమౌతుందద్దా! పోర్చుగీసు వీరాధివీరులు జన్మించిన దేశమని పుస్తకాల్లో చదువుకున్నామే! మానాన్న చెప్పినట్లు, పోర్చుగీసు వాళ్ళు యింత నీచంగా యెలా ప్రవర్తించి ఉంటారు? మా నాన్న చెప్పింది నిజం కానే కాదనుకున్నాం చివరకు.

మమ్మల్ని నిద్ర ఆవహించగానే, మా నాన్న యేకరువుపెట్టిన కథంతా వట్టి అబద్ధాలపోగని మాకు గట్టిగా నమ్మకం చిక్కింది.

మే నెల దాటిపోయింది; జూన్ ప్రవేశంకాగానే వర్షజల్లులు పడసాగాయి. అదివరదాకా మండుటెండల్లో మల మల మాడిపోయిన మాకు వర్షపుజల్లులు పడడంతో పోయిన ప్రాణాలు లేచివచ్చాయి. రోడ్ల మీది దుమ్మూ, ధూళీ అంతా వర్షపు దెబ్బకు కొట్టుకుని పోయింది. సెంట్రల్ స్కూల్లో చదవడానికి మా గాబర్ట్ పంజిమ్ బయల్దేరి వెళ్ళి

పోయాడు. పంజిమ్‌లో మా మేనత్తా, మేనత్తమొగుడూ కాపుర ముంటున్నారు. అయన గవర్నమెంటు ట్రెజరీ ఆఫీసులో ఒక ఉన్న తోద్యోగి. మా రాబర్టో మేనత్తవద్దనే ఉంచి చదువుకోదలచుకొన్నాడు. మాండవీనది కెదురుగా ఉన్న ఒక పెద్దభవనంలో మామేనత్తా వాళ్లూ కాపురముంటున్నారు. ఆ భవనం కిటికీనుంచి బయటికి తొంగిచూస్తే, చిన్న చిన్న పడవలు నదిమీద ప్రయాణం చేయడం చూడగలం. నది గట్టుపైన వరసగా పెరుగుతున్న కొబ్బరిచెట్లుగూడా ముచ్చటగా చూడవచ్చు.

రాబర్టోకు పోర్చుగీసు భాష నేర్చుకోవాలని యెంతో మోజూ, పట్టుదలా గూడా, ఉన్నత విద్యమీద వాడికెంతో అభిమానం. మేనత్త వద్ద ఉంచి చదువుకోవాలంటే, వాడి సంతోషానికి మేర లేకపోయింది. అయితే అబ్బురంగా పెరిగిన రాబర్టోను విడిచి ఉండలేక మా అమ్మ కన్నీళ్ళు కార్చింది, వాడు ప్రయాణమై పోతూవుండగా.

"మరీ చిన్నపిల్లవైపోతున్నావమ్మా నీవు! నీకూ, నీ రాబర్టోకూ వచ్చిన ఫర్వాయేమీ లేదులే! వాణ్ణి వెయ్యికండతో కనిపెట్టి ఉంటాగా!" అన్నది మా మేనత్త ఆస్పుల్క్వేటా మా అమ్మను ఓదార్చుతూ. మా నాన్నవంక చూచి ఆమె సహజధోరణితో, "అన్నయ్యా, మీ అబ్బాయి చదువుకున్నా, చదువుకోకపోయినా, నన్నుమాత్రం నిష్ఠూరాలాడవద్దు. నీకు తెలియకపోతే చెబుతున్నా విను! మా పంజిమ్‌లో పిల్లకాయలు చదువుకొనడం మినహా తక్కిన పనుల్లో అందెవేసిన చేతులు!" అన్నది.

మా మేనత్త మా అమ్మ నెంతఓదార్చి ధైర్యంచెప్పినా, ఆమె హృదయవేదన కొంచమైనా ఉపశమించలేదు. ప్రతి నిమిషం రాబర్టోను గురించీ, బొంబాయిలో ఉన్న ఆంటోనియోను గురించీ ఆందోళన పడుతూనే ఉండేది. వాళ్ళ ఆరోగ్యమూ, వాళ్ళ చదువులు సరిగా ఉన్నాయో

లేవో అనే ఆలోచనే అస్తమానం. మహో గొడవేమి పట్టలేదామెకు. తన ప్రార్థనలు చాలక, వాళ్ళవంతు ప్రార్థనలు గూడా చేస్తూ కూర్చుండేది మా అమ్మ చర్చిలో. గంటలు గంటలు మోకాళ్ళపైన కూర్చొనడంవల్లనే మా అమ్మ మోకాటిచిప్పలు నల్లబడి కాయలుగూడా కాశాయి. ఎప్పుడూ రాబర్టో, ఆంటోని మోలదే ఆలోచనామెకు. రోజులూ, నెలలూ యీ వరుసగా గడిచిపోతున్నాయి.

ఆ రోజు సాయంత్రమే విషాదకరమైన ఒక దుస్సంఘటన జరిగింది. ఉన్నటుండి ఆకాశం అకస్మాత్తుగా కారునలుపెక్కింది మేఘాడంబరంతో, ఉరుములు, మెరుపులు, జోరుగా, భయంకరంగా ఉన్నాయి. గాలి ప్రళయంగా వీస్తూ, సింహగర్జననుగూడా మరిపిస్తున్నది. ఇంటి ముందాడుకుంటున్న పిల్లలందరూ వెంటనే పరుగెత్తుకుంటూ యింట్లో వచ్చి పడ్డారు. వరండాలో చెల్లాయిలతో కబుర్లాడుతూ కూర్చున్నది లక్ష్మి. గాలివాన సాగడంచూసి, తనయింటి కిటికీ తలుపులు మూసి దీపంవెలిగించి రావడానికి వెళ్ళిపోయింది లక్ష్మి.

మొదట్లో పిల్లలం తప్ప, పెద్దవాళ్ళెవరూ ఉరుములూ, మెరుపులూ చూసి భయపళ్ళేదు. మేంమట్టుకు ఉరుములదెబ్బకు హడలిపోయి, మా వీపులమీద మేమే చరుచుకుని, మమ్మల్ని మేమే ధైర్యం చెప్పుకున్నాం. వర్షం అంతకంతకు జోరై యీడ్చి కొడుతూంది. ప్రళయంగా వీచేగాలి పెద్ద పెద్ద వృక్షాల్నిగూడా కూకటివేళ్ళతో పెకలించివేయడం మొదలెట్టింది. తన కడ్డంవచ్చిన సర్వస్వాన్నీ తుడిచిపెట్టివేస్తున్నది. మనుష్యులూ, పశువులూ గూడా బేజారెత్తిపోతున్నారు. పశువులూ, కోళ్ళూ రక్షణదొరక్క అల్లాడిపోతున్నాయి. పొలాల్లో పనిచేసుకుంటూన్న రైతుకూలీలు బ్రతుకు జీవుడా అని కొంపలకు చేరుకున్నారు. అంత బీభత్సంగా, భయానకంగా ఉన్నదా సాయంత్రం,

మా అమ్మకు తోడుకూర్చునిఉన్న అనస్తాసియో, "ఇది నిజంగా తుఫానే నమ్మా!" అంటూ లేచి యింటిముఖంపట్టి పోతున్నాడు.

"అబ్బాయ్! మీ నాన్న యెక్కడ తలదాచుకున్నారో గదరా యీ పెనుగాలికి!" అంటూ మా అమ్మ పెద్దపెద్దగా అరిచి, మళ్ళీ లోలోపల, "ఆయన క్షేమంగానే యెక్కడో ఒకచోట తలదాచుకునే ఉన్నారను కుంటాలే" అన్నది గొణుక్కుంటూ.

ఇంకా అస్తమానంకాలేదు. కాని కారుమేఘాలకు గాఢాంధకార మైంది గ్రామమంతా. ఎంతో పొద్దుపోయినట్టుంది. కంట్లు పొడుచు కున్నా ఆరుబయటి వస్తువులు ఒకటీ కన్పించడంలేదు. ఇంతలో కార్లస్ సీజర్, నేనూ ఒకగదిలో పడ్డాం పోయి. కిటికీ అద్దాలు చెక్కలై పోయేట్టుగా వర్షం యీడ్చికొడుతూంది. వర్షపుగాలి తాకిడికి తలుపులూ కిటికీలూ బద్దలైపోయేట్టుగా కొట్టుకుంటున్నాయి. ప్రళయాట్టహాసంగా వీస్తూన్న వానగాలి చప్పుడు పిచ్చికుక్క అరుపులా ఉన్నది. ఎక్కడో ఒకచెట్టు కూకటివేళ్ళతో పెళ్ళగిలి పడిపోయినటూ. బలమైన మరొక చెట్టు కొమ్మలు పెళ పెళా విరిగినటూ శబ్దం వినవచ్చింది. ప్రకృతి మాత మాపై అలిగి సర్వవినాశానికి తలపెట్టినట్టుంది.

మా అమ్మను గావుకేకపెట్టి పిలిచి. మాకు తోడుగా గదిలో కూర్చోమని చేయిపట్టుకుని లాగాం. మా అమ్మకు కోపంవచ్చి, మీకు సిగ్గులేదూ! మగపుటక పుట్టలామీరు. ఆడపిల్ల లక్ష్మిని చూడండి! వంట రిగా నిర్భయంగా యెలాకూర్చుని ఉందో!" అన్నది.

ఆ గాలివానలో మానాన్న యే చెట్టుచాటున తలదాచుకున్నాడో అని మా అమ్మ పడ్డ ఆందోళన యింతాఅంతాకాదు - పొలం పోయిన మా నాన్న తడిసి ముద్దైందుమై తిరిగి యింటికి రాగానే, ఆత్రంగా ఆయనవద్దకు మా అమ్మ పరుగెత్తింది - ఆయన ఒళ్ళంతా ఆపాద మస్తకం తన చేతితో నిమిరింది. ప్రమాదమేమీ లేకుండా యింటికి వచ్చి

నందుకు సంతోషసూచకంగా. మా నాన్న నాస్తికత్వానికి మా అమ్మ అప్పుడప్పుడూ కోపంతో కస్సుమన్నా, ఆయనమీద మా అమ్మకు అతి గాఢమైనప్రేమ - మా సమక్షంలో మా అమ్మ ఆయనతో ఆట్టే మాట్లాడేది గాదు. అయితే తరుచుగా అర్ధరాత్రిళ్ళు నాకు మెలకువ వచ్చినప్పుడు, గదిలో మా అమ్మ, మా నాన్నా గుసగుసలు చేసుకుంటున్నట్లు వినవచ్చేది నాకు. అంతేకాదు, సరసల్లాపాల్లో మా అమ్మ ముసిముసి నవ్వులు నవ్వుతున్నట్లుగూడా వినేవాణ్ణి.

మా నాన్న తడిసిన గుడ్డలు విప్పుకుంటూంటే, మా అమ్మ ఆయనకు సాయపడింది. పొడిగుడ్డ తీసుకొచ్చి తలవెంట్రుకలూ, ఒళ్లూ గట్టిగా తుడిచి ఆరబెట్టింది. ముతకగుడ్డ రాపిడికి పై చర్మం ఊడి పోతున్నంత బాధ పడ్డేది మా నాన్నకు. అయినా మా అమ్మకుండే ఆతురతతో ఆయన బాధనుగూడా లెక్కచేయకుండా మరింత గట్టిగా మా నాన్న ఒళ్లు తుడిచి చలిపోగొట్టడానికి ప్రయత్నించింది. తాత్కాలికంగా ఒకనిమిషం బాధకల్గినా, మా నాన్న బిగబట్టుకుని ఓర్చుకున్నాడు. ఆయనమీద మా అమ్మకున్న నిష్కళంకప్రేమకు లోలోన మురుసుకున్నాడు మా నాన్న.

"ఆరుబయట చూడు! ఎంత భయంకరంగా ఉందో! ఈ గాలి మూలంగా ప్రతి చెట్టూ యేదోవిధంగా దెబ్బతినక మానదు. ఈ వాన గాలికి పాపం ఆ చెట్లన్నీ చూడు యెలా యేడుస్తున్నాయో!" అన్నాడు మా నాన్న జాలిహృదయంతో.

మా అమ్మ అప్పటికి తుడవడం చాలించి, "చూడండి! పాకాలో ఆవును కట్టేశాం. పాకాపక్కన చిన్నకొబ్బరిచెట్టు గాలిదెబ్బకు నేల కూలినట్లుంది చూడండి! ఇంతకుముందే భయంకరమైన శబ్దంగూడా వినపడ్డది. వంకర్లు తిరిగిఉన్న ఆ కొబ్బరిచెట్టే తప్పక పడిఉంటుంది!" అన్నది మా అమ్మ గాభరాతో.

"ఈ వర్షంలో వసంత్, బాగూ యెక్కడ చిక్కుకున్నారో పాపం! ఇంటికి వచ్చేదార్లో వాళ్ళయింట్లో తొంగిచూశాను. అప్పటికింకా వాళ్లు రానేలేదు. పాపం లక్ష్మి చలికి వణికి పోతున్నది గదా!" అన్నాడు మా నాన్న.

ఒక్క గంతులో మా నాన్న పరుగుతీసి పాకావైపు తొంగి చూశాడు పశువులు క్షేమంగా ఉన్నాయేమోనని. మా అమ్మ వంటయింటి గుమ్మంలో దీపం పట్టుకుని నిలబడి మా నాన్నకు దోవచూపిస్తున్నది.

వర్షం అంతకంత ఉధృతమౌతూన్నది. చెరువులూ,కుంటలూఅన్నీ యేకమౌతున్నాయి. మిట్టపల్లాలన్నీ సమమౌతున్నాయి. మేమంతా మోకాళ్ళపై నిలబడి యేసుక్రీస్తును ప్రార్థించడం మొదలెట్టాం. ఎవరో దభీమని వీధి తలుపు తట్టినట్లు శబ్దమైంది. "ఈ రాత్రివేళ గాలివానలో యెవరబ్బా తలుపు తట్టేది!" అంటూ తలుపు తెరవడాని కెళ్ళింది మా అమ్మ.

మరెవరోకాదు! ఆ పిల్ల లక్ష్మే!

వర్షానికి నానుతూ, చలికి వణికిపోతూ, ముడుచుకుని గుమ్మం నిలబడుందక్కడ లక్ష్మి. ఆ పిల్ల తలవెంట్రుకల వెంటధారగా వాననీళ్ళు కారుతున్నాయి. కండ్లల్లో దుఃఖాశ్రువులు గిర్రున తిరగడం చూశాను. నా కడుపు తరుక్కునిపోయింది. లక్ష్మి తలిదండ్రులింకా యింటికి చేరుకోలేదు. ఆ పిల్ల గుండె చెరువైంది దిగులుతో.

మా నాన్న లక్ష్మిని చూడగానే విపరీతంగా జాలిగొన్నాడు. గాలి వాన సద్దుమణిగేవరకూ లక్ష్మిని మనవద్దనే ఉంచుకొందామని మా నాన్న మా అమ్మతో అన్నాడు. ఒక గొడుగు తీసుకుని బయల్దేరాడు మా నాన్న. వానగాలికా చింపిగొడుగు ఆగదని మాకు తెలుసు. యాసియానో యింటికీ, చెవిటిపెద్రో యింటికీ పోయి తలుపుకొట్టి, ధైర్యం చెప్పి, జాగ్రత్తగా ఉండమని హెచ్చరించివచ్చాడు. వచ్చేదార్లో యింకా కొందరి యిండ్ల

కూడా వెళ్ళి, వాళ్ళనుగూడా ఓదార్చి వచ్చాడు. అక్కడనుంచి లక్ష్మి తలిదండ్రులకోసం వెదకడం ఆరంభించాడు.

కాళరాత్రి భయంకర స్వరూపం దాల్చింది. వానగాలి విశ్రాంతి తీసుకునేందుకా అన్నట్లు అయిదు నిమిషాలసేపు తగ్గినట్లుగా తగ్గి మళ్ళీ ద్విగుణీకృతోద్రేకంతో జోరైంది. ఈ సారి మొత్తంగానే తుడుచుకుపోయేట్లుంది భయంకరంగా. ఈ సారి మధ్య మధ్య తమాషాగా శబ్దం వినవచ్చింది గాలి వీస్తుంటే. ఆ శబ్దం చచ్చిన భర్తలకోసం యేడ్చే ఆడవాళ్ళ రోదన ధ్వనిలాగా ఉంది.

ఒకటి రెండుగంటలు ప్రాణాలు బిగబట్టుకుని యెలాగో కాలం గడిపాం. త్వరలో గాలివాన సద్దుమణుగుతుందని ఆశపడ్డాం. భగవంతుణ్ణి మనసారా ప్రార్థించాం. చివరకు లక్ష్మి తలిదండ్రుల్ని మా నాన్న వెంటబెట్టుకుని తిరిగి వస్తున్నట్లు శబ్దం వినవచ్చింది. ఏంజరిగిందో తెలుసుకుందామని వరండాలోకి పరుగుతీశాం. బరువెక్కిన హృదయంతో అడుగులో అడుగేసుకుంటూ మెల్లెక్కి వస్తున్నాడు మా నాన్న. ఆయన ముఖపై ఖరి చూడగానే. వసంతకూ. బాగూకు యేదో కీడుమూడి ఉంటుందని తెలుసుకున్నాం.

మా నాన్నా. అమ్మా యెక్కడున్నారు బాబూ? మీరు చూశారా వాళ్ళను?" అన్నది లక్ష్మి మా నాన్నదగ్గరకు పరుగెత్తుకెళ్ళి.

మా నాన్న లక్ష్మివంక దీనంగా, జాలిగా చూశాడు. ఒక్క మాటైనా మాట్లాళ్ళేదు. ఏదో ప్రమాదం జరిగిందని లక్ష్మి గ్రహించింది. ఒక్క గావుకేక పెట్టి వెక్కివెక్కి యేడవడం ప్రారంభించింది లక్ష్మి.

వసంత్. బాగూ స్వర్గస్తులైనారు. వానగాలిలో తలదాచుకోడానికి యిద్దరూ ఒక పెద్ద వేపచెట్టుకింద నిలబడగానే, క్షణంలో వచ్చిన గాలి విసురుకు ఆ చెట్టు కూకటివేళ్ళతో పెళ్ళగిలి నిలువునా కూలింది. చెట్టు బోదెకిందపడి భార్యాభర్తలిద్దరూ నుగ్గునుగ్గైపోయారు.

వసంత్, బాగూల బౌతిక దేహాలక్కడే పడున్నా యింకా. చచ్చినా మొహాలు కళకళలాడుతూ బ్రితికేఉన్నట్లున్నారిద్దరూ. ఆనాడు మధ్యాహ్నమే వాళ్ళిద్దర్ని చూశాను నేను. మధ్యాహ్నం అన్నానికి స్కూలు నుండి నేనింటికి వస్తుంటే, పాపం వసంత్ నాతో పరిహాసాలుగూడా ఆడాడు. పిల్లలతో సరదాగా మాట్లాడడం అతని మామూలు ధోరణి. తిరిగి స్కూలుకు పోయేప్పుడు లక్ష్మినిగూడా వెంటపెట్టుకుని పోతావా అని అడిగాడు నన్ను పాపం!

ఇంతలో యెంతఘోరం జరిగింది! ఒక్క తృటి కాలంలో యీ పాపిష్టి వానగాలి భార్యాభర్తల్నిద్దర్నీ ప్రాణాలు తీపిందే!

అర్ధ రాత్రయింది మర్నాడుదయం లక్ష్మి తల్లిదండ్రుల ఉత్తర క్రియలు జరపాలి. అవసరమైన ఏర్పాట్లను గురించి లక్ష్మి యింట్లో చర్చించి అప్పుడే మానాన్న యింటికొచ్చాడు, లక్ష్మితోసహా పిల్లలందరూ నిద్రపోయారు. ఒక్క మా అమ్మకు నాకు నిద్రపట్టలేదు. మా నాన్న కోసం నిరీక్షించుకొంటు కూర్చున్నాం. అలసిపోయి వచ్చిన మా నాన్నకు మా అమ్మ యింత టీ తయారుచేసి యిచ్చింది.

"మీకింకా నిద్రపట్టలేదు? చాలా పొద్దుపోయిందిరా అబ్బాయ్! నిద్రపోండి!" అన్నాడు పడక కుర్చీలో కూలబడుతూ మా నాన్న.

నా నోటివెంట మాట రాకపోయింది, నా కళ్ళవెంబడి ధారా పాతంగా నీళ్ళుకారడం చూసి మా నాన్న "జరిగినందానికి మనమేం చేయలేం నాయనా! ఈశ్వరేచ్ఛ యెలా ఉందో అలా జరగాల్సిందే! వాళ్ళిద్దరికీ దేవుడు స్వర్గంలో శాశ్వత సౌఖ్యం చేకూర్చుగాక అని ప్రార్థిద్దాం!" అన్నాడు.

"మరి వాళ్ళు హిందువులుగా నాన్నా! వాళ్ళుగూడా స్వర్గానికే పోతారా?" అడిగాను మెల్లిగా.

"మంచి పనులెవరు చేసినా - హిందువులుగానీ, ముస్లీములుగానీ, క్రైస్తవులుగానీ - అందరూ చనిపోయిన తర్వాత స్వర్గానికే పోతారు నాయనా! స్వర్గమనేది ఏ ఒక్క మతస్థుల ప్రత్యేక ఆస్తి, హక్కు కాదురా!"

పక్కమీద పడుకుని ఆ్టే ఆలోచించగా ఆలోచించగా మాగ్రామ పౌరోహితుడు చెప్పిందబద్దామనీ, మా నాన్న చెప్పిందే నిజమనీ, న్యాయమనీ అనుకున్నాను.

---

## ౬

వసంత, బాగూల మరణం ఫలితంగా మా గ్రామమంతా చీకట్లు కమ్ముకున్నట్లయింది. - ప్రతివాడూ తన కుటుంబంలో ఆత్మీయులు మరణించినట్లుగా భావించాడు - ఆ రోజుల్లో క్రైస్తవులూ. హిందువులూ క్షీరనీర న్యాయంగా ఒక్క కుటుంబంలో అన్నదమ్ములు జీవించినట్లు జీవించాం. కష్టసుఖాలన్నీ అందరం సమంగా పంచుకొన్నాం. మా పొలాలు పుష్కలంగా పండాలనీ, మా ప్రజలంతా రోగం, రట్టూలేం ఆరోగ్యైశ్వర్యాలతో పదికాలాలపాటు జీవించాలనీ, చనిపోయింతర్వాత శాశ్వత సౌఖ్యం కలుగజేయాలనీ దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉండేవాళ్ళం.

లక్ష్మి తలిదండ్రులు మా గ్రామంలో ఎంతోపలుకుబడీ, మర్యాదా కలవాళ్ళు. "రేన్స్" అనే ఒకతెగవాళ్ళు పోర్చుగీస్ పాలకులపై ప్రచండంగా చేసిన తిరుగుబాటునుగూర్చి వసంత కళ్ళకుకట్టినట్లు వర్ణిస్తుంటే, యింకా యింకా వినాలనిపించేది మా ప్రజలకు, వూరగాయ పచ్చళ్ళు పెట్టడంలోనూ, కమ్మని పిండివంటలు తయారుచేయడంలోనూ. యిరుగమ్మలకూ, పొరుగమ్మలకూ బాగూ యెంతో సహాయపడేది. భార్యా భర్త లిరువురూ కొంచెం వయస్సు మళ్ళినవాళ్ళే. వసంత వయస్సు 50 సంవత్సరాలూ. బాగూవయస్సు 45 ఉంటాయి. లక్ష్మి ఒక్కతే వాళ్ళకు పుట్టినబిడ్డ. కాపరానికి వచ్చింతర్వాత యిరవై సంవత్సరాలకుగాని లక్ష్మి పుట్టలేదు.

అలాంటి ముద్దు బిడ్డను—ఒక్కగాను ఒక్కబిడ్డను—విడిచి వెళ్ళి పోయారు తలిదండ్రులు.

లక్ష్మి కెవరూ నా అన్న దిక్కులేదు. ఒంటరిగా చిక్కిన పక్షయింది. జాలిగుండెగల మా అమ్మ లక్ష్మిని పెంచుకున్నది. లక్ష్మి గూడా మాతోపాటు ఒకతై కలిసిమెలిసి జీవించడం మాకు సంతోష మైంది. ముఖ్యంగా రూత్, మేరీయా లక్ష్మిని మరీ ప్రేమించేవాళ్లు. ఆ పిల్ల కన్నిసౌకర్యాలూ వనగూర్చేవాళ్లు, మగ పిల్లలం రెండోసారి మారు వడ్డించుకునడం మానేసి, లక్ష్మికి పెద్దవాటా వచ్చేట్లు సర్దు కునేవాళ్ళం.

కాలక్రమేణా లక్ష్మిని మా కుటుంబంలో ఒక సభ్యురాలుగా పరిగణించి గాఢాభిమానంతో ఆదరించడం మొదలెట్టాం. ఆ పిల్లను చూస్తే ఒకందుకు మాకు విచారం కలిగేది. మేమంతా ఆ పిల్లకు భౌతిక, సంబంధమైన సౌకర్యాలు చేకూర్చుతుంటే. ఆధ్యాత్మిక చింతన ఆ పిల్ల మనస్సులో తప్పించాలని మా అమ్మ ఆరాట పడేది.

“లక్ష్మి! మాతో గూడా చర్చికి వస్తావా?” అనడిగింది ఒక రోజున మా అమ్మ. పాపం, తన హిందూమతాన్ని గురించే అక్షరం ముక్కతెలియని లక్ష్మి, మా మతాన్ని గూర్చి తెలుసుకుందామని ఉబలాట పడింది. ఆ పిల్లకోసం మా అమ్మ అందమైన డ్రస్సు తయారు చేయిం చింది. ముచ్చటగా తొడిగి అలంకరించింది. లక్ష్మిని చర్చికి మచ్చికచే క్రమంగా మా మతంలోకి మార్చివేయాలని మా అమ్మ యెంతో ఆశ పడ్డది. ఇప్పట్నుంచీ మతవిషయాల్లో లక్ష్మికి బోధలు చెయ్యవద్దనీ, యీడొచ్చిన తర్వాత తనకు తానై లక్ష్మి స్వయంగా ఆలోచించుకుని. తన కిష్టంవచ్చిన మతం స్వీకరిస్తుందనీ మా నాన్న అమ్మను గట్టిగా మందలించాడు. అయితే, మా నాన్న సలహాను మా అమ్మ లక్ష్యపెట్టనే లేదు. క్రైస్తవాచారాలు బోధించడం, క్రైస్తవ ప్రార్థనలు నేర్పడం మొద

లెట్టింది మా అమ్మ. క్రైస్తవ మతంలో ఉన్న గొప్పదనం, ఆధిక్యత మరే యితరమతంలో గూడా లేదని లక్ష్మికి నూరిపోస్తుండేది.

మొట్టమొదటిసారిగా లక్ష్మిచేత మా అమ్మ జపమాల తిప్పిస్తున్నప్పుడు, మాకు కడుపుబ్బా నవ్వు వచ్చింది. మధ్య మధ్య కొన్ని అక్షరాలను దాటేస్తూ, అప్పుడప్పుడూ తడబడుతూ లక్ష్మి యెప్పుడూ మమ్మల్ని నవ్విస్తుండేది. ఒక్కొక్కప్పుడు గంటలకొద్దీ చేసే ప్రార్థనలు చూస్తుంటే విసుగెత్తేది మాకు. మేం నవ్వుతూంటే ఒక్కొక్కప్పుడు లక్ష్మికి మరీ గాభరా అయ్యేది. గాభరాలో మరికొన్ని తప్పులు చేసేది. ఈ హంగామా అంతా చూసి మా అమ్మ చెప్పు తీసుకొని మా వెంటబడేది.

"ఒక్కతనే ప్రార్థన చేస్తున్నప్పుడు యింత గాభరాపడుతున్నానే! సమిష్టిగా రాత్రిళ్ళు ప్రార్థించేప్పుడెంత గాభరాపడతానో అమ్మా!" అన్నది లక్ష్మి ఒకరోజున. మా అమ్మ లక్ష్మి తల నిమిరి, పిల్లవెధవల నవ్వులు పట్టించుకోవద్దనీ, గాభరా క్రిమంగా పోయి కొద్ది నెలల్లోనే అందరికన్నా దీక్షగా ప్రార్థనలుచేసే శక్తి దేవుడే కలిగిస్తాడనీ మా అమ్మ లక్ష్మికి ధైర్యం చెప్పేది.

ఆమె అనుకున్నట్లు నిజంగా అలాగే జరిగింది. ఆరుమాసాలు గూడా తిరక్కముందే, లక్ష్మికి అన్ని ప్రార్థన గీతాలు కంఠస్థం అయినాయి. తొట్రుపాటూ, తడబిడ పడడం పోయింది. మా కన్న యెంతో ప్రశాంతంగా, సుశిక్షణతో ప్రార్థన చేయడం మొదలెట్టింది.

స్కూలు రెండో టెరమ్ ప్రారంభమయ్యేసరికి లక్ష్మిని గూడా మాతో స్కూలుకు తీసికెళ్ళడం మొదలెట్టాం. పంతులమ్మగారి కాశ్చర్యం కలిగేట్లుగా, లక్ష్మి తన పాఠాలను చక్కగా చదివి వప్పగించేది. లక్ష్మి చాలా తెలివైన పిల్ల. ఒక్కసారి చదివి చెబితే చాలు, యెంతగొట్టుపాఠమైనా యిట్టే అతి సులభంగా వచ్చేసేది లక్ష్మికి.

బైబిల్ మొదలైన గ్రంథాలన్నీ సులభంగా చదివే శక్తి కల్గింది లక్ష్మికి. ఆదివారంనాడు మామూలుగా మతగురువడిగే ప్రశ్నలన్నిటికీ. మాకన్నా లక్ష్మే యెంతో చక్కగా, తృప్తిగా సమాధాన మిచ్చింది.

"ఈ పిల్లలందర్నీ నీవు సిగ్గుపరుస్తున్నావు లక్ష్మీ! కాథొలిక్కు మతాన్నవలంబించిన నీవు నిన్నే అభినందించుకోవాలి! దేవుడు నిన్ను చిరాయువుగా ఆశీర్వదిస్తాడు!" అన్నాడు మతగురువు సంతోషంతో.

లక్ష్మి సంతోషంతో చిరునవ్వు నవ్వింది. తెలివితేటల్లో, చురుకుదనంలో, శ్రద్ధాసక్తుల్లో మేమంతా లక్ష్మికి వెనకపడ్డందుకు మతగురువు నిందాగర్భితమైన దృక్కులతో మావంక అచేపనిగా చూడడం మొదలెట్టాడు.

మతగురువును నేనొక ప్రశ్న వేయడంతో ఆయన అరికాలి మంట నెత్తికెక్కింది.

"చచ్చిన తర్వాత హిందువులుగూడా స్వర్గాని కెందుకెళ్ళరు?"

నా ప్రశ్నకు ప్రక్క ఉన్నవాళ్ళందరికీ కోపంవచ్చింది. ఇలాంటి తెలివితక్కువ ప్రశ్న వేశానని ముఖ్యంగా రూత్ కొర కొర చూసింది నావంక.

"ఎంత తెలివిగలవాడవురా నాయనా! నిక్షేపరాయుడివి అవతరించావ్!" అంటూ కోపంతో యెగతాళిగా చూశాడు మతగురువు నా వంక. "వాళ్ళకు స్వర్గం అంటూ ప్రాప్తంలేదని యిదివరకే చెప్పలా నీకు నేను! నేను చెప్పింది నిజంకాదని యెవరన్నారు నీతో?"

"హిందువులకూడా స్వర్గసుఖం ఉన్నదని మానాన్నే అన్నాడు." అన్నాను ధైర్యంచేసి. మతగురువు మళ్ళీ యింకేదో చెప్పబోయినట్లు పెదిమలాడించారు. కాని పస్తాయించుకుని మారు మాటాడకుండా కుక్కినపేనైనాడు.

చర్చిలో ఆనాడు నేనడిగిన ప్రశ్న వాడ వాడలా, ఊరూరా వ్యాపించింది. ముఖ్యంగా మా గ్రామములో కలవరం పుట్టింది. మానాన్న దుర్బోధలతో మమ్మల్ని తప్పుదారి కీడుస్తున్నాడని ప్రజల్లో గుసగుసలు పుట్టాయి. మా అమ్మపని అయోమయమైంది. ఆమె మనస్సులో మనస్సు లేదు. మా కుటుంబానికీ, వంశానికూడా అపఖ్యాతి గల్గించానని నన్ను ఆడిపోసిందామె. అమృతంలో విషంలాగా. ప్రశాంత జీవనం గడిపే కుటుంబంలో చిచ్చుపెట్టానని నన్ను దూయబట్టింది.

"అయితే హిందువులుగూడా స్వర్గానికే పోతారని నాన్న అన లేదూ?" అని ఆత్మరక్షణ చేసుకున్నాను.

"అవును రా అవును! నాకు తెలుసురా అంతా! మీ నాన్న చేసిన పాపానికి పసిబిడ్డలైన మీరు యేనాడో ఒకనాడు ప్రాయశ్చిత్తం చేసుకోవాల్సిన దుర్గతేర్పడుతుంది! దీన్లో ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు!" అన్నది మా అమ్మ.

రోజులూ, మాసాలూ సంతోషంగా దొర్లుకుపోతున్నాయి. లక్ష్మి మా గడపతొక్కి మాతో ఉండడం మొదలెట్టి సంవత్సరమైంది. ఆ పిల్ల రాకవల్ల మా యింట్లో నూతనోత్సాహం పుట్టుకొచ్చినట్లు తోచిందినాకు. మా అమ్మ సంతోషం యెక్కువైంది. ఒక్కొక్కసారి ఆనందంలో ఆమె తన్మయత్వం చెందిపోయేది. ఆమెచేసిన పుణ్యఫలమా అన్నట్లు క్రీస్తు దయదలిచి మా ఇంట్లో మరొక క్రైస్తవభక్తురాలిని మాకు జత చేశాడనిపించింది మా అమ్మకు. మా నాన్న చేసిన పాపాలకు, క్రీస్తును తూలనాడినందుకూ, ఆయన్ను కరుణించి కటాక్షించమని దేవుణ్ణి ప్రార్థించేదామె.

లక్ష్మి మంత్రతంత్రాల తంతుతో శాస్త్రోక్తంగా క్రైస్తవ మతం స్వీకరించే శుభదినం సమీపించింది.

ఆనాటి సందర్భంలో జరిగిన కర్మకాండ అతిసంక్షిప్తంగానూ, నిరాడంబరంగానూ నడిచింది. కాని యింటిపద్ద మేం పెద్దపండుగ చేసుకొన్నాం. ఆ రోజున యిరుగు పొరుగు బంధుమిత్రులూ, మా మత గురువూ హాజరైనారు. లక్ష్మి పేరుమార్చి, 'మేరియా ఫిలోమినా తెరీసా' అని పేరుపెడితే బాగుంటుందని మతగురువు సలహా యిచ్చాడు.

మా హాలంతా మైనపువత్తుల దీపాలతో, అగరు వత్తులతో, యితర సుగంధ ద్రవ్యాలతో ఘుమ ఘుమ లాడుతోంది. మా యిల్లంతా యెంతో తేజోవంతంగానూ, ప్రకాశమానంగానూ ఉంది. క్రీస్తు శిలువ కెదురుగా నిలబడి, మా కంఠాలెత్తి పెద్దగా ప్రార్థనలు చేయడం ప్రారంభించాం. అంతకంతకూ మా కంఠస్వరం మిన్నుముట్టుతూంది. శరీరం దిగచెమటలు పోయసాగింది. ఫ్లోరియానో, పెడ్రో—యిద్దరూ వరండాలో నిలబడి గుసగుసలు ప్రారంభించారు. త్వరలో యీ తంతు పూర్తయి, సారాయిబుడ్లు బయటపడితే బ్రతికిపోదుం అనిపించింది వాళ్ళకు. ప్రార్థనలమీద విసుగెత్తి, బుడ్లమీదకు మనస్సు మళ్ళింది. సహనం కోల్పోయి వీళ్ళిద్దరూ గొంతులు పెద్దవిచేసి మాట్లాడ్డం మొదలెట్టారు. మాటలు లోనికిగూడా వినవచ్చాయి. చర్చి ప్రశాంతతను భగ్నం చేయగూడదని మందలించినట్లుగా మతగురువు ఒక్కొక్కసారి తన దృక్కులను ఫ్లోరియానో, పెడ్రోలపైన నిగిడ్చేవాడు. ఇది కనిపెట్టిన పెడ్రో తమాయించుకుని కొంగజపం చేస్తున్నట్లు తన దృష్టిని శిలువ మీదకు మళ్ళించాడు. కాని చిత్తం శివునిమీదా, భక్తి చెప్పులమీదా!

మత సంబంధమైన కర్మకాండ ముగిసింది. సంతోషంతో టపా కాయలు, చిచ్చుబుడ్లు పేల్చాం. తర్వాత మా అమ్మా, మా అక్క చెల్లెండ్లు పళ్ళేలతో మిఠాయి, పండ్లు పట్టుకొచ్చి అతిథులందరికీ పంచడం మొదలెట్టారు.

"రత్నంపంటి దానపు వోరికినందుకు నిన్నుచూచి నిజంగా గర్వ పడుతున్నానమ్మా! మన మతానికి నీవు చేసినసేవ మరవరానిది!" అన్నాడు ఆశ్చర్యపోతూ సాంటానా.

"నీ అనంతరం నీకు స్వర్గద్వారాలు బార్లాగా తెరిచే ఉంటా యమ్మా!" అన్నాడు అనిసిటో.

ఉత్సవానికొచ్చిన ప్రతిఅతిథీ తనకు తోచినవిధంగా మా అమ్మను శ్లాఘించడం మొదలెట్టారు. మాఅమ్మ వరుసగా ఒకరి పద్దనుంచి మరొకరి పద్దకు మిఠాయి పళ్ళెంతో సాగిపోతూ, యెవరికి కావలసిన మట్టుకు వాళ్ళే పళ్ళెంలోనుంచి తీసుకొని తినమని సంజ్ఞచేసింది. మాఅమ్మ ఆనందానికి అంతులేదు. అతిథు లంచచేసిన అభినందనలకు మా అమ్మ ముగ్ధురాలై, ధన్యవాదా లర్పించినట్లుగా నోటినిండా చిరునవ్వు మాత్రం నవ్వి ఊరుకుంది.

తిన్నన్ని ఫలహారాలు! తాగినంత సారాయి! అతిథు లందరూ ఆనందంతో మత్తెక్కిపోయారు. సభికులకు అభినందన లందజేయ డానికి మతగురువు లేచి నిలబడ్డాడు. సమాధాన యుక్తంగా దీర్ఘోపన్యాస మిస్తూ, ఆయన మా అమ్మమీద భూషణ పరంపరలు కురిపించాడు. అనస్తాసియో మా నాన్నతో మెల్లగా. "మమ్మల్నందర్నీ యిక్కణ్ణుంచి వెళ్ళగొట్టాలని తీసుకొచ్చావా యీ మతగురువును యిక్కడకు?" అన్నాడు. అసలువిషయం విడిచిపెట్టి నిస్సారమైన చెత్త ఉపన్యాసాలు గంటల కొద్దీ యివ్వడంలో మతగురువు ఘటికుడని ప్రతీతి. చెప్పిందే చెప్పడం అయన ఉపన్యాసంలో ప్రత్యేకలక్షణం. ఆయన వేదిక యెక్క గానే, సగంమంది పైగా వదిలిపెట్టి లేచిపోతారు పక్క పక్కలకు. ముచ్చట్లు చెప్పుకుంటూనో. సిగరెట్లు పీలుస్తూనో కాలం గడుపుతారు.

లక్ష్మికి యెంతో ఆనందమైంది. సఫేదువంటి తెల్లని దుస్తులతో కళ కళలాడుతూ వనలక్ష్మిలా అందంగా కనిపించింది. సిల్కుఫ్రాక్

ధరించిన ఆ పిల్ల కొంచెం యెత్తరిగా కనిపించింది. నా కళ్ళకు మా అమ్మగూడా మామూలుగానే ఉత్సాహంగా ఉంది. అయితే ఆ ఉత్సాహం ఆటే యెంతోసేపు లేదామెకు పాపం! ఇంతలో అభినందనలు చెప్పడానికి మా నాన్న వేదికపై యెక్కాడు.

"అమ్మాయీ, మేరియా ఫిలోమినా!" అని గొంతెత్తి ప్రారంభిస్తూ, అక్కడినుండి అందరికీ వినపడేట్లు సాగి హాలుమధ్యకు వచ్చి, "ఈ రోజున నీవు తీసుకున్న నిర్ణయం అతి ముఖ్యమైనదమ్మా లక్ష్మీ! కాదు కాదు! మేరియా ఫిలోమినా! నీవు అనుసరించబోతున్న మార్గంగూడా సంకుచితమైనది. దానికే నీవు కట్టుబడి ఉంటావనుకుంటున్నాను. గోవాలో యితర క్రైస్తవ మతస్థులకన్నా ఉన్నతమైన నైతిక భావాలతో, నిష్కళంకమైన కార్యాచరణతో జీవితపథాన్ని అనుసరిస్తావని ఆశిస్తాను. నిజమైన క్రైస్తవ భక్తురాలివిగా మా అందరికీ వెలుగు చూపిస్తావని ఆశపడుతున్నాను. 'అందరికీ' అన్నపదంలో మతగురువులుగూడా కలిసే ఉన్నారు. ఈనాటి మతగురువులందరూ దైవసాన్నిధ్యంలో ఆహర్నిశలూ నిస్వార్థమైన భగవత్సేవ చేసేవాళ్ళని భ్రమ పడుతున్నాం అమాయకంగా. ఈ మతగురువులు ఒకవంక మనందరికీ నైతికప్రవర్తన గురించీ, దైవభక్తిని గురించీ గంభీరోపన్యాసాలు చేస్తూ, మరొకవంక అమాయకులైన పేదల్ని మోసంచేసి లక్షలు గడిస్తారు. స్వార్థపరత్వమే యీ మతగురువుల దైవభక్తి!" అని ఉపన్యసించాడు మా నాన్న.

మతగురువు కాళ్లు గజగజ వణకడం ప్రారంభించాయి. మా అమ్మ దిగాలుపడి చూడసాగింది. అయితే మా నాన్నచేత భయంకరమైన యిలాంటి ఉపన్యాసం యిప్పించకుండా తక్షణం ఆపుచేయించమని మా అమ్మ క్రీస్తును మౌనంగా ప్రార్థించింది. మా నాన్న యీ ప్రార్థనలకే లెక్కచేస్తాడూ! మళ్ళీ నిర్భయంగా తన ధోరణిని కొనసాగించాడు:

"ఈనాడు క్రైస్తవ మతం దుర్భరస్థితిలో ఉంది: ఒక్క గోవా లోనే కాదు; ప్రపంచం అంతా యింతే. ప్రేమ. సౌభ్రాతృత్వం. సమానత్వాలను బోధించే క్రైస్తవమతంలో అన్నిరకాల స్వార్థపరులూ చేరారు. ఉన్నతమైన యీ భావాలను ఒక్క క్రైస్తవ మతస్థుడూ ఆచరణలో పెట్టడు. క్రైస్తవభక్తులమని విర్రవీగేవారిలో యీ లక్షణాలు మచ్చుకు గూడా కనిపించవు. ఎంత బూటకం! ఇంతకూ నేను చెప్పవచ్చింది ఒక్కటే. ఈ రోజున మనకు కావలసింది యితరమతాలవాళ్ళను క్రైస్తవ మతంలోకి తిప్పుకొనడం కాదు. ఈనాటి క్రైస్తవులంతా హృదయంమీద చేయివేసుకుని ఆత్మపరిశీలన, ఆత్మవిమర్శన చేసుకొనాలి. అంతూ పొంతూ లేని కష్మకాండలు కట్టిపెట్టి. పొడుపొట్టకింప తిని, తాగినంత తాగి. తందనాలాడడం స్వస్తిచెప్పాలి. నిజమైన, నీతిపరుడైన క్రైస్తవుడుగా జీవిస్తానని ప్రతివాడూ దీక్షబూనాలి." అంటూ మా నాన్న ఒక్కసారి నాలుగు పక్కలా కలియజూశాడు. ఆయన ఉపన్యాసాని కందరూ ఆశ్చర్యచకితులైనట్లు మా నాన్న గ్రహించి యింకా యిలా అన్నాడు:

"క్రైస్తవులంటే ఎవరు? మనమా నిజమైన క్రైస్తవులం? కాదు కాదు! నిజంగా కాదు! మనదోటివాళ్ళంతా క్రైస్తవులమని భ్రమపడడం మాత్రమే! ఈ రకపు క్రైస్తవుడనని పిలుపించుకోబడడంకన్నా, విగ్రహారాధకుడుగా ఉండడమే మంచిదని తోస్తున్నది. నా ఉద్దేశ్యంలో రెండూ ఒకటేనని భావిస్తున్నాను." అని ముగించాడు మా నాన్న.

హాలంతా నిశ్శబ్దంగాఉంది. ఉమచిటుక్కుమన్నా వినిపించేట్లుంది. నిశ్చేష్టులై నిలబడిఉన్న ఆ జనంలో మా నాన్నతో యేకీభవించే వ్యక్తి ఒక్కడూ లేనట్లుగా నాకు తోచింది. ఆనాటి పవిత్ర ప్రశాంతతను భగ్నం చేశాడని మా నాన్నమీద అంతా కారాలూ. మిరియాలూ నూరుతున్నారు. మతగురువుకు కళ్లుమండి లేచిపోవడానికి సిద్ధమైనాడు. మా అమ్మ ఎంతో దీనంగా బ్రతిమాలుకున్నా. క్షణమైనా ఉండక సాగిపోయాడు

చురచుర చూపులతో. ఆమె స్వయంగా తయారుచేసిన రొట్టెను మత గురువుచేత యెలాగైనా తినిపిద్దామని మా అమ్మ యెంతో ఆశపడ్డది.

మతగురువు లేచిపోగానే, తక్కినవాళ్ళు యెవరి యిండ్లకువాళ్ళు తరలివెళ్లారు. పోతూపోతూ, తమ మతంలో కొత్తవ్యక్తి ఒకరు వచ్చి ప్రవేశించినప్పటికీ, దానితోపాటు మరొకవ్యక్తి క్రైస్తవమతం వదలి త్వరలోనే వెళ్ళిపోబోతున్నాడనిగూడా వ్యాఖ్యానించారు.

డిశంబరు నెల మంచూ, చలీ వెంటబెట్టుకుని రానేవచ్చింది. పొలాలపైనా, కుంటలపైనా, చెరువులపైనా, కొండలపైనా యెక్కడ చూచినా ఒకటేమంచు. చలికి పళ్లు జివ్వన తీసుకొని పోతున్నాయి. గ్రాగుబోతు తూలిపడుతున్నట్లు, బూడిదరంగు మేఘాలు ఆకాశంలో తూలుతూ కదిలిపోతున్నాయి. సూర్యాస్తమయంకాగానే వీచే చలిగాలికి ఒళ్ళంతా కొంగర్లు పోతుంది. అప్పటికింకా పదిహేను రోజులుంది కిస్మస్‌పండగ. పండగ సన్నాహాలన్నీ ఉత్సాహంతో చురుకుగా చేసుకొని పోతున్నాం. ఎవరిపనుల్లో వాళ్ళు పూర్తిగా నిమగ్నులై ఉన్నారు, ఇంతలోనే భయంకరమైన ఒకదృశ్యం కన్పించింది అకస్మాత్తుగా. రూత్ కండ్లు తిరిగి పడిపోబోతున్నట్లుంది. చచ్చిపోతుందా యేమిటి కొంప తీసి అన్నట్లుంది దాని వాలకం.

రూత్‌నుచూసి నిజంగా యెంతో జాలిపడ్డాను. అదేం చిత్రమో, ఒకపంక భయం పుట్టేట్లుగా గుడ్లుపెట్టి, గాభరాపడి చూస్తూ యేడుస్తుంది. మరోవంక అదే సమయంలో దేవుణ్ణి ప్రార్థిస్తున్నట్లుంది. ఇదేమిటీ విచిత్రం అని నాకు భయమూ. ఆశ్చర్యమూ వేశాయి.

ఈ విచిత్ర సంఘటన స్కూలు గదిలో జరిగింది. అలవాటు చొప్పున ఆ రోజుగూడా రూత్ క్లాస్‌రూమ్‌లో చలోక్తులాడుతూ మాట్లాడు తూనేఉంది. కొత్త పంతులకది గిట్టక రూత్‌ను మందలిస్తూనే ఉన్నాడు. మధ్యమధ్య తీవ్రంగా కోప్పడు తున్నాడుగూడా. ఆ రోజుఉదయమే

అల్లరి మానమని అయిదారుసార్లు మందలించాడుగూడా పంతులు. అకస్మాత్తుగా ఉన్నట్లుండి రూత్ లేచి నిలబడి బయటికి పోవడానికి పర్మిషన్ అడిగింది.

"ఇవ్వాళ నీ అల్లరి శ్రుతిమించిందే రూత్!" అన్నాడు పంతులు మండిపడుతూ. "నాతో తమాషాలాడు తున్నావు! నేనిక సహించేది లేదు. ఇనస్పెక్టర్‌గారు రేపో మాపో రాబోతున్నప్పుడా నీ వెంకటాయవేషాలు! నా టైమంతా వృథాచేస్తున్నావు జాగ్రత!" అన్నాడు గుక్తింత చేస్తూ గద్దించి.

" లేదు మాస్టరూ ! నాఒంట్లో నిజంగా బాగాలేదండీ ! " అంటూ రూత్ గదివిడిచి వెళ్ళిపోయింది.

రూత్ గదివదిలి బయటకు నడుస్తూంటే అదోవిధంగా కొత్తగా కనిపించింది. బరువుగా, విచారంగా మొహం పెట్టింది. ఇతర్లెవరూ కనిపెట్టలా యీ విషయం పరిశీలనగా. నేను వెంటనే గ్రహించాను. దానికేం జరిగిందబ్బా అని నాలో నేను ఆశ్చర్యపోతూ ఆలోచిస్తున్నాను. రూత్ మామూలుగాలేదు ! దయ్యం కంటపడ్డ మనిషిలాఉంది. ప్రతి నిమిషం అంత అల్లరిగా, అంత ఆటకాయితనంగా ఉండే రూత్, ఆ లక్షణాలన్నీ క్షణంలో మటుమాయమైనాయి ఆ రోజున.

మా రూత్ వట్టి అల్లరిపిల్ల. ఎప్పుడూ యెవర్నో ఒకర్ని వెక్కిరిస్తూ, యెగతాళి పట్టిస్తూ, యేడిపిస్తూ ఉండేది. దానికదోసరదా. మగ పిల్లలం మా అమ్మనెంత యేడిపిస్తామో, మా రూత్ కూడా ఆమెను అంత అవస్థా, అంత చికాకూ పెట్టేది. ఒకరోజున మేమంతా సర్కస్ చూడ్డానికి మార్గోనగరంవెళ్ళి తిరిగి యింటికి వచ్చాం. ఇంటికి రాగానే తలలో పెట్టుకున్న ఉంగరాలు తిరిగిన కృత్రిమపు వెంట్రుకల చుట్టను తీసి గోడకు తగిలించింది మా రూత్. ప్రతిరోజూ యీ

వెంట్రుకలకు నూనెపూసి, దువ్వి రూత్ తలలో అందంగా అమర్చి పెట్టేది మా అమ్మ. చైనా ఆడపిల్లలు యిలాంటి వెంట్రుకల చుట్టల్నే తలల్లో అలంకరించుకుంటారు. వాళ్ళను చూసి మా రూత్ కూడా నేర్చుకున్నది.

పామును పోలిన యీ వెంట్రుకల చుట్టను చూసి కప్ప బెదిరినట్లుగా బెదరిపోయింది, రూత్ ఒకరోజున.

స్కూలునుంచి వెళ్ళిపోయిన తర్వాత యెంతసేపటికీ మా రూత్ మళ్ళీ క్లాసుకు రాలేదు. విరామ సమయంలో దాన్ని వెదకడానికి నేను బయల్దేరి పోయాను. వెతికీ వెతికి దాన్ని చర్చిలో పట్టుకున్నాను.

ఆశ్చర్యంతో, "ఏమిటే రూత్! ఏమిటి నీబాధ? ఇలాంటప్పుడు మోకాళ్ళమీద పడి యిక్కడ ప్రార్థిస్తున్నావేమిటి? ఎంతసేపట్నుంచి యిక్కడ ఉన్నావ్?" అనడిగాను.

నన్నక్కడచూసి రూత్ గూడా ఆశ్చర్య పోయింది. ఏవో కృత్రిమ కారణాలు చెప్పటం మొదలెట్టింది క్షమించమంటూ. దాని ముఖం పరిశీలించేటప్పటికి యేడుస్తున్నట్లు కనిపించింది.

"ఏమిటి నీసంగతి? నీకేమైనా సుస్తీగాఉందా? మతి పోయిందా లేకపోతే?" అన్నాను సగం భయపడీ, సగం కోపంవచ్చీ.

"నాకేం బాధలేదన్నయ్యా! విరామ సమయం అప్పుడే అయిపోయిందా?" అన్నది రూత్.

"అవును!"

"ఓరిదేవుడా! అప్పుడే యింతకాలం గడిచి పోయిందా? అయితే పోదాంపద అన్నయ్యా!" అన్నది రూత్.

చర్చి ఆవరణ దాటి బయటకు వచ్చాం. స్కూలు యెదురుగా మైదానంలో ఆడపిల్లలు ఆడుకుంటున్నారు. రూత్ వాళ్ళ వేపుకు నడిచి

పోయింది. దాన్ని చూసి వీరవనితను అభినందించినట్లుగా అభినందించారు ఆడపిల్లలు. అంతసేపు క్లాసు విడిచి పంతులుగారినే టోపీవేసిన పిల్లవు సామాన్యురాలివా అని ఆశ్చర్యపడ్డారు. ఆడపిల్లలందరూ దాని చుట్టూ చేరి ప్రశ్నల వర్షం కురిపించారు.

"క్లాస్‌రూమ్ యెందుకు విడిచి వెళ్ళావు రూత్? ఇంతసేపూ యేంజేస్తున్నావే?" అడిగింది బేలా అనే ముఖ్య స్నేహితురాలు.

"పోనీ; కనీసం చింతకాయలైనా యేరుకొచ్చావా?" అంటూ రోజా రూత్‌ను సమీపించి జేబులో చేతులుపెట్టి వెతకడం ఆరంభించింది.

"ఇవ్వాళ పంతులు చేతుల్లో ఉన్నాయిలే నీకు! ఆడుకుందాం రావే! మోసంచేసి తప్పించుకుందామనుకున్నావేం!" అన్నది మెరీనా.

రకరకాల ప్రశ్నలు కురిపించారు పిల్లలు. రూత్ అన్నిటికీ డొంక తిరుగుడు సమాధానం చెప్పింది. ఎన్నిసార్లు బలవంతపెట్టినా, రూత్ ఆటల్లో చేరలేదు.

"విన్నేం పట్టుకుని పీడిస్తున్నదే? మాట్లాడవేం?" అన్నది మళ్ళీ బేలా.

రూత్ నిజంమరుగు పర్చి, "జలుబూ, పడిశం పట్టుకున్నట్లున్నాయి. నన్ను వేధించకు!" అన్నది.

తక్కిన పిల్లలందరూ ఆటలకు మళ్ళారు. ఒక్క బేలా మాత్రం రూత్‌తో ఉండిపోయింది. తన క్లాస్ రూమ్‌కు పక్కనే ఉన్న మరొక గదిలోకి తీసికెళ్ళింది రూత్‌ను.

"ఏమిటే రూత్! బాధ పడుతున్నావ్?" అన్నది బేలా బోధపడక. రూత్ జవాబివ్వలేదు. బేలా గౌనుపైకెత్తి, అడుగున ఉన్న అండర్‌వేర్ కేసి చూసింది రూత్. తన మాదిరే బేలా గూడా బాధ పడుతున్నదేమో అని రూత్ అనుమానం.

జేలా కర్థం కాలేదు. కంగారెత్తిపోయింది. ఎంత ప్రయత్నించి అసలు విషయం తెలుసుకుందామనుకున్నా, రూత్ ససేమిరా చెప్ప నిరాకరించింది.

రూత్ స్నేహితురాండ్రను గదిలోకి తీసుకెళ్ళి తన మాదిరే యెవరైనా యీ విచిత్రమైన బాధ ననుభవిస్తున్నారేమో అని తెలుసు కోడానికి ప్రయత్నించింది. కాని ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. దిగ్గున లేచి మళ్లీ చర్చికి పోయి, మధ్య మధ్య వెక్కి వెక్కి యేడుస్తూ క్రీస్తును ప్రార్థించడం మొదలెట్టింది.

"ఓ దేవుడా! యిహ నేనెప్పుడూ అల్లరి చేయను. పెద్దలంటే విధేయత చూపిస్తాను. దయచేసి యీ బాధను పోగొట్టు వెంటనే. విచిత్రమైన యీ రోగాన్ని కుదిర్చిపెట్టు. నిన్నెప్పటికి తూలనాడను. దయచేసి నా బాధ నివారించు........................"

ఇంత భక్తిభావంతో రూత్ యిదివరకెప్పుడూ ప్రార్థించి యెరగదు. చిన్నతనంనుంచీ మా అమ్మతో అది సరదాగా చర్చికి వెళ్లి వస్తూనే ఉండేది. అక్కడి విషయాలన్నీ పూసగుచ్చినట్లు యింటికి రాగానే మాకు వివరించి చెప్పేది. అయినా ప్రార్థనంటే దాని కానాటినుండి యీనాటివరకూ ఆసక్తే ఉండేది కాదు.

"నీకేమైన మతిపోయి కొట్టుకుంటున్నావా రూత్? ఎందుకిలా పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నావ్?" అనడిగాను.

రూత్ ఏమిటో ఆలోచిస్తూ నావంక అదేపనిగా చూసింది. అప్పటికే తడిసి ముద్దయిన జేబురుమాలుతో రూత్ కండ్ల నీళ్ళు తుడుచు కుని యేడుస్తూ, "నేను చచ్చిపోతున్నాన్రా బాబూష్! నిజంగా నేను బతకను!" అన్నది.

"ఎందుకే అమ్మాయి అలా యేడుస్తావ్? అలా అంటున్నా వేమిటే....నాగుండెలు పగిలిపోతున్నాయి నిన్నుచూసి! ఏమి జరిగిందో నిజం చెప్పవే!" గాభరాతో భయపడుతూ అన్నాను.

అప్పటికీ రూత్ జవాబివ్వలేదు. మరీ యెక్కువగా వెక్కి వెక్కి యేడవడం ప్రారంభించింది. నా వెన్నువెంట చల్లగా చెమట కారడం మొదలెట్టింది. ఇంటికెళ్లిపోదాం రావే అని పిలిచాను. పిలిచిందే తడవుగా మారుమాటాడక నావెంట సాగివచ్చింది రూత్.

దారి పొడుగునా బోరున యేడుస్తునే ఉంది. ఎవరైనా చూసి నవ్విపోతారేమో అని నాకు సిగ్గేసింది. అసలు బాధేమిటో తెలుసుకుందామన్న ప్రయత్నాలన్నీ వృధాఅయినాయి. బెల్లంకొట్టిన రాయిలా, యెంత రెట్టించి అడిగినా, బ్రతిమాలినా, భయపెట్టినా జవాబేలేదు. పది అడుగులు వేసి, మధ్యమధ్యన ఆగి క్రీస్తును ప్రార్థిస్తూ, రకరకాల ప్రమాణాలు, ఒట్లూ పెట్టుకొనడం సాగించింది.

ఇంటికెళ్ళాం. రూత్ నా వెంట యేడుస్తు యింటికి రావడంచూసి, మా అమ్మా, మెరియా దిగ్భ్రాంతి చెందారు. దానికి ఆటల్లో యే కాలో, యేచెయ్యో విరిగి ఉంటుందని ఊహించారు మావాళ్ళు.

మా అమ్మ గాభరాతో, "ఏమిటే రూత్! ఎందుకాలా బాధ పడతావ్?" అన్నది.

సమాధానం చెప్పడానికి బదులు రూత్ మరింత పెద్దగా యేడవడం సాగించింది. భయపడ్డ దానిలా మా అమ్మ కంత కంతకు దూర దూరంగా పోవడం మొదలెట్టింది.

"ఏం జరిగిందే రూత్‌నీకు? ఎందుకిలా చేస్తున్నావ్? నాకు చెప్పకపోతే యింకా యెవరికి చెబుతావే?" అన్నది మా అమ్మ. కంగారుతో నావంకచూసి, ఏంజరిగిందో నీవైనా చెప్పరా?" అన్నది.

"నాకేమి తెలియదే అమ్మా ! నాకు మాత్రం చెబితేగా" అనంటూ ఆనాటి మధ్యాహ్నం జరిగిన విషయమంతా వర్ణించాను. నేను అప్పజె ప్పిన పాఠమంతా శ్రద్ధగా ఆలకించింది మా అమ్మ. అంతా అర్థమైనట్టుగా చిన్నచిరునవ్వునవ్వి, రూత్‌ను సమీపించిది. చేయిపట్టుకుని పడకగదిలో కీడ్చుకొని పోయింది.

"అమ్మాయీ రూత్ ! వట్టి వెర్రిబాగులదానివేమే నీవు ! ఇంత పిరికిదానివనుకోలా నిన్ను !" అన్నది మా అమ్మ. తలుపులు బిడాయించి యేవో రహస్యంగా ప్రశ్నలడిగింది రూత్‌ను.

"నిజంగా నీకు మతిపోయిందే అమ్మాయ్ ! దీంట్లో సిగ్గు పడాల్సిందీ, భయపడాల్సిందీ యేముంది ?" అన్నది మా అమ్మ.

"నేను చచ్చిపోతానే ! నాకు బాగా తెలుసు ?" అంటూ వెక్కి వెక్కి యేడ్చింది రూత్ మళ్ళీ. తలుపుకున్న చిల్లిలో నా చెవిని యిరికించి లోపల జరిగే సంభాషణంతా అక్షరం పోకుండా వింటున్నాను.

"నీకేమైనా పిచ్చా, వెర్రా !" అని పెద్దపెట్టున కేకవేసింది మా అమ్మ. "నీవిప్పుడు పెద్దమనిషయ్యావమ్మా ! ఆడపిల్లలందరూ ఒక నాడు యిలా కావాల్సిందే ! నీ విచిత్రమైన బాధ యిదేనమ్మా ! ఇంకా మరేం భయపడబోకు." అన్నది మా అమ్మ ఓదార్చుతూ.

రూత్ ఏడవడం ఆపివేసింది.

"నిజంగా ఆడపిల్లలందరికీయిలాగే జరుగుతుందా అమ్మా ? అయితే మేరియా నాకన్నా పెద్దదిగదా ! దానికలా యెందుకు జరుగలేదే?"

"రేపోమాపో అదీ పెద్దమనిషవుతుంది. ఆడపిల్లలందరూ ఒకే వయస్సులో పెద్దమనుష్యులు కారు. ఆరోగ్యాన్నిబట్టీ, వాతావరణాన్ని బట్టీ, హెచ్చు తగ్గులుంటాయి."

"నిజంగానా అమ్మా ? "

"నిజంగా ! ముమ్మాటికీ నిజంగా ! నీతో అబద్ధాలెందుకాడతాను?"

"ఇన్ని విషయాలు తెలిసిగూడా ముందుగా నాకెందుకు చెప్ప లేదే? ఇప్పుడైనా మేరియాకు తెలిసేటట్టు చెప్పు తీరా పెద్దమనిషయ్యాక గాభరా పడకుండా." అన్నది రూత్.

ఒకటి రెండు నిమిషాలు నిశ్శబ్దంగా ఉంది. ఇంతలో అలమర తలుపులు తీస్తున్నట్లు, వేస్తున్నట్లు శబ్దమైంది.

"అయితే మరేం గాభరా లేదన్నమాట! అంతేనా అమ్మా?" అనడిగింది రూత్ గట్టిగా అనుమానం తీర్చుకోమనికి.

మా అమ్మకు కోపం వచ్చినట్లు కనిపించింది. " అది అందరు ఆడపిల్లలకూ సహజమేనని యిప్పుడేగదే నేను చెప్పాను! నన్ను మళ్లీ మళ్లీ అదే ప్రశ్న అడక్కు. ఇప్పుడు నీవు వ్యక్తురాలవైనావు. కొంటె చేష్టలు యికనైనా మాని కొంచెం జ్ఞానం కలిగి ప్రవర్తించాలమ్మా నీవు! ఇన్నాళ్ల మాదిరిగా ఆటకాయి తనం చేయడానికి వీల్లే దిప్పుడు. అర్థమైందా?"

రూత్ యిప్పుడు మళ్లీ మామూలు మనిషైంది, దిగులూ, విచారం పోయాయి. మళ్లీ చలోక్తులు సాగించింది. "అమ్మా, ఆ బాధ పోగొట్టుకోడానికి దేవుణ్ణి ప్రార్థించాననీ, ఆటకాయి చేష్టలు చేశానని అంతా నీకు చెపుతే నీవు నిజంగా నమ్మావా?'

మా అమ్మ ఒక్కనవ్వు నవ్వింది. ఆమెనుచూచి రూత్‌కూడా నవ్వింది. ఇంతలో తలుపుతెరిచారు. రూత్ కిటికీలో కూర్చుని పూర్వం వలెనే ముసిముసి నవ్వులు నవ్వడం ప్రారంభించింది, దానిభయం, దాని వెక్కివెక్కిఏడ్పులు, దాని కళ్ళనీళ్ళు ఎక్కడ యెగిరి పోయాయో రెక్కలు కట్టుకుని!

"ఎంతగడుసుదానివే నీవు। నన్నంతభయపెట్టి గాభరా తిని పించావా నీవు! మళ్ళీయింతలో పకపక నవ్వులా?" అన్నాను.

"అదేంలేదులేరా బాబూష్! నిన్నంత గాభరా పెట్టినందుకు క్షమించవూ?"

"అయితే, అసలేమిటే నీ బాధ? ఇంతవరూ చెప్పావు కావు!"

"ఓ! అదేమి లేదులేరా! కడుపునొప్పి! అంతే!"

"కడుపునొప్పేకదా! దానికేనా యింత రాద్ధాంతం చేశావు! నీ అర్భాటానికి నీవే సిగ్గుపడాలి!" అంటూ మిగిలిఉన్న కోపంతో నాలుగు తిట్లు తిట్టి నాదారినేను తిరిగి స్కూలుకు వెళ్ళిపోయాను. ఆడపిల్లలు కానరాకుండా చేసే అల్లరి యిలాంటిదే కాబోలను కున్నాను.

---

౭

పిల్లలున్నయింట్లో ఉత్సాహం, ఆనందం వర్ణించగలమా? ఈ సత్యాన్ని యెవరుకాదని వాదించగలరు? పిల్లలు అల్లరిచేసినా, కేకలు వేసినా, కేరింతలు కొట్టినా, ఏడ్చినా, నవ్వినా. సంగీతం ఆలపించినా యివన్నీ అలవాటైన చెవికి బాధఅనిపించవు. ఒక్కొక్కప్పుడు తలి దండ్రులకు చీకాకు కల్గించినా, యెన్నోరెట్లు ఆనందాన్నే కల్గిస్తాయి. పిల్లలతో కళకళలాడే కుటుంబాల్లోనే ఉత్సాహం, సంతోషం యినుమ డించి యింటికి శోభతెచ్చి పెడుతుంది.

మా కుటుంబంలో మేమంతా కలిసి తొమ్మండుగురం. కోతుల గుంపులాగా చెట్లెక్కే వాళ్ళూ, చేమలెక్కే వాళ్ళూ, తిట్టుకునే వాళ్ళూ, కొట్టుకుకే వాళ్ళూ, సంగీతాలు పాడే వాళ్ళూ, కేరింతలుకొట్టే వాళ్ళూ— రకరకాల వాళ్ళూ ఉన్నారు. మేం మరీ పసిపిల్లలుగా ఉన్నప్పుడు మమ్మల్ని చూసి, "టాబ్‌కు చెడబుట్టిన అల్లరిమూక!" అంటూ మా వూరివాళ్ళందరూ తిట్టి పోస్తూ ఉండేవాళ్ళు. మా అల్లరితో గ్రామమంతా విసిగి వేసారి పోతున్నదని శాపనార్థాలు పెట్టేవాళ్ళు. కుక్క పిల్లల్నో, పంది పిల్లల్నో, పిల్లి పిల్లల్నో కాళ్ళు విరగొట్టామని ప్రతి రోజూ మా మీద నేరాలు వచ్చి పడుతుండేవి. బంతులాటల్లో యెవరి కుండలనో పగలగొట్టామని కుప్పలు కుప్పలుగా నిందలు వచ్చి మూకుమ్మడేవి.

ఇరుగు పొరుగు వాళ్ళు మా అమ్మకు మా పైన చాడీలు చెప్పని రోజంటూ లేదు. మా అమ్మ తనను తిట్టుకుంటూ, మమ్మల్ని తిట్టిపోస్తూ మాపైన విరుచుకుని పడేది. వచ్చిన వాళ్ళకు సర్దిచెప్పి, యిక ముందైనా అల్లరి చేయకుండా చూస్తా లెమ్మని పంపివేస్తూండేది.

మాఅందరిలోకీ ఏడ్రియానో మరీ చిలిపివాడు. చిక్కిన ప్రతి కోడిపిల్లనూ పట్టుకుని వాని తోకకు నిప్పంటించి తమాషా చూసేవాడు. దాన్ని చూసిన మా అమ్మ తన కసలు సంతానమే లేకుండా పోతె బ్రతికి పోయె దాన్నని తనను తానే శపించుకునేది. మాలాంటి పాపిష్టి గుంపు పుట్టేకన్నా ఒక్కతే హాయిగా జీవించేదాన్ననుకునేది. కాని మా నాన్న మా అల్లరి చూసి మనస్సు కాట్టేపట్టించుకునేవాడు కాడు. పై పెచ్చు మా అమ్మతో, "వాళ్ళు పసిబిడ్డలు పోనీ లేవే! పిల్లలు చేయకపోతే పెద్దలల్లరి చేస్తారుగనుకనా!" అనేవాడు చిరునవ్వు నవ్వి.

ఏడ్రియానో కొంచెం కక్కుర్తిపడి నీచంగా ప్రవర్తించేవాడు. తక్కిన వాళ్ల వాటాల్లో కాద్దో గొప్పో తస్కరించి, తన వాటాలో నుంచి మాత్రం పిసరంతగూడా యెవరికీ పాలుపంచేవాడు కాడు. పండుగ రోజుల్లో చుట్టపక్కాలెవరైనా మాకు తలో బేడా, పావలా యిచ్చి పోయినప్పుడు, ఏడ్రియానో తన డబ్బులు భద్రంగా ముడుపు కట్టివాచుకుని, మేము కొనుక్కున్న దాన్లో వాటా పంచమని వేధించే వాడు. మా డబ్బులన్ని ఆఖరైన తర్వాత, వాడి మూట విప్పి ఊరించే వాడు మమ్మల్ని.

ఏడ్రియానో కిప్పుడు పందొమ్మిదేళ్ళు నిండాయి. మమల్నందర్నీ విడిచి వాడుగూడా వెళ్ళిపోయాడు గద!

పర్షియాలో ఆబడాన్ నగరంలోని ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీలో ఏడ్రియానోకు గుమాస్తాగిరి దొరికింది. పోయిన నవంబరు లోనే వాడు పర్షియా వెళ్ళిపోయాడు.

ఆ రోజుల్లో ఏడ్రియానో చేసే అల్లరికి మా అమ్మ విసిగి వేసారి పోయేది. ఒకొక్కప్పుడు బడితె పుచ్చుకొని, వాడిని తరిమి తరిమి కొడు తుండేదిగూడా. తీరా వాడిప్పుడు యిల్లు విడిచి వెళ్ళిన తర్వాత దిగులు పెట్టుకుని కూర్చున్నది మా అమ్మ. కనీసం వారానికో ఉత్తరం ముక్కైనా యింటికి వ్రాసి తీరాలని వాడు వెళ్ళబోయేటప్పుడు హెచ్చ రించింది గట్టిగా. మా ఏడ్రియానో మమల్నందర్నీ వదలి దూరదేశానికి పోతూంటే మాకు కలిగిన విచారాన్ని వర్ణించి చెప్పలేం. వాడికి వీడ్కో లివ్వడానికి మా మేనత్తా, మేనత్త కూతురూ వచ్చారు. వీడ్కోలు సమయంలో మా మేనత్త మమ్మల్ని హుషారు చేసి, దిగులు పడవద్దని ధైర్యం చెప్పింది. ప్రయాణమయ్యే సమయంలో మా అమ్మ చలోక్తిగా, "ఆడ్రూ, పర్షియాఆడపిల్లలు ఎర్రగా బుర్రగా దొండపండులా వుంటా రటగదరా ! ఎవ్వరికి తెలియకుండా ఒక పిల్లను అంటగట్టుకోరాదూ !" అన్నది కన్నుగీటుతూ అదో విధంగా.

అల్లరి వెధవ ఏడ్రియానో పరాయి దేశంలో బుద్ధి కలిగి ఎలా బ్రతుకుతాడో అని వక వంక మా అమ్మ ఆందోళన పడుతూంది. హాస్యానికైనా మా మేనత్త వాడికాసలహా యివ్వడం మా అమ్మకిష్టం లేదు. ఆమె మనస్సులో యేదో రాయిపడ్డట్టయింది. ఏడ్రియానో చిరునవ్వునవ్వి మేనత్తసలహా ప్రకారమే నడుస్తాలే అన్నట్టు తిరిగి కన్ను మలిపాడు.

"ఇంకో విషయం ఆడ్రూ! నీయజమాని యెడల విధేయతగా నడచుకో. అల్లరిపనులు చేయకు. ఇప్పుడు నీవు గొప్పవాడివి కాబోతు న్నావు. నీ పైవాళ్ళు నిన్ను అభిమానంతో ఆదరించేట్లు చేసుకో. వాళ్ళు నిన్ను మర్యాదగా చూడకపోయారా మా పోర్చుగీసు వాళ్ళతో చెప్పి, మా సముద్రంలో నూనె తయారుచేయించి వాళ్ళవ్యాపారాన్ని నాశనం చేయిస్తామని చెప్పు !" అన్నది మా మేనత్త.

గుర్రొబ్బండిలో మా నాన్నగూడా యెక్కి కూర్చున్నాడు. ఏకిస్రియాను స్టేషనువరకూ సాగనంపించి రాబోయాడు. స్టేషను రోడ్డు వైపు బండి కదిలిపోయింది. మా మేనత్త పడక కుర్చీలో యీపిగిల బడి తన హాస్యాలతో మాకింత కడుపునిండేట్లు కాలక్షేపం చేయడం ప్రారంభించింది.

మా మేనత్త బహుమాటకారి. నాటకంలో విశిష్టమైన విదూషక పాత్రధారిలా నటించి నట్లుంది ఆమె అభినయంతో మాట్లాడుతూంటే. అప్పుడే గుడ్లుపెట్టిన కోడిలా ఒకటే అరుస్తుంది. ఒక్కొక్కప్పుడు అర్ధంపర్ధంలేని అనేకవిషయాలు గూడా అసందర్భంగా చెబుతుందామె విసుగూ విరామంలేకుండా. పక్కవాళ్ళేమనుకుంటారో అన్న సిగ్గూ, భిడియం గూడా లేదామెకు. వాడవాడలా జరిగే కథలూ, గాధలూ అన్నీ ఆమెకే కావాలి. ఎవరింట్లో ఏ పుల్లకూర చేసుకున్నారో, యెవరు గారె ముక్కలు వండుకున్నారో, పిల్లిసమర్తాడిందో మల్లి మాయమైందో ఈ ముచ్చటన్నీ ఆమెకే కావాలి. తన మొగుడెప్పుడూ గురకపెట్టి నిద్ర పోతుంటాడనీ, లెక్కడొక్కల్లో వట్టి కటికమొద్దనీ, యెప్పుడూ అజీర్ణరోగంతో తీసుకుంటాడనీ, యేకొద్దిపాటి పరిచయం గలవాళ్ళతో నైనా అసందర్భంగా బయటపెట్టుకుంటుందామె. మా మేనత్త మొగుడు యీమెతో పడలేక నానా బాధలూ పడతాడు.

"మాండవీ నదిపైన బ్రిడ్జి కడుతున్నారట నిజమేనా అత్తా ?" అని అడిగింది మేరియా. మేమంతా ఆరోజున ఆమె చుట్టూ మూగి ముచ్చట్లు వింటున్నాం.

"నేనూ అలాగే విన్నాన్రా ! అయితే నిజంసంగతి నాకూ తెలియదు ! ఈ రోజుల్లో విచిత్రం యేమిటో తెలుసా ! నీవు వినని విషయాలే యదార్థంగా జరుగుతున్న ట్లున్నాయిరా !"

"మీ పంజిమ్ మామిడి తోటలో ప్రతిరోజూ బ్యాండు వాయి
ద్యాలు యిప్పటికీ వాయిస్తున్నారా అత్తా ?" అడిగాడు సీజర్.

"ప్రతిరోజూ వాయించరాల్రి నాయనా ! వారానికోసారే వాయి
స్తారు. తక్కిన ఆరురోజులూ కావలసినంత దోమల గుంపు ఉందిగా
సంగీతంతో మమ్మల్ని సంతోష పెట్టడానికి ! సరే దీనికేంగాని, నీవుపరీక్ష
ప్యాసైన తర్వాత ఏంజేయ దలచుకున్నావురా అబ్బాయీ ?" అన్నది
మా మేనత్త.

"ఏమో అత్తా ! నేనింతవరకూ ఆ విషయమే ఆలోచించలేదు !"
అన్నాడు సీజర్.

"నీవురా కార్లస్ ?"

కార్లస్ తలవంచుకొని, "నేను గ్రామ పౌరోహితుడనౌతానత్తా !"
అన్నాడు.

"మంచిది ! మా వూరి పౌరోహితుళ్ళాగా తయారు కాబోకేం !
మా పౌరోహితుణ్ణి చెప్పి. మరొకర్ని చెప్పుకోవాలి !".

అప్పటివరకు మౌనం వహించిన రూత్, "ఏం అత్తా ! అలా
అంటావ్ ! ఏంజరిగిం దేమిటి ?" అన్నది.

మా మేనత్త సావకాశంగా తిష్టవేసుకూర్చుని తన పౌరోహి
తుణ్ణి గురించి ఉపన్యాసం ప్రారంభించింది. "ఆయన కర్మకాండా,
ఉపన్యాసాలు బైబిల్‌బోధయూ కట్టిపెట్టి, వచ్చిందిమొదలూ నోటికీ చేతికీ
ఊపిరి సలుపుకోకుండా ఒకటే పని కల్పించాడు. పండుగ ఆనాటితో
సరిపోయింది మా అదృష్టం బాగుండి. ఇంకా రెండురోజులు సాగి
ఉండాల్సింది మావని తెలిసివచ్చేది. యిరుగుపొరుగువాళ్ళ యిళ్ళగూడా
దోచుకొచ్చి పెట్టాల్సి వచ్చేది మా పౌరోహితుడికి. అడెక్కడికి తిండి
పోతో మరి ! విచిత్రమేమంటే, ఒకవంకాయన మెక్కుతూనే, అజీర్ణంతో

బాధపడుతున్నా నంటాడు. ఓరి భగవంతుడా ! ఇలాంటి అతిధినెప్పుడూ మాయింట్లో అడుగుపెట్టనివ్వకుండా చేయిబాబూ! ఇట్టి మహానుభావుల్ని శతృవుల ఇండ్లకూ్కడా చొరనివ్వ కూడదు !" అని ముగించిందామె. ఆమెమాటల్లో అతిశయోక్తులుకూడా కొంతవరకు లేకపోలేదు.

ఏడ్రియానో ప్రయాణం కాబోయేముందు కొద్ది నిమిషాలకు పూర్వమే మా అత్త మా యింటికి వచ్చింది. అంచేత మా నాన్నతో తీరిగ్గా మాట్లాడే అవకాశం లేకపోయింది. ఏడ్రియానోను సాగనంపి ఆ రాత్రి యింటికి తిరిగి వచ్చాడు మానాన్న. యధా ప్రకారం ఆయనతో కబుర్లు మొదలెట్టింది మా అత్త.

"రైతులపనెలా ఉంది? గట్టివిత్తనాలెదపెట్టి పుచ్చుపంట యిళ్ళకు చేరవేసుకుంటున్నారా? లేకపోతే గట్టిపంటనే తెచ్చు కుంటున్నారా ?"

పదిమందిలో ఘరానాగా బ్రతకాలని మా మేనత్త మనసు. పంజిమ్‌లో ధనికులైన భూస్వాముల్ని పొగుడ్తూ కథల్లి చెబుతుండే దామె. భూస్వాముల కుటుంబంలో పుట్టిన మా నాన్న స్వయంగా పొలంలో కష్టించి పనిచేయడం మా మేనత్తకు తలకొట్టేసినట్టుండేది. ఈ విషయంలో వాళ్ళవూళ్ళో ధనిక రైతుల్నీ, మావూరి భూస్వాముల్నీ సాటువతెచ్చేది. మా మేనత్త చలోక్తులకు మా నాన్న చిరునవ్వునవ్వి, యింకాయింకా కథలు వినాలని ఆమె పక్కనే చేరేవాడు.

"నేను తమాషా తమాషా కబుర్లు చెప్పి. గూస్‌బేర్రిపండ్లను పంచిస్తున్నా! ఇంతకూ నీ వ్యాపారం యెలాగున్నది చెప్పావు కాప్ర ఆస్పూ?" అన్నాడు మా నాన్న.

మా అత్తను మా నాన్న అడిగిన వ్యాపారం ఆమె కబుర్ల వ్యాపారం. కబుర్ల వ్యాపారంలో ఆమెను మించినవాళ్లు యింతవరకు పుట్టలేదు. ఇందాక చెప్పినట్లు. మా మేనత్తకు అందరి వ్యవహారాలూ

కావాలి. ఇతర్ల వ్యవహారాల్లో యెంత యెక్కువగా జోక్యం కల్పించు కుంటే, తనకంత అదృష్టం కలిసి వస్తుందనే విచిత్రమైన వేదాంతాన్ని లేవతీసిందామె. "ఎవరి వ్యవహారాన్ని వాళ్ళే చూసుకుంటే యెంత స్వార్థపరుడౌతాడో చూడండి! ఇతర్ల పనులుగూడా నావిగా భావించు కున్నప్పుడే నీవు నిజమైనా హేతువాదిగా చలామణీ అవుతావు!" అంటుండేది మా మేనత్త. అలా భావించుకోకపోతే, ఆత్మకు శాంతి ఉండదట. ఇహానికీ పరానికీ చెడినవాళ్ళ మౌతామట!

మా నాన్న భావాన్ని గ్రహించినట్లుగా మా అత్త ఒక చిరు నవ్వు నవ్వి, "అన్నయ్యా, నీకు తెలుసుగమా గేబ్రిల్ కూతురు ఒక సోల్జరుతో లేచిపోయిన సంగతి?" అన్నది.

పిల్లల యెదుట యిలాంటి ముచ్చట్లు తేవద్దన్నట్లుగా మా నాన్న కండ్లతో సంజ్ఞ చేశాడు. మా అత్త వెంటనే అర్థం చేసుకుని విషయం మార్చివేసింది.

"పంజిమ్‌లో విద్యార్థి కుంకలు ఎంత గొడవచేస్తున్నారో తెలుసా అన్నయ్యా? నెత్తిన యేగాని పెడితే దమ్మిడీ విలువ చేయని పేద వెధవలుగూడా పిల్లల్ని వైద్యం చదివించడానికీ, ఉన్నత విద్య నేర్పించ డానికి దూర దేశాలకు పంపుతున్నారు! ఉన్నంతలో తిని యింటి పట్టున కూర్చోలేక, యేంపోయే కాలం వచ్చిందో వీళ్ళకు!"

"కాపిటలిస్టు ధోరణిలో మాట్లాడ్డం యెప్పట్నుంచి నేర్చు కున్నావే ఆస్పూ?" అన్నాడు యెత్తిపొడుస్తూ మా నాన్న.

"ఈప్రపంచములో కాపిటలిస్టుగానైనా బ్రతకాలి! లేకపోతే కాపిటలిస్టు మాదిరిగా మాట్లాడనైనా మాట్లాడ్డం నేర్చుకోవాలి. లేకపోతే మనం బ్రతికీ చచ్చిన వాళ్ళల్లో జమే!"

మా నాన్న చిరునవ్వు నవ్వుతూ బూట్లు విప్పుకున్నాడు. పక్కనే ఉన్న పొడుగాటి బల్లమీద కాళ్ళు బారజాపుకుని వెల్లకిలా పడుకున్నాడు.

"ఎందుకలా అంటావ్ ఆస్నూ! నన్ను చూడు! నాయిరుగు పొరుగు వాళ్ళను చూడు! మేమంతా పేదావాళ్ళమేగదా! అయినా లేకున్నా తృప్తిగా సుఖమైన జీవనమే జరుపుకుంటున్నాంగా! లేదని చెప్పగలవా?" అన్నాడు మా నాన్న.

"మీరు సుఖంగానే ఉన్నామనుకుంటున్నారు మీ మనస్సుల్లో! మీలోమీరు మురుసుకొని పోతున్నారు! కాని కాపిటలిస్టు దృష్టిలోనూ, యీ ప్రపంచాన్ని పాలిస్తున్న యితర వర్గాల వారి దృష్టిలోను, నీవంటి వాళ్ళెన్నడో చచ్చినట్లు జమకట్టుకున్నారు తెలుసా!" అన్నది మా మేనత్త.

"మేమంటే పురుగుల్లాగా చూసే పోర్చుగీసు వాళ్ళ దృష్టిలో మేం యెన్నడో చచ్చినట్లు లెక్కే. పోర్చుగీసు ప్రభుత్వం మన దేశంలో పరిశ్రమలు పెట్టి. మన ముడిసరుకును వినియోగిస్తే. మనకు కావలసినంత సంపద అభివృద్ధయ్యేదిగదా! మన బిడ్డలందరూ 'అలో లక్ష్మణా' అని తిండిలేక పొట్టలు చేతపట్టుకుని దేశంకాని దేశాలకు పోయి అగచాట్లు పడడం యెందుకు సంభవించేది!"

"నాకదంతా తెలియదు!" అంటూ మా మేనత్త భుజాలెగర వేసింది. "ఒకవిషయం మాత్రం గట్టిగా చెప్పగలను. పంజిమ్‌లో కాపురాలుంటున్న కొందరు పోర్చుగీసువాళ్లు మాతృదేశమైన పోర్చుగల్‌నే మరిచిపోయారు. వాళ్ళంతా మనపిల్లల్నే పెండ్లాడి యిక్కడే శాశ్వతంగా కాపురాలేర్పర్చు కుంటున్నారు. అసలు వాళ్ళదేశమే మరిచి పోతున్నారంటే నమ్ము."

మా అత్తను చూడ్డానికి మర్నాడు యిరుగుపొరుగు వాళ్ళంతా వచ్చిచేరారు మా యింట్లో. వాళ్ళల్లో లిగోరియా ఒకడు. ఇతన్ని పని గట్టుకుని యేడ్పించడం మా అత్తకు సరదా. లిగోరియా పెండ్లిళ్ల పేరయ్య. మధ్యవర్తిగా ఉండి మనుములు కుదర్చడం యితనికి సరదా.

పెళ్ళిఎయస్సొచ్చిన ఆడపిల్లల తలితండ్రులితన్ని తమ పాలిటి దైవంగా చూసుకునేవాళ్ళు. వాళ్ళ బరువుభారాన్ని దించడానికి ప్రత్యక్షమైన అపరదైవంగా భావించేవాళ్ళితన్ని.

లిగోరియా బక్కపల్చగా పాలిపోయి ఉంటాడు. దర్జీపని అతని వృత్తి కావడానికి. అయితే షాపులో తరచుగా ఉండేవాడు కాడు. పెండ్లి పేరంటాలంటే చెవికొసుకుంటాడు. ఎవరింట్లో పెళ్ళిముచ్చట్లొచ్చినా, అతనే తయారు. పాత చింపిగొడుగొకటి చంకన పెట్టుకొని ఉదయానే ఆరుగంటలకల్లా రోడ్డుపట్టుకుని బయల్దేరేవాడు. మనుములు కావలసిన తలిదండ్రులెవరున్నారో వెతుక్కుంటూ పోయేవాడు గడప గడపకూ. అమేషా అతని చంకలో మనుముల జాబితా ఒకటుండేది. ఏదేశాలనుంచి తిరిగివచ్చిన యువకులెవరెవరా అని విచారించి, సాధ్యమైనంతవరకూ పిల్లల్ని వాళ్ళకే యిచ్చి పెళ్ళిచేసే వాళ్ళు తలిదండ్రులు. వాళ్ళదృష్టి ప్రధానంగా యువకులపైనే పడడంలో ఆశ్చర్యమేముంది!

"హెల్లోవిగూ! ఏదోపనిమీద దయచేశావే యివ్వాళ?" అన్నది మా అత్త. లిగోరియా చెమటలు కక్కుతూ మెట్లెక్కి వస్తున్నా డింట్లోకి. "మా మేరియాకు గూడా సంబంధం కుదర్చడానికి రాలేదు గదా! మా అమ్మాయికింకా అయిదారు సంవత్సరాలదాకా తొందర లేదులే. అంతవరకూ వంటరిజీవితమే చేస్తుంది!"

లిగోరియా తన కుచ్చు టోపీ తీసి కింద పెట్టాడు. మాసి తోలైన జేబు రుమాలుతో ముఖం తుడుచుకుంటూ, "లేదు, లేదమ్మా! నీవు వచ్చావని తెలిసి నమస్కారాలు చెప్పిపోదామని వచ్చానంతే!" అన్నాడు.

"అలాగా లిగూ! అయితే ధన్యవాదాలు-నీ వ్యాపారం ఎలా సాగుతున్నదోయ్?"

"ఏమీ గిరాకి లేదమ్మా! నిజంగా ఉత్సాహం అంతా చచ్చిందనుకో! గోవాలో యిప్పుడు ఆడసంతానం అధికంగా ఉందటమ్మా!

వీళ్ళందరికి సరిపోయే మగపిల్లలు కాగడాలేసి గాలించినా కనిపించితే,గా గోవాలో! మరో దేశం పోయి పట్టుకురావాల్సి వచ్చేట్లే కనిపిస్తూంది. అదీగాక యీ మగరాయిళ్లు వాళ్ళ్పై తెలియకుండా వేల కట్నాలు కుమ్మరించుకోవాలని చూస్తున్నారు. పెండ్లిళ్ళ మార్కెట్లో మాంద్యం పూర్తిగా యేర్పడ్డదనుకో! పరిస్థితులు త్వరలో బాగు పడకపోతే, మళ్ళీ నా దర్జీ పని ఉండనే ఉంది. చివరకదే గతౌతుందేమోనమ్మా తల్లీ!"

"బతికాంరా భగవంతుడా! పెండ్లిళ్ళ వ్యాపారం గిట్టుబాటుగా లేదని శుభవార్త విన్నందుకు సంతోషంగా ఉంది. మనుములు కుదిర్చే బదులు, యిప్పుడు అయిన వివాహాలు భగ్నం చేయడానికి ప్రయత్నించ రాదూ! వాళ్ళ రోగం టక్కున కుదురుతుంది!"

లిగోరియాకు మా మేనత్త భావంబోధపళ్లా. అమాయకంగా, "ఎందుకమ్మా అలా అంటావు? నేనెందుకు చేస్తానమ్మా ఆ పాడు పని!" అన్నాడు లిగూ.

ఈ పిదపకాలపు పెళ్ళిళ్ళు నాకుమాత్రం పెళ్ళిళ్ళేనోయ్ లిగూ! భార్యభర్తల మధ్య ప్రేమాతిశయాలు పూజ్యం. నీ పుణ్యమా అంటూ అలాంటి భార్యాభర్తలకు విడాకు లిప్పించితివా, సంసార కూపంలో పడికొట్టుకుంటున్న దురదృష్టవంతులంచరూ నిన్ను నెత్తిన పెట్టుకుంటా రాబాబూ!"

లిగోరియా పకపకా నవ్వాడు. కిటికీలోనుంచి కాండ్రించి తుబుక్కున యింత ఉమ్మేసి, మామూలు స్థానంలో తిష్టవేసి కూర్చు న్నాడు మళ్ళీ.

"దానికి నేను కారణంకాదమ్మా! మన చేతుల్లో యేమీలేదు. ఉ పరమాత్ముడే యిద్దరికీ జత కుదురుస్తున్నాడు. నేనల్లా ఆటబొమ్మ మాదిరిగా మధ్యవర్తి పాత్రవహించి, యిద్దరికీ సంధానం కల్పించడమే! మన బోటివాళ్ళం కేవలం నిమిత్త మాత్రులమే!"

నవంబరు నెల. ప్రొద్దు నెత్తిమీది కొస్తున్నది. అయినా సూర్యు డంత తీవ్రంగాలేడు. అంచేత యిండ్లవద్ద వేసుకొని వెళ్ళిన గుడ్డలతోనే పొలంపనులు చేసుకుంటున్నారు రైతులూ కూలీలూ. ఎండాకాలంలో పొలం పనికి దిగేముందు, మాసిన గుడ్డలు వేసుకొనడం వాళ్ళకలవాటు. లిగోరియా అరచేతి మందాన ఉన్న ఊలు స్వెట్టర్ వేసుకున్నాడు. స్టీమరులో వెయిటర్‌గా పనిచేస్తున్న తన మేనల్లుడీస్వెట్టరిచ్చాడు. అంత దట్టమైన స్వెట్టరు వేసుకున్నా, లిగోరియాకు చలి ఆగలేదు. గజగజ వణకి పోతున్నాడు. చలిగాలికి నిమోనియా పట్టుకుంటుందేమో నని భయపడుతూ మధ్యమధ్య స్వెట్టరుపై వేసుకున్న కోటును ఒంటికి గట్టిగా అదుముకుంటున్నాడు.

"అయితే మగాడికైనా, ఆడదానికైనా పెండ్లివల్ల సుఖంలేదనా నీ ఉద్దేశ్యం యింతకూ! ఏమో, నీ అభిప్రాయంతో యేకీభవించ లేక పోతున్నా నేను." అన్నాడు లిగోరియా.

"ఏమో! నాకు తెలియదురా లిగూ! వివాహ సౌఖ్యాన్ని గురించి మనం నిర్ణయించడం కాదు. ఇరుగు పొరుగువాళ్ళు చెప్పేతీర్పే నిజమైనది. నేనూ అనేక మందిదంపతుల జీవితాన్ని చూస్తున్నాను. నన్నడుగు చెప్తాను."

"ప్రేమించి చేసుకున్న పెండ్లిళ్లు పది కాలాలపాటు హాయిగా సాగిపోతాయంటావా?" అన్నాడు లిగోరియా.

"నీవనేమాటలో అర్థమే లేదురా అబ్బాయ్! ఏ రకమయిన పెండ్లయినా ఒకటేరా వెర్రివాడా! పెండ్లయిన మర్నాటినుంచీ పిల్లల్ని కనడమేగదరా పని! ఇహ నన్నడిగావా ఆ నరకయాతన! సంసారపు కొంపలో సౌఖ్యం యెక్కడిదిరా లిగూ! సూదికి తొంబైమందికి పైగా వివాహం యమకూపమేఅనుకో!"

"అదికాదమ్మా నేననేది! పిల్లల గొడవ చెబుతావ్ నీవు! అసలు భార్యా భర్తలు సుఖంగా ఉంటారంటావా లేదా?" అన్నాడు లిగోరియా.

"ఏమీ సుఖంగా ఉండలేరు! ప్రేమించి పెళ్ళిళ్లు చేసుకున్న దంపతులు గూడా వాళ్ళ దురదృష్టానికి వాళ్ళనే నిందించుకోవాలి. అంతే కాని ఒకర్ని అనే పనేలేదు. ఇహ నీ బోటిగాళ్లూ, తలిదండ్రులూ కలిసి మెడలు విరిచి చేసినపెండ్లిళ్ల విషయంలో, వధూవరులిద్దరూ మీ జీవానికి పడి యేడవనన్నా యేడుస్తారు బతికున్నంత వరకూ!" అన్నది మా మేనత్త.

లిగోరియా మళ్ళీ తనివితీరా నవ్వాడు. ఒక్కనిమిషం సేపైనా దగ్గిఉంటాడు.

"ఏమిటి నీ సంగతి లిగూ?" అన్నది మాఅత్త ముసిముసి నవ్వుతో. "అంతా మాయకాలంలా ఉన్నదోయ్! ఈ రోజుల్లో అదేమిటో, ఒకచోట మునిగి, మరోచోట తేలేవాళ్ళే కనిపిస్తారేమోయ్ యెక్కడచూసినా?"

"మరేంలేదు! మరేంలేదులేవమ్మా! చూడు. నేను పెద్దవాడినైపోతున్న సంగతి మరచిపోకు. ఈ పాపిష్టి దగ్గు యే పాడుముహూర్తాన పట్టుకున్నదో ప్రాణం తీస్తున్నదమ్మా! ఇంతసేపూ మాటలసందట్లో చెప్పావు గావేం! నీ ఆరోగ్యం యెలా ఉందమ్మా? ఇదివరకటికంటే యిప్పుడు కాస్త లావైనట్టున్నావ్! ఆరోగ్యంగా ఉన్నట్లుగూడా కన్పిస్తున్నావ్!"

"పై చూపులకు కన్పించడానికేంలే లిగూ! పచ్చగా కన్పించే వల్లా బంగారమే అని భ్రమపడితే యెలా! ధనికులు పేదలుగానూ, పెండ్లికాని ఆడపిల్లలు నిర్దోషులు గానూ, పసిబిడ్డలు అమాయకులు గానూ పైకి కన్పించడంలా?"

"నీ వెంతకాదన్నా, పూర్వంకన్నా నీవు నిజంగా యిప్పటికీ ఆరోగ్యంగా, సుఖంగా వున్నావమ్మా!"

"నీ మాటల్లో అర్థంలేదురా నాయనా! ఎందుకలా అంటావ్? నిజమైన సౌఖ్యం అనుభవించాలంటే ప్రధానంగా మూడు లక్షణాలు వనగూడి రావాలి. ఈ మూడింట్లో నన్ను ఒక లక్షణమూ వరించలేదు" అన్నది మా అత్త విచారంగా.

"ఏమిటమ్మా ఆ మూడు లక్షణాలూ?"

"డబ్బు, డబ్బు, యింకా మరింత డబ్బు!"

అంతా పక్కున నవ్వడం మొదలెట్టారు. నవ్వులో లిగోరియాకు మళ్ళీ దగ్గుతెర వచ్చి ఊపిరాడలేదు. సగం దగ్గులోనే బాధపడుతూ గూడా గొడుగూ, టోపీ పుచ్చుకుని చక్కా వెళ్ళాడు యింటిముఖం పట్టి.

ఈ సంవత్సరం మామిడితోటలు విరగ్గాచాయి. పిందెలతో, కాయలతో మామిడిచెట్లన్నీ పచ్చగా చూడముచ్చటేస్తున్నాయి. ఇంకా ఒకటిరెండు నెలలు గడిస్తేగాని కాయలు బంగారు వన్నెకు మళ్ళవు. కాని పిల్లలకు యీ పచ్చికాయలంటే యెంతో యిష్టం. కోతుల్లాగా కొమ్మలెక్కి ముదురుముదురు మామిడికాయలన్నీ కోసి జేబులు నింపుకుంటారు. చెక్కుతీసి, ముక్కలుగా కోసి, కారం, ఉప్పూ అద్దుకొని లొట్టలేసుకుంటూ తింటారు. ఇలా ఉండగా మా వూళ్లో పెండ్లిసంబరం ఒకటొచ్చింది. అనిసిటో కొడుకు రొసెండో వివాహం. లిగోరియా కుదిర్చిపెట్టిన సంబంధమే అది.

ఊళ్లో పెళ్ళయితే కుక్కలకు హడావిడట. మా యింట్లో మట్టుకు తక్కువ సంబరమా! కొత్తగా కుట్టించుకున్న టఫేటా ఫ్రాకు ఒంటికి తగిలించుకుని, అద్దం ముందర డాన్సు చేయడం మొదలెట్టింది మా రూత్. జుట్టు యెగదువ్వుకుంటే తానెలా కనిపిస్తున్నానో అని మాఅమ్మ నడిగింది. పైకి యెగదువ్విన వెంట్రుకలకు క్లిప్పు పెట్టుకుంటే బాగుంటుందా అని మా అమ్మ అభిప్రాయం అడిగి తెలుసుకుంది.

ఫాషన్లంటే మా అమ్మ కాటే యిష్టంలేదు. ఆడంబరంగా కనిపిస్తే ఆమెకు తలనొప్పి వేస్తుంది. ఇష్టంలేనట్టుగానే చూసింది రూత్‌వంక మా అమ్మ. "ఫాషన్లు చూసుకుని గర్వపడబోకమ్మా! సహజంగా ఉన్న నీ ముఖం చూసుకుని తృప్తిపడు తల్లీ! నీ అంతరాత్మను పరిశుద్ధం చేసుకో! ఈ మాయదారి ఫాషన్లు శాశ్వతం కాదమ్మా!" అన్నది మా అమ్మ సలహా పూర్వకంగా.

పెండ్లినాడుదయం ప్రకృతి శోభాయమానంగా ప్రకాశిస్తూంది. ఆరోజు శనివారం. మామూలు కన్న సూర్య భగవానుడు ఆనాడెందుకో దన అద్భుత కాంతులు విరజిమ్ముతున్నాడు. ఆ కాంతికి యిళ్ళకప్పులన్నీ పచ్చగా కనిపిస్తున్నాయి. గడ్డిపైన. చెట్ల ఆకులపైనా. యేర్పడ్డ మంచు ముత్యాలు యెండకు క్రమంగా ఆవిరై పోతున్నాయి. అంతకంతకు యెండ తీవ్రత హెచ్చింది. పెండ్లి పేరంటాలకు ముస్తాబైన వారంతా చెమటకు ఉక్కిరిబిక్కిరై, సూర్య భగవానుణ్ణి మనస్సుల్లో తిట్టి పోస్తున్నారు.

మానవులు యెంత విచిత్రమైన వ్యక్తులో చూడండి! వర్షం కురపడం ఒక్కరోజు ఆలస్యమైతే, వర్షంకోసం ప్రార్థిస్తాం. అదేపనిగా కురపడం సాగిస్తే. అంతటితో విసిగి వర్షాన్నీ, దేవుణ్ణీ కలిపితిడతాం. గొడ్రాళ్ళు పసిబిడ్డలకోసం పరితపిస్తారు. తీరాసంతానం కలగడం ప్రారంభమయ్యేసరికల్లా పిల్లల్ని పట్టుకుని ఆ తల్లులే తిట్టి పోస్తారు. చలి కాలంలో యెప్పుడు సూర్యుడుదయిస్తాడా అని యెదురుచూస్తాం. ఎండా కాలం ప్రారంభ మౌతుందో కాదో అప్పుడే సూర్యభగవానుణ్ణి ఆడి పోయడం సాగిస్తాం. మళ్ళీ త్వరలో చలికాలం వస్తే బాగుండునే అని ఆరాటపడుతాం. మన జీవితాలకు యెన్నడూ తృప్తీ, సహనం అంటూ లేదా అనిపిస్తుంది.

ఉదయాన్నే స్త్రీ పురుషులందరూ పెందలాడె నిద్రలేచి యింటి పన్లూ, కొద్దోగొప్పో మిగిలి ఉన్న పొలంపన్లూ పూర్తి చేసుకున్నారు. చర్చికి పోవడానికి సిద్ధపడుతున్నారు. మా నాన్న, అమ్మ, మేరియా, రూత్, చక్కగా ముస్తాబై ఉదయం పదిన్నరకల్లా చర్చికి బయల్దేరి వెళ్ళారు. మా ఫ్రాన్సిస్కో, పెండ్లికొడుకు పినతండ్రి బిడ్డలైన అలారికో, ఆనాలతో కలిసి ఉదయానే వెళ్ళిపోయాడు. వీళ్ళూ, తక్కిన బంధువులూ కలిసి పెండ్లికూతుర్ని చర్చికి తీసుకు రావాలని నిర్ణయమైంది.

వూళ్ళో సందడి మెండయింది. చర్చికి రాలేని ముసలివాళ్ళంతా, వరండాల్లోనూ, కిటికీల వెనకా నిలబడి చూస్తున్నారు. రొసెండో బ్రహ్మచారిగా ఆఖరుసారి చర్చికి వెళ్ళడం చూసి ముచ్చట పడ్డారు. రొసెండో బిగ్రబిగుసుకున్న షర్టుతొడుక్కుని నల్లసూటు వేసుకున్నాడు. సీతాకోక చిలుకరంగు కాలరు పెట్టుకున్నాడు. చెమటలు పోసిన ముఖంతో రోసెండో చర్చికి పోతూంటే, కబేళాకు తీసుకు పోతున్నట్లుగా భయపడి పోయినట్లు కన్పించాడు.

రొసెండో కిప్పుడు 23 సంవత్సరాల వయస్సు. అనిసిటో కితడొక్కడే కొడుకు. ఎనిమిదో తరగతి పరీక్షలో ముచ్చటగా మూడు సార్లు తప్పిన మొద్దబ్బాయి. ఊళ్ళోవాళ్ళంతా యింత పరమమొద్దు గోవా మొత్తంలో మరొకడు లేడని చెప్పుకుంటూంటారు. రోజుకు నలభై గంటలు పనిచేస్తానని డప్పాలుకొట్టిన అనిసిటో కొడుకును గూర్చి ఎప్పుడూ ఆందోళన పడుతుండేవాడు. నలుగురితోపాటు కష్టపడి చదువుకోమనీ, లేకపోతే ఉపయోగించే పని యింతచేసుకుని బతకమని కొడుకును ఎప్పుడూ పోరుపెట్టేవాడు. చెప్పిచెప్పి ప్రాణం వేసారి పోయిందీతనికి. పెండ్లయినా చేసి వదిలేస్తే, వాడిపాటికి వాడు బుద్ధి కలిగి బాగుపడతాడేమో అనుకున్నాడు అనిసిటో. లిగోరియా పుణ్యమా అంటూ ఒక్క ఆడపిల్ల దొరికింది రొసెండోకు. అయితే ఉహూం

రోసెండోకు యీ పెండ్లంటే నచ్చలా. ఏ విషయమైనా అసలతను అలక్ష్యంగా చూసేవాడు.

పెండ్లి వైభవంగా జరిగిపోయింది చర్చిగంటలు గణగణ మోగడంతో. టపాకాయలు పేలడంతో, రోసెండోకూడా ఒకయింటి వాడైనాడనుకున్నారు వూరివాళ్ళంతా. కార్లస్, సీజర్, నేసూ, మా నాన్నా, మా అమ్మకు తెలియకుండా చల్లగా అక్కణ్ణుంచి జారుకుని బ్యాండు మేళం వాయించే చోటికి వెళ్ళాం. అక్కణ్ణుంచి పెండ్లితంతు యావత్తు చూచాం చక్కగా. రోసెండో తడబటి కంగారులో పెండ్లికూతురు వేలుకు తొడగాల్సిన వుంగరం కాస్తా క్రిందికి జారవిడిచాడు.

"పెండ్లిరోజున గూడా చిలిపి చేష్టలూ, వికారచేష్టలూనా ?" అన్నాడు పౌరోహితుడు కోపంగా. దానితో రోసెండో మరింత గాభరా తిన్నాడు.

పెండ్లికూతురు జాడీఆకారంగా పొడుగుమొహం పెట్టింది. "రోసెండోకు తగిన పిల్లే" అని బ్యాండుమాస్టరు వెటకారంగా వ్యాఖ్యానించడం మేం విన్నాం. ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, మా అమ్మ మమ్మల్ని చూసి కోపగించు కుంటుందేమో అని, కటిక్కిన నవ్వు ఆపుకున్నాం.

ఎలాగైతేనేం రోసెండో, లారీనా లిద్దరూ భార్యాభర్తలైనారు.

అతిథులందరికీ హాలు చాలదేమో అని పెద్ద పందిరివేయించాడు అనిసిటో. రకరకాల పూలతోనూ, ఆకులతోను పందిరి అతిసుందరంగా అలంకరించ బడ్డది. ఆ రాత్రి అందరికి పెండ్లివిందు. మా కుటుంబం గూడా ఆరోజంతా అక్కడేవున్నాం. పల్లెటూళ్ళలో పెళ్ళిళ్ళయితే, పెండ్లి మూడుపూటలూ ఊళ్ళో వాళ్ళంతా పెండ్లిపందిట్లో కాలం గడపడం ఆచారం. కుటుంబాలకు కుటుంబాలు పసిబిడ్డలతో తరలిరావడం సాంప్రదాయం. పసిపాపలను గదుల్లో పక్కలువేసి పడుకో బెడతారు.

ఆడా, మగా అంతా పందిళ్ళలోనే హాయిగా కాలక్షేపం చేస్తారు. పెళ్ళిళ్ళల్లో ఉండే ఆనందం మరెప్పుడూ ఉండదు. నాట్యం యిష్టమైన వాళ్ళు నాట్యం చేసుకుంటారు. సంగీతాలు పాడేవారు సంగీతాలు పాడుకుంటారు. తాగేవాళ్ళు తాగుతూ ఉంటారు.

నాట్యానికి అనువుగా ఒక ప్రత్యేకమైన గదిలో వెదురు చాపలు అమర్చి ఉంచబడ్డాయి. వయస్సు మళ్ళిన వాద్యగాళ్ళను మెజార్టోనుంచి అనిసిటో కుదుర్చుకుని తీసుకొచ్చాడు. వాళ్ళ పనిముట్లకు పడ్డచిల్లులకు మైనం పూస్తుండడం కనిపెట్టాను.

ఆ వాయిద్యాలు యెలా మోగితే యెవరికి పట్టిందిప్పుడు! మేళగాళ్ళు పాటపాడడం మొదలెట్టారో లేదో, మగవాళ్ళంతా యెవరి జోడాలను వాళ్ళు సిద్ధం చేసుకుని డ్యాన్సు చేయడం సాగించారు. రకరకాల పోజులతో పందిరిచుట్టూ గిర్రున తిరుగుతూ డ్యాన్సు చేస్తున్నారు జోళ్ళకు జోళ్ళు. ప్రతి జోడా రెండవ జోడాతో పోటీపడి, స్త్రీ పురుషు లిద్దరూ ఒకరినొకరు గట్టిగా, బిర్రుగా అదుముకున్నారు. చూడవచ్చిన వాళ్ళెవరూ తమను గుర్తుపట్టకుండా దోమతెరలాంటి సన్నని తెల్లగుడ్డను ముఖాల కడ్డం కప్పుకుని, మొరటు హాస్యాల్లోదిగి పకపకా నవ్వడం ప్రారంభించారు.

"ఏయ్! రోసెయ్! ఏం జేస్తున్నావో తెలుసా నీవు? పొలం దున్నినట్లు నేలంతా దున్నిపారేస్తున్నావు!" అన్నాడొకరు సభికుల్లోంచి.

"అవి ఎవరి బూట్లో తెలుసా ఎస్టైల్! నీవా, నీ మొగుడివా?" అన్నాడు మరొకడు. ఈ మొరటు హాస్యానికి పెద్రోభార్య ఎస్టీలాకు చిన్నతన్నం వేసింది.

ప్రతివాడూ డ్యాన్సు చూసి ఆనందిస్తున్నాడు. పెండ్లిపెద్ద కార్నిలో మేళగాళ్ళకు క్షణం విశ్రాంతి యివ్వకుండా అలసట పుట్టించి యేడ్పిస్తున్నాడు. దురదృష్ట వశాత్తు, అర్ధరాత్రయేసరికల్లా తప్పతాగి డ్యాన్సు

# ౮

ఎన్నోరోజుల్నుంచీ పండగ ఎప్పుడెప్పుడు వస్తుందా అని నోరు తెరుచుక్కూర్చుంటారు. ఆ నాడెంతో సంతోషంతో గడుపుదామని ఆశపడుతూంటాం. తీరా ఆ పండగ రానూవస్తుంది. పోనూపోతుంది. మర్నాడు రెండురకాల భావాలతో ఆలోచిస్తూ ఉంటాం. పండగ దాటి పోయిందనీ. అంతలో మళ్ళీరాదనీ ఒక వేపునబెంగ, మరోవేపున క్రితం రోజే అనుభవించిన ఆనందం జ్ఞప్తికి వస్తూ నిలిచిపోయే తియ్యని ఊహలూ, క్రితం రోజున కడుపునిండా తిన్న ఫలహారాలూ. అందగత్తెలైన ఆడపిల్లలతో కలిసి చేసిన డ్యాన్సులూ యింకా స్ఫురణకు వస్తూనే ఉంటాయి.

మాది పల్లెటూరు కనుకనే బస్తీలో నిత్యమూ కన్పించే ఆకర్షణలు మాకు లభ్యంకావు. అందుకనే పెండ్లిళ్ళ సమయంలోనైనా తృప్తిగా తనివితీరా ఆనందం అనుభవించాలని కోరుకుంటాం. పెండ్లి నాడు జరిగిన విచిత్ర సంఘటన్నిగూర్చి తర్వాత కొన్నాళ్ళ వరకూ చెప్పుకునిఆనందిస్తుంటాం. రోసెండో పెండ్లయిన మర్నాడుమధ్యాహ్నం భోజనాలముందు పెండ్లి అనుభవాలను యెవరికి తోచినట్లు వాళ్ళు వ్యాఖ్యానించడం మొదలెట్టారు.

"నీవు కనిపెట్టావుటే అమ్మా! రెమెడియోస్ డ్యాన్సు చేస్తుంటే. నూతిలోనుంచి నీళ్లతోడినట్లే ఉన్నది!" అన్నాడు ఫ్రాన్సిస్కో.

"రిబరెట్ చేతికి అయిస్‌క్రీమ్ ప్లేటు అందించగానే, ఏంజేశాడో తెలుసా! మంచులా ఉన్న ఆ ప్లేటు పట్టుకోలేక దాన్ని కాస్తా క్రిందికి వదిలిపెట్టేంత పనైంది!" అన్నది రూత్ పోస్టుబంధోత్రితు అనాక్లిటో కూచుర్ని వెక్కిరిస్తూ.

సీజరు నోటినిండా అన్నం కుక్కుకుని. "నేను ప్రత్యక్షంగా నాకండ్లతో చూసిన సంగతి చెబుతున్నాను వినండి!" అంటూఉండగనే మా అమ్మవాడిని కసిరి, ముందు ముద్దమింగి తర్వాత చెప్పదలచు కున్నది చెప్పమని కేకవేసింది; అపాటి మర్యాదైనా నేర్చుకుని సంచ రించమని మందలించింది.

"నేను చెప్పేది అక్షరాలానిజం!" అంటూ సీజర్ నవ్వుపట్టలేక తినే తినే అన్నం క్రిందబోర్లించుకున్నాడు. "నేనొక రోజున బార్ రూమ్‌కు పోయి, లెమనేడా యివ్వమని డ్రింక్‌షాపు వాణ్ణి అడిగాను. అప్పుడే ఆంటన్ ఇర్మా అక్కడ తయారై, బ్రాంది సీసా ఒకటున్నదా అని అడిగాడు. ఆ సీసా తన కోసం కాదనీ, సెనార్ హెర్క్యులానో కోసమనీ గూడా అన్నాడు. పసారా చాటుకుపోయి. ఎవరైనా తనను కనిపెడుతున్నారేమో అని అటూయిటూ చూసి ఇర్మా ఆ బ్రాందీబుడ్డి మొత్తాన్ని గుటుక్కున మింగేశాడు!" అని పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వాడు సీజర్.

మానాన్నగ్గూడా నవ్వొచ్చింది. ఆంటన్ ఇర్మా చేసిన దొంగతనం బయట పడడం యిదే మొదటిసారి కాదని మానాన్న అన్నాడు.

"ఎస్టెల్ ఆరోజున వేసుకున్న బూట్లు నిజంగా తన మొగుడివే. ఏవో మ్యాజిక్ బూట్లు తొడుక్కున్నాననుకుని నడవడం మొదలెట్టింది.

ఏస్టైల్ యేం పిచ్చిపని చేసిందో చూడు! డ్యాన్సు చేస్తూ చేస్తూ పాదాయి నేలకేసి బాదడం మొదలెట్టింది. దాన్ని యెడమకాలితో తన్నెయ్యాల న్నంత వెర్రికోపం వచ్చింది నాకు!" అన్నది రూత్.

"చాలు చాల్లే కట్టిపెట్టు అంతటితో నీ పరితాపం! ఎంతసేపటికీ పరాయి వాళ్ళను వేలుపెట్టి వెక్కిరించడంగాదు! నిన్ను గురించీ, నీ తెలివితేటలూ, మంచితనం గురించీ యితరులేమనుకుంటున్నారో అదిగూడా మనం గమనించాలి. ఇతరులను అంత చులకనగా అవహేళన చేయగూడదమ్మా!" అన్నది మా అమ్మ.

"అమ్మ చెప్పినమాట నిజమేనే రూత్! నీ మట్టుకునీవు డ్యాన్సు చేస్తున్నప్పుడు యెలా కనిపించావో తెలుసా? ఇతరులకెలా ఉన్నావో గాని నా కళ్ళకు మాత్రం నీవు ఒట్టి గర్వబోతులా కనిపించావే! నీవు కాదనలేవుగూడా యీ విషయం!" అన్నాడు సీజర్.

"అర్థంలేకుండా అంటున్నావ్! ఎంత సహజంగా డ్యాన్సు చేశానో తెలుసా! దాన్నే చూసి నేను గర్విష్ఠినని భ్రమపడితే నేనేం చేయగలను!" అని గట్టిగా బదులు జవాబిచ్చింది రూత్.

మేరియాతప్ప తక్కినవాళ్ళందరికీ యీ మాటకు నవ్వొచ్చింది. మేరియా మాట్లాడనైనా మాట్లాడలేదు. ఈ తమాషాఅంతా వింటూన్న మా నాన్న "మేరియా యెలా డ్యాన్సు చేసిందేమిటి?" అని అడిగాడు.

"ఓ! మేరియా! దానికేం! అది చక్కగా డ్యాన్సు చేసింది! అద్భుతంగా చేసింది," రూత్ సమాధానమిచ్చింది కొంటెతనంగా.

"ఏమిటీ! మేరియా అంత అద్భుతంగా నాట్యమాడిందా? అన్నది మా అమ్మ ఆసక్తితో.

"మేరియా డ్యాన్సు చేయడం నీవు చూడలేదే అమ్మా! ఇదివర కెప్పుడూ అలా చేయలా! నీవే అడుగమ్మా దాన్ని!" అంటూ అన్నం తినడం మొదలెట్టింది రూత్.

మా నాన్న పక్కనే కూర్చుంది మేరియా. ఈ మాట వినగానే అది కొంచెం సిగ్గుపడ్డది. కంగారుతో స్థిమితంతప్పి కూర్చున్నది. "చూడమ్మా! పెండ్లికూతురు వెంటవచ్చిన ఆ కుర్రాడితో కాసేపు మాత్రమే డ్యాన్సు చేశానే. రూత్ చెప్పే మాటలు నమ్మకే అమ్మా!" అన్నది మేరియా సిగ్గుతో చురచుర చూస్తూ.

"కాసేపా మేరియా డ్యాన్సు చేసింది? గంట సేపయితే, కాసే పంటావా?" అడిగింది రూత్ తింటూ తింటూ కండ్లెత్తిచూసి.

మేరియా రూత్‌తో వాదించ దలుచుకోలేదు. అన్నం మెతుకులు ముని పంట కొరుకుతూ కూర్చున్నది.

"అయితే ఆ కుర్రాణ్ణి మేరియా ప్రేమిస్తున్నదని అనుకుంటాను!" అన్నాడు సీజర్.

"నోరుముయ్ సీజర్! నీ కొంటె వేషాలు కట్టిపెట్టు!" అన్నది మా అమ్మ కోపంతో.

అంతవరకూ జరిగిన కార్యక్రమాన్ని వింటూ మా నాన్న ఆనందిస్తున్నాడు. "మన యింట్లో యేమిటీ ఉత్సాహం, ఆనందం యీ నాడు! ప్రతి ఒక్కరూ ప్రేమనుగూర్చే చర్చిస్తున్నట్లున్నారే! ఈ ప్రణయ సమస్యను గురించి బొత్తుగాతెలియంది నాకూ, మీఅమ్మకు మాత్రమే!" అన్నాడు మా నాన్న. సీజర్‌వైపు తిరిగి, "నీకెలా తెలుసురా ఆ కుర్రాణ్ణి మన మేరియా ప్రేమిస్తోందని?"

"నీవు కనిపెట్టలేవు నాన్నా దానివాలకం, దాని నడకా, దాని మాటలూపులూ! ఆ సమయంలో మేరియాకు పరో విషయమే పట్టినట్లు లేదు! దానిమనస్సంతా అతనిమీదే లగ్నమైంది నాన్నా!" అన్నాడు సీజర్.

"ఎవడురా ఆ రసికాగ్రేసరుడు? వాడి పేరేమిటి? పేరీ?" అడి గాడు మా నాన్న.

మేరియా జవాబివ్వలేదు. రూత్ వెంటనే అందుకొని, "అతని పేరు ఆబెల్ నాన్నా!" అన్నది.

"అరె! ఆబెలా?" అన్నాడు మా నాన్న ఆశ్చర్యంగా. "వాడు బుద్ధిమంతుడూ, చక్కనివాడూ అయితేసరి. లేకపోతే, వాణ్ణి రూపు మాపుతా దయ్యంగా నన్నాసరి!" అన్నాడు.

టేబుల్ వద్ద ఉన్నవాళ్ళంతా నవ్వడం సాగించారు.

మేరియాకు దిగచెమటలు పోశాయి. కాళ్లు దూదిపింజెల్లాగా తేలి పోతున్నాయి. ఎవరేమంటున్నారో, యేం జరుగుతున్నదో దాని కర్థం కావడంలేదు. రూత్‌కూ, మేరియాకూ మనస్తత్వంలో తేడాఉంది. రూత్ మాదిరిగా మేరియా, చిలిపిపిల్లాకాదు, చపలచిత్తాకాదు. మేరియా సాధువూ, మితభాషిణీగూడా—పూర్వాపరాలు బుద్ధిసూక్ష్మతతో ఆలోచించే పిల్ల, ఎవరికీ చనువిచ్చే పిల్లకాకపోవటంచేత, మా వూళ్ళో మగపిల్ల లెవరికీ మా మేరియా జోలికివచ్చే దమ్ములుండేవికావు. తలిదండ్రుల యెదుటగానీ, పరాయివాళ్ళ యెదుటగానీ నమ్రతతో, సహనంతో సంచ రిస్తూండేది మేరియా. రూత్ ఒక్కొక్కప్పుడు శ్రుతితప్పి మగపిల్లల మాదిరిగా అల్లరికి దిగినప్పుడు, మేరియా దాన్ని మందలించి, ఆడపిల్లలు నడుచుకోవలసిన పద్ధతి అలా కాదని హెచ్చరిస్తూ, సన్మార్గం బోధిస్తూండేది.

"ఒక్కొక్కసారి నీవు చాలా అసహ్యంగా ప్రవర్తిస్తావే రూత్! ఇతర్లముందు నిన్ను నీవే చులకన చేసుకోగూడదే! అనేది" మేరియా.

"పోవే మేరియా! నా భావాలను నేనెందుకు దాచుకోవాలి? అసహజంగా యెందుకు ప్రవర్తించాలి? చెప్పేదొకటీ, చేసేదొకటీకాదు నా పద్ధతి! నేను సుఖంగా ఉండడమొక్కటే నేను కోరుకునేది!" అంటూ వచ్చింది రూత్ నిర్భయంగా.

రోసెండో పెండ్లినాడు నాట్యానికి సంబంధించిన అన్ని నియమాలూ ఉల్లంఘించి వేసింది మేరియా. ఆరోజున మేరీ ఆబెల్‌తో కనీసం ఆరుసార్లయినా సిగ్గువిడిచి డ్యాన్సుచేసింది. అభిమానం, సిగ్గుగలపిల్ల మామూలుగా ఒకటి రెండుసార్లకన్న మగవాడితో డ్యాన్సు చేయగూడదు.

అనాడెక్కణ్ణుంచో ఆబెల్ పిడుగులా వచ్చిపడ్డాడు మేరియా వద్దకు. మేరియా మామూలుగా ఎవరితోనూ కలిసిమెలిసి ఉండక ఒంటరిగా ఉండే అలవాటు. ఎవ్వరితోనూ ఆట్టేమాట్లాడదు. మగవాళ్ళ కసలు చోటివ్వదు. దానిలో చలోక్తులు మాట్లాడ్డానికిగానీ, పరిహాసాలాడ్డానికిగానీ యే మగాడికీ సాహసముండదు. అలాంటి నిబ్బరాలినీ, మేదకురాలినీ ఆబెల్ యెలా మచ్చిక చేసుకున్నాడో చేసుకున్నాడు. మేరియాతో అతి నాజూకుగా, విజ్ఞానం ఉట్టిపడేట్లు మాట్లాడేవాడు ఆబెల్. మేరియా అమాంతంగా ఆబెల్ కౌగిల్లోదూకి డ్యాన్సు చేస్తూచేస్తూ, అంతకుముందు యెంతో కాలంనుంచీ బాగా పరిచయమున్న దానివలె సరదాగా సంభాషించడం మొదలెట్టింది.

మేరియా అమాయకురాలు. అందమైన పిల్లగూడాను. నిరాడంబరంగా జీవించేపిల్లల్లో అదొకతె, రూత్‌మాదిరిగా లేనివి కల్పించి తెచ్చిపెట్టుకునేదికాదు. సహజమైన దాని స్వరూపంతోనే సంతృప్తిపడేది.

పై పై వేషాలన్నా, పటాటోపాలన్నా దానికసహ్యం. మా వూరొక్కటే మేరియాకు సర్వప్రపంచమూ. మరి యీనాడది మరో ప్రపంచంలో విహరిస్తున్నది. మనస్సక్కడా, కట్టె యిక్కడా. ఆ ప్రపంచం ఒకరు నడిచి ప్రయాణమై పోయేదికాదు. రెక్కలుంటే యెగిరి పోవచ్చునేమో! ఆ ప్రపంచంలో మాటమాట్లాడితేనే మధుర సంగీతం ఒలుకుతుంది. అక్కడి మందమారుతం వీలుస్తుంటే, పది లక్షల రోజా పుష్పాల్లోనుంచి తయారైన సెంటువాసననుగూడా మరిపించినట్లుంటుంది.

"నీవు యెంతో నిరాడంబరమైనదానివనీ. అమాయకురాలవనీ. అనుకుంటున్నాను" అన్నాడు ఆబెల్ మేరియాతో. ఆబెల్ మాట్లాడే ప్రతిమాటా సూర్య భగవానునియెండ తీక్షణతకు బీటలువారిన భూమిపై వానజల్లు పడ్డట్లు మేరియా హృదయంపైన హత్తుకుని పోయింది.

మేరియాను చూడ్డానికి ఆబెల్ మావూరురాగానే. ప్రతివ్యక్తీ మేరియాకు త్వరలోనే వివాహం కాబోతున్నదని ఊహించారు. రోసెండో పెండ్లయిన వారంరోజుల తర్వాత ఒకనాటి సాయంత్రం అతను మా వూరు వచ్చాడు.

ఆబెల్ వస్తాడని మేరియాకు ముందుగా తెలుసు. అందుకే ఆ నాడు చక్కగా తల దువ్వుకుని రంగురంగుల డ్రెస్సుతో ముస్తాబై సిద్ధంగా ఉంది. మామూలుకన్నా ఆనాడు హుషారుగా ఉన్న మేరియా నిమిష నిమిషానికీ యింట్లోకీ. వరండాలోకీ ఊపిరాడకుండా తిరగనారంభించింది. ఆబెల్ కోసం యెదురుచూస్తున్న దాని మనస్సు అదోవిధంగా వికారంగా కన్పించింది. వరండాలో రెండు నిమిషాలు నిలబడి అదేపనిగా దృష్టి సారించింది రోడ్డువంక.

"ఏమిటే మేరియా! ఏమిటీకంగారు! బొత్తిగా కాలునిలవడం లేదు! ఎందుకంత ఉద్రేకంగా కన్పిస్తున్నావ్?" అన్నది మా అమ్మ.

మేరియా ఉత్సాహం అణుచుకుందామని ప్రయత్నించింది. అల్లిక లో నిమగ్నురాలైనట్లు నటించింది. కొన్ని నిముషాలే అలాచేయగల్గింది. మళ్ళీ యెప్పటట్లే కిటికీదగ్గరనూ వరండాలోకీ చరచరనడవడం సాగించింది. రోడ్డువంక ఎదురుచూసింది మళ్ళీ.

సాయంకాలమైంది. ఎండతీవ్రత తగ్గుతోంది. అంతవరకూ మేరియా సహనంతో గడిపింది. ఇంతలో ఆబెల్ సైకిల్‌మీద రానే వచ్చాడు. ఇంటిముందర ఉన్న వేపచెట్టుకు సైకిల్ ఆనించి మెట్లెక్కి వరండాలోకి వచ్చాడు.

"మేరియా యింట్లో ఉన్నదండీ?" అన్నాడు కొంచెం కంగారుతో.

మెట్లపై నిలబడున్న కార్లస్ అతనికి జవాబిచ్చింది. ఆబెల్ యింట్లోకి పరుగెత్తుకొచ్చి మేరియాను పిలిచాడు పెద్దగా.

మేరియావచ్చి అతనితో కరచాలనం చేసింది. ఇప్పుడు మేరియా ముఖవైఖరి మరో విధంగా మారినట్లు స్పష్టంగా కన్పిస్తోంది. ఇప్పుడది యెంతో ప్రశాంతంగాఉంది. పూర్వపరిచయమున్న మనిషిని అభినందించినట్లుగాక, కొత్త అతిథిని గౌరవించినట్లు గౌరవించింది ఆబెల్‌ను.

"మీరిప్పుడొస్తారని నేననుకోలేదండీ! నిజంగా షికారెళ్ళడానికి సిద్ధమౌతున్నాను మీరు వచ్చేముందే!" అని అబద్ధాలాడింది.

ఆబెల్ మనస్సు కొంచెం చివుక్కుమంది. "ఈరోజు వస్తానని నీకు చెప్పాగా మేరియా?" అని జ్ఞాపకం చేశాడు ఆబెల్ ఆనాడన్న మాట.

"ఇవ్వాళ వస్తానన్నారా? మీ రామాట అన్నప్పుడు నా మనస్సెక్కడో ఉంది. శ్రద్ధగా ఆలకించనందుకు క్షమించండి" అంటూ హాల్లో కూర్చుందామని లోపలికి తీసుకునిపోయింది అతన్ని.

మా అమ్మా, రూత్ అప్పుడే అక్కడవచ్చి కూర్చున్నారు. ఆబెల్ తనను గురించీ, తనకుటుంబాన్ని గురించీ మా అమ్మకు వివరంగా చెప్పాడు. అతని తండ్రి కస్టమ్స్ ఆఫీసులో ఒక ఉద్యోగనీ, అతని చదువు పూర్తికాగానే, అక్కడ తనకూ ఉద్యోగం దొరుకుతుందనీ చెప్పాడు ఆబెల్.

"పంజిమ్‌లో మీ యిల్లెక్కడ నాయనా ?" అడిగింది మా అమ్మ.

"ఫాంటెనాస్ దగ్గరండీ !" అని జవాబిచ్చాడు ఆబెల్.

"అయితే నీవు ఆస్పుర్ క్వేటాను యెరిగే ఉంటావనుకుంటాను ; ఆమె మావారి చెల్లెలు !"

"అవునండీ ! యెరుగుదును ! బాగాయెరుగుదును ! మాఅమ్మకూ ఆమెకూ ప్రాణస్నేహం. ఇద్దరూ ఆడవాళ్ళక్లబ్‌లో ముఖ్యమైన సభ్యురాండ్రు గూడా !" అన్నాడతడు.

నన్నూ, కార్లస్‌నూ, సీజర్‌ను హాల్లోకి రావద్దని మా అమ్మ ఆర్డరేసింది. ముగ్గురం ఆబెల్ సైకిల్ వద్దకెళ్ళి, తలాకాసేపు తొక్కి విడిచిపెట్టాం. చర్చివరకూ వంతుల ప్రకారం ఒకరి తర్వాత ఒకరం వెళ్ళివచ్చాం. సైకిల్ తొక్కడం మా అమ్మ లోపల్నుంచి చూసి మమ్మల్ని లోపలికి పిల్చి కేకలేసింది.

"సైకిల్ విరిగిపోతే యేంగానురా ? ఎప్పుడూ అల్లరి చేస్తూ యెందుకురా నాకప్రతిష్ఠ తెస్తారు ?" అన్నది మా అమ్మ.

ఇంటి పనులు చక్కపెట్టుకోడానికి మా అమ్మ లోనికి పోగానే, ఆబెల్ మేరియాలు యేం మాట్లాడుకుంటారో విందామని అక్కడే ఉండి పోవడానికి నిశ్చయించుకున్నాం. ప్రక్కనే ఉన్న కిటికీ చాటుకు వెళ్ళి చిల్లిలోనుంచి తొంగిచూశాం. సీజర్ స్టూల్‌మీద నిలబడ్డాడు కార్లస్,

నేనూ క్రింద నిల్చున్నాం. "హాల్లో ఉన్నవాళ్ళు కనిపిస్తున్నారా ?" అని అడిగాను సీజర్ని.

"ఓ! కనిపిస్తున్నారు. రూత్ యింకా వాళ్ళ దగ్గరే ఉంది. వదిలివెళ్ళలా ! అందుకే కాబోలు వాళ్ళిద్దరూ యెడం యెడంగా కూర్చు న్నారు !" అన్నాడు సీజర్.

"రూత్ యెప్పుడూ అల్లరిచేస్తూనే ఉంటుంది. దానికి సమయ మూలేదు, స్థానమూలేదు. వాళ్ళిపాటికి........ వాళ్ళిద్దర్నీ వదిలేసి అక్క డ్నుంచి వెళ్ళిపోదేం యింకా ?" అన్నాడు కార్లస్.

"ఒరేయి ! ఒక్కసారి స్టూలెక్కి నన్నుగూడా లోపలికి చూడ నివ్వరా !" అని ప్రాధేయపడ్డాను. సీజరు సరేనని స్టూల్ దిగాడు. వంతుల ప్రకారం ముగ్గురం స్టూలెక్కి హాల్లోకి తొంగి చూశాం చిల్లి గుండా. అప్పటికీ రూత్ అక్కడే తిష్టవేసుకూర్చుంది. మాఫోటోలు, మేరియా తయారు చేసిన అల్లిక రుమాళ్ళు యింకేవేవో నగిషీపనులు మేరియా ఆబెల్కు చూపిస్తూంది. మావూరి కబుర్లుగూడా కొన్ని కొన్ని చెబుతున్నదతనితో. ప్రేమకలాపాలేవీ సాగించలా అంతవరకూ; రూత్ అక్కడనే ఉండడంవల్ల కాబోలనుకున్నాం. కోపం పట్టలేక దాన్ని తలా ఒక తిట్టు తిట్టాం.

సూర్యాస్తమయం కావస్తున్నది. కప్పుర కప్పుర చీకటిగూడా పడుతుంది కాసేపట్లో. ఇంకా కాసేపటికల్లా ఆబెల్ తనదారిన తాను తిరిగిపోవాల్సిఉంది. ఇది కనిపెట్టి, సీజర్ ఒక చక్కని ప్లాను ఆలో చించాడు. తలుపు దగ్గరకు పోయి, అమ్మ లోపలికి రమ్మంటున్నదని రూత్కు ఒక్కగావు కేకపెట్టాడు. రూత్ వాడిమాట నిజమని నమ్మి హాల్ విడిచివెళ్ళిపోయింది చివరకు. వెంటనే కార్లస్ మళ్ళీ స్టూలెక్కి చిల్లిగుండా లోపల యేం జరుగుతున్నదో చూశాడు.



"మేరియాను ముద్దుపెట్టుకుంటున్నాడురా ?" అని అడిగాను.

"లేదురా ! ఇంకా ముద్దుపెట్టుకోడంలేదు. మేరియా పంజింవచ్చి కొన్నివారాలపాటు ఆస్పుల్ క్వేటాలో కాలక్షేపం చేసితీరాలని ఆబెల్ గట్టిగా పట్టుపడుతున్నాడురా !" అన్నాడు కార్లస్.

"సరేలే ! ఇహనీవుదిగు. నన్నెక్కి చూడనివ్వరా ?" అన్నాను.

"ఒక్క నిమిషం ఉండరా నీవు! ఇప్పుడే అతను మేరియాను సమీపించి తొడకుతొడ కలిపి ఆనుకుని కూర్చున్నాడు. దాని చేయిగూడా పట్టుకోబోతున్నాడురా" అన్నాడు కార్లస్.

"అయితే యింకా ముద్దు పెట్టుకోపడంలేదన్నమాట." అంటూ కోపంతో సీజర్ కార్లస్‌ను కిందికి దిగమని దబాయించాడు.

"మరో క్షణంలో ముద్దు పెట్టుకునేట్టున్నారా!" అని కార్లస్ దిగగానే. మేమిద్దరం ఒక్కసారే స్టూల్‌మీద యెక్కడానికి ప్రయత్నించాం. స్టూల్ తలకిందై, శబ్దమైంది.

మా అమ్మ వచ్చి మావీపులెక్కడ పెట్లగొడుతుందో అని తలా ఒక మూలా కాలికి బుద్ధిచెప్పాం.

అప్పుడే మా నాన్న యింటికి తిరిగి వచ్చాడు. ఆయనతో కాసేపు కబుర్లుచెప్పి. ఆబెల్ వచ్చిన దోవనే తిరిగి వెళ్ళిపోయాడు.

"ఏమమ్మా మేరీ! ఇతనేనా నీవు ప్రేమించిన కుర్రాడు?" అడిగాడు మా నాన్న. మేరియా సిగ్గుతో తలవంచి మాట్లాడలేదు.

"వాళ్ళ కుటుంబంలోని వారంతా మీ చెల్లెల్ని యెరుగుదురట." అన్నది మా అమ్మ నాన్నతో. మా నాన్నకు ఆబెల్ ఒకవేళనచ్చకపోతే, మా మేనత్తతో వాళ్ళకున్న స్నేహాన్ని పురస్కరించుకునైనా, ఈ సంబం

ధాన్ని కలుపుకుందామని మా అమ్మ ఆశపడ్డది. మా అమ్మ మనస్సుకు ఆబెల్ చక్కగా నచ్చాడు. యిద్దరికీ యేర్పడ్డ పరిచయం వివాహంగా పరిణమిస్తే బాగుండిపో ననిపించిందామెకు.

"మా చెల్లెల్ని యెరుగుదురా వాళ్లు? అయితే నా మీద వాళ్ళ కంత మంచి అభిప్రాయం లేదేమో!" అన్నాడు తమాషాగా మా నాన్న.

"ఆ అబ్బాయి తల్లి మహిళా సంఘానికి నాయకురాలటగూడా!" అన్నది మా అమ్మ - వాళ్ళ గొప్పదనాన్ని గురించి నాన్న కింకా నచ్చ చెప్పడానికి.

"ఓహో! అలాగా! అయితే యింకేం! మనం మరీ అదృష్ట వంతుల మన్న మాట! ఈ పరస్పర ప్రేమ ఫలించి వివాహంగా పరిణమించితే, ఆ కుర్రాడి తల్లీ, మా చెల్లెలు నీవూ కలిసి యేకంగా ఒక చర్చే కట్టించి పారేసేట్టున్నారే!" అన్నాడు మా నాన్న.

మా అమ్మ మానాన్న చేసిన పరిహాసానికి చిరుకోపం తెచ్చు కుని పని చేసుకోడాని కెళ్ళింది లోపలికి.

పంజిమ్ వెళ్లే ముందు మరొకసారి మాత్రమే ఆబెల్ మేరి యాను చూడ్డానికి వచ్చాడు. రెండోసారి ఉదయాన్నే వచ్చిన ఆబెల్ బలవంతంమీద మధ్యాహ్నం భోజనం చేసుకుని, ఆ సాయత్రం బయ ల్దేరి పోయాడు.

మేరియా ఇప్పుడు ఉల్లాసంగా కాలం వెళ్ళబుచ్చుతూంది. దానితో కలిసి మెలిసి కబుర్లాడుతూ, సరదాగా వున్నాం మేమంతా.

గురువారం సెలవు దినం మాకు. మధ్యాహ్నం వరకూ పేకాట ఆడుతూ వెళ్ళబుచ్చాం. సాయంత్రం కొండవేపు షికారెళ్ళాం. కొండ మీద కోతుల్లాగా అటూ యిటూ గంతులేశాం; కోతి కొమ్మచ్చు లాడాం.

మా ప్లాను ప్రకారం మేరియానూ, ఆబెల్‌నూ ఒకచోట వంటరిగా వదిలేసి మా దోవను మేం పోయినాం.

ఎత్తయిన ఒక శిఖరం మీదకి మేరియా అతన్ని తీసుకుని పోయింది. అక్కడినుంచి అందంగా కనిపించే మా గ్రామాన్నీ, మా పొలాల్నీ, చెరువులనూ, కుంటలనూ, వెదుళ్ళ తోపులనూ, యితర పరిసరాలనూ చూపించింది ఆబెల్‌కు.

"ఇక్కణ్ణుంచి మా యిల్లు చూడగలరా ?" అడిగింది ఆబెల్‌ను మేరియా, మా యిల్లు ఆనవాలు పట్టలేకపోయాడు ఆబెల్. మేరియా అతన్ని ఆనుకుని నిలబడి వేలెట్టి మా యిల్లు చూపించింది. "అక్కడ చూడండి ! మా అమ్మ వెనక దొడ్డిలో పందులకు అన్నం పెడుతున్నది! కన్పించిందా మీకు" అని అడిగింది, ఆబెల్ మా అమ్మను గుర్తుపట్ట లేకపోయాడు. మేరియా అతని తల తీసికొచ్చి తన తల కానించుకొని మా అమ్మను వేలెట్టి చూపించింది.

అప్పుడతను మా అమ్మను చూసి గుర్తుపట్టగలిగాడు. కాని మెరియా చేయి మాత్రం వదల్లేదు. దాని చేతిని గట్టిగా పట్టుకొని ఒక పెద్ద బండమీద కూర్చున్నాడు.

"మన వాళ్ళంతా యెక్కడ ?" అనడిగాడు మేరియా పక్కనే కూర్చుని.

"జీడి మామిడి తోపులోకి పోయి వుంటారు".

"ఈ ఊరి వాళ్ళెవరూ కొండమీదికి షికారు వస్తున్నట్లులేదే !"

"వాళ్ళుగూడా కొండ అవతల ప్రక్కనే ఉండి వుంటారు" అన్నది మేరియా.

ఆబెల్ కొన్ని నిమిషాలసేపు మౌనం వహించి యేదో ఆలోచిస్తున్నట్లు నటించాడు. కొంతసేపయిన తర్వాత మేరియాతో నెమ్మదిగా "ఇక్కడెవ్వరూ లేరుగా యిప్పుడు! నిన్ను ముద్దు పెట్టుకోవచ్చా?"

అప్పుడే మసక చీకటి పడుతోంది. మేరియా ప్రాణానికిమాత్రం సూర్యరశ్మి ప్రసరిస్తున్నట్లే అనిపించింది. ప్రాణానికి హాయి నిచ్చే పిల్ల వాయువులు వీచసాగాయి. ప్రేమికు లిద్దరూ కూర్చున్న నల్లరాతి బండ ఒక తెల్లని మేఘంగా పొడగట్టింది వాళ్ళ కళ్ళకు. పరిసర ప్రదేశమంతా నందనవనంగా కళకళలాడుతోంది.

ఆబెల్ కోరిక తిరస్కరించలేక మౌనం వహించింది మేరియా. పట్టణాల్లో, పల్లెల్లో, అరణ్యాల్లో, యెడారుల్లో- యెక్కడైనాగానీ ప్రకృతి సహజ లక్షణాలు ఒకేతీరుగా వుంటాయి. మానవుని మనఃప్రవృత్తులు ఒకే విధంగా రూపొందుతాయి. స్త్రీల మనోభావాలు విచిత్రంగా వుంటాయి. మేరియా మౌనం అంగీకారసూచక మన్నమాటే. ఆబెల్ లేచి పక్కనేవున్న బండమీద నిలబడి మేరియాను ముద్దుపెట్టుకున్నాడు. వాళ్ళ మొదటి ముద్దిదే.

జీడిమామిడి తోటలో నుంచి అన్ని విషయాలూ కనిపెడుతూనే ఉన్నాం. "అదికూడా ఒక ముద్దేనా! ముద్దనిపించుకోదది. పిట్ట పైపైన ముక్కుతో తాకినట్లు, అతను మేరియాను పెదవితో పైపైన అంటీఅంట నట్లు తాకాడంతే!" అన్నది రూత్.

రూత్ మాటలు ఆబెల్ చెవిని పడగానే, అతను రెండోసారి మేరియాను తనివితీరా ముద్దుపెట్టుకున్నాడు. ఈ ప్రణయచిహ్నాన్ని చూస్తున్న నేను, వీళ్ళిద్దరూ యింతసేపు ఊపిరిసలుపకుండా యెలా ముద్దులు పెట్టుకుంటూఉండ గలిగారా అనుకున్నాను ఆశ్చర్యంతో.

"అదీ ముద్దంటేని జమైన ముద్దు!" అన్నది రూత్ ఉద్రేకంగా.

"ఆ ముద్దుల సంగతి నీకెలా తెలుసే?" అన్నాడు కార్లస్ యెంతో ఆసక్తిగా.

రూత్ నా వంకా, నేను రూత్‌వంకా చూసుకుంటూ యిద్దరం చిరునవ్వు నవ్వుకున్నాం - రూత్ రహస్యం నాకు తెలుసును గనుక.

---

## ౯

ఒకనాడు పిల్లలతో సందడిగా వున్న మా ఇంట్లో నుంచి వర సగా ఒక్కొక్కళ్ళు జారుకుంటున్నారు. మొట్టమొదట అంటోనియో వెళ్ళిపోయాడా! తర్వాత రాబర్టుకూడా డా మరి! తర్వాత ఏడ్రి యానో వంతు వచ్చిందిగద! ఇప్పుడు కార్లస్, సీజర్ యిద్దరూకూడ మమ్మల్ని విడిచి పోబోతున్నారు, వీళ్ళిద్దరూ చర్చి స్కూల్‌కు పోయి అక్కడే ఉండిపోవడానికి నిశ్చయించుకున్నారు.

వీళ్ళ నిర్ణయం వినగానె మా అమ్మ మొదట సంతోషించింది. తర్వాత రేపటి దినం ప్రయాణమై పోతారనగా బిక్కమొహం వేసు కుని కూర్చుంది మా అమ్మ.

కార్లస్ బుద్ధిమంతుడూ, నిదానస్తుడు గూడా. వాడి అలవాట్లన్నీ మంచివే. మా అమ్మకు వాడు బాగా మాలిమి. ఎప్పుడూ వాడు మా అమ్మను విడ ండా ఉంటూ, చిన్నపనికీ, పెద్దపనికీ చేదోడు వాదోడుగా ఉండేవాడు. మా అందర్లోకీ. వాడొక్కడే మా అమ్మకు చీకాకు కల్పించనివాడు. మా అమ్మగూడా వాడు యెప్పుడూ తనదగ్గరే ఉండి పోవాలని కోరుకుంటూ ఉండేది. వాడిమీద మమకారంతో, వంటరిగా వాడితో ఉన్నప్పుడు, "నీమీదనే నేనెన్నో ఆశలు పెట్టుకున్నానాని

నాయనా! ఆశాభంగం కలిగించబోకేం! నీవు నిజంగా విద్యాబుద్ధులు నేర్చి మతగురువు గావాలని ఆశిస్తున్నా!" అంటూండేది.

మతగురువులన్నా, క్రైస్తవ సన్యాసినులన్నా, మా అమ్మకెంతో భక్తీ, గౌరవం. నేనూ ఒక మతగురువు కావాలని మా అమ్మ కోరుకుంటూ ఉండేదెప్పుడూ. ఆమె అభిమానాన్నీ, ఆదరణనూ పొందాలని మతగురువంటే నాకూ యిష్టమున్నట్లు నటించేవాణ్ని ఆమెవద్దనుంచి తప్పుకోగానే మా అమ్మను భలేతమాషా చేశానని నాలో నేను నవ్వుకునేవాణ్ని. మా అక్క చెల్లెండ్లను గూడా అడిగేది మా అమ్మ సన్యాసినులౌతారటమ్మా అని. సన్యాసిని జీవితంలో యెంతో పవిత్రతా, ఆనందం గూడా ఉన్నదని, వాళ్ల నిత్యజీవితాన్ని వర్ణించేది వాళ్ళముందు.

"అయితే నీవెందుకు సన్యాసినివి కాలేదమ్మా? మమ్మల్ని కమ్మంటున్నావుగాని!" అడిగింది మా అమ్మను రూత్ ఒకనాడు.

ఇప్పటి మాదిరిగా నాకానాడు చర్చి సంగతీ, క్రైస్తవమతం సంగతి తెలియదు. ఆ రోజుల్లో నా కెవరైనా మనమతం గొప్పదనాన్ని చెప్పివుంటే, ఆనాడే తప్పక సన్యాసినిని అయ్యేదాన్ని. నిజం చెబుతున్నా విను రూత్! సంసారమనుకుంటే యేమనుకున్నావో! స్వర్గం అనుకుని భ్రమపడబోకు. వట్టి నరక కూపమంటే నమ్మి. యీ జీవం నరకమే." అంటూ సమాధాన మిచ్చింది మా అమ్మ.

"అయితే చర్చిలూ, చర్చిస్కూళ్ళు మాత్రం సంతోషం కల్గించే స్వర్గసీమలనుకున్నావా అమ్మా?" అన్నది రూత్ అన్నివిషయాలూ తెలిసినట్లు. "అంపర్లోకి అంద విహీనురాలనైనప్పటికీ, నేను మాత్రం చర్చి ఆవరణలో అడుగుపెట్ట దలుచుకోలేదు" అన్నదిరూత్.

కార్లస్ మతగురువుగా తయారుకావాలని వాడికెన్నాళ్ళనుంచో ఉబలాటం. అందుకేవాడు గట్టినిశ్చయం చేసుకున్నాడా విషయంలో.

అయితే సీజరుగూడా మతగురువు కాబోతున్నాడని మా వూరివాళ్ళు విన్న ప్పుడు ఆశ్చర్యపోయారు. ఇటీవల వాడి అల్లరి మోపయింది. వాడి భవిష్యత్తు యేమవుతుందో ఊహించడం గూడా కష్టమయింది. నిజంగా వాడి సమస్య మా అమ్మకు తలనొప్పి కలిగించిందంటే నమ్మండి.

మా సీజర్ మనస్తత్వం అతి సున్నితమైనదీ, చిక్కైనదీ గూడా. మనస్తత్వ శాస్త్రజ్ఞులు వాడిమీద ప్రయోగం చేస్తే వాళ్ళు అమూల్యమైన అనుభవంగూడా గడించగల్గుతారని మానాన్న అభిప్రాయపడేవాడు. అంత క్లిష్టమైనది వాడి మనస్తత్వం. ఒకప్పుడు మహాఋషిలా ప్రవర్తిస్తాడు. మరుక్షణమే పరమపాపిగా గూడా సంచరిస్తాడు. ఒక క్షణంలో దేవుడు లేనేలేడని వాదిస్తాడు. ఉత్తరక్షణంలో మోకాళ్ళమీద నిలబడి అదేపనిగా ప్రార్థనలు జరుపుతాడు మహాభక్తుడిలా. వాడుచేసే పాపిష్టి పనుల మూలంగా మా అమ్మ ప్రాణం విసుగెత్తిపోతుంది. మా అప్పచెల్లెండ్లను వాడుకూసే కారుకూతలిన్నన్నికావు. వాడికి మర్యాదా, మన్ననా యేకోశానాలేవు. వాడసలు ప్రార్థనచేయని రోజులున్నాయి. గుబులుమళ్ళి నప్పుడు తిండీ, నీళ్ళూ లేకుండా రాత్రింబగళ్లూ చర్చిలో కాలం గడిపిన రోజులూ ఉన్నాయి. ఎటుచూసినా వాడినడత విపరీతమే. ప్రార్థనలో మునిగి ఉన్నసమయంలో గోడలకు తగిలించిన ఋషులపటాల వంక కన్నుమూయకుండా చూసేవాడు. చిరునవ్వు నవ్వి ఆ పటాలతో యేవేవో మాట్లాడేవాడు గూడా.

వాడి మనస్సు అగాధం. వానిలోని పొరలను తెలుసుకోవడం అసాధ్యంగా తోస్తుందినాకు. చర్చిలో యేదైనా ఉత్సవం జరుగుతుందని తెలియగానే, సీజర్‌కు ఆవేశమెత్తినట్లుంటుంది. ఈస్టరు పండగ రోజువచ్చే సరికి. చంచలత్వం యేర్పడుతుంది. ఏమేమో ఆలోచనల్లో నిమగ్నుడౌతాడు. ఆ రోజు మా యింట్లో నోరూరే రకరకాల పిండివంటలు

చేసుకుంటాం. తినకముందే వెగటుపుట్టినట్లు వాటిని ముట్టనైనా ముట్టడు. పండగనాడు వూరంతా ఉత్సవాలతో, ఆటపాటల్తో, ప్రార్థనల్తో కోలాహలంగా ఉంటుందా మరి! వాటి చాయలకూ కూడా పోడువాడు. అసలు భోజనమే చెయ్యడానాడు. మా అమ్మను పిలిచి, "అమ్మా! ఒక్క పూట కూటికిగూడా గతిలేక లక్షలమంది పస్తులతో అలమటిస్తుంటే, మనకెందుకే యీ ఉత్సవాలూ, యీ పిండివంటలూ!" అనేవాడు.

వీడి వైఖరి చూసి మా అమ్మ కంగారు పడుతుండేది. వాణ్ని సన్మార్గంలో పెట్టమని దేవుణ్ని ప్రార్థించేది. వాడికోసం దిగులుపడి కన్నీళ్ళు కార్చేది.

అలాంటి విచిత్రవ్యక్తి యీనాడు మతగురువు కావాలని నిర్ణయించుకుంటే మా అందరికీ ఆశ్చర్యం కల్గింది. వీడేమిటా, మతగురువు కావడమేమిటా అని నమ్మలేక పోయినాం.

జూన్ నెలలో ఒకనాటి సాయంకాలం ఆకాశం మేఘావృతమై ఉంది. ఏ నిమిషాన్నైనా భయంకరమైన వర్షం ముంచెత్తుతుందనిపించింది. ఆ స్థితిలో క్లాన్, సీజర్ రాకోల్‌కు బయల్దేరి వెళ్ళిపోయారు. ఒక నెలైనా జరిగిందోలేదో మా ఫ్రాన్సిస్ మమ్మల్నందర్నీ గాభరాయెత్తించాడు ఒకరోజున.

"అమ్మా, వియాండోస్ట్రోతో కలిసి ఆఫ్రికా వెళ్ళిపోవాలని ఉందే నాకు!" అన్నాడు ఫ్రాన్సిస్. మామూలుగా పనీపాటాలేక వాగేవాగుడే యిదని మా అమ్మ మొట్టమొదట వాడిమాట లెక్కచేయలేదు.

"పోరా, నీ వాగుడూ నీవూనూ! పొలంపనిలో మీ నాన్నకైనా సాయపడరాదేం?"

మా ఫ్రాన్సిస్‌కు చదువంటే చుక్కెదురు. పుస్తకాలు కట్టకట్టి మూల్లో దోపేవాడు; చచ్చిచెడీ యెలాగో యెనిమిదో తరగతి నెట్టేశాడు.

పైచదువు జోలికేపోక, అప్పట్నుంచీ పొలం పనుల్లో మానాన్నకు చేదోడువాదోడుగా ఉండేవాడు. ఫ్రాన్సిస్‌కు యెద్దుకున్నంత బలం ఉన్న దంటే ఆశ్చర్యపడవద్దు. చదువు సంధ్యల్లో వాడికుత్సాహం లేకపోయినా, పొలం దున్నుకునైనా సుఖంగా బ్రతక్క గలడని మా నాన్న తృప్తిపడే వాడు. తనకింత అండగా గూడా ఉండగలడని సంతోషించాడు. ముసలి తనంలో తాను పనిచేయలేడనే కొరత ఫ్రాన్సిస్ తీరుస్తాడని మురుసు కునేవాడాయన. అపరిమితమైన ఉత్సాహంతో ఫ్రాన్సిస్ వ్యవసాయానికి మళ్ళుకున్నాడప్పుడే. ఇంతలో ఆర్జెంటినా కొడుకు వియాండ్రో ఆఫ్రికా నుంచి యెప్పుడు ఊడిపడ్డాడో వచ్చాడు. ఒక్కసారి వియాండ్రోను మా వాడు కలుసుకుని మాటాడాడోలేదో, యింతలోనే వీడిమనస్సు తిప్పివే శాడు వియాండ్రో. ఒక నిమిషం యీ వూళ్ళో ఉండనని మళ్ళబడ్డాడు ఫ్రాన్సిస్.

ఫ్రాన్సిస్ మా అమ్మతో మాట్లాళ్ళేదానాడు. రాత్రి పొలంనుంచి మానాన్న ఇంటికిరాగానే, తన మనస్సులోనిమాట ఆయనకు చల్లగా వినిపించాడు.

"ఏంరా అబ్బాయ్ ! నీవు నిజంగా అంటున్నావా, తమాషాకా?" అన్నాడు మానాన్న సంభ్రమాశ్చర్యాలతో. "ఏంచేస్తావురా నీ వాఫ్రికాలో? ఉన్నట్టుండి ఆకస్మికంగా యెందుకిలాంటి నిర్ణయం చేసుకున్నావు? పొలం దున్నుకుంటూ హాయిగా బ్రతక్క యెందుకురా దేశం కానిదేశం పోవడం! నాకు హస్తంత అండగా వుంటావనుకున్నానే! ఇంతలోనే యీనిర్ణయ మెలాచేసుకున్నావురా మమ్మల్ని వదలిపోవడానికి?" అన్నాడు మానాన్న.

"తనతోవస్తే, నాకేదైనా ఉద్యోగం యిప్పిస్తానన్నాడు నాన్నా వియాండ్రో! ఆయనతో వెళ్ళిపోవాలని ఉందినాకు."

"ఏంఉద్యోగంరా నాయనా అతనిప్పించేదినీకు?"

"ఏదోఒకఉద్యోగం! ఏవాపతుఉద్యోగమో నాకు వివరంగా తెలియదు నాన్నా!"

"అక్కడ ఆ పరాయిదేశంలో నీకు సుఖందక్కుతుందంటావ్రా?" అన్నాడు మానాన్న భయాందోళనలతో.

"ఆఫ్రికాలో సుఖంగా బ్రతకగలననే అనుకుంటున్నాను. లియాండ్రో చూడునాన్నా! ఆ సూట్లతో, ఆ గౌనుతో, ఆ పెద్దపెద్ద బూట్లతో యెంత దర్జాగాఉన్నాడో! ఆయ నెంతడబ్బు సంపాదించుకుంటున్నాడో తెలుసా? ఆయన ముఖంచూస్తే, సుఖంగాఉన్నట్లు కనిపించడంలా?"

ఫ్రాన్సిస్ మెత్తనివాడు, సున్నితమైనమనస్సువాడిది. లియాండ్రో మాటలతీరు, అతని నడతా, అతని దర్పం డాబూచూసి భ్రమపడిపోయాడు ఫ్రాన్సిస్. ఆఫ్రికానుంచి లియాండ్రో తీసుకొచ్చిన రైఫిల్ చూసి మావాడు బహు మెచ్చుకొనేవాడు; కనిపించిన ప్రతివాడియెదుట ఆఫ్రికాలో అడివిజంతువుల్ని యెన్నో కాల్చి చంపానని లియాండ్రో బడాయిలు కొడుతుండేవాడు. మాగ్రామంలోగూడా చాలామందికి మామూలు తుపాకులున్నాయి. కోళ్ళనూ, పందిపిల్లలనూ ఫలహారం చేయడానికొచ్చే నక్కలను యీతుపాకుల్తో కాల్చి చంపుతుండేవాళ్ళు. శీతాకాలంలో అప్పుడప్పుడూ చెరువుల్లో ప్రత్యక్షమయ్యే అడివిబాతుల్నిగూడా వేటాడేవాళ్ళీతుపాకుల్తో. లియాండ్రోతెచ్చిన రైఫిల్ను వాళ్ళెప్పుడూ కళ్ళతో చూసైనాయెరుగరు. ఆ రైఫిల్నుచూచి మావూరివాళ్లు భయ సంభ్రమాలు ప్రకటించారు.

అలాంటి రైఫిల్ను తానుకూడా ధరించాలనీ, ఒకటి స్వయంగా సంపాదించుకోవాలనిగూడా ఫ్రాన్సిస్కు మనసుకల్గించి. ఆఫ్రికాకు

పోతేగాని అలాంటిరైఫిల్ సంపాదించుకొనే అవకాశం కలగదను కొన్నాడువాడు.

“ఆఫ్రికాకు పోయితీరాలని నాకు పట్టుదలగా ఉన్నదినాన్నా! దయచేసి నన్ను పోనివ్వవూ?” అంటూ బ్రతిమిలాడాడు మానాన్నను.

“నీవన్నట్లే లియాండ్రో అంత దర్జాపురుషుడే అనుకో! ధనవం తుడే కావచ్చుగూడా! అబ్బాయ్. నీవొకసంగతి మాత్రం జ్ఞాపకం ఉంచుకో! ఒక్క డబ్బునుబట్టీ, దర్జానుబట్టి మానవునికి సుఖంచేకూర దురా! సర్వసంపదలతో తులతూగేవాళ్ళ నెందర్ని చూడ్డంలేదు మనం! అంతమాత్రాన్నే వాళ్లు సుఖంగా బతుకుతున్నారనుకున్నావా?”

“అయితే నేనుమాత్రం వ్యవసాయం చేసుకుంటూ సుఖపడ్డాను నాన్నా!” అన్నాడు ఫ్రాన్సిస్కో దృఢనిశ్చయంతో. “నేను వ్యవసా యంలో దిగినప్పటినుంచీ, నామీదెవరికీ గౌరవం ఉన్నట్లు కన్పించదు. అటుచూడునాన్నా! ఆ లియాండ్రోమీద మనవూరిరైతుల కెంతఆదరాభి మానాలో! ఎంత గౌరవమో!”

మానాన్న ఒకనిమిషం ఆలోచించి, మెల్లగా, “అవునురా అబ్బాయ్! నీభావం నే నర్థంచేసుకొన్నాను; గోవాలో పొలాలున్న ప్రతి రైతుకుర్రాడు ఒకరికింద ఊడిగంచేసుకునైనా బ్రతుకుతానం టాడుగాని, సొంతపొలంలో కష్టపడి పనిచేసి సుఖమైన స్వతంత్రజీవ నం చేద్దామని కలలోగూడా అనుకోడు. ఈ దానిసత్వం ధరించలేం! ఈ అధమస్థపుబ్రతుకు బతకడం యెంతఘోరం! దేశదేశాలుతిరిగి పీత బొక్కల్లాంటి అద్దెకొంపలలోపడి అలమటించటానికైనా అంగీకరిస్తారు! నాగలిపట్టి కొండ్రయింత దున్నుకొని, కలో అంబలో తాగుతూ యింటి పట్టున ఉండి సుఖమైన స్వతంత్రజీవనం చేయడానికి మనసొప్ప దీకారుకుర్రాళ్ళకు!” అన్నాడు ఆవేదనతో మానాన్న.

"ఆఫ్రికాకు పంపుతావానాన్నా? పంపుతాననూమరి!" అన్నాడు ఫ్రాన్సిస్కో ఆతురతతో. మానాన్న తప్పకుండా పంపుతాడనే వాడి ఆశ.

"నిన్నాపడానికి నేనెవరినిరా? కొడుకుల మనస్సుకు తోచినపనులు చేసుకోకుండా ఆటంకపరచడానికి కీరోజుల్లో యేతండ్రికి హక్కులేదు! మంచికో, చెడుకో కొడుకులీస్వాతంత్ర్యం సంపాదించుకున్నారు! దానికే వాళ్లు గర్విస్తున్నారుగూడా. నీవు నిజంగా ఆఫ్రికాలో సుఖపడగలనని నమ్మకముంటే, నీవు వెళ్ళడానికభ్యంతరం చెప్పను. ఇక్కడ నీకు సుఖంలేదని నీమనస్సుకు నిజంగాతోస్తే, నీయిష్టంవచ్చినచోటికి పోవ డానికి నీకు సంపూర్ణస్వేచ్ఛ ఉంది. ఎక్కడికివెళ్లి సుఖపడదలచుకున్నా నీతలిదండ్రుల ఆశీర్వాదాలు యెప్పుడూవుంటాయినీకు. నేను కోరేదల్లా ఒక్కటే. ఈ విశాలప్రపంచంలో నీవు యేమారుమూలకు పోదలచు కుంటే అక్కడికిపో. ఎక్కడికిపోయినా, నీవు నీతిగా, మర్యాదగా, సుఖంగా బ్రతకాలినాయనా! అదే మేమాశించేది!" అన్నాడుమానాన్న.

అప్పుడే రూత్‌గదిలోకి వచ్చింది, సంభాషణ శ్రద్ధగా ఆలో చించి అది చెప్పదలచుకున్న రెండుముక్కలుగూడా చెప్పివేసింది. "నాన్నా! కూలీలాగా పొలందున్నుకు బ్రతుకుతుంటే, గౌరవమేమైనా ఉంటుందీచెప్పు" సమాధానంగూడా అదేచెప్పుకుంది. "ఏమీగౌరవము ఉండదు! ఏమీ మర్యాదఉండదు. లియాండ్రోకు వచ్చిన పెండ్లి సంబం ధాలు యెలాంటివో తెలుసానీకు?"

"తెలియదమ్మా! నాకుతెలియదు. ఎటువంటి సంబంధాలు వచ్చా యేమిటి?" అన్నాడు అర్థంకానట్టుగా మానాన్న.

"గోవామొత్తంమీద అతనికి ముఫ్ఫయి సంబంధాలకుపైగా వచ్చా యట. అయితే పదివేలరూపాయలకు తక్కువతెచ్చేపిల్లను చేసుకోవమని వాళ్ల అమ్మ అంటున్నది" అన్నదిరూత్.

మా అమ్మ పుట్టింటివాళ్లకుటుంబం ఘరానాకుటుంబం. వాళ్లూ పెద్ద భూస్వాములే. అలాంటియింట్లో పుట్టిన మాఅమ్మకు పుట్టింటి వాళ్ల దర్జా నిలపెట్టాలని ఉంటుంది సహజంగా. స్వయంగా పొలంలో పండించి పనిచేసుకొనడమంటే ఆమెకుచిన్నతనం-అవమానంగాతోచేది. మాఅమ్మ పుట్టింటివాళ్లూ మా నాన్నకన్నా యెన్నోరెట్లు ధనవంతులు. మానాన్న పారా, పలుగూ పట్టుకొని పనిచేస్తుంటే మా అమ్మకు సుతరామూ యిష్ట ముండేదికాదు. వొళ్ళు వంచి మానాన్నమట్టిపని చేస్తుంటే, మాఅమ్మకు తల తీసేసి నట్లుండేది; అవమానం భరించలేక పోయేది. ఫ్రాన్సిస్కో గూడా మొట్టమొదట్లో మానాన్నతో కలిసి పొలంపనికి వెళ్లినప్పుడు, మా అమ్మకుభరించలేనంతబాధవేసింది. పైకిచెప్పేదికాదుకాని లోలోపల కుళ్లి పోతుండేది. ఎలా అయితేనేం చివరకు ఆఫ్రికా వెళ్ళిపోవడానికి మా నాన్నవద్దనుంచి అనుమతిసంపాదించు కున్నాడు ఫ్రాన్సిస్కో. మాఅమ్మ సంతోషంతోపొంగిపోయింది. వాడి ప్రయాణానికవసరమైన అన్ని యే ర్పాట్లు హుషారుగా చేసిందామె. తీరా ప్రయాణ ముహూర్తం సమీపించ గానే, దిగులుతో దిగజారిపోయింది. అసలు ప్రయాణం మానుకుంటేనే బాగుండుననిపించింది. మా అమ్మకు.

"పిల్లలంతా యెవరిదారిన వాళ్ళు యిల్లువదలి పోతూంటే, ఒంట రిగా ఉండలేక పోతున్నానండీ!" అన్నది మాఅమ్మ నాన్నతో. ఆ నాడే మావాడి అఫ్రికాప్రయాణం. "ఎందరో బిడ్డలు పుట్టారు! ఎందుకా యింత సంతానం యిచ్చాడు భగవంతుడు అనుకునేదాన్ని అప్పుడు. తీరా యీనాడు చెట్టుకొకడూ పుట్టకొకడై పోతూంటే, యింకాపిల్లలుంటే బాగుండునే! కొందరైనా నన్నుకనిపెట్టుకుని యింటిదగ్గరే వుండే వాళ్లనిపిస్తున్నదిప్పుడు" అన్నది మా అమ్మ దిగులుతో.

"ఈ పోర్చుగీసు దుర్మార్గులు మన గోవాకేమాత్రమైనా మేలు చేసిఉంటే, మన బిడ్డలీనాడు దేశాలుపట్టి పోవలసిన దుర్గతి యెందు

కుపట్టేది? ఈ పోర్చుగీసు కిరాతకులెగనుక..............." అన్నాడు ద్వేషంతో మా నాన్న.

"పొదురూ! మీరూ మీపోర్చుగీసు వాళ్లనూ!" అన్నది వెంటనే మా అమ్మ. "నేనేంచేసేది చెప్పండి! వాళ్లబతుకు వాళ్లు సుఖంగా బతకడానికి పోతూంటే! ఈ పుత్రవియోగం యెలాభరించాలో నాకర్థంకావడం లేదు!"

మా అమ్మ కళ్లవెంట నీళ్ళుకారడం చూశాడు మానాన్న. ఆమె దుఃఖం పోయేట్టుగా ఊరట కల్గించాలనుకున్నాడు. "పిల్లలందరూ దేశాల పాలైపోయినతర్వాత నా మీదనీకుప్రేమ యెక్కువై ఆదిగులు మాసిపోతుందిలే! నేనునీసరసన ఉన్నంతవరకూ నీవు వాళ్లను తలచనైనాతలచవు! ప్రణయకలాంపంలో కొత్తకొత్త చిట్కాలు. కొత్తకొత్త తమాషాలు నేర్చుకో బోతున్నాను తెలుసా నీకు! వాటిని తీరా అమల్లో పెట్టేసరికల్లా అసలు నీవు పిల్లలధోరణే మరచి పోతావు! ఏమంటావ్? పిల్లలపైనీకున్న ప్రేమంతా ఆనాడు నామీద ఒలికిస్తావు కాబోలు!" అన్నాడు మానాన్న పరిహాసంగా.

సరదాలూ, హాస్యాలూ మాఅమ్మకు సరిపడవు. మా నాన్న ఊరడింపు మాఅమ్మ కేంపనిచేయాలా. ఆమె హృద యావేదన యేమీ తగ్గలేదు.

నవంబరునెల్లో ఒకనాటిసాయంకాలం మధురమైన సువాసనలు విరజిమ్ముతూ పిల్లవాయువులు వీస్తున్నాయి. ఆ సాయంత్రమె ఫ్రాన్సిస్కో ప్రయాణమై వెళ్ళిపోయాడు. వాడు మార్ము గోవాలో స్టీమరెక్కి పోవాల్సివుంది. వాడితో మానాన్న, మేరియా, రూత్, లక్ష్మి. తోడు పోయారు. మార్ము గోవా వరకు ఫ్రాన్సిస్కో స్నేహితులుగూడా కొంత రెళ్ళారు. స్టీమరంటే యెరగని వీళ్ళకది మంచి అవకాశం చిక్కింది.

ఫ్రాన్సిస్కోకు వీడ్కోలిస్తున్న మా అమ్మకు స్వగృహతప్పినంత పనైంది. ఒక్కసారిగా దుఃఖం ముంచుకొనివచ్చి బావురుమని యేడ్చింది! ఫ్రాన్సిస్కోను కరచుకుని కదలనివ్వలా అక్కణుంచి. మానాన్న కలుగజేసుకుని మా అమ్మని ఊరడించడం మొదలెట్టాడు. ఆలస్యం యేమాత్రం చేసినా, స్టీమరు బయల్దేరే వేళమించిపోతుంది. ప్రళయంమీద యెలాగైతేనేం చివరకు మాఅమ్మ వాడిని వదిలిపెట్టింది. ఆమె హృదయంలో కత్తులుపెట్టిపొడిచినట్లుంది ఆమె ఆవేదన.

మాతృప్రేమ యెంత గాఢమైనది! సంవత్సరానికోసారి కొడుకో కూతురో స్వగృహాన్ని విడచిపోతుంటే, తల్లి అనుభవించే హృదయావేదన, పొంగి పొరలివచ్చే దుఃఖపరంపర యెవరు వర్ణించగలరు ? ప్రపంచంలో యెందరుబిడ్డలు మాతృదుఃఖాన్ని అర్థంచేసుకుని, ఆమెను సుఖపెట్టగలరు?

ఫ్రాన్సిస్కో యెడబాటుగూడా మాకెంతో విషాదం కల్గించింది. ఇక మిగిలిందల్లా నేనూ, మా అమ్మ మాత్రమే ఆనావింట్లో. మేమిద్దరం వరండాలోకూర్చుని ఉండగానే అంధకారం ఆవరించింది.

"అమ్మా! నిన్నువదలి నేనెక్కడకూపోనే నిజంగా! ముమ్మాటికీ యీఘిల్లువదలి యెక్కడకిపోనే అమ్మా! నామాటనమ్మ!" అన్నాను మనసారా మా అమ్మతో.

"నీమాటలు ఆశ్చర్యంవేస్తున్నాయి! నీవలా అంటున్నావుగాని, యేనాడో ఒకనాడు నీవుగూడా నన్నువదలి వెళ్ళిపోతావు. అప్పుడు నేను పూర్తిగా వంటరిదాన్నైపోతా" అంటూ బిక్కమొహంపెట్టి దుఃఖించింది. నేనూ ఆమెమొహం చూశ్శేక నాలుగు కన్నీళ్ళు రాల్చాను.

"లేదులేదమ్మా! నిన్నెప్పుడూ విడిచి వెళ్ళనని ప్రమాణంగూడా చేస్తున్నా" అన్నాను గట్టిగా ధైర్యంచెబుతూ. "నాన్న నన్నుహైస్కూలుకు పంపదలచినా, నేనువెళ్ళనమ్మా! వెళ్ళనంటేవెళ్ళను! నిన్ను విడిచి క్షణం ఉండలేనే!"

"నిజంగానా నాన్నా! మనస్సులోమాటే పైకి చెబుతున్నావుగదా! అయితే నీమాట మీనాన్న విననేవినడు. నీవు పోర్చుగీసో, యింగ్లీషో చక్కగా చదువుకోవాలని ఆయన ఆశగూడా! అందుకే నీమాటఆయన వినడని చెప్పేది!" అన్నది మాఅమ్మ.

"నాకు తెలుసునమ్మా ఆసంగతి! నేనిక్కడే ఉండిపోయి నాన్న పొలంపనులలో సహాయపడతానని గట్టిగా చెబుతా ఆయనతో. ఈ మాటంటే, ఆయన నన్ను వదలిపెట్టి ఉండడు!" అన్నాను,

"అయితే నీవు యే బొంబాయికో, మరో పెద్ద పట్టణానికోపోయి యెందుకు చదువుకోవు నాయనా? ఈ పాడు పల్లెటూరుకన్నా అవి స్త్రీలు అందంగా ఉంటాయిగదా!"

"కాదమ్మా! మనవూరుకన్నా మంచివూరు మరెక్కడాలేదు! నేను చెబుతున్నా గట్టిగానమ్మా! నిన్నూ, నాన్ననూ, మనవూరునూ, యింతగా ప్రేమిస్తుంటే, మిమ్మల్నివిడచి యెలావెళ్ళగలనుచెప్పమ్మా! ఎన్నటికి వెళ్లలేను, వెళ్ళను!"

"నీవు తమాషా పిల్లాడివిలాగున్నావురా? - తక్కిన పిల్లలమాదిరి కాదేనీసంగతి!" అంటూ దీర్ఘమైన నిట్టూర్పు విడిచిందమ్మ.

మాఅమ్మ కుర్చీలోంచి లేచి నాదగ్గరకువచ్చింది. ఆప్యాయంగా నా వెంట్రుకల్ని తనచేతులతో నిమిరింది. నా నొసలు ముద్దుపెట్టుకుంది తర్వాత. నా పసితనంలో మాఅమ్మ యిలాచేసినట్లు నాకుగుర్తు. లోపలికిపోయి దీపం వెలిగించింది. ఇంతగాప్రేమిస్తున్న నాయింటినీ నాతల్లినీ, నాతండ్రినీ విడిచి యెక్కడకూపోనని నాలోనేను ప్రమాణం చేసుకున్నాను.

## రెండవ భాగము

ఆ రోజున కోడెల పందెం. పందలాదిగా కోడెదూడలు పందెంలో పాల్గొనడానికి ప్రయాణమై పోయాయి, పందెం పూర్తయింది. దూడలన్నీ మైదానం మీదుగుండా పడి యిండ్లకు చేరుకుంటున్నాయి. వాటితొక్కిడికి మైదానంలోని దుమ్మంతా ఉవ్వెత్తుగా లేచి చలికాలప్ర మంచును జ్ఞప్తికి తెచ్చింది. గ్రామమూ, గ్రామపరిసరాలూ దుమ్ము మయమై పోయాయి. కాసేపటివరకూ సూర్యబింబంగూడా కానరానంత పట్టంగా లేచింది దుమ్ము. సాయంకాలం సమీపిస్తున్నా యెండ తీవ్రత తగ్గుముఖం పట్టలేదు.

మేనెల. వూరంతా వుత్సాహంగా కన్పిస్తున్నది. బొంబాయి. యితర ప్రదేశాలనుంచి సెలవులకు చాలామంది యిండ్లకు వచ్చారు. కొంతకాలంపాటు కులాసాగా కాలం వెళ్ళబుచ్చాలని యేటేటా యెండా కాలంలో యిండ్లకు రావడం అలవాటు. ఆరోజు పెద్దలంతా కలిసి కోడె దూడల పందెం గూడా యేర్పాటు చేశారు. ఆ పందెం చాలా గొప్పది. పక్కగ్రామం కోడెకూ, అనస్తాసియో కోడెకూ ఆనాడు జట్టీపడ్డది. పక్కగ్రామం కోడె పొగరుబోతనీ, యెటువంటి కోడెనైనా చీల్చి చెండాదే బలం కలదనీ అంతా చెప్పుకుంటూంటే నేను విన్నాను.

నేనాసాయంత్రం వరండాలో కూర్చొని పందేనికి వెళ్ళి తిరిగి వచ్చే జనాన్ని చూస్తున్నాను. వాళ్ళ మొహాలు సంతోషంతో కళ కళ్లాడు తున్నాయి. వాళ్ళ జుట్టంతా గాలికి రేగి చిక్కుపడ్డది. ఆరు సంవత్సరాల నాటి సంఘటన చటుక్కున జ్ఞప్తికొచ్చింది. ఆనాడు కొత్తగా పుట్టిన ఆవుదూడను నాకు చూపించమని అనాస్తాసియోను మంకుపట్టు పట్టి వేధించాను; అందమైన ఆ ఆవుదూడ యిప్పటికీ నా కళ్ళల్లో మెదలు తూనే ఉంది.

ఆ పసిదూడ యీ నాడు పందేల్లో పాల్గొనే కోడెగా తయారైంది. యింతలో ఆ నాటి పసిదూడ యీ నాడు యేనుగులా బలిసి భయంక రంగా ఉంది. ఆ నాడు భయంతో బెదిరి బెదిరి చెంగుచెంగున గంతు లేస్తూ ఆడుకునేది. ఈ నాడు తన ప్రత్యర్థిని చంపడానికో, తానే చావ డానికో పందేల్లో ప్రత్యక్షమైంది. ఇంతలో యెన్ని సంవత్సరాలు పరుగెత్తుకు పోయాయి!

సంతోషంలో మనకు తెలియకుండానే కాలం యెలా గడచి పోతుందో పోతుంది. సంవత్సరాలు, దశాబ్దాలూ సునాయాసంగా సాగి పోయినట్లయింది మానవునికి. ఆరోజుల్లో గోవాలో మేమెంతో సుఖ మైన జీవితం గడిపాం. ప్రతిరోజు మా గ్రామంలో యేదో ఒక కొత్త కార్యక్రమంలో నిమగ్నులమై పుష్కలంగా ఆనందం అనుభవించాం. ఒకరోజు నాట్యం, ఒక రోజున పందేలు, మరోరోజు మరొకటి-ఇలా తెలియకుండానే గడచి పోయేవి రోజులూ, మాసాలూ, సంవత్సరాలూ! ఆశ్చర్యం వేస్తుంది మాకు.

ఈ నాడు జరిగిన కోడెల పందెం బ్రహ్మాండమైనది. చివరకు అనస్తాసియో కోడే గెల్చింది పందెంలో.

ఉర్నాడు మేమంతా ఆనందోత్సాహాల మధ్య వనభోజనా లేర్పాటు చేసుకున్నాం.

ఆ రోజున మేమంతా తెల్లవారు ఝామునే నిద్రలేచి, "సిల్వర్ పాండ్" సరస్సువద్ద యేర్పాటు చేయబడ్డ వనభోజనానికి హాజరైనాం. ఆరోజు యెండ తీవ్రంగా నిలపబడి కాస్తున్నది. మేనెల్లో ప్రతి సంవత్సరం మాకది మామూలే. కావలసినంత ఆహారంతో, ఫలహారాలతో, సారాయి బుడ్లతో, "సిల్వర్‌పాండ్" సమీపంలో ఉన్న మర్రి తోపుకు వెళ్ళాం. చల్లని నీడఉన్న ప్రదేశం వెతుక్కొని చాపలు పరుచుకుని కూర్చున్నాం. పేకాట, చదరంగం మొదలైన ఆటలాడుకున్నాం. ఎండ తీవ్రమౌతున్న కొద్దీ, పసిపిల్లలూ, యువకులూ, వయసు మళ్ళినవాళ్ళల్లా అందరూ కలిసి కొలను దిగి యీదులాడడం మొదలెట్టాం. పందేలు గూడా పెట్టుకున్నాం. ఆడపిల్లలందరూ గట్టున నిలబడి మమ్మల్ని చూసి నవ్వడం, కేరింతలు కొట్టడం మొదలెట్టారు. ఈత బాగా కొట్టలేని వాళ్ళను చూసి యెగతాళి చేస్తున్నారు. అలిసిపోగానే చెట్లనీడచేరి ఆకలి దీర్చుకున్నాం. భోజనాలైన తర్వాత చెడుగుడూ, కోతి కొమ్మచ్చులూ కాసేపాడుకొని తర్వాత కూనరాగాలు తీస్తూ పాటలు పాడుకున్నాం. అప్పటికి సూర్యాస్తమయ మైంది. పూర్తిగా అలిసి, గొంతులు బొంగురు పోగొట్టుకొని దీపాలు పెట్టేసరికి యిండ్లకు చేరుకున్నాం.

ఆనాటి వనభోజనం యెంత జల్సాగా ఉన్నదనుకున్నారు! అంత మందీ కలిసి సమిష్టిగా ఆనందిస్తుంటే. మే మానాడు స్వర్గంలో ఉన్నట్లే ఉంది ప్రాణాలకు. వనభోజనాలు అంత త్వరగా అయిపోయాయని విచారం వేసింది. పాలో, నిసియో, లూయీ అనే కుర్రాళ్లు రెండు రోజుల తర్వాత తిరిగి మళ్ళీ బొంబాయి పోవాల్సిఉంది. స్వగ్రామం విడిచి వెళ్ళిపోవడానికి వాళ్ళకు మనస్కరించలేదు. నిత్యకల్యాణం

పచ్చతోరణంగా ఉన్న మాగ్రామాన్ని విడిచి వెళ్ళిపోవడానికెవరికీ బుద్ధిపుట్టదు. యాయీకి రూత్‌మీద మనసు కల్గింది. దాని అంద చందాలు అతన్ని ఆకర్షించాయి; నెలరోజుల్నుంచీ మా రూత్‌ను అతను మెచ్చుకుంటూ, లోలోపల మురుసుకుని సంతోషించడం నేను గమనించాను. ఈ రోజున వంటరిపాటిగా దానితో మాట్లాడి, తన ప్రేమను వెల్లడి చేసుకునే అవకాశం కల్గిందతనికి.

"నిన్నూ, యీ గ్రామాన్ని వదలిపోవడమంటే, నా మనస్సు యెలాగో వుంది రూత్ !" అన్నాడు లూయీ వనభోజనాల్నుంచి తిరిగివస్తూ.

"నన్ను ఒక్కతెనూ విడచిపోవడం అంటేనే నీ కెందుకుండాలి ఆ బాధ ?" అన్నది రూత్ కొంటెతనంగా గొంతు పెద్దది చేసి. తన మాటలు అంతా వినాలనీ, లూయీని అందరూ యేడ్పిస్తుంటే ఆనందిద్దామనీ దాని ఉద్దేశ్యం. "నేను నిన్ను యేంజేశాను ?"

మగకుర్రాడైనా యాయీకి కొంచెంసిగ్గు. మనస్తత్వంలో లూయీకీ, రూత్‌కూ యెక్కడా పోలికే లేదు. తనలాగా గడుసువాడూ, చురుకైనవాడూ కాడని రూత్‌కు తెలుసు. రూత్‌కు నిజంగా మా గ్రామంలో యే కుర్రాడిమీదా ప్రేమ లేదు; దానికెవరూ నచ్చలేదు! ఆటకాయితనంగా మగపిల్లలతో కలిసి ఆడుకుంటూ, అందరినీ వెగ వాళ్ళ పట్టిస్తూ యేడిపించినా, యెవరిపైనా దానికి మనస్సు కలగలేదు. ఏ యువకుడితోనూ హృదయం యిచ్చి సరదాగా మాట్లాడి యెరగదు.

"ఇస్సే ! పెద్దగా మాట్లాడకు రూత్ ! ఎవరైనా వినిపోతారు !" అని లూయీ హెచ్చరిస్తూ, "నేనీపాటికి సంపాదనలో పడివుంటే, నిన్ను పెళ్లాడదలచానని మీ నాన్నను అడిగేవాణ్ణే !" అన్నాడు.

రూత్‌కు చక్కిలి గింత పెట్టినట్లయింది. పెద్దగా నవ్వి. "నన్నా పెండ్లాడేది ? అందచందాలంటే యేమిటో కనిపెట్టలేని రసికుడవు నీవు! నా పాదం చూడు! ఎంతో అందమైందని ఊళ్లో అంతా చెప్పు కుంటారు! కనీసం నా పాదాన్నైనా వరించి ఉండాల్సింది ముందు నీవు!" అన్నది పరిహాసంగా రూత్.

"ఏమిటి రూత్ నీవు! ఎప్పుడూ పరిహాసాలేనా ? ఇంకా చిన్న తనం చేష్టలు పోనిచ్చావు కావు! నా మనోభావాన్ని అర్థం చేసుకో డానికైనా ప్రయత్నించవు నీవు! నీవంటే నాకు పంచప్రాణాలూ లేచి వస్తాయని యిప్పటికైనా గ్రహించవేం ?" అన్నాడు లూయీ.

మేమంతా నవ్వుకుంటూ, పాటలు పాడుకుంటూ చీకట్లో దారి వెంటపడి యిండ్లకు వస్తున్నాం. లూయీ ఒక్కడే తీవ్రంగా, గంభీరంగా ఆలోచిస్తున్నాడు. తనను ప్రేమించమని రూత్‌ను వత్తిడిగూడా చేస్తున్నాడు. మాకు దూరమౌదామని లూయీ ప్రయత్న పూర్వకంగా రూత్‌ను మెల్లగా నడవమంటున్నాడు. లూయీ ప్రేమ కలాపం మా రూత్‌కు వెగటనిపించింది. అయినా అతనితోనే కబుర్లాడుతూ మెల్లగా నడవడాని కంగీకరించింది. అతనిపీడ వదలించుకోవా లనుకుంటే, నాలు గంగల్లో వచ్చి రూత్ మమ్మల్ని కలుసుకునేదే. లూయీతో పరుషంగా మాట్లాడి అతన్ని బెదరగొట్టడం యెందుకనుకుంది.

"కనీసం నన్ను జ్ఞాపకమైనా ఉంచుకుంటావా రూత్ ? వచ్చే యెండాకాలం యింటికి వచ్చినప్పుడైనా నీకు తగినవాణ్ణిగా నన్ను గుర్తిస్తావా ?" అన్నాడు లూయీ-వినయంగా ఆశ ప్రకటిస్తూ.

రూత్ గట్టిగా ఒక్క నిట్టూర్పు విడిచింది.

"కావచ్చు! ఏమో, యెవరుచెప్పగలరు! వయసు వచ్చిన ఆడ పిల్ల జీవితంలో సంవత్సరమంటే దీర్ఘకాలం కిందనే లెక్క. అప్పటికే

నాలో కొంత జ్ఞానం నశించి పోవచ్చు! వివేకం సన్నగిల వచ్చు! చమత్కారపు మాటలు మాయంకావచ్చు! రూపు రేఖలు మాసిపోవచ్చు! నా పళ్ళుగూడ కొన్ని రాలిపోవచ్చు! సంవత్సరంనాటి మాట! ఆనాడసలు పెళ్ళిళ్ళ మార్కెట్లో నాకు గిరాకీ తగ్గలకనే పోవచ్చు గూడా. ఆ పరిస్థితుల్లో నేనే నీకాళ్ళపై బడి నన్ను పెండ్లి చేసుకుంటే తప్ప వేరే గతి లేదని ప్రాధేయపడతానేమో! అందుకని ఆశలు పోగొట్టుకోకు. ఆశే మానవుడికి ప్రాణం. తిరిగి సంవత్సరం వచ్చేవరకు ఓపికపట్టి ఉండు! అంతేనా ?'' అన్నది రూత్.

లూయీ ఒకటిరెండు నిముషాలు మౌనం వహించి తిరిగి మెల్లగా, "నేను రేపోమాపో వెళ్ళిపోతున్నాను. నీకు నేను జ్ఞాపకం ఉండేందుకు ఒక్కసారి ముద్దయినా పెట్టు కోనిస్తావా ?"

"ఒకసారి ముద్దా!'' అని రూత్ పెద్దకేక వేసి పకపకానవ్వింది. ముందున్న వాళ్ళను చేరుకోడానికి అంగలు పెద్దవి చేసి చరచరా నడక సాగించింది. ''ఒక్కముద్దా! వద్దుబాబూ! ఒక్కసారి నన్ను ముద్దు పెట్టుకుంటే, దానిరుచి మరిచి పోవు మరి! నన్నూ, నాముద్దులూ మరిగి యీ వూరినుంచి కదలనే కదలవు తెలిసిందా! ఆపనే నిన్ను చేయవద్దని కోరిందిగూడా!"

పొలాలన్నీ దాటివచ్చాం. ఊరు దాదాపు సమీపించాం. ఎవరి దోవన వాళ్లు వాళ్ళ యిళ్ళకు చేరుకోవడం సాగించారు.

వనభోజనాలెంతో సరదాగా ఉన్నాయి. ఆ నాటి ప్రకృతి సౌందర్యం గూడా రమణీయంగా ఉంది. మా జీవితంలో ఆరోజు జ్ఞాపక ముంచు కోదగిన సంఘటన. మానవుని సుఖదుఃఖాల కతీతమైన ప్రకృతి మాత యెంత ఉపేక్షా భావంతో ఉంటుందో తలుచుకుంటే చిత్రంగా ఉంటుంది.

మానవులు పుడుతూనే ఉన్నారు; మరణిస్తూనే ఉన్నారు. సుఖదుఃఖా లనుభవిస్తున్నారు. వేరువేరు దశల్లో చిత్రవిచిత్రమైన అనుభూతులను పొందుతున్నారు. జీవితంలో యిన్ని పరిణామాలు జరుగుతున్నా, సూర్యభగవానుడు గతులు తప్పకుండా ప్రకాశిస్తునే ఉన్నాడు. తనదివ్య తేజస్సును జీవకోటిమీద ప్రసరింప జేస్తూనే ఉన్నాడు. మానవ హృద యాలు నిస్పృహతో. నిరాశతో దుఃఖ భాజనమైన జీవితం వెళ్ళదీస్తున్నా నక్షత్రరాసులు మిణుకుమిణుకు లాడుతూ ప్రకాశిస్తునే ఉన్నాయి. ప్రకృతి తన పవిత్ర కర్తవ్యాన్ని ఎలా వదులుకుంటుంది ?

దిరిసెనచెట్లూ, బంతిచెట్లూ, లిలీచెట్లు విరియబూచి కన్నుల పండుగ్గా ఉన్నాయి. రకరకాలైనా ఫల వృక్షాలు యీ సంవత్సరం విరియపండి పిల్లలు, పెద్దల నోళ్లూరిస్తున్నాయి. మా ఆనందానికి అంతులేకుండా ఉంది. మా కేవిధమైన అంతరాయం రాకుండా రక్షించమని భగ వంతుణ్ణి ప్రార్థించుకున్నాం. ఇంతలో పోర్చుగల్‌లో భయంకరమైన సంఘటనలు జరిగి, మా స్వాతంత్ర్యానికీ, మా సర్వస్వానికీ ప్రమాదం వాటిల్లే దుర్భర నీచస్థితి మాకు పట్టబోతున్నదని ఎవ రూహించ గలుగు తారు ? ఆనాడు మా గ్రామంలో ఆనందుత్సాహా లెలా నాట్యమాడాయో! ప్రతివాని పెదవులమీదా చిరునవ్వులెలా తొలకరించాయో! ఆనాడు కురిసిన వర్షపు జల్లుకు మా రైతులెంత ఉప్పొంగిపోయారో! విత్తనా లెదపెట్టుకోడాని కెంత ఆతురత చూపించారో! జరిగిపోయినవన్నీ మంచి రోజులే అంటారు పెద్దలు।

1926 మే 28 వ తేదీ! ఎంత సంతోషకరమైన రోజది! మా గోవాకు దుర్భర దాస్యం, భరించలేని క్షుద్బాధలను ఆహ్వానించి, స్వాగతమివ్వబోతున్న దుర్దినంగూడా అదే.

ఆ మరు రోజే పోర్చుగల్‌లో సైనిక విప్లవం తల యెత్తిందని విన్నాం. అడ్మిరల్ మెయిర్‌లెస్ సహాయంతో, డికొస్టా నాయకత్వాన సైన్యం తిరుగుబాటు చేసి ప్రభుత్వాన్ని కూలదోసి, అధికారం హస్త గతం చేసుకున్నదట. మరునా డింతకన్న యెక్కువ సమాచారం మా చెవిన బడలేదు. ఈ సంఘటన ఫలితంగా, నిరంకుశ దాస్యాన్నీ, ఘోరావమానాన్నీ గోవా ప్రజలు త్వరలో భరించాల్సి వస్తుందని మా నాన్న ముందే జోశ్యం చెప్పాడు. ఈ దుస్సంఘటన విన్న తర్వాత ఆయన మనస్సు పరిపరివిధాల పోయింది. గాఢ విచారంలో మునిగి పోయాడు మా నాన్న.

మా నాన్న దుఃఖావేశంతో ఆక్రోశిస్తూ "మనకు రోజులు సమీపించినట్లు తోస్తున్నది. మిగిలిన యీకొస్తాగూడా యీ కిరాతకులు మన ప్రజలకు దక్కనివ్వరు!" అన్నాడు.

చీకటి పడ్డది. ఉద్రేకంతో మా నాన్న చిరచిరలాడుతున్నాడు. ఆయన మనస్సులోని బాధలన్నీ వెళ్లబోసుకుంటున్నాడు. మా అమ్మ మా నాన్న దగ్గరకు వచ్చి, "అనవసరంగా మనస్సు పాడుచేసుకుని పిచ్చెత్తి పోతున్నారు! మీరే కాకుండా మీతోపాటు పిల్లలతోసహా యింటిల్లిపాదికీ వెర్రెత్తిస్తున్నారు—చూడండి, మీ మూలాన మేమెలా అయిపోయామో! అస్తమానం మీకెందు కా పోర్చుగీసు చచ్చినవాళ్ళ గొడవ చెప్పండి! మీరిప్పుడు రైతులుగదా! పొలాల పన్లు చేసుకుంటూ సుఖంగా కాలక్షేపం చేసుకోగూడదూ! పోర్చుగీసు వాళ్లెవరో పొడిచి చంపుతారని మహా బాధ పడతారేం!" అన్నది.

"పోర్చుగల్‌లో జరిగిన యీ ఘోర సంఘటన మన గోవా ప్రజలందరికీ భయంకరమైన ఒక అపశకునం! నా మాట ముమ్మాటికీ నమ్ము!" అన్నాడు మా నాన్న దీర్ఘమైన ఆలోచనతో; "సైనిక తిరుగు

వాటులోని అంతర్యం, దాని దుష్ఫలితాలూ నీకు తెలుసా? తక్షణం పోర్చుగల్‌లో వ్యక్తిగత నియంతృత్వ పరిపాలన తల యెత్తింవన్న మాట. ఈ నియంతృత్వ పాలన మానవ నాగరికతనూ, మానవ స్వాతంత్ర్యాన్నీ మట్టుపెట్టి తీరుతుంది. నేను చెప్పేమాటలు అక్షరాలా నిజం! చారిత్రక సత్యం యిది!"

మా నాన్న రాజకీయ పదప్రయోగాలు మా అమ్మకు అయోమయంగా కన్పించాయి. ఒక్క ముక్కగూడా అర్థం కాలే దామెకు. ఆదేపనిగా నిర్ఘాంతపోయి చూడసాగింది మా నాన్న వంక.

"చూడండి టాబ్! పోర్చుగల్‌లో రాజరికం ఉన్నన్నాళ్లూ మీరు దాన్ని విమర్శించారు. ప్రజా ప్రభుత్వంలోగూడా మీరు తృప్తిపడక దాన్నీ విమర్శించారు. ఇప్పుడు రాబోతున్న కొత్త పరిపాలన గురించి యిప్పట్నుంచీ ఆందోళన పడుతున్నారు! మీరు యెలాంటి ప్రభుత్వం కావాలో, యే రోజున మీకు సంపూర్ణమైన తృప్తి కలుగుతుందో, యేనాడు మీ మనస్సు శాంతిస్తుందో యింతవరకు మాకర్థం కావడం లేదు" అన్నది మా అమ్మ.

మా నాన్న మామూలు పడకకుర్చీలోనే కూర్చున్నాడు. గడ్డాన్ని చేతి వేళ్ళతో అదే పనిగా కొట్టుకుంటున్నాడు యేదో ఆలోచిస్తూ. నొసలు పైన నాగటి చాళ్ళలా దీర్ఘాలోచన సూచిస్తూ లోతైన గీత లేర్పడ్డాయి. అసమానం ఆయన పెదవులపై నాట్యమాడే చిరునవ్వు మాయమైంది. ఆయన ముఖాకృతిలో నిరాశ విషాదం ద్యోతక మౌతున్నది. చాలా సేపటివరకూ గంభీరంగా ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయాడు. మా అమ్మ ఆయన పక్కనే కూర్చుని బెడ్‌కవరు మీద రంగు దారాలతో అల్లుతూంది.

"నా కెలాంటి ప్రభుత్వం కావాలో చెప్పమంటావా? విను చెబుతాను" అంటూ మా అమ్మ మొహంలో తేరిపార చూశాడు మా నాన్న.

ఆయన మాటకూ మాటకూ మధ్య వ్యవధియిస్తూ ఆవేదనతో మాట్లాడాడు. "మన తాత ముత్తాతల కాలంనుంచీ నాగరికతతో, సమస్త సంపదలతో తులతూగిన మనదేశాన్ని పోర్చుగీస్ నరహంతకులు తక్షణం విడిచి పోవాలనీ, మనగోవా ప్రజలే మన యిష్టంవచ్చిన విధంగా మనదేశాన్ని పరిపాలించు కోవాలనీ నేను కోరేది! తెలిసిందా?"

"అంటే నాకర్థంకాలేదు పూర్తిగా!" అన్నది మా అమ్మ.

"అంటే అర్థంయిది. పోర్చుగీసువాళ్లు మనగతికి మనల్ని విడిచి పెట్టి. వాళ్ళ దేశానికో, లేకపోతే బంగాళా ఖాతంలోకో మూటముల్లె కట్టుకొని పోవాలని కోరుకొంటున్నాను. అదీ కావలసింది నాకీనాడు! దురదృష్ట వశాత్తు నేను చచ్చేవరకూ ఆ కిరాతకు లిక్కడ తిష్టవేసు క్కూర్చుంటే. అప్పటివరకూ గూడా నా కోరికా, ఆశయం యిదొక్కటే" అన్నాడు తీవ్రమైన ఆవేదనతో.

నిరసన భావంతో మా అమ్మ "ఎంత ఆశండీ మీకు! గోవా ప్రజలు వాళ్ళ ప్రభుత్వం వాళ్ళు పాలించుకోడమా! ప్ప! అలాంటి స్వపరిపాలనలో మీరేఉద్యోగం చేస్తారు చెప్పండి? ఓహో! గవర్నరు గిరి కాబోలు! హహ్హహ!!"

వీధిబయట అంధకారం గ్రామాన్ని పెనవేసుకు పోయింది. పరిసర ప్రదేశమంతా బావురుమన్నట్లు భయంకరంగా ఉంది. మా నాన్న చీకట్లోకి తేరిపార జూశాడు. కాని ఒకమాట గూడా మాట్లాడలేదు.

"గోవా ప్రజలు తమలో తాము కీచులాడుకోడం చూడడంలా మనం? ఇది చాలాదూ మన ప్రతాపం చాటుకోడానికి! గోవా ప్రజలు రాజ్యమేలుకుంటారాట! రాజ్యం! ఎలాంటి రాజ్యమండీ గోవనులేరే రాజ్యం! రాక్షస రాజ్యం కాదుగద!" అన్నది మా అమ్మ యెత్తి పొడుస్తూ.

"నీకు బుద్ధీ, జ్ఞానం కొంచెమైనా లేదు! గోవనులు తమలో తాము కీచులాడుకుంటున్నారంటే, అది పోర్చుగీసువాళ్లు పెట్టినబిక్షే! మనం శాశ్వతంగా అలా పోట్లాడుకోవాలనే వాళ్ళకోరికగూడా. బుద్ధి, పూర్వకంగా అలాంటి కీచులాటలు సృష్టించేదిగూడా వాళ్ళే. ఇదంతా వాళ్ళకుట్ర! సామ్రాజ్య వాదుల "విభజించి పాలించే" సూత్రం అది. ఈ సూత్రం ప్రకారమే తూ. చ. తప్పకుండా వాళ్లు నడుస్తారు. మనల్ని క్రైస్తవులుగా మార్చితే మార్చారేమో గాక! లేకపోతే, యిన్నికులాలూ, యిన్నితెగలూ సృష్టించడం. పెంచి పోషించడం యెందుకు - మనలో మనకు తగాదాలు పెట్టే దుర్బుద్ధే లేకపోతే. వాళ్ళ కుటిల నాటకం కనిపెట్టలేదా నీవు?" అన్నాడు మా నాన్న కోపంతో.

"మళ్ళీ మీ ప్రమాణాలూ, మీశపథాలూ తయారు! మీ వాదనలో పడలేనప్పుడు, నీళ్లు కారిపోతున్నప్పుడు, ప్రమాణాలు చేయడం ప్రారంభిస్తారు మీరు! గోవన్లు వాళ్ళ పరిపాలన వాళ్లు చేసుకోడమా! ఎవరైనా నవ్విపోతారు ఊరుకోండి! ప్చ! వాళ్ళ పెళ్ళాలతోనే వాదించ డానికి దమ్ములు లేనప్పుడు స్వపరిపాలనా! ఎంతో హాస్యాస్పదమండీ!"

మా నాన్నలేచి అమ్మవద్దకుపోయి ఆమె తలముద్దు పెట్టుకున్నాడు.

"ఉద్రేకంతో ఒళ్ళుతెలియక మిగల మాట్లాడానేమో క్షమించు!" అన్నాడు మానాన్న. మళ్ళీతన కుర్చీలో కూర్చుని, "మీకు చెబు తున్నా వినండి! మన గోవన్ల మధ్యనేవాదు భేదాభిప్రాయాలున్నది! ప్రతిజాతిలోనూ, ప్రతిదేశములోనూ చిల్లరవిషయాలపైన కొన్ని అంత రంగిక భేదాభిప్రాయాలుండడం సహజం. అంతమాత్రాన పౌరుషం, ఆత్మగౌరవం, జాతీయాభిమానంగల యేప్రజలూ, పరపరిపాలన సహిం చరు; సహించగూడదు. శాశ్విత దాశ్యశృంఖలాల్లో పడిఉండరు; ఉండ గూడదు!"

"ఓరి భగవంతుడా మళ్ళీమీరూ, మీదాస్యశృంఖలాలు తయారు! ఎప్పుడూ యిదేపాటామీకు! ఏమిటి మీబాధ చెప్పండి! మీకేమైనా మతి పోయిందా లేక చిత్తచాపల్యం కలిగిందా?" అన్నది మాఅమ్మ.

మళ్ళీ మానాన్న కాసేపు మౌనంవహించి, "నాకు బాధగానే ఉంది! నిజంగా ముమ్మాటికీ బాధగానే ఉంది! అయితే శారీరక సంబంధమైన బాధకాదది! మానసిక సంబంధమైన ఆవేదన అది. మన ప్రజలు— స్త్రీలూ, పురుషులు, బిడ్డలూ — తినటానికి పట్టెడన్నం లేక బక్కచిక్కి, ఆత్మాభిమానం, ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసం నశించి, రాజకీయచైతన్యం మొదలేపోయి, జీవచ్ఛవాల్లాగా పడిఉంటే చూచి భరించలేని బాధ నాబాధ! ఈపోర్చుగీస్ కిరాతకులు మన మాతృభూమిని నాలుగువందల ఏండ్లకుపైగా ఏలుతూ సమస్తసంపదయూ కొల్లగొట్టుకుని పోతున్నారు. మనమేంచేస్తున్నాం కొల్లగొడుతుంటే? కండ్లప్పగించి చూస్తూ ఊరకున్నాం జవసత్వాలుడిగి! మన కీ పోర్చుగీసు హంతకులు చేసిన మేలొక్కటైనా ఉందా? ఒక్కటీలేదు. వందల సంవత్సరాలు పరాయివాళ్ళు మనదేశంలో పరిపాలన సాగిస్తున్నారంటే, కనీసం వీసమంత మేలైనా చేసి వాళ్ళ ఉనికిని సమర్థించుకోవాలి. అలాంటిదేదీలేదు. అందుకే వాళ్ళు మూటాముల్లె కట్టుకుని శీఘ్రంగా కాలికి బుద్ధిచెప్పేట్లు చేయాలి."

మా అమ్మ మా నాన్నవంక వెక్కిరింపుగా చూసి, "మీ కసలు జబ్బు మూలంలోనే ఉన్నట్లుంది. ఏమిటో నాకు బోధపడటం లేదు. మీకు సంధించే లక్షణాలు గూడా కన్పిస్తున్నాయి. కాస్తంత సేపు మీ ప్రమాణలూ, మీశపథాలూ, మీశాపనార్థలూ, ఉద్రేకాలూ కట్టిపెట్టి మౌనంగా పడుకోండిపోయి," అంటూ మా అమ్మ కుర్చీనుండి లేచి మా నాన్న దగ్గరకు వెళ్ళింది. జ్వరం తగిలిందేమో అని మా నాన్న

నొసలుమీద చేయిపెట్టి చూసింది. "ఇదివరకిలా యెన్నడూ మాట్లాడి యెరగరే! మీకేమన్నా వంట్లో బాధగా ఉన్నదా అండీ?"

"నీ విక్కిణ్ణించి వెళ్ళిపో! నాకేజబ్బూ లేదు! ఏ బాధా లేదు! నన్ను ఉద్రేకపరచి కోపం తెప్పించకు దయచేసి! నా భార్యవైన నీవే నా మనోవేదన అర్థం చేసుకోక పోతే, పరాయి వాళ్ళెలా అర్థంచేసుకో గల్గుతారు! ఎలామరి! నన్ను వంటరిగా విడిచి నీ'దారిన నీవుపో!"

మా అమ్మలాగే, మా గ్రామ ప్రజలగ్గూడా పోర్చుగల్ విప్లవ సంఘటన అర్థంకాలేదు. తమకేమీ పట్టనట్లు నిత్య జీవితం దొర్లిస్తున్నారు బాధలతోనే. వాళ్లనెత్తిపైగానే ఒక బ్రహ్మాండమైన తుఫాను దాటిపోయి నట్లయింది. వాళ్ళు పోర్చుగీసు పరిణామాల్ని గూర్చి అసలు ఆలోచిం చనే ఆలోచించ లేదని నా నమ్మకం. కొందరు ధనిక భూస్వాములు మాత్రం కులాసాగా చర్చించారు. ఇదివరకున్న రిపబ్లిక్ ప్రభుత్వమే సరదాగా పేరు మార్చుకున్నదనీ, యీ మార్పు వల్లనే పరిపాలనా వ్యవ స్థలో విపరీత పరిణామా లేవీరావనీ వాళ్లల్లో వాళ్లే తీర్పు చెప్పుకున్నారు. రానున్న విపత్పరిణామాలు యదార్థంగా వాళ్లను కలవర పరచలేదు. అందరిలోకీ మా నాన్న ఒక్కడే రిపబ్లిక్ ప్రభుత్వం అంతరించి పోయినందుకు ఆ వేదన పడుతున్నాడు. రోజులు గడిచిన కొద్దీ అమూ ల్యమైన తన సర్వస్వమూ కుల్పోయినట్లు పిలపించడం మొదలెట్టాడు మా నాన్న.

ఇదివరకు లాగాలేడు మా నాన్న యిప్పుడు. రిపబ్లిక్ ప్రభుత్వం పతనం కావడం ఆయన తల కొట్టివేసినట్లుంది. పోర్చుగీసు ప్రభుత్వం మీద పూర్వంకన్న యిప్పుడు ద్వేషం యెక్కువైంది. మా నాన్న నిది వరకు పలకరిస్తేచాలు, చిరునవ్వు పెదవులపై చిందులాడేది. ఆయనకు నవ్వుఅతిసహజంగా వచ్చేది. చిరునవ్వుతో మృత్యుదేవతనైనా ఆలింగనం

చేసుకోడానికి భయపడని మా నాన్న యీ స్వల్పకాలంలోనే ఊహించ లేనంతగా మారిపోయాడే! మా నాన్నను మళ్ళీ యెప్పటిలాగే మామూలు మనిషిగా చేయమనీ, యథాపకారంగా మానట్టింట్లో అందం నృత్యం చేసేట్లు వరంప్రసాదించమనీ దేవుణ్ణి ఒకటే ప్రార్థించడం సాగించాను. ఏనాడా శుభముహూర్తం వస్తుందో అని ఉవ్విళ్లూరు తున్నాను. కాని ఆ భగవంతుడికి మామీద దయకలిగితేగా!

బహుశా అదిమావిధి వ్రాతేమో! విధిబలీయమైన దంటారు జ్ఞానులు! పోర్చుగీసు విప్లవంతోపాటు మా గ్రామంలో గూడా మహా విపత్తు వెంటాడింది ప్రజల్ని. ఒకనాడు సుఖసంపదలతో ఓలలాడిన మాకు యెంత మహాఉపద్రవం సంభవించిందో చూడండి!

ఒకనెల గడిచిందో లేదో, మా గ్రామంలో ఇన్ఫ్లూయంజా కార్చిచ్చులా చెలరేగింది. గ్రామమంతా ప్రళయంగా వ్యాపించింది. వందలమంది ప్రజలు దోమల్లా హతమారి పోతున్నారు. అబాల గోపాలం అరచేతుల్లో ప్రాణాలుంచుకొని హడలెత్తి పోతున్నారు.

చర్చిదగ్గిర కాపుర ముంటున్న సిప్రియానో మొట్టమొదటగా ఇన్ఫ్లూయెంజా వాతబడ్డాడు. ఇంతలో ప్రజలు గగ్గోలు పెట్టారు. ప్రజల్ని జాగ్రతగా ఉండమనీ, త్వరలో రోగం సమసిపోయేట్లు ప్రయత్నాలు చేస్తున్నామనీ, చాటించాం. ఆతనిభార్యగూడా యిన్ఫ్లూ యెంజాకు గురైంది! గడపదాటి ప్రక్కఇంటికి పోవడానిక్కూడా భయ పడ్డారు ప్రజలు. అంటువ్యాధి తమనెక్కడ పీక్కు తింటుందో అని పక్కవాడితో నిత్యసంబంధాలు గూడా తెంచుకున్నారు.

ఎన్ని మందు లిచ్చినా యీ పెనుభూతాన్ని అరికట్టలేక పోయి నాం. విషదంష్ట్రలు తెరుచుకొని ప్రజల్ని విరుచుకు తినడం సాగించిందీ

మహమ్మారి. అంతకంతకు ప్రజలు గుదులుగుదులుగా చనిపోతున్నారు. ప్రతియింట్లో ఏడుపులూ పెడబొబ్బలూ.

నాలుగు రోజులు గడిచింది. ఇసబెల్లా మంచం యెక్కిందని మా నాన్న విన్నాడు. తన ప్రాణం గూడా లెక్క చేయకుండా ఆమె యింటికి వెంటనే మా నాన్న పరుగు తీశాడు. ఆర్మెజిండాకు ఇసబెల్లా ఒక్కతే కూతురు. ఇసబెల్లా తండ్రి ఆరుమాసాల క్రితం పొలంలో పనిచేసుకుంటూ పాముకాటుకు ప్రాణాలు వదిలాడు. ఇసబెల్లా కష్టపడి పనిచేసే పిల్ల. తల్లికూడా ఆధారంగా ఉండేదా పిల్ల.

"ఇసబెల్లా పరిస్థితి చాలా విషమంగా ఉంది!" అన్నాడు మా నాన్న యింటికి రాగానే. "ఆ పిల్ల త్వరలో ఆరోగ్యవంతురాలు కావాలని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను."

మేమంతా ఇసబెల్లా పరిస్థితి చూసి యెంతో విచారపడ్డాం.

" చూడండి! రోగుల యిండ్లకు వెళ్ళేప్పుడు మీరెంతో జాగ్రత తీసుకోవాలి. సాహసం చేయకండి! అందరివీ ప్రాణాలే. ఇంటివద్ద కూనాగుడ్డూ ఉన్నారనే సంగతి జ్ఞాపకం ఉంచుకోండి! వాళ్ళకోసమైనా మీరు తప్పక జాగ్రత తీసుకోవాలి" అని హెచ్చరించింది మాఅమ్మ.

మానాన్న మాట్లాళ్ళేదు. విచారంతో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

" ఏమండీ టాబ్! డాక్టర్ ఆక్వినో యేమంటున్నాడీ రోగాల్ని చూసి? ఈవిషాద పరిస్థితుల్లో మనం ఏంచేయాలని సలహా యిస్తాడాయన?" అడిగింది మాఅమ్మ.

" ఆయన చేయదగిందంతా చేస్తూనే ఉన్నాడు. కాని దానివల్ల ప్రయోజనంయేమీ ఉన్నట్లు కనపడడంలా " అన్నాడు మానాన్న. గోవాలో తక్కిన ప్రాంతాల్లో ఔషధ సహాయం సకాలానికి అందకపోవడంవల్ల, అనేకమంది హతులైనారు.

ఇన్‌ఫ్లూయెంజా భయంకరమైన రోగం. మా గ్రామాన్ని బలి తీసుకుంటున్నది. రోజుకు ఒకరైనా యీ రోగానికి గురౌతున్నారు. రోజూ ఒకటి మొదలు నాలుగుశవాలవరకూ మా యింటి పక్కగానే దాటిపోతున్నాయి. శవందగ్గరకు రాగానే భయంతో కళ్ళు మూసుకుంటు న్నాను. దగ్గరే ఉన్న మా అమ్మను కౌగలించుకుని యేడ్వడం మొద లెట్టాను. ఆమె నా వీపు చరచి ధైర్యం చెప్పేది. ఒక్కొక్కనాడు మరీ యెక్కువమంది చనిపోతుండేవాళ్లు. అలాంటి రోజున సెబాస్టి యోకు గోతులు తవ్వడం అసాధ్యమయ్యేది. ఆరోజున పాతిపెట్టగా మిగిలిపోయిన శవాలను అక్కడే ఉంచి మర్నాడుదయం తీరిగ్గా వాటి పని చూసుకునేవాడు.

రోజల్లా చర్చి గంట విషాద సూచకంగా మోగుతూనే ఉండేది. ఆ ధ్వని వింటుంటే ఒళ్ళు జలదరిస్తుండేది నాకు. ఈ చర్చి గంట ధ్వనే యిదివరలో మమ్మందరినీ యెంత పరవశం చేసి వేసింది! పిల్ల లందరం సరదాగా గోపురం యెక్కి తాడు లాగగానే ఆహ్లాదకరంగా గంట మోగేది. ఆ ధ్వని విని యెంతో ఆనందించే వాళ్ళం చెవులు మూసుకుంటూ తెరుచుకుంటూ వేళ్లతో. పిల్లలమేనాదు. పెద్దవాళ్లుగూడా మా సంతోషంలో పాలు పంచుకునేవాళ్లు. ఇలాంటి చర్చిగంట యీ ప్రాంతంలో మరెక్కడా లేదనే వాళ్లు మా పెద్దలంతా.

ఈ రోజు చర్చిగంట వింటూంటే కఠోరంగా ఉంది. తలనొప్పి పుట్టించే యీ శబ్దాన్ని యిహ వినగూడదనుకునే వాళ్లం. మా గ్రామ దృశ్యం యీనాడెంతో భయంకరంగా ఉంది. ప్రతి స్త్రీ పురుషుడూ గాభరా యెత్తి కేకలు పెడుతూ వీధిన పడ్డారు. బిడ్డలందరూ తలి దండ్రుల్ని చూసి అయోమయావస్థలో యేడవడం సాగించారు. ఏ నిమి షాన తననూ, తన భార్యాబిడ్డల్నూ యీ మహమ్మారి పొట్ట పెట్టుకుం టుందో అని ప్రతివాడు బేజారెత్తి పోతున్నాడు.

పాపం. జయరాంగారి భార్యగూడా రోగాన పడ్డది. ఎక్కువ రోజులు తీసుకోకుండానే త్వరలో దాటిపోయిందామె. ఆమె శవాన్ని కొండ పై భాగానికి తీసికెళ్లి అక్కడ అంత్య క్రియలు చేశారు. వెంటనే జయరాంగారుగూడా మంచం యెక్కాడు పాపం. ఎంత మంచి వాడాయన? ఆయన కీ గతి పట్టడం మా కుటుంబంలో ఒకరికి ప్రమాదం సంభవించినట్టుగా ఉంది. ఇంగ్లీషు వైద్యంవల్ల యేమీ ప్రయోజనం లేదని గ్రహించాడు జయరాంగారు. కొన్ని వారాల క్రితమే పోండా గ్రామంలో ఒక మూలికా వైద్యుని చూచి ఆయనతో మాట్లాడ్డానికి వెళ్లాడు తిరిగివచ్చేప్పుడు ఆయనతో కొన్ని మూలికలు, వేళ్లూ తెచ్చుకున్నాడు. మూలికలన్నీ పెద్ద బానలో ఉడకబెట్టి, తయారైన కాషాయాన్ని ప్రజలకు తలా కాస్తా యిచ్చాడు. ఈ కషాయం ఇన్ఫ్లూయంజాను అరికడుతుందేమో అని ఆయన ఆశ. జయరాంగారి ఆలోచనకూ, ప్రజాభిమానానికీ ఆయన్ను అంతా అభినందించారు; కాని కషాయంవల్ల యెవరికీ కొంచెమైనా మేలు కలగలేదు.

పాపం జయరాంగారు మంచంయెక్కినప్పట్నుంచీ అడుగుతీసి కిందపెట్టలేదు. ఆయనరోగం కొన్నాళ్ళకు తిరుగుముఖం పెట్టినట్లే కనిపించింది. తనశక్తినంతా కూడగట్టుకుని- రోగంతో యుద్ధం చేస్తున్నాడని మానాన్న చెప్పేవాడు. పాపం ఉన్నట్లుండి ఆకస్మాత్తుగా తిరగబెట్టి జయరాంగారు స్వర్గస్థులైనారు.

"బాబూ నేను వెళ్ళిపోతున్నాను. నా పిల్లల్ని కనిపెట్టి వుండు నాయనా! మన బిడ్డలందరికీ శక్తివంచన లేకుండా చదువు సంధ్యలు నేర్పాను. పరాయి పిల్లలైనా స్వంత పిల్లలుగా భావించుకొని విద్యాబుద్ధులు నేర్పాను!" అన్నాడు జయరాంగారు అవసానదశలో.

జయరాంగారి శవాన్ని మోయడానికి ప్రజలు భయపడి ముందుకు రాలేదు. ఒకరిద్దరు మాత్రం ధైర్యంచేసి సిద్ధమైనారు. జయరాంగారి శవపటియాత్రలో ఆయన వెంట కొంతమంది అభిమానులు స్మశాన భూమికి సాగివచ్చారు. ఆయన భౌతికదేహం అగ్నిజ్వాలల్లో భస్మమై పోతూంటే అందరూ కంటతడి పెట్టారు.

దర్జీపనివాడు అనాక్లిటో, కల్లుగీత కార్మికుడు మిన్‌గ్విల్, రేపో మాపో మొదటికాన్పు కనబోతున్న మేరియానియా, మంగలివాళ్ళబ్బాయి జోస్ అంటోనియో— యింకా యెంతమందో యిన్‌ఫ్లూయంజా వల్ల మరణించారు. డాక్టర్ ఆక్వినో రోగం అరికట్టాలని శాయశక్తులా ప్రయత్నించాడు. శక్తికి మించిన శ్రమచేసి చివరకు తానే అడ్డంపడ్డాడు. ఇహ రోగులను చూసే వైద్యుడే లేడు పూళ్ళో. ఆగస్టు నెల. రోగం ప్రజల్ని ఊపిరాడకుండా విరుచుకు తింటున్నది. డాక్టర్‌గారికూడా తీవ్రత హెచ్చింది. అయన బతుకు అనుమానమైంది. ఇకాయన మాకు దక్కడనుకున్నాం.

మా గ్రామస్థు లేం జేయగల రా పరిస్థితుల్లో?

డాక్టర్ ఆక్వినో మంచానబడ్డ రాత్రి మా నాన్న యింటికొచ్చి తెల్లమొహం వేయడం చూశాను. ఏమీ తోచక వరండాలో కూర్చుని చీకట్లోకి అదేపనిగా చూస్తూ ఆలోచించడం మొదలెట్టాడు. మేమంతా దిగాలుపడి కూర్చున్నప్పుడు మాకు ఉత్సాహం పురికొల్పి ధైర్యం చెప్పే వాడాయన. ఇప్పుడు మా కన్న పిరికివాడై పోయాడు. ఆయన గుండె నిబ్బరం ఆయన్ను యెన్నడో విడిచి వెళ్ళింది. ఆందోళనతో కుళ్ళిపోతు న్నట్టుగా కనిపించాడు. ఆయనతో నాలుగు ముక్కలు మాట్లాడి, మళ్ళీ మనిషిని చేద్దామని మా అమ్మ ప్రయత్నించింది. కాని మా నాన్నకు మతిపోయింది. ఆయ నెప్పుడో ఆయనకే తెలియని అయోమయావస్థలో

పడ్డాడు. పంటరిగా తనను బ్రతకనివ్వండని మా అమ్మనూ, మమ్మల్నీ బ్రతిమాలడం మొదలెట్టాడు. చీకటి కోనగా ఉన్న ఆరుబయటికి దృష్టి సారించి, మా ప్రజల్ని పట్టుకుని వేధిస్తున్న యీ రోగాలకు పరిష్కార మార్గం కనిపెడుతున్న వాడిలా మాకు కన్పించాడు మా నాన్న.

"స్వర్గంలో వున్న పూజ్యుడైన ఓ తండ్రీ! మా మీద జాలి దలుచు! మా పాపాలేమైనా వుంటే క్షమించు! ఈ మహామారినుంచి మమ్మల్ని రక్షించు" అంటూ మళ్ళీ మళ్ళీ ప్రార్థించాడు మా నాన్న. లోపలి హాల్లోకి వచ్చా డాయన. అలిసిపోయినట్లుగా ముసలివాడిలా కన్పించాడు మా కళ్ళకు.

ఆ రోజున చర్చిలో ప్రత్యేక ప్రార్థన లేర్పాటు చేయబడ్డాయి. డాక్టర్ ఆక్వినో ఉన్నట్లుండి ఆకస్మికంగా అపస్మారకం పడ్డ తర్వాత, ఆదివారం సాయంత్రం చర్చి సర్వీసు జరిగింది. చిన్నలూ, పెద్దలూ, సర్వీసుకు హాజరైనారు. జనంతో కిటకిటలాడింది చర్చి. ప్రార్థనలు చేస్తూ చేస్తూ ఒక్కసారిగా ప్రజలంతా కంట తడిపెట్టారు.

"అత్యుత్తముడవైన ఓ తండ్రీ! మా మీద దయచూపు!" అని మతగురువు ఉచ్చరించగానే, సభికులంతా ఒక్కకంఠంతో అవే మాటలు ఉచ్చరించారు.

"ప్రపంచానికి ముక్తిని ప్రసాదించే ఓ తండ్రీ! మాపై కటాక్షించు. పవిత్రుడవైన ఓ భగవంతుడా! మా మీద నీ కృప ప్రసాదించు!"

ఎంతో భక్త్యావేశంతో ఆ నాడు మేమంతా ప్రార్థించాం. మోకాళ్ల పై బడి ప్రార్థనలు మొదలుపెట్టగానే, అస్తమయమవుతున్న సూర్య కిర ణాలు కిటకీగుండా శిలువమీద ప్రసరించడం చూశాం. వేదికంతా మంట లతో భగభగా మండిపోతున్నట్లు కన్పించింది. అయితే యీ అద్భుత దృశ్యాన్ని కొద్దిమందిమాత్రమే చూడగలిగాం. తక్కినవాళ్ళంతా దుఃఖా వేశంతో కండ్లు మూసుకొని కన్నీరు మున్నీరుగా వాపోతున్నారు.

ఆగస్టు, సెప్టెంబరు నెలల పొడుగునా యిన్ఫ్లూయంజా మా గ్రామాన్ని తుడిచిపెట్టేసింది. రోజూ కనీసం అయిదు శవాలైనా లేచాయా రోజుల్లో. కాని వర్షాలు వెనకబడడంతో, రోగాలు తగ్గుముఖం పట్టడం ప్రారంభించాయి. ఇంతలో డాక్టర్ ఆక్వినో పూర్తిగా కోలుకున్నాడు. మాకూ ప్రాణాలు లేచివచ్చినట్లయింది.

అంధకారం తొలిగిపోవడంతో ప్రతివ్యక్తీ "బ్రతికాంరా బాబూ" అని వేడి నిట్టూర్పులు విడవడం మొదలెట్టారు.

"ఇప్పుడైనా మీ ఉద్దేశ్యాలు మార్చుకోండి!" అన్నది మా అమ్మ మానాన్నను. అక్టోబరు నెలలో ఒకనాటి ఉదయం అది—అప్పుడే చర్చికి వెళ్ళి తిరిగి యింటికి వచ్చాం. దేవుడు మా ప్రజలపై చూపిన అనన్యమైన ప్రేమాభిమానాలకు కృతజ్ఞతగా, ఆనాటి ఉదయం గ్రామం మొత్తంగా ప్రార్థనలు జరిపి వచ్చాం. "చూడండి! మీకు దేవుడంటే, లక్ష్యమూ, గురీ లేకపోయినా, క్రీస్తు ప్రభువు తన బిడ్డల్లాగా మన ప్రజల్ని ఎలా కాపాడి ప్రాణభిక్ష పెట్టాడో! ఇకనుండైనా ఆదర్శవంతమైన క్యాథలిక్కుగా తయారుకావడానికి దీక్షతో పనిచేయండి. దేవునిమీద భక్తి నిలపండి! ఏమంటారు? ప్రయత్నిస్తారుగదూ!"

ఈ భయంకర జాడ్యం నుంచి తప్పించుకుని ప్రాణాలతో బయటపడ్డ కొద్ది కుటుంబాల్లో మా దొకటి. భయంకరమైన యీ రోగం ప్రతియింటా ప్రవేశించి బలితీసుకునే వాళ్ళను బలి తీసుకోగా, తక్కిన వాళ్ళను పీల్చి పిప్పిచేసి వెళ్ళింది. కొనప్రాణాలు మాత్రం మిగిలి వున్నాయి. బ్రతికి బయటపడ్డ వాళ్ళంతా కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకొని నీరసించి వున్నారు. మమ్మల్ని అంతటితో వదిలిపెట్టి రోగందారిన రోగం పోయినందుకు మా అమ్మ భక్త్యావేశంతో ఉబ్బి తబ్బిబ్బైంది. దేవుడి ఋణం ఎలా తీర్చుకోగలమా—అని ఆలోచిస్తున్నది. రాత్రిం

బగళ్ళూ, చర్చిలో, యింట్లో, యెక్కడ క్షణం తీరుబడి వుంటే అక్కడల్లా ప్రార్థనే. క్షణమైనా సందుచేసుకుని మా నాన్న దగ్గిరకు వచ్చి, యిహానుంచైనా, దేవుడిమీదా, మతంమీదా భక్తి గౌరవాలు చూపమని ఒకటే యింజక్షన్లు పొడపడం సాగించింది.

దైవచిత్రం చూడండి! మా నాన్నకూ, మా అమ్మకు మరో విపత్తు వచ్చిపడే సూచనలు కన్పించాయి. ఎంత భయంకరమైన సంఘటనో మీరే చూడండి.

ఆనాడు మధ్యాహ్నం రెండుగంటలసేపు మావూరి చెరువులో యీతకొట్టాను. ఆ సాయంత్రానికల్లా నాకళ్ళుమండడం, నాతల నొప్పి పుట్టటం ప్రారంభించింది. ఎంతో జబ్బుచేసినట్లుందిగూడా. అయితే జరిగినవిషయం మాఅమ్మకు చెప్పివేయడానికి జంకాను! ఆచెరువులో యీదడం మాఅమ్మకు మొదట్నుంచీ యిష్టంలేదు. అనేకసార్లు నన్ను కేకలేసిందిగూడా. అంచేత ఉన్నదున్నట్లు నిజంచెబితే మరోసారిఅక్కడకు పోనివ్వదని నాకు బాగా తెలుసు.

"ఏమిటిరా నాయనా! ఎలాఉందినీకు?" అడిగింది మాఅమ్మ టేబిల్ మీదుగా నావంక తీక్షణంగా దృష్టినిసారించి. నేను టీ తీసుకుంటున్నాను. "నీకళ్ళు అలా యెర్రబారి నీళ్ల కారుతున్నాయేం".

డొంకతిరుగుడుగా సమాధానమివ్వడానికి ప్రయత్నించాను. నేను మాటలకోసం తడుముకొనడం మాఅమ్మ కనిపెట్టింది. నాదగ్గిరకామె వెంటనేవచ్చి అరచేతితో నానొసలు పట్టుకుని చూసింది.

"నీకు జ్వరంతగిలిందిరా అబ్బాయి!" అంటూనే మందులపెట్టె ఎద్దకు త్వరత్వరగా నడిచిపోయి థర్మామీటర్ తెచ్చి జ్వరంచూసింది.

"నూటమూడు! అమ్మయ్యో! తెలుసుండికూడా జ్వరంవచ్చిందని ముందుగా చెప్పలేదేంరా నాయనా?" అన్నది కంగారుతో మా

అమ్మ. నాచేయిపట్టుకుని పక్కదగ్గరకు తీసుకెళ్ళి పడుకోపెట్టింది నన్ను.

"ఓ! అదేంలేదులేవేఅమ్మా! మామూలుగా జలుబుపట్టింది!" అని మా అమ్మకు ధైర్యంచెప్పడానికలా అన్నాను. కాని నిజం నమ్మండి! నాజ్వరంచూసి నాకే హడలెత్తిపోయింది. లోపలనుండి భగ్గుభగ్గున అగ్నిజ్వాలలు యెగచిమ్ముతున్నట్లున్నది శరీరంలో.

"జలుబుగానీ, మరోటిగానీ, నీవిక్కడే కదలకుండా పడుకుని వుండు. కాలు కదపవద్దేమనుకున్నావో!" అని ఆజ్ఞాపించింది మా అమ్మ. పేరియాను పిలిచి డాక్టర్ ఆక్వినోను తక్షణమే కబురు చేయమన్నది.

తర్వాత రెండురోజులవరకూ జ్వరం అలాగే నిలిచిపోయింది. నాలుగోరోజున తగ్గుముఖం పట్టేసరికల్లా, యింటిల్లిపాదికీ ఆందోళన సమసిపోయింది. అయితే నేను మాత్రం శరీరంలో విచిత్రమైనబాధ అనుభవిస్తున్నాను. శరీరంలో ఏదో నన్ను కరిచివేస్తున్నట్లు బాధపడ సాగాను. ఉన్నట్లుండి ఆకస్మికంగా నా పెదిమలు, నాశరీరం కదలించలేకపోయాను. నాలుగు చదరపుటడుగులగదిలో పడివున్నాను నేను. కదలడానికీ, మెదలడానికీ అంగుళమైనా జాగాలేని బోషాణంలా ఉంది నాగది. నేనెంత నిర్బంధం అనుభవిస్తున్నానో ఊహించుకోండి! వెయ్యి గొలుసులతో మీశరీరం బంధించివేస్తే, మీబాధ యెలాఉంటుందో ఊహించుకోగలరా? అంతకు పదిలక్షలరెట్ల బాధతో దహించుకుని పోతున్నాను. అయితే నామనస్సు చురుకుగా, తెలివిగానే పనిచేస్తున్నది. నాచూపు నిశితంగానేఉంది. అయినా చచ్చి పడిఉన్నట్లే భావించుకున్నాను. మానాన్నగూడా అలాగే అనుకొన్నాడు. కండ్లు తెరచి మానాన్న ముఖంకేసి చూస్తుంటే ఆయనలో విపరీతమైన ఆవే

దన, ఆందోళన కనిపెట్టగలిగాను. నన్ను ఉత్సాహపరచి, నవ్వించడానికాయన ప్రయత్నించాడు. ఆయన హృదయకుహరాన్ని దుఃఖం తొలిచివేస్తున్నట్లు కనిపెట్టాను. నాకొరకాయనచెందే పరితాపం, నా విషయమై క్రమంగా ఆయనలోప్రవేశించిన నిరాశకూడా ద్యోతకమైంది ఆయన ముఖంలో.

తెలిసినవాళ్ళంతా, "పసిబిడ్డల పక్షవాతం" అంటూ నా రోగానికి పేరుపెట్టేశారు. నాకర్థంకాలేదీపేరు. నేనెప్పుడూ వినలేదు. మాయింట్లో యింతవరకు తలనొప్పి, జ్వరం అంటే ఎరగని మానాన్న ముఖాన్నిబట్టి నాపరిస్థితి యెంతో తీవ్రంగానేఉన్నట్లు అర్థంచేసుకోగల్గాను, మంచంపై శవాకారంగా పడిఉన్నాను. ఏవిషయమూ స్పష్టంగా, తెలివిగా విచక్షణతో ఆలోచించలేకపోతున్నాను క్రమంగా. నాగతేంకాబోతున్నదా అనిమాత్రం ఆశ్చర్యంతో ఊహించుకుంటున్నాను. ఎప్పటికైనా నేను మామూలు మనిషిగాలేచి తిరగ్గలనా ? ఆలోచించగలనా ? ఈకాళ్లతో యీ చేతులతో యెప్పుడూ ఆటలాడుకుంటూ పరుగెత్తిననేను, వాటిస్థితి యిలాపడుతుందని యెప్పుడూ ఆలోచించుకుని యెరగను యిదివరలో. ఈ రోజున యీకాళ్ళచేతుల ఉపయోగం తీరిపోయి, యీ కుక్కిమంచంపైన చచ్చుపడిఉంటే, నాకమితంగా విచారంవేస్తున్నది. ఆనాడంత పనిచేసిన యీకాళ్ళూ, చేయియూ. తిరిగి యథాపూర్వస్థితిలోకి తెచ్చుకొని తీరగలనని నాకు నమ్మకం కలిగింది.

మానవుని మనస్తత్వం యెంత విచిత్రమైనదో చూడండి! మనం అనుభవిస్తున్న వస్తువు మనల్ని విడిచిపెట్టి పోయేవరకూ దాని ప్రాధాన్యతనూ, అవసరాన్నీ గుర్తించలేని మందమతులం మనం. జైల్లో నిర్బంధించబడ్డ ఖైదీవిషయమే ఊహించుకోండి! ఆచీకటిగదిలోఉన్న చిన్న చిల్లిలోనుంచి బాహ్యప్రదేశంవైపు తొంగితొంగి చూస్తూ,

తానెప్పుడు బయటపడి స్వేచ్ఛగా తిరుగగలుగుతానా అని ఆరాటపడ తాడు. ఆ బాహ్యాప్రదేశమంటే తానుస్వేచ్ఛగా తిరిగేరోజుల్లో, యెన్నెన్నిసార్లు అక్కడ విహరించాడో, యెన్నెన్నిపనులు చేశాడో ఆనాడు ఆలోచించనైనా ఆలోచించడు. ఒక గుడ్డివాడి-విషయమేఆలో చిద్దాం. ఆకస్మికంగా అతనికళ్ళుపోగానే, తనచూపు మళ్ళీ యెప్పుడు వస్తుందాయని ఆసిస్తాడు. కళ్ళున్నరోజుల్లో ఆకాశంవంకా, నక్షత్రాల వంకా, ఫలపుష్ప వృక్షాలవంకా, మనోహరమైన యితరదృశ్యాల వంకా ఒక్కసారైనాచూసి ఆనందించటానికి బుద్ధిపుట్టదు.

నేనీనాడు ఆఖైదీలా, గుడ్డివాడిలా ఉన్నానీమంచంలో.

నారోగం కుదిర్చి, నన్ను సంపూర్ణమైనఆరోగ్యవంతుణ్ణి చేయ డానికి మానాన్న పడని శ్రమలేదు. ఆయన నాకోసంపెట్టిన ఖర్చుకు అంతులేదు. ఎవరేసలహాయిచ్చినా, మానాన్న గోవా అంతాతిరిగి అవ సరమైన అన్నిరకాలమందులూ సాధించితెచ్చి నాముందు కుప్పపోసే వాడు. మూలికావైద్యుల్ని, ఇంగ్లీషువైద్యుల్నీ, పేరుపొందిన ఆయు ర్వేదవైద్యుల్నీ పిల్చుకొచ్చి నన్ను చూపించేవాడు. ఎలాగయినానన్ను బ్రతికించమని వాళ్ళను కాళ్ళూగడ్డాలూ పట్టుకొని బ్రతిమిలాడేవాడు.

ఆరేడుమాసాలవరకూ అన్నిమందులూ వాడిచూశారు. నాపరి స్థితి యేమీ బాగుపడలేదు. ఎప్పటి మంచమూ, నేనూతయారు. సర్వాం గాలు చతికిలబడ్డాయి. చిపరకు దురదపుడితే గోక్కోడానిక్కూడా చేతులు లేవ నిరాకరించాయి. రాత్రింబగళ్ళూ, ఎచ్చేవాళ్ళూ, పోయే వాళ్ళూ నాదీనస్థితినిచూసి జాలిపడుతున్నారు. వాళ్ళమొహాలనుచూసి ఎంతో దిగులుపడేవాణ్ణి. ఈ కడుపు దిగులుతో సగంప్రాణంలేచి పోయినట్లే వుంది. నాబాధ వర్ణించలేరెవరూ, నాఆవేదన యింతంతగాదు. భూలోకనరకమే అయిందినాపని. బతికుండగా నాకెందు కీనరకయాతన!

త్వరలో చచ్చిపోతే బాగుండు ననిపించిందినాకు. బతికి బట్టకడతాననే ఆశ నాకుతీరిపోయింది. నాకీ భూమిమీద నాలుగు మెతుకుల్లు తినేయోగ ముండి మృత్యుదేవత ముఖంనుండి ఒకవేళ బయటపడినా, యీ అవిటి బతుకుతో చిరకాలం అమ్మకూ, నాన్నకూ, ఆత్మీయులకూ యెందుకు భారం కావలెనా అని ఆలోచనతో కుళ్ళిపోతున్నాను.

భయంకరమైన యీ పక్షవాత రోగంవల్లకదా తోటి స్నేహితులతో కలిసి జీవిత సుఖంలో పాలుపంచుకో లేకపోయను! నాయిష్టం వచ్చిన చోటికి స్వేచ్ఛగా నడిచిపోలేకపోయినాను! నేను చూడదలచింది చూసి ఆనందించలేక పోయాను! మంచంలో పడుకొని యెడతెరిపితిలేని ఆలోచనతో నామనస్సు వ్యథపడుతూంది. ఇలా అమాయకంగా ఆలోచిస్తూ దిగులుపడడానికి నేను పసిపిల్ల వాడినేంకాదని నాకోనాడు మనస్సుకు తట్టింది చటుక్కున. యుక్తవయస్సువచ్చి, కష్టసుఖాలూ, జీవిత సమస్యలూ అర్థంచేసుకోగలవ్యక్తినని స్ఫురణకు వచ్చిందప్పుడు. చూడండి యెంతఆశ్చర్యమో! అదివరదాక ఆటపాటలమీద పోయిన నాచిన్నతనవు ఆలోచనలన్నీ ఒకదెబ్బతో పటాపంచలైనాయి. అవన్నీ పొలుకువలేకుండా మర్చిపోయాను. నాఊహకూ, నాఆలోచనకూ 'ఆతీతమైన జటిల సమస్యలు నామనస్సును పెనవేసుకొనడం మొదలెట్టాయి. ఈ క్లిష్టసమస్యల్ని గురించి యిదివరలో క్షణమైనా ఆలోచించే యెరగను.

"ఈపోర్చుగీసు పాలకులు మాపైన యెందుకు పెత్తనంచేయలి? వాళ్ళుమాకుచేసినమే లేమిటి? నన్ను నేనే ప్రశ్నించుకున్నాను. నాచిన్నతనంనుంచీ మానాన్న అప్పుడప్పుడూ పోర్చుగీసువాళ్ళను గురించి చెప్పే గాథాలన్నీ నిజమేనని నమ్మడం మొదలెట్టాను. నా ఆలోచనా శక్తికి తగినట్లుగా, నాకున్న స్వల్పానుభవంతో స్వతంత్రించి నేనే సత్యాన్వే

షణ చేయడం ప్రారంభించాను. ఈపరాయిదేశస్థులు మాపైన యెక్కి తొక్కుతూ, మమ్మల్నెందుకీ ఆగచాట్లు పెట్టాలి ? అలాచేయడానికి వాళ్ళ కేంహక్కుంది ? మావ్యవహారాలు మేమే చక్కదిద్దుకుంటూ మాదే శాన్ని మేమే సుఖంగా పాలించుకునేశక్తి సామర్థ్యాలు మాకులేవా ? ఇంతమంది లాయర్లు, డాక్టర్లు, న్యాయశాస్త్ర నిపుణులు, కవులు, రచయితలు, కళావేత్తలు, వేదాంతులు శాస్త్రజ్ఞులు మాదేశంలో కొల్లలుగా ఉన్నారే! ఇందరు మేధావులుంపిగూడా, మేము అసమర్థులమనిపించుకోవలసిందేనా ? ఈ తెల్లజాతివాళ్ళు నల్లజాతులవాళ్ళ కెందుకన్యాయాలూ, అవమానాలు, అక్రమాలు చేయాలి ?

పోర్చుగీసు పాలకులు గోవా ప్రజల్ని క్రైస్తవులుగా చేశారట! మనకు నాగరికత నేర్పారట! పోనీ వాళ్ళు చేసినసేవకు వాళ్ళ నభినందిద్దాం. అయితేనేం! మనకిష్టం లేనప్పుడు, మన మనోభావాలకు వ్యతిరేకంగా మనల్ని మతంలోకి తిప్పుకునే అవసరం యెందుకు కల్గింది వాళ్ళకు ? మనల్ని ఉద్ధరిద్దామనా ? పోర్చుగీసు వాళ్ళు హిందూ దేవాలయాలను భస్మీపటలంచేశారు! మసీదులను అపవిత్రం చేశారు. వాళ్ళ ఆస్తులను స్వాధీనం చేసుకున్నారు. క్రీస్తు ప్రభువుపేరుతో నోట ఉచ్చరించరాని ఘోర హింసాకాండ కొనసాగించారు. వీళ్ళెక్కడికి తప్పించుకు పోయినా, వీళ్ళపాపం వీళ్ళను వదలక కట్టికొడుతుంది. వధ్యశిల వద్ద వేలాది స్త్రీ పురుషులను బ్రతికుండగనే భగ్గు భగ్గున మండేమంటల్లో త్రోసి చంపారీ పోర్చుగీసు హంతకులు. క్రైస్తవమతాన్ని ముసుగుగాధరించి, యీ కటిక కిరాతులు అవినీతి, అకృత్యాలు, దోపిడీలు, చిత్రహింసలు, నరహత్యలు కొనసాగించారు!

పేదలైన హిందూ కుటుంబాలు క్రైస్తవ మతం అవలంబించేందుకు పోర్చుగీసువాళ్లు పన్నిన మాయపన్నాగం చూడండి! ధర్మ

కార్యాలనీ, వైద్యసహాయమనీ, పేర్లుపెట్టి ఉచితంగా సేవ చేయడం ద్వారా అమాయకులైన మా ప్రజల్ని తమవలలో వేసుకున్నారు. పోర్చుగీసు పాలన ప్రారంభమైన దినాల్లో హిందువులకు గవర్నమెంటు ఉద్యోగాలివ్వగూడదని ఆంక్షవిధించారు. చనిపోయిన హిందువుల ఆస్తులు, కొత్తగా క్రైస్తవ మతం పుచ్చుకున్న వారి బంధువులకు సంక్రమించేట్లుగా పోర్చుగీసు ప్రభుత్వం చట్ట నిర్మాణం తయారు చేసింది. హిందువులు తమతమ గ్రంథాలను బహిరంగంగా చదవకుండా, ప్రకటించకుండా నిషేధిస్తూ నిబంధనలు జారీచేసింది. హిందూమత గ్రంథాలెన్నిటినో భస్మంచేశింది. క్రైస్తవ మతస్తులను పన్నుల భారం నుండి తప్పిస్తూ మరికొన్ని చట్టాలు అమలు జరిపింది.

కొత్తగా క్రైస్తవులైనవాళ్లు మతసంబంధమైన పండగలకూ, ప్రార్థనలకూ రాకపోతే, వాళ్ళల్లో భాగ్యవంతులైన వాళ్ళకు జరిమానాలు విధించి, బీదలను బహిరంగ ప్రదేశాల్లో కొరడా దెబ్బలు కొట్టేవాళ్లు. హిందూ మంగలి వాళ్ళచేత క్షవరాలు గూడా చేయించు కోవద్దని క్రైస్తవులను శాసించారట!

1510 లో అల్బుకర్క్ మా సముద్రతీరంలో దిగినప్పటినుంచీ 1814 వరకూ క్రైస్తవ మతం పేరా, విశ్వమానవ ప్రేమపేరా యెన్నెన్ని అమానుషమైన నీచకృత్యాలు, యెన్నెన్ని హత్యలు చేశారో వర్ణించలేం. ఈ అకృత్యాలన్నీ ఆనాడు మానాన్న ఆ వేదనతో యేకరువుపెడుతుంటే ఆరోజున అతికల్పితాలనిపించాయి. ఈ నాడా విషాదగాథలన్నీ నా మనస్సులో విపరీతమైన కలవరం కల్గిస్తున్నాయి; నా మెదడును సమ్మెట పోట్లు కొట్టినట్లు కొడుతున్నాయి – నా చైతన్యాన్ని రేకెత్తించి ప్రకోపింప జేస్తున్నాయి. మా నాన్న చెప్పిన మాటలన్నీ అక్షరాలా నిజం! ముమ్మాటికీ నిజం. రాత్రిపేళైనా ఒక్క కునుకు తీద్దామనుకుంటే, కళ్ళ

మూతలు పడడానికి ససేమిరా నిరాకరిస్తున్నాయి. నాతాత ముత్తాతల పవిత్రాత్మలు, వాళ్ళకూ, మా ప్రజానీకానికి జరిగిన పరాభవానికి శత్రువుల పైన ప్రతీకారం తీర్చుకోమనీ. యిప్పటికైనా అన్యాయం రూపుమాపి, మా ప్రజలకు దాస్యవిముక్తి కలిగించమనీ కర్తవ్యం ప్రబోధిస్తున్నాయి.

అయినా యీదుస్థితిలో పడ్డ నేనా వాళ్ళ పవిత్రాత్మలకు శాంతి గల్గించేది ! అవిటి వాణ్ణయినా నేనా ప్రజల యెడల నా పవిత్ర కర్తవ్యం నెరవేర్చగల్గేది! కాళ్లూచేతులూ చచ్చుపడి, నిస్సహాయస్థితిలో ఉన్న నేనేం చేయగలను ! బ్రతికుండగానే దయ్యంగా మారుతున్న నావల్ల యేమవుతుం దీ ఘనకార్యం ! ఆ నరహంతకులాచరించిన ఘోర హత్యాకాండకూ, దోపిడీకీ. అవమాన పరంపరలకూ తగిన శాస్తి నాబోటివాడేం చేయగలడు ! ఆ దోపిడీమూకకు వారసులుగా యీనాటివరకూ మనల్ని పోర్చుగీసు పాలకులు బానిసలుగా పీల్చి పిప్పి చేస్తూనే ఉన్నారు.

---

౨

పవిత్రమైన నా మాతృ భూమిమీద దయాదాక్షిణ్యాలూ లేని యే దుష్టగ్రహం ఆవేశించిందో! నిన్నమొన్నటివరకూ ఆనందోత్సాహాల మధ్య సుఖజీవితం గడుపుతున్న మా గోవా ప్రజలను అంధకారం ఆవరించింది.

మా నాన్న కన్న దుస్వప్నాలన్నీ నిజమైనాయి యీ రోజున. ఆయన దూరదృష్టితో ఊహించిన ఊహలన్నీ నగ్న సత్యాలైనాయి. సైనిక తిరుగుబాటుకు సంబంధించిన భోగట్టా అంతా మాకు చేరింది. ఈ వార్తలు మా చెవుల్లో యిప్పటికీ గింగురు మంటూనే ఉన్నాయి. ఇంతలో డాక్టర్ సాలజార్ ప్రధాన మంత్రిగా పోర్చుగల్‌లో నియంతృత్వప్రభుత్వం యేర్పడ్డట్టు వార్తవచ్చింది; ఆతర్వాత వెంటనే పరిపాలనా వ్యవస్థలో, తదనుగుణ్యమైన మార్పులుగూడా వచ్చాయి. పోర్చుగల్‌లో రిపబ్లిక్ ప్రభుత్వం ఉండగా, మాగోవాకు కొంతవరకు బాధ్యతాయుత పరిపాలనా స్వాతంత్ర్యముండేది. నియంతృత్వం నెలకొనడంతో యీకాస్త స్వాతంత్ర్యమూ మాయమయ్యే ప్రమాదం యేర్పడ్డది. సైనికవిప్లవం జరిగినప్పట్నుంచీ పోర్చుగల్‌లో పెద్దమార్పులుప్రారంభమైనాయి. అయితే మానాన్న తప్ప మరెవరూ యీగ్రామంలో వీటిని గమనించలేదు. అసలు మనస్సుకే పట్టించుకోలేదు.

"ఈ నియంతృత్వంపట్ల నీవైఖరేమిటి? దీనివల్ల మనకు కీడేగాని మేలు కలుగదని నేనానాడే చెప్పినమాటలు నిజంకాదూ? ఇప్పుడు జరిగే భయంకర సంఘటనలు మన మనస్సును కలవరపెట్టడంలా?" అనడిగాడు మానాన్న డాక్టర్ ఆక్వినోను.

డిశంబరునెల. మానాన్న, డాక్టర్ ఆక్వినో మావరండాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఒక్క కలంపోటుతో వాక్సభాపత్రికా స్వాతంత్ర్యాలు మూడూ మంటకలిసి పోయాయని తెలుసుకున్నాం. ఆక్వినో చీకాకైన మనస్సుతో గంభీరంగా ఆలోచిస్తున్నాడు. మానాన్న ఆగ్రహంతో నియంతృత్వాన్ని దుమ్మెత్తిపోస్తున్నాడు.

"ఈ పోర్చుగీసువాళ్ళు వట్టి పందులు! మనమంతా మనుష్యులమా లేక కుక్కలమా?" అన్నాడు మానాన్న ఆవేశంతో.

డాక్టర్ ఆక్వినోకీవిషయం బాధించినట్లులేదు. తాపీగా చుట్టతీసి వెలిగించాడు.

"ఏమీ బాధపడకండి మీరు! ప్రభుత్వం కట్టుదిట్టంగా వ్యవహరించాలంటే, యీ చట్టాలూ, యీఅంక్షలూ, నిషేధాలూ అవసరమేమో! కాకపోతే పోర్చుగీసువాళ్లుమాత్రం వీటినెందు కసలు జరుపుతారు? తొందరెందుకు! నాలుగురోజులపాటు వేచిచూద్దాం! అంతా బోధపడుతుంది" అన్నాడు డాక్టర్.

మానాన్న కోపం వెళ్ళగక్కుతూ, "వేచిచూడాలీ! శతాబ్దాలుగా తాతముత్తాతల కాలంనుంచీ మనం వేచిచూస్తూనేఉన్నాం. నాలుగుశతాబ్దాల బానిసజీవితంలో యెలాంటి విచిత్రమైన మనస్తత్వాన్ని అలవర్చుకున్నామయ్యా!" అన్నాడు.

"ఈ విషయం గురించి మీరెందుకండీ యింత బ్రహ్మాండంగా పట్టువదలపడతారు? మీకన్న కొమ్ములుతిరిగిన ధనవంతులందరూ యేది యెలాపోతే మనకేమని మౌనం వహించి కూర్చున్నారు! మీకెందుకండీ యింత ఆందోళనా, యింతఆయాసం? మీకై మీరెందుకు తెచ్చిపెట్టుకుంటారు శరీరానికి, మనస్సుకూ బాధ? సుఖంగా కాలుమీదకాలేసుకుని బ్రతకడం చేతగాదూమీకు?" అన్నాడు డాక్టర్.

"మీరుచెప్పింది నిజమేనండీ డాక్టరుగారూ! గోవాప్రజలెవరూ కొత్తనియంతృత్వ ప్రభుత్వం తెచ్చిపెట్టే కడగండ్లనుగురించి పట్టించు కొనడంలేదు. రోజువారీ పొలంపనుల్లో సతమతమయ్యే పేదరైతులూ కూలీలూ రాజకీయవిషయాల్నిగూర్చి ఆలోచించలేరు. పొలంపనులు పట్టినట్లుగా మరేవిషయాలూ అంతగా వాళ్ళను బాధించవు. వాళ్ల మనస్సు లీసమస్యపై మళ్ళించడానికి విరామమే ఉండదు. నిత్యజీవి తానికి-భంగం రానంతవరకు యీ వర్గానికి సంబంధించిన ప్రజలుమరో సమస్యనుగురించి ఆలోచించరు. పొలంపనులు, యింటిగొడవలతో కాలంవెళ్ళబుచ్చే రైతాంగానికి వాక్సభాపత్రికా స్వాతంత్ర్యాలెలాబోతేనేం కావాలి! నిరక్షరకుక్షులైన రైతు, కూలీలు రాజ్యాంగంలో జరిగేపరిణా మాలెలా అర్థంచేసుకోగలరు? రాజకీయ చైతన్యంలేని ధనికభూస్వా ములూ, యితర ఉన్నత వర్గాలవాళ్ళూ సుఖజీవనాని కలవాటుపడ్డారు. పోర్చుగీసు పాలకులే తమ శాశ్వత యజమానులనీ, వాళ్ళ ఆధ్వర్యం క్రిందనే తమ భోగభాగ్యాలింకా అధికంకావాలనీ వాళ్ళు కోరుకుంటారు. ఇది వాళ్ళవర్గ స్వభావం.

"ఈ పోర్చుగీసు దోపిడిగాండ్రు మన జాతీయచైతన్యాన్ని కుంగ దీశారు. మనల్ని మచ్చికచేసుకొని, మనమీదయెక్కి సవారీతీస్తున్నారు. మనకు ఆత్మాభిమానమే నశించిపోయింది. అందరికన్నా క్రైస్తవుల స్థితి మరీ హీనంగాఉంది. అందరిదృష్టిలో మనం అపహాస్యం పాలై నాము. నాలుగుశతాబ్దాల నిరంకుశత్వం ఫలితంగా మనమే మనదేశ ప్రజలచేత విదేశీయులుగా పరిగణించ బడుతున్నాం. ఇదెంతో సిగ్గు చేటైన విషయం. ప్చ!

చలికాలం తప్పుకుని వసంతరుతువుకు చోటిచ్చింది. పూలచెట్లు పుష్కలంగా పూచి విరగబడున్నాయి మొగ్గలతో. పుష్పాలతో. సూర్య

వస్మి తేజోవంతంగా ప్రకాశిస్తుంది. అయితే మానాన్నకీ ఆనందం అనుభవించే అదృష్టంలేదు. ఎటునడిచినా, ఎక్కడకూర్చున్నా. ఆయన నిరాశతో, దైన్యముతో కంపించి పోతున్నాడు. పోర్చుగీసు సామ్రాజ్యవాదాలు పెట్టే ఘోరావమానాలను సహించి, ఆత్మాభిమానంవదిలి బతుకుతున్నామని ఆయన ఆవేదన. మా ఉదాసీనవైఖరి ఆయన సహించలేక పోతున్నాడు.

కాని అదృష్టవశాత్తు మానాన్నకొక ఆశారేఖ పొడగట్టింది. మానాన్నకూ, ఆయనవంటి మనస్తత్వంగలవాళ్ళకూ, జాతీయగౌరవం. స్వాతంత్ర్య కాంక్షలకూ చాలినవి మరేభౌతికసంపదా కాదని దృఢమైన ఆత్మవిశ్వాసం. పోర్చుగల్‌లో రిపబ్లిక్ ప్రభుత్వం అంతరించి నియంతృత్వం నెలకొనగానే, దాన్ని ప్రతిఘటిస్తూ మెనిజీస్ బ్రాగాంకా అనే రిపబ్లిక్ అభిమాని ఒక ప్రకటన చేశాడు. "ఓడిబేట్" అనే తన పత్రికలో తన అభ్యుదయ భావాలను నిర్విరామంగా ప్రకటించేవాడు. కావడానికి అతను మితవాద రాజకీయవాదే. కాని పోర్చుగల్‌లో నిరంకుశ ప్రభుత్వం తలయెత్తగానే బ్రాగాంకా నిర్మొగమాటంగా తన నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడించాడు :

"భావస్వాతంత్ర్యాన్ని నేను ప్రధానలక్ష్యంగా పరిగణిస్తాను. జంతుదశలోనుంచి మానవుణ్ణి ఉన్నతస్థాయికి తీసుకునిపోయేది ఆలోచన. ఈస్వతంత్రాలోచననే ప్రపంచంలో శాశ్వతంగా నిలిచిఉంటుంది. భావస్వాతంత్ర్యం పరిరక్షించబడితేనే, దానిలోనుండి నూతన చైతన్యం, నూతన పరిణామం ఉద్భవిస్తుంది. సమాజాభివృద్ధికి శాశ్వతమైన కాలబద్ధ భావస్వాతంత్ర్యమే. ప్రపంచములో శతాబ్దాలుగా తలయెత్తిన నిరంకుశవాదులను ప్రతిఘటించింది ఒక్క భావస్వాతంత్ర్యమే. ప్రభుత్వాలు చిత్ర విచిత్రమైన నినాదాలతో తెరలమీది కెక్కుతున్నాయి; మాయమౌతు

న్నాయి. ఇవి అశాశ్వతమైనవి; ఒక్క భావాలే శాశ్వతమైనవీ, చావు లేనివి!"

బ్రాగాంకా గొప్ప గోవన్ జాతీయుడు. నిష్కల్మషమైన దేశ భక్తుడు. గోవాను ఆవరించియున్న నిరాశ, నిస్పృహల్ని పోగొట్టి మానాన్న వంటి దేశభక్తుల హృదయాల్లో బ్రాగాంకా పత్రికావ్యాసం ధైర్యస్థైర్యాలను పురిగొల్పింది. ఈ పత్రికా వ్యాసం ఫలితంగా పోర్చుగీసు పాలకులు గోవా ప్రజల మనో భావాలను అర్థం చేసుకుని వాళ్ళపూర్వపు హక్కులను పునరుద్ధరిస్తారని మానాన్న, తక్కిన దేశ భక్తులూ ఆశించారు.

రోజులూ, మాసాలు గడిచాయి. మా నాన్న ఆశలేవీ ఫలించలేదు; ఆయన మనస్సుకు ఊరట కలగలేదు. ఆయన మానసిక దౌర్బల్యం అంతకంతకు అధికమైంది. ఏదో భయంకరమైన జాడ్యం ఆయనను పట్టినట్లు బాధపడసాగాడు. మా అమ్మ జీవితంకూడా దుఃఖభాజన మయ్యే దుర్దినాలు సమీపించాయి. వర్షకాలం వెళ్ళిపోగానే ధనికులైన మా వూరి భూస్వాములు మా నాన్నను సంఘబహిష్కృతుణ్ణి చేశారు. ఈ దారుణ వార్త మా అమ్మచెవిన పడ్డది. ఆమెగుండె ఆగిపోయినంత పనైంది. ఆనాటినుండి మా అమ్మ జీవితం దుర్భరమైంది.

రెండు సంవత్సరాలుగా గోవా ఆర్థిక పరిస్థితులు మరింతగా దిగజారి పోయినాయి. కొబ్బరికాయలధర పడిపోయింది. మా వూరి భూస్వాముల ఆదాయమంతా ముఖ్యంగా కొబ్బరికాయల వ్యాపారం మీదనే. తమ వ్యాపార లాభాలు దెబ్బతినడంతో వాళ్ళ కత్తి కార్మికుల మీద పడబోతున్నది. కూలీరేటు తగ్గించి వేయడానికి భూస్వాములు సాంటానా యింట్లో సమావేశమై చర్చిస్తున్నారు. సాంటానా మా

గ్రామంలోకల్లా పెద్ద ధనికరైతు. రైతు పెద్దలందరూ సమావేశానికి హజరైనారు.

ఈ సమావేశానికి మా నాన్నగూడా ఆహ్వానించ బడ్డాడు. సాంటానా సమావేశాన్ని ప్రారంభిస్తూ, యీ మాంద్యపు రోజుల్లో కూలీలకు పూర్వపురేట్లు యివ్వడం అసంభవమనీ, ఆత్మహత్యా సదృశమనీ గంభీరంగా ఉపన్యసించాడు. ఇప్పటికన్నా చెడురోజులు ముందు రాబోతున్నాయనీ, కూలీరేటు తగ్గించకపోతే, తమ భవిష్యత్తు తమ బిడ్డల భవిష్యత్తు యింతటితో ఆఖరేనని హెచ్చరించాడు.

"ఇకముందు కూలీరేటు యెంత యివ్వాలని మీ అభిప్రాయం ?" అడిగాడు ఫ్రాన్సిస్కో కాస్టా. "పూర్వపురేటులో సగంవరకు కోసి వేయడమా లేక రోజుకు యెనిమిదణాలు యివ్వమనా మీ సలహా ?"

"ఇప్పుడు రోజుకు పన్నెండణాలు యిస్తున్నాంగదూ! ఇకముందు పదణాలు యిస్తే సరిపోదూ ! రెండణాల తగ్గింపుకు వాళ్ళయినా అట్టే భాధపడరు !" అన్నాడు సౌసా.

"వాళ్ళు బాధపడితే మనకేం, పడకపోతే మనకేం ! మన బాధలేవో వాటినే మనం ముందు ఆలోచించుకోవాలి. ఈ కూలీ కుంకలకు ఖర్చా పాడా ! చూడండీ ! మనకెంత అలవిమాలిన ఖర్చో ఇంత పెద్ద కుటుంబాలను మనం పోషించుకోవాలా మరి ! పిల్లలకు చదువులు చెప్పించుకోవాలామరి ! వాళ్ళకు చక్కని దుస్తులు తొడగాలి ! ఎనిమిదణాలిస్తే చాలదూ వాళ్ళకు ?" అన్నాడు సాంటానా.

కూలీరేటు తగ్గింపు విషయమై వాదోపవాదాలు జరుగుతున్నాయి. మా నాన్న మౌనంవహించి సంభాషణలు వింటున్నాడు. ఆయన అభి

ప్రాయం గూడా చెప్పమని సాంటానా కోరాడు; మా నాన్న నిర్మొగ మాటంగా చెప్పిన అభిప్రాయం వాళ్ళకు రుచించక కోపం వచ్చింది.

"మీ ఉద్దేశ్యాలతో నేను ఏకీభవించను. ఈ నాడు కొబ్బరికాయల ధర కొంచెం తగ్గినమాట నిజమే. ఈ సాకుతో కూలీరేటు తగ్గించడం అన్యాయం. ఒకప్పుడు కొబ్బరికాయల ధర ఆకాశాన్నంటి అమ్ముతుంటే కూలీ రేటు ఒక దమ్మిడీ అయినా పెంచామా చెప్పండి? అలాంటప్పుడు యీ నాడెందుకు తగ్గించాలి కూలీరేటు?" అన్నాడు మా నాన్న నిగ్రహంతో ప్రశాంతంగా.

సాంటానా మా నాన్న వంక చురచురా చూసి, "నీ కర్థం కాదులే బాబూ! మన హక్కులనూ, మన ప్రయోజనాలనూ యిప్పుడు మనం మనని రక్షించుకుని తీరాలి! పూర్వపు ప్రశంస మన కెందుకిప్పుడు? ఎన్నో సంవత్సరాలుగా మనం పన్నెండణాలకు తీయిస్తూ వచ్చాం. అప్పటికే అది పెద్దకూలి! ఎందుకూ పనికిరాని యీ సోమరి పోతులకు పన్నెండణాల కూలీ ఆ రోజుల్లో చాలా యెక్కువే. అది వేరే విషయంలే. జరిగి పోయిందేదో జరిగి పోయింది. ఇప్పుడు ప్రస్తుత విషయాన్ని గూర్చి ఆలోచించాల్సి ఉంది. కొబ్బరి ధర పూర్తిగా పడిపోయింది. పూర్వపు రేటే యిప్పుడూ యివ్వడం సాగిస్తే, మనం బతకలేం" అన్నాడు.

తక్కిన పెద్ద రైతులంతా "సరేలెండి! సరేలెండి!" అంటూ తలలాడించారు. కాని మా నాన్న ఆయన అభిప్రాయాన్ని కుండబద్దలు చేసి చెప్పాడు.

"మీ ధోరణీ, మీ నిర్ణయాలూ పూర్తిగా అన్యాయం, అక్రమం అనినా ఉద్దేశ్యం. మీ నిర్ణయాలను నేనామోదించను. వాటికి బద్ధుణ్ణి

కాలేను. కూలీలిప్పటికే యెన్నో బాధలు పడుతున్నారు రేటుచాలక. మీ రిప్పబోయే యెనిమిదణాల రేటుతో వాళ్లకిక ఒంటిపూట భోజనమే గతి!" అన్నాడు మా నాన్న.

"ఏమిటీ! కూలీల పక్షాన యెన్నాళ్లనుంచి పకాల్తా పుచ్చు కున్నావు? వాళ్ల సంరక్షకుడుగా యెన్నాళ్లనుంచి పనిచేస్తున్నావు బాబూ? సిగ్గూ లజ్జా వదిలి ఆకూలీ వెధవలతో కలిసిమెలిసి నీవు గూడా పొలంపన్లు చేస్తూఉంటే, నీకవమానం, లజ్జా లేకపోతే, మేం భరించ లేకపోతున్నాం - తెలుసా! నీపైన మాకెంత రోత పుట్టిందో నీకు తెలియదు! చేసింది చాలక, నీ ప్రయోజకత్వం చాటుకోడానికి మా నిర్ణ యం అన్యాయమని చెప్పడానికి వచ్చావా! ఇంత సాహసమా నీకు! ఇదినీకు మర్యాద లక్షణం కాదు!" అన్నాడు సాంటానా ఉగ్రుడై.

భూస్వాముల వైఖరికి మా నాన్నకు నవ్వువచ్చింది లోలోపల. పైకి చిరునవ్వునవ్వుతూ వాళ్లను చూసి, "మీరు పిలిస్తే యిక్కడికి వచ్చాను. నా అంతట నేను తగుదునమ్మా అని రాలేదు. ఎవ్వరూ అడగందే నేనుముందు కొచ్చి నా అభిప్రాయం తెలియ జేయడంలేదు. సాంటానా నన్నడిగాడు; నా మనస్సుకు తోచిన అభిప్రాయం నేను చెప్పాను. కూలీలను గురించి ఒక్కటే అభిపా్రియం చెప్పదల్చు కున్నాను మీకు — వాళ్లు సోమరి పోతులనీ, యెందుకూ పనికిరాని వాళ్లనీ సాంటానా నిరసన భావముతో మాట్లాడాడు. వాళ్లు సోమరిపోతులూ కారు; యెందుకూ పనికిరాని వాళ్ళూ కారు. మనసమాజంలో సోమరి పోతులూ, పనికిరాని వాళ్లూ యెవరైనా ఉన్నారంటే. వాళ్లు మీరూ, మీవంటి యిత రులూ. మీ జన్మలో ఒక్కరోజైనా మీరు కష్టించి పనిచేసి గౌరవంగా బతికారూ?" అన్నాడు.

సాంటానాకు మా నాన్న మీద పడి నమలి మింగేద్దామన్నంత కోపం వచ్చింది. తక్కిన వాళ్లు గూడా ఆయన వంక కొరకొర చూడడడం మొదలెట్టారు కొడదామన్నంత కోపంతో. కాని మానాన్న నిలబడి వెళ్లబోతూ బోతూ, "మీ యిష్టం వచ్చినట్లు మీరు చేసుకోండి! మీకిష్టం లేకున్నా, నాపట్టుకు నేను పూర్వమిచ్చిన కూలీరేటే యివ్వదల చుకున్నాను. నేనొక వంక లాభాలు సంపాదించుకుంటూ, కూలీలకు అన్నంలేకుండా మాడ్చదలచుకోలేదు. మీరు చేసిన నిర్ణయాలకు మీరే తర్వాత పశ్చాత్తాప పడతారు!" అన్నాడు.

మర్నాడుదయం కూలీరేటు తగ్గింపు విషయమై భూస్వాములు చేసుకున్న నిర్ణయాన్ని కార్మికులకు తెలియజేశారు. కూలీలు వెంటనే మానాన్నదగ్గరకు పరుగెత్తివచ్చి, ఆయనగూడా యీనిర్ణయాన్ని ఆమో దించాడేమోఅని తెలుసుకున్నారు. పూర్వపురేటే ముందుగూడా తానివ్వ దలచుకున్నానని మానాన్న జవాబిచ్చాడు. తక్కిన భూస్వాములు కొబ్బ రితోటల్లో ఆనాటినుండి పనిచేయడం మానివేస్తామని చెప్పివేశారు కూలీలు.

మావూరి కూలీల్లో అధికభాగం భూస్వాములతోటల్లో పనిచేసి జీవితం గడుపుతారు. అయినా యెన్నికష్టాలనైనా భరించడానికే సిద్ధమై నారు వాళ్ళు. తమనిర్ణయాన్నుంచి వెనక్కు తిరగగూడ దనుకున్నారు కూలీలు. ఆరాత్రి ఎడ్వర్డ్ సారాయిదుకాణంలో కూలీలు సమావేశమై తమ నిర్ణయాన్ని మరోసారి ఖాయంచేసుకున్నారు. మర్నాడు, ఆతర్వాత రోజూ కూలీలందరూ యిండ్లవద్దనే ఉండిపోయారు. భూస్వాములు కూలీలను భూములనుండి వెళ్ళగొడుతామని భయపెట్టసాగించారు.

మా మతగురువుగూడా భూస్వాముల పక్షికనచేరి అన్నివిధాలా వాళ్ళకు సాహాయపడుతున్నాడు. తర్వాత ఆదివారంనాడు మతగురువు

గంభీరోపన్యాసం చేస్తూ. భూస్వాములపట్ల కూలీలు చూపిస్తున్న ఆ విధేయతకు వాళ్ళను తీవ్రంగా విమర్శించాడు. త్వరలో వాళ్ళ పద్ధతులు మార్చుకుని సన్మార్గంలో పడకపోతే, దేవునిశాపం వాళ్ళను విరుచుకు తింటుందని హెచ్చరించాడు. సూటిగా మానాన్నపేరు మతగురువు ఉదహరింపకపోయినా, కూలీల ఉద్యమానికి వెనుకఉండి ప్రోత్సాహ మిచ్చే వాళ్ళుగూడా దేవుని ఆగ్రహానికి గురికావలసి వస్తుందని సూచించాడు. కూలీల నిర్ణయానికి వెనక అండగాఉన్న వ్యక్తి మానాన్నే అని గ్రామ రైతులంతా గ్రహించుకున్నారు. స్త్రీలను సంబోధిస్తూ, తమ భర్తల కింతబుద్ధిగరపి, కూలీలను వెంటనే తగ్గింపు రేట్లప్రకారం పనిలోచేరమని చెప్పవలసిందిగా మతగురువు సలహాయిచ్చాడు.

కాని మతగురువు గంభీరోపన్యాసంగాని. తమ స్త్రీల ప్రబోధం గానీ కూలీల నిర్ణయాన్ని తిప్పలేక పోయాయి. వాళ్ళ కోర్కెలు తీరే వరకూ యిండ్లల్లో నుంచి కదలమని దీక్షతో కూర్చున్నారు. వారం రోజులవరకూ కూలీలు పనిపాటలులేక యిండ్లవద్దనే ఉండిపోయారు. తర్వాత బొంబాయికో, మరో పట్టణానికో పనికోసం వెళ్ళిపోతామని బెదురుపెట్టారు. కూలీల పట్టుదల సడలే సూచనలేమీ కనుపించలా భూస్వాములకు. గత్యంతరం లేక, పాత కూలీ యివ్వడానికే నిశ్చయించుకున్నారు.

ఇంతటితో యీ సమస్య పరిష్కారమైంది. కూలీల అభేద్యమైన ఐక్యతకు భూస్వాములు భయపడి, యెప్పటిలాగనే వాళ్ళను ఆదరణతో చూశారు. కాని మా నాన్న యెడల అప్పట్నుంచీ క్రౌర్యం చూపిస్తునే ఉన్నారు. మా నాన్నను ద్రోహిగా, తిరుగుబాటు దారుగా చిత్రించి ఆయన్ను తమనుంచి వెలివేశారు భూస్వాములు.

ఈ సంఘటన మా అమ్మ మనస్సును మరింత కుంగదీసింది.

---

## 3

ధనిక భూస్వాములు ఆ నాటినుండి మా నాన్నయెడల చూపిస్తున్న క్రౌర్యానికి మా అమ్మ మనస్సులో ఆ వేదన బయల్దేరింది.

కాని మా నాన్న యెంతమాత్రమూ పట్టించు కోలేదు. భూస్వాముల క్రౌర్యం వారినైజస్వభావమే అనుకున్నాడాయన. ఆయన్ను బాధ పెడుతున్నదీ. చీకాకు పరుస్తున్నదీ పోర్చుగీసు పరిపాలన ఒక్కటే. పోర్చుగీసు నియంతృత్వం మా మెడలకు ఉచ్చువేసి మా ప్రాణాలను బలిగొంటున్నది. రోజురోజూ నీచాతినీచమైన అవమానాల పాలౌతున్నాం. మాలో మిగిలిన కాస్తంత వ్యక్తిత్వం, ఆత్మగౌరవం స్వాతంత్ర్యాభిమానాలను యీ నియంతృత్వం సమూలంగా నాశనం చేయడానికి పూనుకొన్నది.

మా నాన్నా, అమ్మా వాళ్ళ బాధలను తలపోసుకుంటూ దుఃఖమయమైన జీవితం గడుపుతున్నారు. మాయింట్లో పూర్వమున్న ఉత్సాహం, ఆనందం యీనాడు లేవు. ప్రేతకళ ఆవహించినట్లున్నది మా యిల్లు. ఒక సంవత్సరం గడిచింది. మా ఆంటోనియోకు సంవత్సరం పరీక్షలు పూర్తయి యింటికి వస్తున్నాడు. మేమంతా ఆనందంతో ఉప్పొంగి పోతున్నాం. ఆంటోనియో మమ్మల్ని విడిచి వెళ్ళి ఆరు సంవత్సరాలైంది. ఆరేండ్ల తర్వాత వాడెలా మారిపోయి ఉంటాడో అని మనస్సుల్లో ఊహించుకుంటూ ఆశ్చర్య పోతున్నాం.

ఆంటోనియో తిరిగి యింటికి వచ్చేరోజది. కోడికూయగానే మాఅమ్మ నిద్రమేల్కొన్నది. అలమారాలు సర్దుతూ, పెట్టెలు తీసివేస్తూ,

చెంబులు, తపేలాలు సవరిస్తు, మా అమ్మ సందడిచేయ నారంభించింది. ఈశబ్దానికి మేమంతా మేల్కొన్నాం.

"ఎందుకమ్మా తెల్లవారుఝామునే లేచి యింత గొడవచేస్తున్నావ్ యివ్వాళ ?" అన్నది రూత్ చిరచిరలాడుతూ.

"లే! లే! వెంటనేలే! మీఅన్నయ్య వచ్చేరోజుగూడా సోమరితనంగా ఉంటే యెలా అమ్మా!" అంటూ మా అమ్మ మందలించింది. మేరియానూ లక్ష్మినీగూడా కేకవేసి, మా నాన్నగదిలోకి వచ్చి ఆయన్ను గూడా లేపింది.

"ఏమిటే యివ్వాళ నానా హంగామా చేస్తున్నావ్ యిల్లంతా! ఎందుకింత పెందలాడే లేచావ్ ? ఇల్లంతా నీ గొడవతో ఒక కొలిక్కి తెచ్చావ్!" అన్నాడు మా నాన్న.

"ఏమీలేదండీ!" అన్నది మా అమ్మ అమాయకంగా యేమీ యెరుగనట్లు. "మీరు నిద్రలేచి గుడ్డలు వేసుకుని బయల్దేరేవేళ అయింది."

"ఎందు కప్పుడే ? ఏం జేయమంటావ్ యిప్పట్నుంచీ ? నీకు వేళయితే లోకులందరికీ వేళకావద్దూ ? ఇప్పుడప్పుడే పోయి పోర్టర్లను నిద్రలేపమంటావా ఏం ?"

చివరకు మా నాన్న ఒక్కడే మద్రాసుకు పోయి అంటోనియోను వెంటబెట్టుకు రావాలని నిర్ణయం జరిగింది. ఆ రోజు ఉదయం రైలుకు దిగేదీ, సాయంత్రం రైలుకు దిగేదీ అంటోనియో మాకు స్పష్టంగా వ్రాయలేదు. ఎందుకైనా ముందుగానే వెళ్ళడం మంచిదని ఆ ఉదయాన్నే బయల్దేరి స్టేషన్లో కనిపెట్టుకొని కూర్చోడానికి నిశ్చయించుకున్నాడు మా నాన్న. కాని అంతకు ముందుగానే వెళ్ళి విసుగుపుట్టేటట్టు కూర్చోడం

నిజాని కాయన కిష్టంలేదు. అప్పుడప్పుడూ బస్తీకి పోయి కులాసాగా కాలక్షేపం చేసిరావడం ఆయన కిదివరకు సరదాగా వుండేది. వెళ్ళినప్పుడల్లా ఆయన సహాధ్యాయుడు గ్రాషియస్ కాస్టాను ఒకసారి కలుసుకుని ముచ్చట్లు చెప్పి మరీ తిరిగి వచ్చేవాడు. కాస్టా మార్గో నగరంలో ఒక పెద్ద భవనంలో నివశిస్తూ వుండేవాడు.

"ఉత్తరం వ్రాసేటప్పుడు అంటూ తలకాయ యెక్కడుందో! ఎవతెనో ఒకదాన్ని అంటగట్టుకొని అక్కడ విడిచిపెట్టి రావడంలేదు గదా!" అన్నాడు మా నాన్న అమ్మతో.

దిగాలుపడి చూసింది మా అమ్మ. "అక్కడికి పోయిన తర్వాత మనవాడు అల్లరి పూర్తిగా మానేశాడనే నా నమ్మకం. వాడి ఆటకాయతనం మన వూరితోనే వదిలిపోయి ఉంటుంది."

మా నాన్న మా అమ్మ మొహం చూసి, ఆడపిల్లమాట వినపడగానే ఆమె మనస్సు చీకాకుపడడం తెలుసుకున్నాడు. ఆ ధోరణి మరిచిపోయేట్లు చేయడానికి ఒకసారి ఆమెను నవ్వించడానికి ప్రయత్నించాడు.

"నీవూ నీ పిచ్చి ఆలోచనలూ చాలించు! ఆడపిల్లల మాట వినగానే యెందుకలా ఉలిక్కిపడతావ్? ఆడపిల్లలు మగపిల్లలకు కాకపోతే మరెవరికేం! వయసు వచ్చిన మగకుర్రాడు ఆడపిల్లల వెంటపడ కేం చేస్తాడేం? మగకుర్రాళ్ళు మగకుర్రాళ్ళలాగానే వ్యవహరించాలి. వాడు నా కొడుకే. వాడికి నా బుద్ధులు పట్టుబడకపోతే, మరెవరి బుద్ధులు పట్టుబడ రాయంటావ్! వాడి వయస్సులో నే నెలా ఉన్నానో నీకు తెలుసుగా! ఎందుకు వాణ్ణి నిందిస్తావ్?"

మా నాన్నను మందలించినట్లుగా మా అమ్మ అయనవంక చూడసాగింది తీక్షణంగా. "మీరు చేసిన ప్రతాపాలు చెప్పుకొని గర్వపడుతున్నారు పైగా! మీరు నిజంగా సిగ్గుపడాలి!"

లక్ష్యం చేయనట్లుగా మా నాన్న చిరునవ్వు నవ్వి మాట్లాడక ఊరుకున్నాడు.

అప్పుడే తెల తెలవారుతూంది. సూర్యోదయం కాలే దింకా. రైతులూ, కూలీలూ పొలం పన్లమీద బయల్దేరి పోతున్నారు. మా నాన్న గూడా ప్రయాణమైనాడు మార్గోకు. మా నాన్నను సాగనంపి వచ్చిన మా అమ్మా, చెల్లాయయూ, అక్కలూ, యింటిపనుల్లో నిమగ్నులై మా అంటోనియోకు ఘనంగా స్వాగతమివ్వడానికి అన్ని యేర్పాట్లు చేస్తున్నారు. మా అమ్మ కోళ్ళ సాపట్లోకి పోయి ఒక పెద్ద కోడిని చంపి కూర వండడం మొదలెట్టింది. మేరియా, రూత్ యిల్లంతా పరిశుభ్రంగా కడిగి తుడపడం మొదలెట్టారు. అంటోనియో పడుకుండే గదిని మరీ పరిశుభ్రంగా తయారు చేశారు. వాడి మంచంపైన చక్కని పరుపువేసి అందమైన బెడ్‌షీట్ పరిచి వుంచారు. ఇంట్లోవున్న బల్లలూ, కుర్చీలూ యెక్కడివక్కడ సర్ది వుంచారు. హాలు మధ్యలో పూలతొట్టి అలంకరించి సిద్ధంచేశారు.

"బాబూ, నీవు పోయి వరండాలో కూర్చొని బండి రాగానే కేక వేసి మాకు చెప్పు!" అన్నది నాతో మా అమ్మ. నేను పనీపాటా లేక రూత్‌ను అదేపనిగా యేడిపిస్తున్నా ఆ సమయంలో. వెక్కిరించి వెక్కిరించి దాన్ని కవ్విస్తున్నా.

"ఏమిటో అమ్మా! ఇప్పట్నుంచే చెంపుకే వరాండాలో. రైలు తొమ్మిది గంటలకుగాని రాదు. మనవాళ్ళు యింటికొచ్చేసరికల్లా కనీసం పదకొండు గంటలౌతుంది" అన్నాను నేను.

"ఉదయం రైలు దిగితేనే పదకొండు గంటలకైనా మనవాళ్ళు రాగలిగేది. అసలు ఉదయం రైలులో దిగుతాడో దిగడో! అదిగూడా అనుమానమే!" అన్నది రూత్.

"వాడు తప్పక ఉదయం రైల్లోనే వస్తాడనుకుంటాను. లేకపోతే మీ నాన్న కోపంతో మండిపోడూ!" అన్నది మా అమ్మ.

చర్చి శిఖరంమీదుగా సూర్యబింబం మెల్లమెల్లగా పైపైకి వస్తున్నది. అప్పుడే సూర్య కిరణాలు వేడెక్కుతున్నాయి. కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నాయి. వరండాలో వున్న రాతి బెంచీమీద కూర్చుని మా అన్నయ్య వాళ్ళ కోసం యెదురు చూస్తున్నాను. పక్షులు రెక్కలాడించుకుంటూ నలువేపులకూ యెగిరిపోతున్నాయి ఆహారం కోసం. పొలాలకు పోతున్న కూలీలు ఈలలేస్తూ ఉషారులో వున్నారు. ఎక్కడ చూసినా కుక్కలు మొరుగుతూ రణగుణధ్వని చేస్తున్నాయి. సంచులు బుజాన వేసుకుని పసిబిడ్డలు బడికి పోతున్నారు. ఆ నాటుదయం మా మనస్సుల కెంతో ఉత్సాహంగా వుంది. మా ఉత్సాహాన్ని ప్రకోపింపజేయడానికా అన్నట్లు ఒక పక్కనుంచి నులివెచ్చని గాలి వీచసాగింది. దూరాన కనిపిస్తున్న ఆ సరస్సులో తుపాకిశబ్దం వినిపించింది. ఎవరో వేటగాడు యే అడివిబాతునో కొట్టి ఉంటాడనుకున్నాం.

మా గ్రామం ఎంతో అందంగా ఉంది. ఆరోజు ఉదయం వరండాలో కూర్చుని, చెట్లవంకా, ఆకాశంవంకా, యెర్రబారిన ఆ రోడ్డువంకా చూస్తుంటే నా మనస్సుకెంతో ఆహ్లాదంగా ఉంది. నా కెక్కడలేని సంతృప్తి కలిగింది. ఏమో! నా రోగం నయమై ప్రాణాలతో బయటపడడం నా మంచికే వచ్చిందేమో అనుకున్నాను. నేను ముందు ముందు హైస్కూల్లో, కాలేజీలో చదువుకోవాల్సిన రోజులుంటే, నేనా గ్రామాన్ని వదిలి యెలా పోగలను? ఇలాంటి ఇలోచనలు నాకెన్నో జ్ఞప్తికివచ్చి నాలో నేను ఆనందిస్తుంటే, యింతలో రూత్ వెనుకపక్కనుండి వచ్చి నా ఆనందానికి భంగం కల్గించింది.

"అరేయి! కునికిపాట్లు పడుతున్నావా, మనవాళ్ళను కనిపెట్టి ఉన్నావా? మేమంతా అన్నయ్యావాళ్ళు యెప్పుడొస్తారా అని గుడ్లు విప్పుకొని నిరీక్షిస్తూంటే, నీకు నిద్రయెలా వచ్చిందిరా?" అన్నది రూత్.

"అఘోరించావులే! మూర్ఖంగా ప్రవర్తించబోకు! నేనేమీ నిద్ర పోవటంలేదు తెలుసా!" అన్నాను.

"నిద్ర పోబోకురా! అన్నయ్యవాళ్ళు వస్తారని అమ్మ బలే ఉత్సాహపడుతుందిరా! నీవు నిద్రకు పడ్డావేమో అని అమ్మ చూసి రమ్మని నన్ను పంపింది!" అన్నది రూత్.

"అమ్మకు చెప్పు! కూర్చుని కూర్చుని ప్రాణం విసిగిపోతున్నా నేను క్షేమంగా బతికే ఉన్నానని చెప్పు. అమ్మను నే నభినందిస్తున్న ట్లుగా గూడా చెప్పు" అన్నాడు పరిహాసంగా.

"వాళ్లొచ్చేవేళ కావచ్చిందిరా! బండి కనబడగానే మాకు కబురు చేయి!" అంటూ రూత్ లోపలికెళ్ళింది.

వంటగదిలోనుంచి గుప్పున వాసనకొట్టింది. రకరకాల కారం, తీపి పిండివంటలు, మాసం కూర, సువాసనలు వెదజిమ్ముతున్నాయి. నా నోరూరడం మొదలెట్టింది. ఒక్క నిమిషంగూడా ఓర్చుకోలేక పోయాను. వంటగదిలో యేమేమి. యెలా తయారౌతున్నాయో స్వయంగా చూసి తృప్తి తీర్చుకుందామనుకున్నాను. కర్ర సహాయంతో వెంటనే వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. మా అమ్మ నన్నుచూడగానే దయ్యాన్ని చూసి భయపడ్డట్టు కేకవేసింది. అక్కడున్న వాళ్ళంతా నామీద ఒక్క సారిగా విరుచుకుని పడ్డారు. నేను వంటయింట్లో అడుగు పెట్టగానే బండి వాకిట్లోవచ్చి నిలబడ్డదేమో అని కంగారుపడుతూ, వెంటనే నన్ను వాకి ట్లోకి తరిమారు ఊపిరాడనివ్వక.

"ఇక్కడి కొచ్చావురా నీవు!" ఆశ్చర్యపడి అన్నది మా అమ్మ. "వాళ్ళొచ్చేవేళగదా యిప్పుడు! ఎలావచ్చావురా యిప్పుడు? ఒక నిమిషం సేపు అక్కడే కూర్చొని కాలక్షేపం చేయరాదూ! ఇంతలో యేంపడి పోయిందని వచ్చావ్!"

"ఎంత విసుగెత్తిపోయిందో తెలుసా అమ్మా!" అన్నాను చిరాకుతో.

"మంచివాడవుగదూ నీవు! ఇంకొంచెంసేపక్కడే ఉండుపో! ఊరిబయటికి వచ్చి ఉంటారీపాటికి!" అన్నది మా అమ్మ బుజ్జగిస్తూ.

"పోరానీవు! ఏపని అప్పగించినా సార్లాచేయవు!" అంటూ రూత్ వంటగదిలోనుంచి బయటికి గెంటడం మొదలెట్టింది.

మేరియాగూడా నన్ను సమీపించి దాని సహజ ధోరణిలో మృదువుగా, "నాన్నా వెళ్ళుబాబూ! వెళ్ళు! బండి ఆగగానే ఒక్క కేకపెట్టు! పోతావుగదూ! బుద్ధిమంతుడ వనిపించుకో!" అని బతిమాలింది.

వరండాలోకి వస్తూవస్తూ భోజనాలగదిలో గోడకు తగిలించివున్న గడియారం చూశాను. అప్పటికే పదకొండు దాటింది. మావాళ్లొచ్చేవేళ అయిందనుకున్నాను. వచ్చి మళ్ళీ నా సీటులో కూలబడ్డాను. టిక్కు టిక్కున నిముషాలు కొట్టసాగింది యథాప్రకారంగా. కాలం మందంగా, విసుగ్గా సాగిపోతున్నట్లుంది. అరగంట యెట్లాగ్గింది తెలాగో. మా నాన్నా వాళ్ళొ వచ్చే సడీసందడీ యెక్కడా వినపళ్ళేదు. యిహ కూర్చోలేక పోయాను. సహనం దాటిపోయింది. ఒక చిన్న తమాషా చేయాలని బుద్ధిపుట్టింది.

"రండి! రండి! మనవాళ్ళరుగో రానే వచ్చారు!" అంటూ నా కంఠం యెత్తి పెద్దగా అరిచాను. ఎక్కడిపని అక్కడ వదిలేసి, ఒక్క పరుగులో మా అమ్మావాళ్ళు వరండాలోకి వచ్చిపడ్డారు.

"ఎక్కడరా ఎక్కడ ? ఏరీ ?" అంటూ ఒక్క గొంతుకతో అరిచారంతా.

"అరుగోనే అక్కడ ! కనిపించలా ?" అంటూ వాళ్లదృష్టిని రోడ్డుమీదకు మళ్లించి విరగబడి నవ్వాను. కొంటెతనానికి అలా అరిచానని మా అమ్మవాళ్లూ గ్రహించి తిట్టడం ప్రారంభించారు.

ఇలా మూడు సార్లు వాళ్లను యేడ్పించాను. వాళ్లు నాతో విసుగెత్తిపోయి, నేనక్కడినుంచి లేచిపోతే అంతేచాల్లెమ్మని పంపివేశారు. అప్పటికి మధ్యాహ్నమైంది. చర్చిగంట గణ గణ మోగింది. దిక్కులు ప్రతిధ్వనించాయి ఆశబ్దానికి. మధ్యాహ్నం అన్నాలకు రైతులు, కూలీలు యిండ్లకు చేరుకోవడం ప్రారంభించారు.

"అబ్బాయి ! నీవు సాయంత్రంగూడా వరండాలోనే ఉండిమనవాళ్లను కనిపెట్టి ఉండాలి ! ఆంటోనియో తప్పకుండా సాయంత్రం టంఏకి వచ్చిచేరుతాడు !" అన్నది మా అమ్మ భోజనం చేస్తూ.

"నిలివెడెత్తు ధనం పోసినా నేను కూర్చోనమ్మా యీ సారి ! స్పష్టంగా చెబుతున్నాను. సాయంత్రం మేరియానో, రూర్నో కూర్చోమనరాదూ ! కూర్చుని కూర్చుని కాళ్లు కండెలు కట్టిపోతేనూ !" అన్నాను.

మా అమ్మ మాట విననప్పుడల్లా ఆమె నావంక చురచుర చూడడం అలవాటు. ఈ మాట అనగానే మా అమ్మ నన్ను యీ సారిగూడా అలాగే చూసింది. సహజంగా అందంగా ఉండే మాఅమ్మ కళ్లు కోపిష్టి చూపులతో ఆమె మెల్లకన్నుతో చూసినట్లుంది నావంక.

మా అమ్మ కళ్లలోతుగా దయారసం చిందిస్తూంటాయి. ఒక విధమైన మెరుపు మెరుస్తూంటుంది ఆమె కళ్లలో. ఆమె ముక్కు

సంపెంగ పువ్వులాగా చిన్నదిగా ఉంటుంది. మా అమ్మ ముఖంలో అందమైన అవయవాలీరెండే. మా అమ్మ చక్కనిదనే చెప్పవచ్చు. ఆమెను పెండ్లాడినప్పుడు దొండపండులాగా యెర్రగా ఉండేదని మా నాన్న యెప్పుడూ చెబుతూండేవాడు.

వయసుమళ్లి, దిగుళ్లు వెంటబడడంతో ఆమె అందచందాలూ, నాజూకుదనం, ఛాయా అన్నీ దెబ్బతిన్నాయి. ఆమెతల వెంట్రుకల్లో యెక్కువభాగం నెరసి పోయాయిగూడా.

మేరియా నన్నీపీడనుండి విడిపించదలచి, "సాయంత్రంగూడా వాడినే కూర్చోమంటావెందుకే అమ్మా? సాయంత్రం రైలు ఆరు గంటలకుగాని రాదు. అప్పటికి మన పనంతా పూర్తవుతుంది! మన మంతా వరండాలోనే కూర్చుని కనిపెట్టుకుందా వచ్చు!" అన్నది.

"నిజమేనే అమ్మాయ్? ఈ లోగా అట్నుంచి వచ్చేబండేదీలేదా? అన్నది మా అమ్మ అనుమానంగా.

మా అమ్మకు మేరియా యెంతో ధైర్యం చెప్పినా సాయంకాలం వరకూ ఆమె అనుమానంతోనే ఉంది. మావాళ్లు వస్తున్నారేమో అని అరగంటకొకసారి కిటికీవద్దకుపోయి తొంగి చూడడం మొదలెట్టింది. ఆరుగంటలలోగా మరోరైలు బండి ఉందని అప్పటికీ ఆమెకు అను మానమే. అస్తమానమైంది. నీలాకాశంలో నక్షత్రాలు మిణుకు మిణుకు లాడుతూ కన్పిస్తున్నాయి. ఇంటిల్లిపాదీ వరండాలోకిచేరి మా నాన్న వాళ్ల కోసం నిరీక్షిస్తూ కూర్చున్నాం.

"రైలు అందకపోవడమో, బొంబాయిలోనే దిగబడి పోవడమో జరగలేదుగద!" అన్నది మా అమ్మ.

"ఈ పాటికల్లా వాళ్లు రావాల్సిందేనే అమ్మా! ఎందుకురాలేదో!" అంటూ అనుమానం వెళ్లబెట్టింది మేరియా.

అంతకంతకు అంధకారం అలముకుంటూంది, మా అమ్మను అనుమానంతోపాటు భయంగూడా పెనవేసుకుంది.

"అసలు బొంబాయినుంచి బయల్దేరనే లేదేమోనే! అయినా బయల్దేర కుండా యెలా ఉంటారు? బయల్దేరకపోతే, కనీసం టెలిగ్రాం అయినా యివ్వడూ? ఏం మేరియా, ఏమేమంటావ్?........" అన్నది మా అమ్మ.

"మరీ పసి పిల్లవు కాబోకవే అమ్మా! వాడుతప్పకుండా బయల్దేరే ఉంటాడు. ఒక్కొక్కప్పుడు మార్గోస్టేటులో దిగగానే బండి గూడా దొరకడం కష్టం. తప్పకుండా వాడు రైలు దిగాడనే నాగట్టినమ్మకం. లేకపోతే నాన్నయెప్పుడో తిరిగి వచ్చేసేవాడు యింటికి!" అన్నది రూత్ నమ్మకంగా.

మేమంతా గంపెడాశతో యెదురు చూస్తున్నాం. త్వరలో వచ్చేట్లు చేయమని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాం. ఇంతలో దూరాన గంటల శబ్దం వినపచ్చింది! మేమంతా ఆతురతతో లేచి నిలబడ్డాం. తోచినట్లు యెవరికి వారు మాట్లాడాం. ఏ ఒక్కరూ రెండోమనిషి మాట పట్టించుకోలేదు. అందరి దృష్టి, అందరి మనస్సూ బండిపైనే వుంది.

"నీకు వినబడుతున్నదీ గంటలశబ్దం?" అందరూ యేకకంఠంతో అడిగారు.

"నిజంగా అది బండిగంటలే! అంటూ యింకా గట్టినమ్మకం కల్గించుకోడానికి రెండుమెట్లుదిగి మేరియావొంగిచూసింది!

"అవునే, నిజంగా అది మనవాళ్లబండే!" అంటూ అరిచి ఒక్క పెట్టున రాతి బండ మీదనుండి దూకింది రూత్.

"ఊరికే అరవక నిశ్శబ్దంగా ఉండి వినండి!" అన్నది మా అమ్మ విసుగ్గా. అప్పటికే ఆమె సహనం కోల్పోయింది. మేమంతా మా చెవులను రోడ్డువైపు రిక్కించుకుని సందడిని శ్రద్ధగా ఆలకిస్తున్నాం.

ఒకనిమిషం విన్నతర్వాత "అవును! అదిబండి శబ్దమే!" అన్నాను. నే నన్నది నిజమే అన్నట్లు తక్కిన వాళ్ళంతా మనస్సు కుదుటపర్చుకొని చెదిరిపోయిన వెంట్రుకలనూ, దుస్తులనూ సరిదిద్దుకున్నారు.

గంటల శబ్దం మరింత పెద్దగా స్పష్టంగా వినవచ్చింది. బండికి ముందుగా రెండు పక్కలా అమర్చివున్న రెండు దీపాలూ కంటబడ్డాయి. ఆ తర్వాత ప్రశాంత వాతావరణంలో గుర్రాల్ని అదిలిస్తున్న జట్కావాలా శబ్దం వినిపించింది. రోడ్డుమలుపు తిరిగి మా యింటి ఖాళీస్థలంలోకి వచ్చి ఆగింది బండి. మేమంతా ఒక్క గంతులో మెట్లుదూకి ఆంటోనియోను గాఢంగా కౌగలించుకున్నాం.

బండి ఆగకముందే ఆంటోనియో సంతోషంపట్టలేక, "అరుగో అమ్మా వాళ్ళూ!" అంటూ దూకి ముందు మా అమ్మనూ, తర్వాత రూత్‌నూ, ఆ తర్వాత మేరియానూ, చివరకు నన్నూ కౌగలించుకున్నాడు.

"నీ వెలా ఉన్నావురా బాబూష్? నీ కాళ్ళిప్పుడు కొంచెం స్వాధీనంలోకి వచ్చాయిగదూ? ఇప్పటికీ కర్రల సహాయంతోనే నడుస్తున్నావురా?" అంటూ ఆంటోనియో నా కాళ్ళు తాకి చూశాడు.

వాడి ప్రశ్నకు సమాధాన మివ్వలా నేను. కొంచెం దూరంగా చీకట్లో నిలబడున్న లక్ష్మిని వాడు పలకరించక పోవడం నేను చూశాను. "ఏంరా ఆంటూ! లక్ష్మిని పలకరించలేదేంరా?" అన్నాను.

"ఏదీ లక్ష్మి? ఎక్కడుంది? ఒహో యిక్కడున్నావా? ఎలా ఉన్నావు లక్ష్మి?" అడిగాడు ఆంటోనియో.

ఆపటయట అంధకారం నల్లని ముసుగులో పెనవేసుకుని పోయింది. మరో రెండణా లెక్కువ యిమ్మని మా నాన్నతో బండీవాడు జేరమాడుతున్నాడు. చీకట్లో శ్రమపడి తోలుకు వచ్చినందుకు మెహర్బానీ కావాలట జట్కావాడికి. మా అమ్మా, అక్క చెల్లెండ్లూ బండిపక్కనే నిలబడి ప్రయాణపు అనుభవాల్ని గురించి ఆంటోనియో మీద ప్రశ్నల వర్షం కురిపించారు.

"ఏంరా! అబ్బాయీ! ప్రయాణం విసుగు పుట్టించిందా నీకు? రైలో నిద్రపట్టిందా వాగా?" అన్నది మా అమ్మ ఆంటోనియోను దగ్గరకు తీసుకుని తల నిమురుతూ.

బండివాడితో మా నాన్న సమాధానపడ్డాడు. మేమింకా అక్కడే నిలబడి వున్నాం. ఎక్కడలేని ఉత్సాహంతో మా నాన్న, "ఇక్కడింకా యేం జేస్తున్నారు? ఈ రాత్రి యింట్లోకి పోవడమూ లేక ఆరుబయటనే పడుకుని నిద్రపోవడమూ?" అన్నాడు.

మీ కోసమే మేమంతా యెదురు చూస్తున్నాం లేండి!" అంటూ అందర్నీ మా అమ్మ లోపలికి తీసుకుని పోయింది.

మేమంతా లోపలికి వెళ్ళాం. కిరసనాయిలు బుడ్డి దీపం లోపల వెలుగుతూంది. దీపం ఎదట ఆంటోనియోను జాగ్రత్తగా ఆపాదమస్తకం పరిశీలించాను. వాడు చాలా యెత్తుగా పెరిగాడు. మా నాన్నకన్నా గుప్పెడున్నాడు. గడ్డం కిందటిరోజే చేసుకున్నాడు. తెల్లగారిన వాడి చర్మం పైన అప్పుడే మొలకలెత్తబోతున్న వెంట్రుకలు నిగనిగలాడుతూ

మెరుస్తున్నట్లున్నాయి. ఉంగరాలు తిరిగిన వాడి తలవెంట్రుకలు చూస్తే 'జిప్సీ' జాతివాడు జ్ఞాపకం వచ్చాడు. మా అమ్మ వాడిని ఆప్యాయంగా భుజంమీద తట్టుతూ, వీపుమీదకు మెల్లగా చేతులు పోనిచ్చి తర్వాత శరీరమంతా నిమిరింది. అంత స్వల్పకాలంలో తన తొలుచూలు కొడుకు తన కళ్ళ ఎదుటనే అజానుబాహుడైనాడని మా అమ్మ సంతోషంతో మురుసుకున్నది.

"లక్ష్మిని ఏ రోడ్డుమీదనో చూసి వుంటే, అసలు గుర్తుపట్టే వాడినే కాదు" అన్నాడు అంటోనియో. "దేవుని దయవల్ల లక్ష్మి కీనాటికి వయసు వచ్చి క్షేమంగా ఉంది". మమ్మల్నందర్నీ కుశలప్రశ్న అడిగిన తర్వాత అంటోనియో లక్ష్మిని గురించి ప్రస్తావన తెచ్చాడు.

లక్ష్మివంక అంటోనియో దయార్ద్ర హృదయంతో చూడసాగాడు. వాడితడిలతో మాట్లాడుతున్నప్పుడు గూడా లక్ష్మిని కనుకొలకుల నుండి ప్రేమాభిమానాలతో చూసేవాడు.

లక్ష్మి ఒక్క పొడగరిగా మాత్రమే మారలేదు. అపురూప లావణ్యవతియైన అందగత్తెగా గూడా రూపొందింది. ఆ పిల్ల అందానికి అంటోనియో తన్మయుడైనట్లు కన్పించాడు. అయినా పల్లెత్తు మాటయినా వ్యాఖ్యానం చేయక నిగ్రహం ప్రకటించగల్గాడు. లక్ష్మిని మెచ్చుకున్నట్లుగా అప్పుడప్పుడూ వాడు ఓరకంటితో చూస్తూ, ఆ పిల్ల సిగ్గుతో తల వంచుకునేట్లు మాత్రం చేస్తున్నాడు. ఆ నాటినుంచీ లక్ష్మి అంటోనియోను సూటిగా ప్రత్యక్షంగా చూడడం చాలించుకున్నది.

"కనీసం నీవైనా దాన్ని క్రైస్తవ పేరుతో పిలుస్తావని ఆశపడుతున్నానా" అన్నది మా అమ్మ.

"అదేం! అంతా యెలా పిలుస్తున్నా రా పిల్లను?" ప్రశ్నించాడు ఆంటోనియో ఆసక్తితో.

"ఇప్పటికీ ద్దాన్ని 'లక్ష్మి' అని పిలుస్తూనే ఉన్నారు. నే నెన్ని సార్లు అలా పిలవవద్దని కోరినా మానడం లేదు మనవాళ్ళు" అన్నది మా అమ్మ.

"అయితే నాకుగూడా 'ఫిలోమినా' అని పిలిచేకన్నా 'లక్ష్మి' అని పిలిస్తేనే చెవి కింపుగా ఉన్నట్లుందే అమ్మా!" అన్నాడు ఆంటోనియో.

మా నాన్న అక్కడే అలిసిపోయి పడక్కుర్చీలో పడుకున్నాడు. వొళ్ళంతా చెమట పోసిందాయనకు. "అరేయ్ ఆంటూ! నీ యిష్టం వచ్చినట్లు పిలవరా దాన్ని. పేరులో యేముంది? మగవాడికైనా, ఆడదానికైనా పేరునుబట్టి కాదురా ఉన్నత భావాలేర్పడేది!" మానాన్న ఒక్క చిరునవ్వు నవ్వి కన్నుగీటుతూ "ఎప్పుడూ 'స్వర్గం, స్వర్గం' అంటూ జపంచేసే మీ అమ్మను దేవత అని పిలవడం నాకు పూర్తిగా యిష్టం లేదురా" అన్నాడు.

మేమంతా విరగబడినవ్వాం. మామూలు ధోరణిలో మాఅమ్మ తన పరిహాసాలను కట్టిపెట్టమన్నది మానాన్నతో. ఆంటోనియో రాకతో సరదాకబుర్లూ, పరిహాసాలూ, నవ్వులూ మళ్ళీ తలెత్తాయి మా యింట్లో. ఆంటోనియో ఒక తమాషా సంఘటన పట్టిస్తూ, మమ్మల్ని పొట్టలు చెక్కలయ్యేట్లునవ్విస్తున్నాడు.వాడుచెప్పదలచిన ఉదంతంగూడా పూర్తయింది. అయినా మేమంతా ఆపుకోలేక యింకా విరగబడి నవ్వుతూనే ఉన్నాం. ఇంతలో యెవరో బయట తలుపు గుద్దినట్లు శబ్దం అయింది. ఎవరో కాదు; ముసలాయన అనిసిటో, లియొనార్డోలు. ఆంటోనియో వచ్చాడని విని, వాడిని కుశలప్రశ్నలడిగి పోదామని వచ్చారు మాయింటికి.

"నీవుచాలా పొడగరివైనావురా అంటూ! పూర్వంకన్న యిప్పుడు నునుపుదేలి మిసమిసలాడుతున్నావే!" అంటూయిద్దరూ ఆంటోనియోను కౌగిలించు కున్నారు. అక్కణ్ణుంచిలేచి మరికొంచెం దూరం పోయి, సంతలో కోడెదూడను కొనే రైతుల మాదిరిగా ఆంటోనియోను ఆమూలాగ్రంగా పరిశీలించారు. "నీ కొడుకును చూసినీబోటి తండ్రి నిజంగా గర్వపడాలయ్యా! అదృష్టవంతుడవయ్యా నీవు!" అన్నారిద్దరూ.

"నిజంగా గర్విస్తునే ఉన్నాను వాడిని చూసుకొని! వాడుగూడా నన్ను తలుచుకుని గర్వపడుతూనే ఉంటాడనుకుంటాను" అన్నాడు సంతోషంతో మానాన్న. కొందరు కొడుకులు నాలుగక్షరం ముక్కలు అబ్బగానే పొగరు తలకెక్కి తలిదండ్రులను చిన్నచూపుచూడడం వింటూనే ఉన్నాం. తండ్రులు వ్యవసాయం, బడిపంతుల్లాంటి చిన్న వృత్తుల్లో మర్యాదగా జీవనం చేస్తుంటే, పైకెక్కి వచ్చిన కొందరు కొడుకులకు యీసడింపుగా ఉంటుంది గూడా.

చిన్నతనంలో లియోనార్డో ఆంటోనియోతో కలిసిచదువుకున్నాడు ఇప్పుడతను బడిపదిలేసి వ్యవసాయం చేసుకొనీ, పాలమ్ముకొనీ జీవిస్తున్నాడు. ఆంటోనియో ఎంకచూసి తనకు వాడెంతో నచ్చినట్లుగా తల పంకించాడు. "నీవిప్పుడు పెద్దవాడివైనావోయ్ అంటూ! చిన్నప్పుడు జామపండ్లు తెమ్మని నన్ను తరిమేవాడివి జ్ఞాపకం ఉందీ నీకు?"

గోవా ప్రజలకు త్రాగుడు ప్రాణాధారం. విదేశాలనుండి దిగుమతైన సరుకుగానీ, నాటు సారాయిగానీ మాప్రాంతంలో నిర్విరామంగా, నిరాక్షేపణగా ప్రవహించాల్సిందే మంచినీళ్ళలాగా. స్నేహితులు అంతా ఒకచోటచేరి సరదాగా కబుర్లు చెప్పుకుంటున్న యిలాంటి సమయాల్లో తలా ఒక మోతాదు వేసుకోవాలని ఉర్రూతలూగుతుంటాం. ఇలాంటప్పుడు

కాక మాకెప్పుడు సరదా! అనుకున్నదే తడవుగా అలమారాలోనుంచి ఎచ్చి దూకుతాయి బుడ్లకు బుడ్లు.

"చదువు ముగించుకున్నావుగదా! నీవిప్పుడేం చేయదలచుకున్నావురా ఆంటూ?" అన్నాడు సారాయి చప్పరిస్తు రిమొనాల్డో.

"నాకు తెలియదురా! బహుశా బొంబాయిలో యేదైనా ఉద్యోగం దొరకవచ్చు. పరీక్ష ఫలితాలు బయటపడగానే, బొంబాయి వెడతామనుకుంటున్నాను!" అన్నాడు ఆంటోనియో.

"నీవు చదివిన చదువుకు ఉద్యోగం రాకపోవడ మేమిటి? తప్పక వచ్చి తీరుతుంది."

"అంత చౌకగాలేవురా ఉద్యోగాలీనాడు! బిఎస్సీ ప్యాసైన వాళ్లు గూడా ఉద్యోగం లేక పడున్నారు తెలుసా! ఎక్కే గడపా, దిగేగడపా! ఒక్కడైనా ఉద్యోగమిచ్చిన పుణ్యాత్ముడు లేడురా!" అన్నాడు ఆంటోనియో.

మామిడపండ్ల కాపును గురించి చర్చిస్తున్న మానాన్న యింతలో కల్పించుకుని, "ఆంటూ నాతోపాటు యింటిపద్దనే ఉండి వ్యవసాయ పనుల్లో నాకు సహాయ పడరాదూ! బతికిపోదును! నేను పెద్దవాడి నౌతున్నాను. చికో ఆఫ్రికాకు వెళ్ళిపోవడంతో, నేనిప్పుడు మరీ పంటరి వాడనైనాను. ఈ సమయంలో నాకు సహాయం కూడా అవుసరం" అన్నాడు.

మానాన్న అన్నమాటలకు ఆనిసిటో పెడమొహం పెట్టి "నీవి విచిత్రమైన ఊహలూ, కోరికలూనయ్యా; ఎప్పుడూ వ్యవసాయం, వ్యవసాయం అని అదేపనిగా ఆరాటపడతావు! నీ పొలమూ, నీవ్యవ

సాయపనులూ ఎప్పుడూ ఉండనే ఉంటాయి. కొడుకుల్ని వ్యవసాయంలో పెట్టదలచిన వాడివి దోసిళ్ళతో డబ్బుపోసి చదువెందుకు చెప్పించావయ్యా ? బస్తీలకు పంపి దువారా చేయడానికి డబ్బు మూలుగుతుందేమయ్యా నీదగ్గర ?" అన్నాడు అనిసెట్టో.

మా నాన్న ఉన్నతాశయాలూ, ఆయన మనస్తత్వం యెవ్వరికీ అర్థం కాలేదు. మా తాత ముత్తాలు సంపాదించి యిచ్చిపోయిన పొలాలూ, మా వూరూ, 'మావూరి పల్లెజనమూ అంటే మానాన్న కెంతో అభిమానం. ఆయనకా భూములే పంచప్రాణాలూ. ఆయన సర్వస్వం ఆ భూములే, తనచెమటా, నెత్తురుతో తడిపి పండిస్తూ వచ్చాడా భూముల్లో. మా కుటుంబాన్ని యీ స్థితికి తేవడానిక్కూడా ఆ పొలాలే కారణం. మాపొలాల్ని వదలి ఒక్కనిమిషం గూడా బతకలేడు మా నాన్న. మా పొలాలు పోయిన మరుక్షణం మాకు జీవితమే సున్న. విత్తనాలు యెదపెట్టింది మొదలు పంటలు నూరిపిళ్ళయ్యేవరకూ పచ్చ పచ్చని ఆ పంటపొలాలు చూసి ఆనందిస్తున్నప్పుడు సప్తస్వరాలను మేళవించే మధురగానంలో తన్మయత్వం చెంది లీనమై పోయినట్లే ఉండేది మానాన్నకు. అలాటి తన్మయత్వాన్ని మళ్ళ ఒక్కదేవుడే కలుగజేయగలడు. భగవత్ సృష్టిని ప్రేమించగల ఉత్తమమైన మానవులే అలాంటి ఆనందాన్ని అనుభవించ గలరు.

మా పొలాల భూసారమంతా మానాన్న రక్తంలో మిళతమై పోయింది. విచిత్రమైన స్త్రీగర్భకోశంలో వివిధ దశల్లో పరిణామం చెందే పసిబిడ్డ మాదిరిగా, భూమిలో విత్తునాటింది మొదలు, అదిపగిలి, మొక్కై, దశదిశలూ విస్తరించి, పుష్కలంగా మనకు వరిపంట యిచ్చే సృష్టివైచిత్ర్యాన్ని చూసి మానాన్న పొందే ఆనందానుభూతి వర్ణించలేం. సూక్ష్మరూపంలో ఉన్న ఒక్క వరిమొక్కలనేగాదు: మన్నూ, భూమి,

చెట్లూ చేమలూ, వాటిబోదెలూ, పూలూ, పిందెలూ, కాయలూ, పండ్లు యివన్నీ మనుష్యుల్లా తననెత్తురులో నెత్తురుగా, మాంసంలో మాంసంగా భావించుకునే మానాన్న, తనచేతులతో యెప్పుడూ వీటిని ప్రేమాభిమానాలతో స్పృశిస్తూనే ఉంటాడు.

అనిసిటోవంక మానాన్న చూసి, "ఎందుకయ్యా నీకు వ్యవసాయం మీద అంత యీసడింపు? వ్యవసాయం చేసుకుని నేను సుఖంగా బతకడంలా ! మనకండ్ల యెదట మనవూరి రైతులు పొలం దున్నుకుని సుఖంగా కాలంగడపడంలా !

అనిసిటో గ్లాసెడు సారాయీ ఖాళీచేసి ఒకసారి సకిలించాడు. "నిజమేనయ్యా మనమంతా సుఖంగానేఉన్నాం! అయినా యీ నాటి వరకూ వ్యవసాయాన్నిగూర్చి కూలంకషంగా తెలుసుకున్నామా చెప్పు ? ఎన్నాళ్ళుపోయినా గొర్రెకు జానెడేతోక అన్నట్లు మిడిమిడి జ్ఞానంతోనే యిన్నేళ్ళనుంచీ వ్యవసాయం మిడుకుతున్నాం! మీవాడుచూడు! త్వరలోనే బియ్యేడిగ్రీ సంపాదించబోతున్నాడు ! పిడుగయ్యా మీకుర్రోడు! అలాంటివాణ్ణితెచ్చి అస్తమానం అరకదున్నించి ఆపష్టలపాల్జేయకు. నీడపట్టున కూర్చుని యింత లెక్కాడొక్కా వ్రాసేవాణ్ణితెచ్చి చెమటలు పోసేట్లు పొలంపన్లు చేయిస్తావంటే నేనుమాత్రం యెలానమ్మతాను!" అన్నాడు అనిసిటో.

"ఆఫీసుల్లో పనిచేసేవాళ్ళకుమాత్రం చెమట పోయదనా నీ అభిప్రాయం? పొలంపనికి మనశరీరమంతా చెమటపట్టి ఆరోగ్యమైనా బాగుపడుతుంది. పాపం! ఆఫీసుల్లో పనిచేసే బుద్ధిజీవులకు శరీరాలుగాక వాళ్ళ ఆత్మలే చెమటపోస్తాయి. ఇది ఆరోగ్యానికి మంచిదికాకపోగా ఆయుర్దాయానికే ప్రమాదం.

ఏప్రిల్ నెల నక్షత్రాలతో ఆకాశం అలికి ముగ్గులుపెట్టినట్లు నేత్రానందంగా ఉంది. దక్షిణదిక్కుగా వీచే పిల్లవాయువులకు ఆరుబయట ఉన్న తాటిచెట్ల ఆకులు కదులుతూ దైవప్రార్థన చేస్తున్నట్లు శబ్దంవినిపించింది మాకు. ప్రకృతిసౌందర్యానికి మానాన్నలా తన్మయత్వంచెందిన ఆంటోనియో ఆకస్మికంగా అన్నంతినడం మానివేసి, చెవులు రిక్కించుకుంటూ తాటాకుల శబ్దంవిని ఆనందించటం మొదలెట్టాడు.

"మీరంతా వింటున్నారా ఆశబ్దాన్ని? ఎంత మధురంగాఉంది! మీతోపాటు యిక్కడుండి ప్రకృతి సౌందర్యాన్ని అనుభవించే అదృష్టాన్ని కోల్పోయాను యిన్నాళ్ళనుంచీ! తిరిగి యీనాటికి మళ్ళీ యీ గడపతొక్కడం నిజంగా నాకెంతో అదృష్టం పట్టినట్లుంది" అన్నాడు ఆంటోనియో తన్మయత్వంతో.

"మరి బొంబాయో? బొంబాయిమాత్రం యీపాటి అందంగా నన్నా ఉండలా? బొంబాయికి అమాంతంగా ఎగిరిపోవాలని ఉంది నాకు రెక్కలుంటే. సినీమాలూ, డ్యాన్సులూ, సంగీతం, టీపార్టీలూ, యింకెన్నెన్నో! ఎంత ఆనందం అన్నయ్యా బొంబాయి జీవితం!"

రూత్ అమాయకత్వానికి మానాన్న నవ్వాడు. ఆంటోనియో వంకచూసి "బొంబాయిలో పూరిగుడిసెలూ, రోచ్చుగుంటలూ, పిచ్చి గాళ్ళూ. కుష్ఠురోగులూ, బహిరంగ వ్యభిచారగృహాలు, అన్నీ. అందరూ క్షేమంగా ఉన్నాయా. వీటన్నిటిని గురించికూడా రూత్‌తో చెప్పరా నీవు!" అన్నాడు మానాన్న.

"అవునేఅమ్మా! నాన్నచెప్పింది అక్షరాలానిజమేనే. బొంబాయిలో అత్యధికసంఖ్యాకులైన ప్రజలు,దుఃఖపరిస్థితుల్లో జీవిస్తున్నారు అక్కడ నివసిస్తున్న గోవన్లగతి ఎంతఘోరంగా ఉన్నదనుకున్నావ్!

"ధోభీటాలో" అనే ప్రాంతంలో ఉన్న యిండ్ళు నిజంగా నరకకూపాలే అనుకో. మా పేట క్లబ్బు ఒక చీకటిగుహ. చస్తే దానిలోకి గాలీ, వెలుతురూ రావు. దాన్లోకి పోవాలంటే పగటిపూటే దీపంకావాలి. ఏంజెప్పమంటావ్ అక్కడిజీవితం! బొంబాయినగరం అనగానే అంతా సుఖపడుతున్నారనుకుంటారు భ్రమపడి. మీకు చూస్తేగాని అర్థంకాదు మేమనుభవించే యాతన" అన్నాడు ఆంటోనియో.

"నిజంగానట్రా?" అన్నది మాఅమ్మ ఆశ్చర్యపోతూ.

"నిజంగా అమ్మా! మహాభయంకరం! అయితే అక్కడి వాళ్లకు అవస్థలుపడడం అలవాటైపోయింది. ఎవరూ అంతగా పట్టించుకోరు!" అన్నాడు ఆంటోనియో.

మా అమ్మదృష్టి ఆంటోనియోమీదనుంచి తక్కినవాళ్ళమీదికి మళ్ళింది. "మనవాళ్ళంతా అక్కడికిపోయి యీ యమయాతనలు పడడందేనికి కోరుకుని? ఇక్కడ చూడండి! మన యిళ్ళూ, వాకిళ్ళూ, మనగ్రామం యెంత పరిశుభ్రంగా, విశాలంగా ఉన్నాయో! మనపొలాలు చూడండి! ఎంత అందంగా ఉన్నాయో!" అన్నది మా అమ్మ.

"ఏం చేయమంటావ్ యిక్కడుండి?" అన్నాడు మానాన్న మా అమాయకత్వానికి విసిగిపోయి. "రాళ్లనమిలి మింగండి! పోర్చుగీసు రాక్షసపాలనలో చేసుకోడానికింత పనిగూడా దొరకదిక్కడ బొంబాయిగానీ, కలకత్తాగానీ, పరాయిదేశాలుగానీ, అక్కడ గాలిపీల్చుకోడానికి యాత్రిగా పోతున్నారనుకున్నావా మనవాళ్ళంతా? గోవన్లకు మాతృదేశంమీద మమకారం యెందు తెలుసునా? కాకపోతే ప్రతియెండా కాలపు సెలవుల్లో అంతదూరాన్నుంచి మనవాళ్ళు స్వగ్రామంవచ్చి నెల రోజులపాటు కులాసాగా యెందుకు కాలక్షేపం చేస్తారు? పోర్చుగీస్

వాళ్ళను నేనింత తీవ్రంగా విమర్శిస్తున్నానంటే, నన్నిన్నాళ్ళనుంచీ అర్థమే చేసుకోలేకపోతివి! నేనేం వెర్రివాడననుకున్నావా?'' అన్నాడు మానాన్న.

''నీవు చెప్పింది నిజంనాన్నా! ప్రపంచంలోకల్లా పోర్చుగీసు వాళ్ళే సోమరిపోతులు. ఈసంగతి కోలెమ్* రాగానే కనిపెట్టగలిగాను. బ్రిటిష్‌కస్టమ్స ఉద్యోగులకూ, కోలెమ్‌లోని పోర్చుగీసు ఉద్యోగులకూ యెంతతేడా ఉందనుకున్నారు! పోర్చుగీసు ఉద్యోగులంతా వట్టి మడ్డి మగాలూ, సోమరిపోతులూఅనుకోండి. కేజిల్‌రాక్‌వద్ద బ్రిటిష్‌ఉద్యోగు లెంత చలాకీగ, యెంతసమర్థగ ఉంటారో తెలుసామీకు?'' అన్నాడు అంటోనియో.

అవునన్నట్లుగా. మానాన్న ఆంటోనియోవంకచూసి చిరునవ్వు నవ్వాడు.

''పోర్చుగీసువాళ్ళ మడ్డితనాన్ని, సోమరితనాన్ని నీవు కనిపెట్ట గలిగినందుకు నిజంగా నాకు సంతోషంగా ఉంది. పోర్చుగీసు పెనుభూతాన్ని యిక్కడ్నుంచి తక్షణం తోలెయ్యకపోతే, నీకూ, నాకూ, మన ప్రజలకూ సుఖం లేదురా! వట్టి పరమనీచులూ, దగుల్బాజీయా వీళ్ళు!'' అన్నాడు మానాన్న.

''ఇక్కడి ప్రజల జీవితం యేమాత్రం సుఖంగా లేదనుకుం టాను! ప్రభుత్వం విధించిన కఠిన నిర్బంధాలూ, ఆంక్షలూ, అతి క్రూరంగా ఉన్నాయనుకుంటాను. మన భారత సోదరులు బ్రిటిష్ నిరం

* కోలెమ్ పోర్చుగీసుకస్టమ్స్ ఆఫీసు. వేర్వేరుప్రాంతాలనుండి రైలు ప్రయాణంచేసి గోవాలో ప్రవేశించబోయే ప్రజలందర్నీ పోర్చుగీసు అధికార్లు యిక్కడ తనిఖీచేసి, వాళ్లసామాన్లు సోదాచేస్తారు.

కుశాధికారాన్ని యెలా ప్రతిఘటించి నిర్మూలించారో యిప్పటికైనా మన ప్రజలు తెలుసుకోవడం అవసరం నాన్న!'' అన్నాడు ఆంటోనియో కొంచెం ఉద్రేకంగా.

"పరిస్థితులు యేమీ బాగాలేవు! అంతకంతకు విషమిస్తున్నాయి! ప్రజల నిత్యజీవితమే దుర్భర మౌతున్నదిరా!" అన్నాడు మా నాన్న.

"అయితే ప్రజలేం ఆలోచిస్తున్నారు యీసమస్యను గురించి? మనమైనా ప్రజలకు దారిచూపి సక్రమమార్గంలో నడపకపోతే, పోర్చుగీసు దురాగతాలు మితిమీరుతాయి. తక్షణం ఆందోళన ప్రారంభించాలి నాన్నా! మనవాళ్ళంతా యేమంటున్నారు?" అన్నాడు ఆంటోనియో.

"నిజం చెప్పావు నూరేండ్లు బ్రతకరా! శతాబ్దాలుగా మనం అనుభవిస్తూ వచ్చిన బానిస జీవితం మన ప్రజల జవసత్వాల్ని కుంగదీసింది. మన చైతన్యాన్ని అడుగంట జేసింది. మన ఉత్సాహం, మన పోరపాట పటిమా, మనపౌరుషం నశించి పోయినాయి. మనమంతా ..................'' అన్నాడు మా నాన్న ఆవేశనపడుతూ.

మా అమ్మ కీసంభాషణ వెగటుగాతోచింది. మా అక్కచెల్లెండ్లకూడా అయిష్టమైనట్లే ఉంది. వాళ్లముఖవైఖరినిబట్టి మాఅమ్మ వెంటనే కలుగచేసుకుని, ఆవిషయం అంతటితో విరమించమనీ, మరోసంగతి మాట్లాడమనీ హెచ్చరించింది.

"మీరాజకీయాలు మానండిప్పుడు! సమయంకాదు, స్థానంకాదు. ఇంకేదైనా సరదాపుట్టించే విషయాలు మాట్లాడుకోరాదూ;'' అన్నది మా అమ్మ.

"చెప్పులజోడు తెమ్మని వ్రాశాను నీకు. తెచ్చావా? మా కింకేం తెచ్చావురా అన్నయ్యా?'' అడిగింది రూత్.

"నీచెప్పులజోడు తెచ్చానే భయపడకు! సరేకాని మేరియా, ఆబెల్ సంగతి యేంజరిగిందో విపరంగాచెప్పు. వాళ్లిద్దరూ యెప్పుడు పెండ్లి చేసుకుంటారేమిటి?" అడిగాడు ఆంటోనియో.

"ఇంకా సంబంధం నిశ్చయమే కాలేదురా! ఇంకోసంవత్సరం చదివితే గాని ఆబెల్ కోర్సు పూర్తికాదు. పాపం పోయిన సంవత్సరం అతను తప్పిపోయాడట!" అన్నది మా అమ్మ.

"తప్పి పోయాడంటే ఊరికే తప్పిపోయాడూ? సంవత్సరం పొడుగునా ఊపిరాడకుండా అమ్మాయిగారికి 'లెటర్స్' వ్రాస్తూ కూర్చుంటే తప్పిపోయాడు! ఎందుకొచ్చిన 'లెటర్స్' అదేపనిగా వ్రాయడం!" అన్నది రూత్.

మేరియా సిగ్గుపడ్డది. మా అమ్మ రూత్ వంక కళ్లుపెద్దవిగా చేసి మింగిపారేసేట్లు చూసింది. "నీవుపట్టి అల్లరిపుండాకోరువే రూత్! ఆబెల్‌కు మేరియా వ్రాసుకున్న పుత్తరాలు నీవు యెందుకు చూడాల్సొచ్చిందే కొంటెతనం కాకపోతే!"

రూత్ నావంక చూసి చిరునవ్వుతో పెద్దగా "ఆవుత్తరాలు నేను చదవలేదే అమ్మా! ఊరికే వాటివంక ఒకసారిచూశాను - అతనిదస్తూరి బాగుంటుందేమో అని! అంతేనే!" అన్నది.

రూత్ అబద్ధమాడుతున్నదని ఆంటోనియో తెలుసుకున్నాడు.

"చూస్తేచూసి చదివిందిలేవే అమ్మా! మరేం పర్వాలేదుగాని, ఆబెల్ యెలా ఉంటాడే? అందంగా ఉంటాడా?" అన్నాడు ఆంటోనియో.

"అతన్ని నీవేచూస్తావులే త్వరలో! ఇంతలోనే యెందుకు తొందర! రెండురోజులకిత్రం అతనిక్కడే వున్నాడు. త్వరలోనే మళ్లా రాబోతున్నాడు" అన్నది మా అమ్మ.

రాత్రి పదకొండయింది. అప్పటికే వూరంతా మాటుమణిగింది. మా యింట్లో యింకా లోకాభిరామాయణం చెప్పుకుంటూ జాగరణ చేస్తూనే ఉన్నాం. వీధుల్లో ఒక్క పురుగ్గూడా కన్పించడంలేదు. అకస్మాత్తుగా యెక్కడో దూరాన టపాసులు పేలినశబ్దం వినవచ్చింది. మంత్రిసాని లూయిజా యింట్లోనించే యీ టపాసుల శబ్దం వస్తూందని మా నాన్న ఊహించాడు.

"ఓహో ! పార్ధనలు వినవస్తున్నాయి ? ఇదివరలాగా మనవూరివాళ్లు అదేపనిగా విసుగులేకుండా యిప్పటికే ప్రార్ధనలు చేస్తూనే ఊన్నారు ?"

"అవున్నాయనా ! అవును ! మనల్నింకా వదిలివెళ్లకుండా ఉన్నవి మూడే మూడు. ఈ ప్రార్ధన్లూ, తాగుడూ, పోర్చుగీసువాళ్ళు !" అన్నాడు మా నాన్న.

"లూయీజా యింట్లో యీవేళప్పుడు టపాసులు కాల్చడానకీ, ప్రార్ధన్లు చేయడానకీ యేమిటికారణం ? వాళ్లయింట్లో యేమైనా పండుగా ?" అడిగాడు ఆంటోనియో.

"నీకు తెలియదూ ? ఇనొసెన్సియో యెల్లుండే ఆఫ్రికాకు బయల్దేరిపోతున్నాడు" అన్నాడు మా నాన్న.

"అలాగా ! ఎంతసిగ్గుచేటు ! సరేగాని డొనాటో సంగతేమిటి ? వాడిక్కడే ఉన్నాడనుకుంటాను !" అన్నాడు ఆంటోనియో.

"లేదురా ఆంటూ ! మూడునెల్లకిత్రం వాడు బర్మా పోయాడు."

"నాకు తెలియదు నాన్నా ఆవిషయం !" అన్నాడు అంటోనియో విచారంలో. మన వూరుగతి యెలాపట్టింది నాన్నా ! నాయీడు కుర్రాళ్లంతా యిదివరకే వూరువదిలి వెళ్లారో, వెళ్లడానికి సిద్ధంగా

ఉన్నారో, ఈ సంఘటన విషాదకరమైనది గాదూ నాన్నా!" అన్నాడు ఆంటోనియో.

మాటా పలుకూలేకుండా మా నాన్న ఒకనిమిషం వాడి వంక చూశాడు. ఒక్కొక్కటే నెమ్మదిగా తూచి మాట్లాడుతూ, "అవున్రా, యిదీ చాలా ఘోరం. ఇన్ని సంవత్సరాలనుంచీ యీ ప్రవాహం యిలా సాగి పోతూనే వుంది. మనయువకులంతా ఊరూ, నాడూవదిలి, ప్రియతమమైన తలిదండ్రులనూ, భార్యాబిడ్డల్నూ వదిలి మూటముల్లెతో పొట్టలు పట్టుకొని పరదేశాలకు ప్రవాహంలాగా పోతూనే ఉన్నారు. గోవాకు పట్టిన ఘోరదురవస్థయిదే యీనాడు! తోచింది స్వేచ్ఛగా వ్రాసుకోడానికీ, మాట్లాడ్డానికీ, మన ప్రజలకీనాడు ఆస్కారమే లేదు. కష్టించి బతకడానికి అవకాశాలేవున్న. భర్తయీ, కొడుకుయీ పనికోసం దేశదేశాలూ తిరిగి, యింతసంపాదించి, తమకు సరిపోగా మిగిలింది యింటికి పంపించి కుటుంబాలు బ్రతికించు కోవాల్సిన అగచాట్లేర్పడ్డాయి. దేశదిమ్మరిగా తిరగడమే మన జన్మహక్కయింది. దీనికంతం ఉన్నట్లు కనిపించదు. పోర్చుగీసువాళ్ళు యిక్కడ తిష్ఠవేసుకొని కూర్చున్నంత కాలం మనం దేశదిమ్మరుల్లాగే జీవితాలు గడపాలేమో!" అన్నాడు మానాన్న.

---

౮

అది ఏప్రిల్ మాసం. మరుసటిదినమే మా వరండాలో కూర్చుంది ఉన్నాను. మర్రితోపుకు వెనుకనుంచి నాకళ్ళల్లోకి యేటవాలుగా సూర్య కిరణాలు ప్రసరిస్తున్నాయి. సూటిగా సూదిమొనల్లా గుచ్చుకునే ఆకిర ణాల కాంతికి నాకళ్ళు చూడలేక పోతున్నాయి. లక్ష్మి నాముందే కూర్చుని మామూలుగా నా రెండుకాళ్ళూ నూనెతో మర్దిస్తున్నది. నాకాళ్ళురెండూ చచ్చుపడ్డరోజుల్లో మానాన్న 'పోండా' కుపోయి అద్భుతమైన ఒక తైలం పట్టుకొచ్చాడు. పక్షవాతంపడ్డ రోగులకీతైలం సంజీవిలా పనిచేస్తుందనీ, మూడునెలల్లో మళ్ళీ కాళ్ళు యెప్పటట్టే వచ్చేట్లు చేస్తుందనీ ప్రసిద్ధి. నాకు రోగంవచ్చిన నాటినుంచీ యిన్ని సంవత్సరాలుగా పట్టువిడువకుండా లక్ష్మి నాకాళ్ళు మర్దనచేస్తూనే ఉంది. కాని తైలంవల్ల నాస్థితి కాస్తయినా మెరుగైనట్లు లేదు. లక్ష్మికి విసుగన్నమాట లేకుండా ప్రతిఉదయం నారెండుకాళ్ళూ మర్దనచేస్తూ ఉంటే, ఆపిల్ల దీక్షకూ, ఓపికకూ నాకాశ్చర్యం వేసేది. నాకాళ్ళుమర్దన చేయడం తన విధ్యుక్తధర్మంగా యెంచుకునేది. రెండుకాళ్ళకూ నూనె పూర్తిగా యింకిపోయేలా తన శక్తికొద్దీ రుద్దేది. ఈతైలంవల్ల నాకేమీ ప్రయోజనం కలగదని నిర్ధారణ చేసుకున్నాను. అయినా లక్ష్మికి ఆశవదల్లేదు. తప్పకుండా కాళ్ళు వచ్చితీరుతాయని యిప్పటికీనమ్మకమే ఆపిల్లకు. నిరాశతోచిన నాకు ధైర్యంచెప్పి నాకూరట కల్గిస్తుండేది.

దాదాపు పగలల్లా నావద్దనే కూర్చునేది లక్ష్మి. నాఅవిటికాళ్ళను చూసుకుంటూ బెంగపెట్టుకుంటానేమో అని, నామనస్సును మహోవిష

ఇంంపై మరల్చడానికి యేవేవోకబుర్లు చెబుతుండేది. నాముఖంవంక అప్పుడప్పుడూ జాలిగా చూస్తుండేది. నాకు కాళ్ళురావాలంటే, దేవుడి యందు అచంచలమైన దీక్ష అలవర్చుకోవాలని నాకు సలహా యిచ్చేది. ప్రతిరాత్రి నిద్రపోయేముందు నా కాళ్ళను గురించి దేవుణ్ణి ప్రార్థించే దాన్ననిగూడా చెప్పేది.

ఈ ఉదయం లక్ష్మి నాకాళ్ళు మర్దిస్తున్నప్పుడు ఆపిల్లను చూసి, "నీవెంతో భక్తిశ్రద్ధలతో నాకు పరిచర్యచేస్తున్నావు. నీరుణం యెలా తీర్చుకోగలను!" అన్నాను. "సరేగాని, ఆంటూను గురించి నీఅభి ప్రాయం ఏమిటి లక్ష్మి? మాఆంటూ అందంగా ఉన్నాడుకదూ యిప్పుడు?"

లక్ష్మి నావైపునుండి తన దృష్టి మరల్చింది. తలవంచుకుని అదే పనిగా మర్దించడం సాగించింది. "నీకాళ్ళొచ్చిన రోజున ఆనందంతో నాట్యం చేస్తాన్నేను" అన్నది లక్ష్మి - నాప్రశ్నకు అదే సరైన సమా ధానమనుకొని.

"పోనిద్దూ! దిక్కుమాలిన కాళ్ళు" అంటూ రెండుకాళ్ళనూ లోపలికి ముడుచుకున్నాను. "లక్ష్మి, అడిగిన ప్రశ్నకు సూటిసమాధానం చెప్పక విషయం మరుగుపరుస్తావెందుకు? ఇప్పుడైనా జవాబు చెప్పు! ఆంటూ నిజంగా ఆకర్షణీయంగా లేడూ?"

"హుఁ" అని లక్ష్మి గొణుక్కుంది. దీని భావం అవుననీ కావచ్చు; కాదనీకావచ్చు. మాట్లాడకుండా దాని పని అది చేసుకుని పోతూనే ఉంది.

లక్ష్మి వద్దనుంచి యెలాగైనా సమాధానం రాబట్టాలని నా ప్రశ్నలతోఆపిల్లను చికాకుపెట్టాను. "వాడంటే నీకిష్టమేకదూ లక్ష్మి?"

లక్ష్మి సిగ్గుతో మొహం అటుతిప్పుకుని మాట్లాళ్ళేదు. ఆరోజున లక్ష్మి నాపక్కన కూర్చునిప్పుడు, దానివంక అదేపనిగా చూస్తూ, ఆపాద మస్తకం అన్ని అవయవాలూ పరిశీలించసాగాను. అలా చూడడం అదే మొదాటిసారి నాకు. లక్ష్మిచాలా సౌందర్యవతి అని తేల్చుకున్నాను. చాకొలేటురంగుతో ఉన్నా, లక్ష్మి అవయవాలూ, ముఖకవళికలూ తీర్చి దిద్దినట్లు ముచ్చటగా ఉన్నాయి. ముక్కుసూటిగా మొనదేలి సంపెంగ పువ్వులా ఉంది. ఆమె చిన్ననినోరూ, తామరపూలవంటి కండ్లూ, ముత్యాలవంటి పలువరుసా, ముఖానికెంతో కళ గూర్చాయి. లక్ష్మికి యింకోవివేషం గూడా ఉంది. నునుసిగ్గుతో గూడిన గాంభీర్యం, గాంభీర్యానికి తగిన లావణ్యం, పతివ్రితాత్వం మొలకలెత్తే ముగ్ధ సౌందర్యం, యీఉత్తమ లక్షణాలకు యీదైవ అంతస్థూ, లక్ష్మికి కొత్త శోభను చేకూర్చిపెట్టింది. ఇన్ని ఉత్తమ లక్షణాలతో అలరారే పిల్ల మాగ్రామంలో మరెవరూ లేరు. క్రైస్తవమత చిహ్నాలు బాహ్యాడంబరానికి కొన్ని కనిపించినా, హిందూ యువతికి సహజమైన అలంకారంగా పరిగణించబడే నునుసిగ్గు, మిత భాషిత్వం లక్ష్మి ముఖంమీద నాట్యం చేస్తున్నాయి. సౌకుమార్యం, లాలిత్యం, అమాయకత్వం. ఆత్మనిగ్రహం - యిన్ని లక్షణాలూ కలిసి అరుదుగా సమ్మిశితమయ్యాయి లక్ష్మిలో. మూర్తీభవించిన హిందూ యువతా అనిపించిందాపిల్ల!

కష్టజీవుల కడుపున పుట్టడంవల్లనో యేమో, చూపులకు లక్ష్మి పల్చగాఉన్నా, అంగసౌష్టవంతోపాటు, శరీరపాటవంగూడా యేర్పడినది. ఆపిల్ల పెదవులు మెత్తగా దొండపండువలె ఉన్నాయి. దానికాళ్లు పొడుగుపాటివి. నాఅక్కలందరికన్న ఆపిల్ల ఎత్తరి. లక్ష్మి నడుస్తూంటే, నాజూగ్గా, గాంభీర్యంగా నెమలి నడచినట్లుండేది. అయితే గర్వం ఉన్న

దనుకుంటారేమో, యేకోశానా గర్వమనేమాట యెరగదు. ఏంచూచు కొని గర్వపడుతుంది గనక. పసితనంలో లక్ష్మి ఫ్రాకులు ధరించినా, హిందూ సంప్రదాయం ప్రకారం, యిప్పుడు చీరలే కట్టుకుంటూంది. ఆచీరె చాటున, అణకువతో సిగ్గుతో తన అవయవాలను యెంతవరకు వీలౌతుందో అంతవరకూ మరుగు పర్చుకొనేది. ఈడొచ్చిన తర్వాత గూడా ఫ్రాకులే వేసుకోమని మా అమ్మ లక్ష్మికి నచ్చచెప్పడానికి ప్రయత్నించింది. చీరెలకన్న ఫ్రాకులే అందంగా, తేలిగ్గా ఉంటాయనే మాఅమ్మ అభిప్రాయం. అయితే లక్ష్మి చీరెలే కట్టుకుంటూ, చెప్పులు మాత్రం వేసుకొని తేలిగ్గా, స్వేచ్ఛగా, హాయిగా నడుస్తూ పోయేది.

ఆనాటినుండీ లక్ష్మి చీరలే ధరిస్తుండేది. ఆపిల్ల సంకల్పంలో మార్పు రాలేదు. వాటిని చూసుకొని గర్వపడుతుండేదిగూడా.

ఈ ఉదయంగూడా యెప్పటివలెనే లక్ష్మి నా ముందు కూర్చుని కాళ్ళు మర్దిస్తూనే ఉంది. పసుపురంగు అంచుగల తెల్లనిచీర కట్టుకుంది లక్ష్మి. పరమపవిత్రమైన తేజస్సుతో ఉట్టిపడుతూంది. వెనక్కూ ముందుకూ ఊగుతూ నాకాళ్ళు గట్టిగా మర్దిస్తున్న సమయంలో లక్ష్మి పైటచెంగుజారి ఆమె తొడలపైన పడ్డది. ఆపిల్ల దీన్ని గమనించ లేదు. మొట్టమెదటిసారిగా చూశాను అందమైన ఆమె మెడతీరు. ఇంకాకొంచెం ముందుకు వంగి మరింత గట్టిగా కాళ్ళు మర్దించడం మొదలెట్టింది. ఆమె మెడకిందుగా నాదృష్టి సాగించాను. పట్టుకుచ్చులాంటి ఆమె శరీరాన్నీ, బిగువుగా నిక్కబొడుచుకుని ఉన్న పాలిండ్లనూ చూడ గలిగాను. ఈ అద్భుతదృశ్యం చూడగానే నాశరీరం ఝల్లుమన్నది ఒక్కసారిగా; రోమాలు నిక్కబొడుచుకున్నాయి.

"ఏమిటాలోచిస్తున్నావు లక్ష్మి?" అనడిగాను. ఎప్పుడూ యేవో కబుర్లు చెబుతూ కూర్చుండే లక్ష్మి ఆనాడు బెల్లంకొట్టిన రాయిలా అయింది. "ఏమిటి నన్నుబాధించే ఆలోచన? అంటూను ప్రేమించ లేదుగదా నీవు? లేక నిజంగా ప్రేమించావా?"

లక్ష్మి మాట్లాడలేదు. తనపనితాను చేసుకుంటూ పోతూనే ఉంది. అసలే లక్ష్మి మితభాషిణి. మగవాళ్ళను చూస్తే చెప్పలేనంత సిగ్గు. మావూరి మగవాళ్ళతోగాని, కనీసం మానాన్నతోగానీ, లక్ష్మి యెన్నడూ మాట్లాడినట్లు నేనెరగను. మానాన్న ఆపిల్లను తరుచుగా పరిహాసాలు పట్టిస్తుండేవాడు. ఒక్క నాతోనే కాస్తంత చనువుగా మాట్లాడ్డం అల వాటు చేసుకుంది. అయినా నేనుగూడా యింతవరకూ ఆపిల్లలోతును గ్రహించ లేకపోయాను. ఆ అమ్మాయి మనోభావా లెవరికీ అర్థం కాలేదు.

"లక్ష్మి! నీమెడయెంతో అందంగా ఉన్నదని నీకుతెలుసా?" అనడిగాను. నామాటలు విననట్టుగా లక్ష్మి నడుంచి మర్దించడం సాగిస్తూ పోతూంది.

లక్ష్మి సిగ్గు తెచ్చుకుంది. ఒక్క మెడనే కాకుండా మరి దేనినో గూడా అదేపనిగా కేంద్రీకరించి చూస్తూ ఆనందిస్తున్నానని లక్ష్మి తెలుసుకుంది. మర్దిస్తూ మర్దిస్తూన్న రెండు నూనెచేతులతో పైటచెంగు వెంటనే పైనసర్దుకొని పాలిండ్లను రెండు చేతులతో నూకప్పుకుంది.

"నీవు చాలా చెడ్డపిల్లవాడివి బాబూష్! ఇలాంటి ఆలోచనలు నీమనస్సులో పెట్టుకుంటే, దేవుడు నీకాళ్ళ నెలాబాగు చేస్తాడు చెప్పు!" అంటూ భయసంభ్రమాలతో అక్కణ్ణుంచి లేచి పోవడానికి సిద్ధపడ్డది.

"నేనిప్పుడేంచేశాను చెప్పు లక్ష్మి ? ఎక్కడికి పోతున్నావిప్పుడు ?" అన్నాను-అమాయకత్వం నటిస్తూ.

నేను మళ్ళీమాట్లాడుదా మనుకుంటుండగానే యింతలో ఆకస్మికంగా సరంజామా అంతా పట్టుకుని సాగిపోయింది లక్ష్మి.

ఈ లక్ష్మినే మా ఆంటోనియో మనసార ప్రేమించాడు.

ఆక్రితం రాత్రి నేనూ, మా ఆంటూ గదిలో పడుకున్నప్పుడు లక్ష్మిని గురించి వాడెన్నో ప్రశ్నలు ఆసక్తితో అడిగాడు నన్ను. లక్ష్మిని వాడు ప్రేమిస్తున్నట్లు నేనర్థం చేసుకుంటానేమో అని నాకనుమానం రేకెత్తకుండా ఉండేలా తెలివైన ప్రశ్నలడిగాడు. ఎంతతెలివిగా ప్రశ్నలువేసినా, లక్ష్మియందు వాడికున్న ప్రేమను అప్పుడే అర్థం చేసుకోగలిగాను. వాడిప్రేమను గూర్చి కొద్దో గొప్పో నాకనుమానం ఉన్నా, ఆకాస్తా ఉదయం రహితమైంది. ఈ రోజు పెందలాడె ఆంటూ నిద్రలేచాడు. అప్పటికే బావినీళ్ళు తోడుతున్న లక్ష్మిని కిటికీగుండా అదే పనిగా చూస్తూ మురుసుకు పోతున్నాడు ఆంటూ. అక్కడే వాడు కొంతసేపు నిలబడి, లక్ష్మిపద్దకు అమాంతం పరుగెత్తి ఒక్క మాటైనా మాట్లాడి వద్దామన్నంత ఆతురత వెల్లడించాడు. లక్ష్మియందు వాడి మనస్సు పూర్తిగా లగ్నమైందని నిర్ణయించు కున్నాను. లక్ష్మికోసం తపించిపోతున్నట్లుగూడా నాకర్థమైంది.

ఆ రోజల్లా ఆంటోనియోను చూడ్డానికి యిరుగుపొరుగు వాళ్లంతా తండోప తండాలుగావచ్చి మాట్లాడి పోతున్నారు. స్నేహితులతో వాడు చాలాసేపు మాట్లాడాడు. బొంబాయి అనుభవాల్నిగూర్చి యెన్నోముచ్చట్లు చెబుతున్నాడు. అయితే చిత్తం శివునిమీదా భక్తి చెప్పులమీదా అన్నట్లు

వాడి ధ్యానమంతా లక్ష్మిమీదనే కేంద్రీకృతమైఉంది. ఆ నిమిషంలో లక్ష్మి యెక్కడ ఉందా, యేంచేస్తుందా అని వాడి కళ్లు ఒకచేతీరుగా వెదకసాగాయి. లక్ష్మి వంటయింటి పన్లో నిమగ్నురాలై ఉంది. ఆ సాయంత్రం, రొసెండో, ఫర్నాండో, క్లారిస్సా, జులైటా, ఆర్నాల్డో మానోల్ వగైరా మిత్రులందరూవచ్చి ఆంటోతో మాట్లాడుతున్నారు. చిన్ననాట స్కూలు ముచ్చట్లూ, ఆ రోజుల్లో వాళ్లు చేసిన ఘనకార్యాలూ తలపోసుకుని సంతోషంతో విరగబడి నవ్వుతున్నారు.

"బొంబాయి యిప్పుడెలా ఉందిరా అంటూ?" అడిగాడు లాగు బోతు మానోల్. "ఏమైనా మారిందిరా యిప్పుడు? ఆ మురికి వెధవలు హిందువు లిప్పుడుగూడా తాంబూలాలు యూడిస్తూ రోడ్లూ, గోడలూ ఖరాబు చేస్తున్నారా? వట్టి పందులురా వాళ్లు!" అని పడతిట్టాడు.

ఒక్క వారం గడిచింది. ఇంతలో కార్లస్, సీజరూ చర్చి స్కూల్‌నుంచి సెలవులకు యింటికి వచ్చారు. ఆదివారం నాడు పంజిమ్ నుంచి రాబర్టోగూడా యిల్లుచేరాడు. ఆ సాయంకాలమే ఆబెల్‌గూడా మేరియాను, మమ్మల్నీ చూడవచ్చాడు. ఆంటోనియోకూ, ఆబెల్‌కూ పరిచయం జరిగింది. తన తండ్రి పలుకుబడితో త్వరలోనే కస్టమ్స్ ఆఫీసులో తనకు ఉద్యోగం దొరుకుతుందనీ, ఉద్యోగంలో చేరగానే మేరియాను పెండ్లాడతాననీ ఆబెల్ మా ఆంటూతో నమ్మకంగాచెప్పాడు.

"అయితే నాకు త్వరలో బావవౌరావన్నమాట! చాలా సంతోషంగా ఉందీవార్త వినడానికి!" అన్నాడు ఆంటో హృదయపూర్వకంగా. వాళ్ళ సరసనే కూర్చున్న రూత్‌ను ఒక కంటచూసి తమాషాగా, "మా రూత్‌కుగూడా మీ పంజిమ్‌లో చక్కని కుర్రాణ్ణి ఒకతన్ని పట్టుకొచ్చిపెట్టు ఆబెల్! పాపం అది మొగుడికోసం కలవరించి

పోతున్నది। దానికేమీ తోచడంలేదు। దాని స్థితి అయోమయంగా ఉంది నాకు।" అన్నాడు ఆంటూ.

"నోరుముయ్ ఆంటూ। నీవు ముందెక్కడైనా ఒక చక్కని చుక్కను చూసి ముడిపెట్టుకో। నా సంగతి నీవేమీ ఆలోచించ నక్కర్లేదులే" అన్నది రూత్ రోషంతో. ఆ మాటలు వినేసరికల్లా రూత్ చెక్కిళ్లు లేతగా యెర్రబారినై. "మీ మగవాళ్ళకు పౌరుషాలు చచ్చి నాకాళ్ళపైన పడడం చూళ్ళా మీ రెవరూ ? వాళ్ళ అవస్థ చూసిన వాళ్లెవరూ వాళ్ళను మగవాళ్ళనుకోరు తెలుసా। మీ మగజాతికే యిది సిగ్గుచేటు। జవసత్వాలుడిగి శీతాకాలంలో టపటప రాలే పండుటాకులు కాక మరేమిటి మీ మగవాళ్ళంతా ?" అన్నది రూత్ మగజాతిని హీనంగా జమకట్టి. రూత్ తన ఆడజాతి ఆధిక్యతను ఉగ్గడిస్తూ చేసిన గంభీరోపన్యాసానికి మేమంతా నవ్వుకున్నాం.

అన్నదమ్ములతో యింటిల్లిపాదీ అందరం ఒక చోటచేరాంమళ్ళీ. నవ్వులతో, కేరింతలతో, చిరుకోపాలతో, ప్రణయ కలాపాలతో మా యిల్లీనాడు ఆనందంగా కళకళ లాడుతుంది. ఆంటోనియో మహా మాటకారి. యెప్పుడూ సంతోషమే వాడికి. క్రైస్తవ చిహ్నమైన ప్రెస్బితప్ప చర్చి స్కూలు తర్ఫీదు ఫలితంగా సీజరుకూ, కార్లస్‌కూ వచ్చిన మార్పేమీలేదు. ఒక్క రాబర్టోలో మాత్రమే యెంతో మార్పు వచ్చింది. ఈ మార్పుచూసి, మా నాన్నా, మా అమ్మా ఆందోళన పడ్డారు.

"నేను పరీక్ష పాడుచేశాను. తప్పిపోవడం ఖాయం।" అన్నాడు రాబర్టో మాటల ధోరణిలో. తప్పిపోతాననే దిగులు వాడికేకోశానాలేదు. భోజనాలముందు వెళ్లబెట్టాడీవార్త చల్లగా. "అయితే నేనేం భయపడను

ఒకవేళ ప్యాసైనా, నేను లైసియంకు తిరిగివెళ్లను. ఆ పుస్తకాలు పాడు గాను! బండెడు పుస్తకాలెవడు చదువుతాడు! నేనేం ముట్టుకోను వాటిని! పంజిమ్ పోగానే నేనేదైనా ఉద్యోగంలో ప్రవేశిస్తా" అన్నాడు అలక్ష్యంగా రాబర్టో.

మా నాన్న అన్నం తింటూ తింటూ తలపైకెత్తిచూశాడు వాడి మాటలు నమ్మక.

"ఏమిటిరా రాబూ! ఏమిటి నీవన్నది? లైసియంకు మళ్ళీ వెళ్ళాలనిలేదూ నీకు?"

"అవును నాన్నా! అవును!"

"వెర్రివేషాలెయ్యకు; బుద్ధిలేనివెధవా!" అన్నాడు ఆగ్రహంతో మా నాన్న. "ఈ కొర్సు పూర్తిచేసి తీరాలి! తెలిసిందా?"

"నే నెరుగుదును నాన్నా! అసలు నాకే చదువుకోవాలని యిష్టం లేదు! బలవంతంచేసి నాచేత యెవరు చదివించగలరు? నా కుద్యోగం చేసుకోవాలని ఉంది! చేసుకోగూడదూ?" అన్నాడు రాబర్టో.

మా నాన్న వాడివంక తీవ్రంగా చురచురా చూస్తున్నాడు. అమ్మ ఆవేదనపడుతూ, "రోబూ! నాన్నతో మాట్లాడేది యిలాగేనా! మర్యాదేమైనా ఉందొట్టూ! ఇదేనా నీవు లైసియంలో నేర్చుకున్న చదువు?" అన్నది.

"ఏం మాట్లాడాను! ఏం అన్నాను చెప్పు!" పొగరుబోతుతనంగా అన్నాడు రాబర్టో. "ఇహ నేను చదువుకోనని యిప్పటికీ అంటున్నాను. మళ్ళీ అంతే. నేనొక నిశ్చయం చేసుకొన్నాను. దానికి తిరుగులేదు. మార్చుకొనడం అసంభవం.

గతించిన రెండు సంవత్సరాల్లోనూ రాబర్టోలో యీ మార్పు వచ్చింది. పంజింమ్ వెళ్ళిన కొత్తలో తరచుగా మా నాన్నకూడా ఉత్తరాలు వ్రాస్తూనే ఉండేవాడు. తర్వాత తర్వాత ఉత్తరాలు వ్రాయడం అరుదైంది. ఎప్పుడైనా ఒకటీ అరా వ్రాసినా, డబ్బు పంపమని మాత్రమే వ్రాసేవాడు నాలుగుముక్కలు. మరోవిషయం గురించి ఒక్క అక్షరంగూడా వ్రాసేవాడుగాదు. ఇప్పుడు చదువు సన్నగిలినా, అహంభావం, స్వాతిశయం మాత్రం కావలసినంత పట్టుబడ్డాయి అబ్బాయికి. ఇండో-పోర్చుగీసు కుర్రాళ్ళ స్నేహం మరిగి, వాళ్ళ గొప్పలుగురించి చెప్పడం మొదలెట్టాడు. మావూరి రైతులంటే వీడి కెక్కడి యీసడింపైందిప్పుడు!

వీడి పోకడలుచూసి మా నాన్నా, అమ్మా తీవ్రంగా ఆందోళన పడ్డారు. ఆ రాత్రి మా నాన్నా, మా అమ్మా వంటరిగా వీడి విషయం మాట్లాడుకుంటున్నారు. అతిగా చదువుకుంటే వినయవిధేయతలు నశించి తీరుతాయనీ, రాబర్టో తలతిరుగుడుకు మా నాన్నే ప్రధాన కారణమనీ మా అమ్మ మా నాన్నను నిందించడం మొదలెట్టింది.

"నామాట మీరు వినివుంటే, వీడిమూలంగా మనకిన్ని పాట్లు వచ్చేవికావు. అలా వింటేగామీరు! మనవాడికి ఉన్నతవిద్య చెప్పించాలని మీకు పుట్టింది. ఇప్పుడు నెత్తికెక్కి కూర్చున్నాడు. చేతులారా చేసుకున్నందుకు అనుభవించండి" అన్నది మా అమ్మ నిష్ఠూరంగా.

మే నెల. ఆకాశం నిర్మలంగా ఉంది. మచ్చుకైనా ఒక్క మబ్బు తునక లేదు. ఎటుచూసినా మామిడిపండ్లు, పనసపండ్లు, జీడిపప్పు వాసనలు గుబాళించి కొడుతున్నాయి. మా సంతోషం యెప్పటివలె అనుభవిస్తూనే ఉన్నాం. ఒక్క ఫ్రాన్సిస్కో, ఏడ్రియానోలు మాత్రం మాతో లేరు. రాబర్టో నడత మాకు సుతరామూ నచ్చలేదు. అప్పుడప్పుడు వాణ్ణి

కసిరి కొడుతూండేవాళ్ళం. అయినా వాడివల్ల మా ఆనందానికెట్టి విఘాతమూ కలగలేదు. ప్రతి సాయంత్రం కొండమీదికి షికారు వెళ్లేవాళ్ళం. పెళ్ళి విందులకు సరదాగా హాజరౌతూండేవాళ్ళం, డ్యాన్సులకు తక్కువ లేదు. ఆనందంతో మా యిల్లంతా వెల్లివిరిసిపోతూంది.

నా రోగంలో మా అమ్మావాళ్ళు దేవుడికి మొక్కు పెట్టుకున్నారు త్వరలో నయంకావాలని! మొక్కుబడి తీర్చుకోడానికి ఒకరోజున మేమంతా పాతగోవా వెళ్ళాం. అక్కడున్న సెయింట్ క్సేవియర్ విగ్రహానికి కర్పూర హారతులు వెలిగించి ప్రార్థనలు జరపాల్సివుంది. ఆ రోజు పెందలాడే మేం మోటార్ కారులో బయల్దేరి నిర్మానుష్యంగావున్న ఆ నగరానికి సకాలంలోనే చేరుకున్నాం. మొక్కుబడి పూర్తయిన తర్వాత, పాడుబడున్న చర్చీలనూ, కాన్వెంట్లనూ చూశాం. భూగర్భంలో ఉన్న మార్గాలనూ, చీకటి గుహలచూసి, పూర్వ వైభవాన్నోసారి తలపోసుకున్నాం. ఇది పాతగోవా దృశ్యం. దీని పూర్వౌన్నత్యమంతా కాలగర్భంలో కలిసిపోయింది. ఒకప్పుడిది మహానగరం. సమస్త సంపదలతో ఓలలాడిన యీ మహానగరానికి విదేశాలనుంచి ముఖ్యంగా చైనా, పాలస్తీనా, మిసపోటేమియా, పోర్చుగల్ దేశాలనుండి యాత్రికులూ, వ్యాపారస్తులూ తండోపతండాలుగా వచ్చేవాళ్ళు. విదేశవ్యాపారులు తమ వెంట బానిసల్ని తెచ్చేవాళ్లు; గుర్రాలను పట్టుకొచ్చేవాళ్లు. బజార్లన్నీ వీళ్ళతో కిటకిటలాడి పోయేవి. ఎక్కడాలేని సందడి! ఆరోజుల్లో విదేశాలనుంచి విద్యార్థులు మన దేశానికివచ్చి వివిధశాస్త్రాల్లో మన విశ్వవిద్యాలయాల్లో విద్య అభ్యసించేవాళ్ళు. అట్టిమన పూర్వవైభవం మట్టిలో కలిసిపోయింది.

మెరుపు మెరిసినట్లుగా ఒకనెల యీవిధంగా గడిచిపోయింది. ఈ నెలపొడుగూనా అందరం సమిష్టిగా ఎంతో ఆనందం అనుభవించాం.

ఒకనాడు కార్లస్‌కు ఉత్తరం వచ్చింది. తనకూ, సీజర్‌కూ 'జెస్యూట్ ఆర్డర్' లో ప్రవేశమిచ్చామనీ, జూన్‌నెల మధ్యభాగంలో యిద్దరూ 'ప్రొబేషన్ హౌస్' వద్ద హాజరుకావాలనీ ఉత్తరంలోని సారాంశం. ఈ కొత్త యేర్పాట్లను గురించి సీజర్, కార్లస్ ముందుగా మా యింట్లో యెవరికీ చెప్పలేదు. తీరా ఉత్తరం వచ్చినతర్వాత వాళ్ళిద్దరూ రాకోల్ చర్చిస్కూలు విడిచిరావాలని ఉద్దేశించినట్లూ, 'జెస్యూట్ ఆర్డర్' లో ప్రవేశించదలచినట్లూ మా నాన్నకూ, మాఅమ్మకూ చెప్పారు. మాఅమ్మ యీ వార్తవిని ఆందోళన పడ్డది. మా నాన్న మాత్రం యిష్టపడ్డట్లు సంతోషం వెలిబుచ్చాడు.

"అంటే మీరు శాశ్వతంగా నన్ను వదిలి వెళ్ళిపోతున్నారన్న మాట!" మళ్ళీ యెన్నడూ తిరిగి యింటికి రారన్నమాటేనా?" అంటూ మా అమ్మ యేడ్పుమొహం పెట్టింది. "ఎందుకు చేయాల్సివచ్చిం దీ విధంగా? రాకోల్ చర్చిస్కూలు యెందుకు విడిచిపెట్టాల్సి వచ్చింది?"

రాకోల్ నగరం జువారీ నదీతీరానవుంది. గోవాలోని ప్రధానమైన మత విద్యాకేంద్రంయిది. ఇక్కడి చర్చి చాలాగొప్పది. ఆ చర్చి భవనంలో యెన్నో విశాలమైన గదులూ, రహస్యాలోచన మందిరాలూ, సువిశాలమైన చాపెళ్లూ ఉన్నాయి. చర్చిచుట్టూ బ్రహ్మాండమైన ఆవరణ ఉంది. గోవా అంతటినుండీ వేలకొద్దీ యువకులూ, పసిపిల్లలూ యీ చర్చికి హాజరౌతుంటారు. కొందరు తమ యిష్టానుసారం వస్తారు; కొందరు తలిదండ్రుల పోరుపడలేక వస్తారు. ఈ చర్చిస్కూల్లో క్రైస్తవమత విద్య అభ్యసించి, తిరిగియిండ్లకొచ్చిన ప్రతియువకుడూ మతగురువు కావాలని తలిదండ్రులాశిస్తుండే వాళ్ళు. ప్రతికుటుంబంలో ఒక మత గురువు తర్ఫీదు కావడం వాళ్ళకు గర్వకారణంగా ఉండే రాకోల్ చర్చి స్కూల్లో తర్ఫీదిచ్చే మతగురువులంటే మానాన్నకు మంట. వీళ్ళంతా

తమకుటుంబం, తమ బంధు మిత్రులు, తమను గురించే యెంతసేపూ ఆలోచిస్తారనీ, యీ మఠా దైవభక్తిపేరుతో కపటనాటకమాడే వంచకులూ, స్వలాభపరులనీ మానాన్న విమర్శించేవాడు. దైవభక్తి యీ బాపతు మతగురువులకు యే కోశానాలేదనీ, వీళ్ళను యెప్పుడూ ఒక కంట కనిపెడుతూ మెళకువతోనే సంచరించాలనీ గూడా హెచ్చరించేవాడు.

"పసివాళ్ళయినా తెలివైన నిర్ణయమే చేసుకున్నార్రా అబ్బాయిలూ!" అన్నాడు మానాన్న. మాఅమ్మవంక చూసి, "మన కుర్రోళ్ళు మతగురువులు కావాలని నీవుకోరడం, భగవంతుడి సేవచేయడానికా, లేకపోతే, నీకూ, నాకూ, ఊళ్ళోవాళ్ళకూ సేవచేయడానికా?" అన్నాడు మానాన్న.

"అదికాదండీ నా ఉద్దేశ్యం!" జెస్యూట్ ఆర్డర్'లో చేరిపోతే తిరిగి యింటిమొహం చూడరేమో అనండీ నా భయం!" అన్నది మా అమ్మ.

"ఇదుగో నా వంకచూడు! మన మతానికీ మనదేవుడికీ యిహ నుంచైనా నిజాయితీగా సంచరిద్దాం! ఎందుకీ ఆత్మవంచన? పిల్లలు మనల్ని, మనయింటినీ వదిలిపెట్టి యెక్కడికి పోతారని నీ దిగులు? వాళ్ళను విడిచి నేను మాత్రం ఉండగలనా? అయితే నిష్కళంకమైన భగవత్సేవ, ప్రజాసేవలో మన కుర్రోళ్ళు తమహాలాన్నీ శక్తినీ వినియోగించాలని నా ఆశయం. ఎందుకూ పనికిరాని శుష్కోపన్యాసాలు చేస్తూ, కపట సన్యాసుల్లా, ప్రపంచాన్ని వంచించడం సుతరామూ అంగీకరించలేను" అన్నాడు మానాన్న ఆవేదనతో

మౌనంతో వింటూన్న ఆంటోనియో, "వచ్చే నెల్లో వాళ్ళిద్దరూ వెళ్ళిపోతూంటే, పై నెల్లో నేనూ వెళ్ళిపోయే వాడినే. ఎవరి పనుల మీద

వాళ్ళు వెడుతూంటారు, వస్తూంటారు ! ఇక్కడ ఉండేవాళ్ళు యిక్కణ్ణే ఉండిపోతారు ! ఎవరిపన్లు యెవరాపుకుంటారు ?" అన్నాడు.

మా నాన్న, అమ్మా ఆంటోనియో వంకచూసి మొహాలు వేలా వేసుకున్నారు. వాడుగూడా రేపోమాపో వెళ్ళిపోతా ననేసరికల్లా, మా అమ్మ మరీ బెంగబెట్టుకుంది. ఎన్నాళ్లు దిగులుపడి కుమిలి పోతా రీవిధంగా ! పమ్మల్నందర్నీ రెక్కలువచ్చేదాకా అల్లారుముద్దుగా పెంచి పోషించారు మా తలిదండ్రులు. మా గూళ్లనుంచి రివ్వున యెగిరి యెవరి దోవననాళ్లు వెళ్ళిపోయే రోజులువచ్చాయి. ఇహ ఉండమన్నా ఉండేది లేదు. మా తలిదండ్రులు గుండెలు రాయి చేసుకొని జీవించక తప్పదని గూడా గ్రహించారు. లోకం పోకడ యింతేనని వాళ్ళకు తెలియక పోతేగా !

జూన్ నెలారంభంలో చదువుకోడానికి రాబర్ట్సోపంజమ్ వెళ్ళి పోయాడు. తర్వాత ఒక వారానికల్లా కార్లస్, సీజర్లిద్దరూ జెస్యూట్ ఆర్డర్‌లో చేరడానికి బెల్గాం వెళ్ళిపోయారు.

వీళ్ళిద్దరితో తానుగూడా కలిసి ప్రయాణమై పోతానన్న ఆంటో నియో సర్దుకున్నాడు. బింకాని కలా అన్నాడుగాని, అమ్మనూ, నాన్ననూ విడిచి వెళ్ళలేక పోయాడు. అంతకన్న బలమైన కారణం గూడా మరోటుంది, అది నా ఒక్కడికి మాత్రమే తెలుసు.

అయినా తర్వాత తర్వాత వాడునడచిన 'ధోరణి నన్ను గాభరా పెట్టింది. వాణ్ణిగురించి నాకిదివరకున్న సదభిప్రాయాన్ని మార్చుకోవాల్సి వచ్చింది. ఇదివరలో వాడెంతో ధైర్యసాహసాలుగల మనిషిలా కనిపిం చాడు. స్కూల్లో చదువుకునే రోజుల్లో వాడి చొరవకూ, వాడి చురుక దనానికీ, వాడిసాహసానికీ అబ్బురపడేవాళ్ళం. ఇప్పుడెందుకో యేళ్లు పై

బడ్డకొద్దీ ధైర్యం సన్నగిలింది. పెర్రివాడిలా బెదిరి బెదిరి చూడడం సాగి స్తున్నాడు. ఏదోభయం పట్టుకుని వాణ్ణి పీడిస్తున్నట్లు సంచరిస్తున్నాడు. ఆత్మవిశ్వాసం సడలినట్లుంది. అవకాశం చూసుకుని లక్ష్మితో తన ప్రేమను బయటపెట్టి అటో యిటో తేల్చుకోడానికి జంకుతున్నాడు. బెదురు చూపులతో కాలయాపన చేస్తాడుగాని ఒక్క ప్రయత్నమైనా గట్టిగా చేయడు. లక్ష్మిని చూస్తేవాడికి సిగ్గులా ఉంది. చాటు చాటుగా దూరాన్నుంచి చూసి మురిసిపోతాడు. ఎదటపడి కుండ బద్దలుకొట్టినట్లు అడిగి తేల్చుకోడేమా అని నేను మండిపోతున్నాను. ఎందుకీ ముసుగులో గుద్దులాట ! పోనీ తనప్రేమ రహస్యాన్ని అప్పుడే బయట పెట్టుకోక పోయినా, మామూలు యిష్టాగోష్టి కబుర్లైనా లక్ష్మితో చెప్పడేమా అని ఆశ్చర్య పోతున్నాను.

ఈ దైన్యస్థితి మా ఆంటోనియో కెలా కల్గింది. బస్తీచదువు వాణ్ణిలా పిరికివాణ్ణిగా చేసిందా ? బస్తీలో చదువుకున్న కుర్రాళ్ళంతా యిలా సిగ్గుపడుతున్నారా ? ఆడపిల్లలతో యిదివరలో వాడు స్వేచ్ఛగా మాట్లాడుతుండేవాడే ! నిర్భయంగా యెందరినో ఆడపిల్లల్ని ప్రేమించి నట్లు డాబులు చెప్పుకునేవాడే ! పెళ్ళిళ్ళకూ, డ్యాన్సులకూ హాజరైనప్పుడల్లా రకరకాల ఆడపిల్లల్ని ప్రేమించినట్లు, ప్రేమచిహ్నాలుగా సెంటు పూసిన జేబురుమాళ్లు యింటికి తెచ్చుకునేవాడు; ఎవ్వరూ చూడకుండా వాటిని దిండుకింద దాచుకుని, అప్పుడప్పుడూ వాటిని ముద్దుపెట్టుకునే వాడు.

ఆడపిల్లలన్నా, ప్రణయకలాపాలన్నా ఆరోజుల్లో మా ఆంటోనియోకు అంతపిచ్చి. ఎంతసులభంగా ఆడపిల్లల్ని ప్రేమించేవాడో అంత సులభంగా మరచిపోయేవాడు గూడా. ఇప్పుడాదశ దాటిపోయింది,

చైతన్యవంతుడై వ్యక్తిత్వం సంపాదించు కున్నాడు. వాడిప్పుడు నిండు మనిషైనాడు. అందంగా, సౌందర్యవంతుడుగా తేలాడు. విద్యావంతు డైనాడు. జీవితం అంటే, ప్రపంచం అంటే యేమిటో తెలుసుకున్నాడు. ఇంత మార్పినాడు కొత్తగా వచ్చినా. మునుపున్న ధైర్యం వాడిలో యీ నాడు పదోవంతుగూడా లేదు మూగవాడైనట్లు నోరువిప్పి మాట్లా డడు. చదువా, విజ్ఞానమూ, ధనమూ, అలాంటి పేదపిల్ల లక్ష్మితో నాలుగు ముక్కలు నోరార మాట్లాడానికి దమ్ములు లేకపోయినాయి వాడికి.

లక్ష్మియందు వాడికిగల ప్రేమ యెలాంటి ప్రేమోనాకు బోధ పళ్ళేదు. ఏరకమైన ప్రేమైనాగానీ, రోజు రోజుకూ వాడు నీరసించి పోతున్నాడు. అయితే వాడివాలకం, వాడినడక తీరూ, వాడి ముఖలక్ష ణాలు నాకాశ్చర్యం కల్గిస్తున్నాయి. నేనెంతో ఆశాభంగం చెందాను. ఇలాంట అద్భుతమైన అవకాశాన్ని జారవిడుచుకునే వెర్రివాడెవడైనా ప్రపంచంలో ఉంటాడా అని జాలిపడే వాణ్ణివాణ్ణి చూసి, చిన్నతనంలో చూపిన ధైర్యసాహసాలే యిప్పుడూ చూపిస్తే యెంతబాగుండి ఉండేదని పించిందినాకు. నాకు శక్తిలేకపోయిందిగాని, నేనుగూడా వాడిమాదిరే తయారౌదామని ప్రయత్నించా నా రోజుల్లో. వాణ్నిచూసి ఆ నాడు అసూయ పడ్డానంటే నమ్మండి.

లక్ష్మి, తనేమో, తనపనులేమో, పూర్తిగా నిమగ్నమై పోయింది బాహ్యప్రపంచ ధోరణే దానికి పట్టలేదు. ఆంటోనియో పడే ఆవేదన ఆ పిల్ల కనిపెట్టలేదు. ఇద్దరిస్థితి రాత్రింబగళ్లు నేను కనిపెడుతూనే ఉన్నాను. అనుకూలమైన వాతావరణం త్వరతో రాకపోతుందాఅని ఆశతో యెదురు చూస్తున్నాను, ఈ లోగా గోవాలో ప్రధానమైన రాజ కీయ సమస్యలు తలెత్తాయి, తాత్కాలికంగా ఆంటోనియోనూ, లక్ష్మినీ మరచి పోవలసిన పరిస్థితిగూడా యేర్పడ్డది.

తరతరాలనుంచీ మమ్మల్ని పీల్చుకుని పిప్పిచేస్తున్న పోర్చుగల్ ప్రభుత్వం పార్లమెంటులో ఒకబిల్లు ప్రవేశపెట్టింది. ఈ బిల్లు మాబానిస జీవితాన్ని మరింత నీచస్థితికి తేవడానికి ఉద్దేశించ బడ్డది. మావ్యక్తిత్వం, మా ఆత్మగౌరవం యీ బిల్లుతో పూర్తిగా తుడుచుకుపోయే దుర్భరస్థితి యేర్పడ్డది. మా ప్రజల్ని ఒక శతాబ్దం వెనక్కు తీసుకుని పోయింది యీ బిల్లు. 1910 నాటినుండీ రిపబ్లిక్ ప్రభుత్వం క్రింద అనుభవించిన ఆ కొద్దిపాటి హక్కులూ నేటితో మంటగలిసి పోయాయి.

ఇప్పటివరకూ గోవాలో ప్రజాప్రాతినిధ్యం గల శాసనసభ, మునిసిపల్, స్థానిక సంస్థలూ ఉంటూవచ్చాయి. పరిపాలనా నిర్వహణలో కొన్నికొన్ని హక్కులనుభవిస్తు ఉండేవాళ్ళం. ఒక్క కలం పోటుతో, మా పవిత్ర హక్కులన్నీ భగ్నం చేసిందీబిల్లు. మా బానిస జీవితం యీ నాటితో పరిపక్వస్థితి చెందేలా రిపబ్లిక్ రాజ్యాంగాన్ని సమూలంగా సవరించింది నియంతృత్వ ప్రభుత్వం. గతించిన రిపబ్లిక్ రాజ్యాంగ చట్టంలో, పోర్చుగల్ తోపాటు, పోర్చుగల్ గెల్చుకున్న దేశాంతర ప్రాంతాలుగూడాచేరి పోర్చుగల్ సామ్రాజ్యంగా నిర్వచించ బడ్డది. ఇప్పుడు కొత్తగా ప్రవేశపెట్టిన బిల్లులో రెండవ నిబంధన ప్రకారం, దేశాంతర ప్రాంతాలన్నీ పోర్చుగల్ శాశ్వతహక్కు భుక్తమైనట్లూ, యీ ప్రాంతాలను శతాబ్దాలుగా ఆక్రమించుకుని, అక్కడి ప్రజలను నాగరికులుగా చేసినట్లూ, వాళ్ళపైన పోర్చుగల్ శాశ్వతమైన పెత్తనం చేస్తూ ఆప్రాంతాలను వారి స్వదేశంగా పరిగణిస్తున్నట్లూ నిర్వచించబడ్డది. గెల్చుకున్న ప్రాంతాలనూ, స్వాధీనమైన ప్రజల్నీ నాగరికులుగా, విజ్ఞానవంతులుగా చేయడమే పోర్చుగల్ ప్రధానకర్తవ్యమైనట్లు కొత్తబిల్లులో పేర్కొనబడ్డది. ఈ బిల్లు ప్రకారం రెండు తరగతుల ప్రజలు సృష్టించబడ్డారు. హక్కుదారుడూ, అతనికి లోబడి

ఉండే దానిసలూ. ఈ బానిసల్లో మళ్ళ రెండుతరగతులు సృష్టించబడ్డాయి. పోర్చుగీస్ భాషనేర్చుకుని, పోర్చుగీస్ నాగరికతను, సాంప్రదాయాలను అలవర్చుకొని ఆ జాతిలో మిళితమై యిమిడిపోయే వాళ్ళంతా ఒక తరగతి. పోర్చుగీసుభాష తెలియని గోవా ప్రజలంతా మరొక తరగతి.

ఈ కొత్త బిల్లు పోర్చుగీసు పార్లమెంటులో ప్రవేశపెట్టబడగానే, గోవా అంతటా తీవ్రమైన సంచలనం బయల్దేరింది. ఈ బిల్లులో దాగివున్న అంతరార్థం మా ప్రజలకు అవగతం కాగానే వాళ్ళ ఆగ్రహం మిన్నుముట్టింది. తెల్లజాతికి చెందిన పోర్చుగీసు వాళ్ళంతా వాళ్ళ జాత్యహంకారాన్నీ, ఆధిక్యతనూ, ప్రకటించుకొనడం మొదిలెట్టారు. గోవా ప్రజల్ని తమతో సమానంగా పరిగణించడం ఆనాటినుండి మానేశారు. మా ప్రజలీ విషయం అర్థం చేసుకున్నారు. వాళ్ళ ఆత్మగౌరవానికీ, జాతీయాభిమానానికీ, ప్రమాదకరమైన చర్యగా దీన్ని గుర్తించారు,

"మనం యిప్పుడు అంటరాని వాళ్ళమైనాం గదూ! ఏమంటారు?" అన్నాడు మానాన్న డాక్టర్ అక్వినోతా. మానాన్న ముఖంలోనూ, కంఠధ్వనిలోనూ ద్వేషం, క్రౌర్యం వ్యక్తమౌతూంది. ఏమండీ డాక్టరుగారూ! మీరేమంటారు యిప్పుడు దీనికి? ఇంకా వేచి చూడమనేనా మీ సలహా? నేనే గనక పోర్చుగల్ వెళ్ళగలిగితే, మనపైన అవమాన పరంపరలు కురిపిస్తున్న యీ పోర్చుగీస్ లంజలకొడుకుల్ని మూకఉమ్మడిగా కాల్చిపారేద్దునయ్యా! బ్రతికిపోయారు! వీళ్లు పరమ నీచులయ్యా పట్టపరమ నీచులు! పందులెన్నోరెట్లు నయం వీళ్ళకన్న!" అన్నాడు మానాన్న.

'నిదానించండి టాబ్! నిదానించండి! ఈ విధంగా నోరుపారేసుకుంటే యేమైనా ప్రయోజనం ఉందీ! మనమంతా బానిసలైపోయామనీ

మనకు స్వాతంత్ర్యం తప్పనిసరిగా అవసరమనీ ఒప్పుకుంటాను. ప్రపంచంలో అణగారి ఉన్న కోటాను కోట్ల బానిస ప్రజల్ని గూర్చి మనం వింటున్నాం. వాళ్ళ స్వాతంత్ర్య పోరాటాల్ని గూర్చి చదువుకుంటున్నాం. వాళ్ళను శక్తివంతుడైన నాయకుడంటూ ఒకడుండి వాళ్ళను నడుపుతున్నాడు. అతని నాయకత్వం క్రింద వాళ్ళంతా పోరాడి విముక్తులైనారు. అవుతున్నారు గూడా. స్వాతంత్ర్య కాంక్ష ఒక్కటే ఉన్నంత మాత్రాన చాలదు. మనకు సరైనమార్గం చూచి, మనల్ని జయప్రదంగా నడిపి, స్వాతంత్ర్యాన్ని సాధించిపెట్టగల నాయకుడొక్కడైనా మనకున్నాడూ గోవాలో ? చెప్పండి! అన్నాడు. డాక్టర్ ఆక్వినో అన్నమాటలో పొరపాటేమీ లేదు.

మానాన్న నోరుతెరుచుకొని డాక్టర్‌వంక అదేపనిగా చూస్తున్నాడు. డాక్టర్ ఆ దోరణిలో మాట్లాడటం మానాన్న ప్రథమ పర్యాయంగా యిప్పుడే వింటున్నారు. మా ప్రజల్లో స్వాతంత్ర్య కాంక్ష కలిగించి, కార్యోన్ముఖులుగా చేయగల నాయకుడు లేనిమాటనిటమే. అలాంటి నాయకుడే లభిస్తే, మా ప్రజలు ప్రాణాలర్పించడానికైనా సిద్ధంగా ఉన్నారు. డాక్టర్ ఆక్వినో అన్నమాటల్లో సత్యమున్నదని మానాన్న గ్రహించాడు. ఆయన యిప్పుడు సరైన మార్గంలోకి మారాడని మానాన్న సంతోషించాడు.

మరునాడే మా ప్రజల్లో గుసగుసలు బయల్దేరేయి. క్రొత్తగా ప్రతిపాదించిన బిల్లును తీవ్రంగా ఖండిస్తూ మెనిజీస్ బ్రాగాంజా ప్రకటన ఒకటి చేశాడు. ఈ ప్రకటనలో పోర్చుగీసు శ్వేతజాతీయులు గూడా కలితిలేని స్వచ్ఛమైన యేక జాతీయులు కానీ, వాళ్ళందరూ కార్తజీనియన్, ఫోనీషియన్, మూర్, నీగ్రోజాతీయులకు చెందిన సంకరజాతి అనీ, నిర్వివాదమైన, హేతుబద్ధమైన చారిత్రికాధారులు ఉదహరిస్తు

స్పష్టం చేశాడుగూడా, ఈ కారణం చేత నల్లజాతుల కన్నా తామె అధికులమని ప్రకటించుకున్న పోర్చుగీసు వాదన వట్టిబూటకమైనదనీ, ఫసలేనిదనీ బ్రాగాంకా రుజువుచేశాడు.

బ్రాగాంకా ప్రకటన పూర్తిపాఠం చదువుతూంటుంటే, తుపాకి దెబ్బతిన్న పెద్దపులి గర్జనలావుంది నాచెవులకు.

బ్రాగాంకా మాకు నాయకత్వం వహించి, మా ప్రజల్ని విముక్తి చేసితీరుతాడని ఆశించాడు మానాన్న.

## ౨౩

ఆరోజు వాతావరణం ప్రశాంతంగా ఉంది. సెప్టెంబర్లో కాచే యెండ మందంగా ఉంటుంది గోవాలో. క్రితంరాత్రి వర్షం కురిసి వెలవగానే, పచ్చిగడ్డి పైన నిలిచిపోయిఉన్న నీటి బిందువులు ముత్యాల్లా తళతళ మెరుస్తున్నాయి.

సంవత్సరం అంతట్లోకి సెప్టెంబరు నెల యెంతో అందమైన దని నా నమ్మకం. మూడు నెలలుగా మురికి వానలు కురిసిపోయిన తర్వాత, వానదేవుడు కొంచెం విశ్రాంతి తీసుకున్నట్లున్నాడు. అప్పుడప్పుడూ పడె దబాటువానకు నేలతడిసి, సర్వత్రా గడ్డీ, గాదం మొలవడం ప్రారంభించింది. చెప్పులులేకుండా దిసికాళ్ళతో గడ్డిమీదుగా నడచిపోతున్నప్పుడు, గడ్డి రేకులు మోకాళ్ళకు రాచుకుని శరీరం జలదరిస్తుంది, గాలి బరువుగా మధురమైన సువాసనలు వెదజల్లుతూ, కళ్ళు మూతలు పడేట్లు వీస్తోంది. తనివిదీరా ఆ సువాసనల్ని ఊపిరి తిత్తుల్లోకి యెక్కించుకున్నాం.

సెప్టెంబరులో వీచేగాలికి శరీరాన్ని ఝుళ్ళు మనిపించి, ఆనందం కలిగించే స్వభావ ముంది. సూర్యభగవానుడికీ, వానదేవునికీ యెడతెగని పోరాటం గూడా యీరోజుల్లోనే. ఝామువొద్దెక్కేవరకూ సూర్యుడు ప్రకాశిస్తూ ఉంటాడు. ఇంతలో దడదడమని, పుట్టిమునిగినట్లుగా, వర్షంపడి క్షణకాలంలో భూమిని తడిపి చక్కాపోతుంది. ఈ విధంగా ఒకదానివెంట ఒకటిగా యెండకాయడం, వానకురవడం అనంతంగా

సాగిపోతూంటుంది. పచ్చనిపైర్లు యీ ఆనందాన్ని అప్యాయంగా అనుభవించినట్లు కనిపిస్తాయి.

ప్రకృతిగూడా యీ తరుణంలో రమణీయంగా ఉంటుంది. తోటలూ, దొడ్లూ పొలాలూ, పంటలూ—ధనికుడివి గానీ, పేదవాడివి గానీ—పొద్దుతిరుగుడు పూలూ. లిల్లీపూలూ, దిరిసెనపూలూ. యింకెన్నో రకరకాల పూలతో ప్రకృతి సౌందర్యంగా ఉంటుంది. శీతాకోక చిలుకలు యీ పూలచేత ఆకర్షించబడి, ఒక పూవునుంచి మరొక పూవుకు యెగిరి నాట్యంచేస్తాయి. ఈ ఆనందాన్ని కండ్లారా చూసి అనుభవిస్తేనే గాని తెలియదు.

శీతాకోక చిలుకల్ని చూసి ముఖ్యంగా పిల్లలు చెందే సంతోషానికి మేరలేదు. ఇవి పూలనన్నిటినీ ముద్దు పెట్టుకున్నట్లు ముద్దు పెట్టుకుని, ఒక్కమాటుగా రివ్వున యెగిరిపోతాయి. పసిబిడ్డలు వీటివెంటబడి పట్టుకుంటారు. తోకలకు దారాలుకట్టి వాటిని తమసొంతవిగా చేసుకుంటారు. యువకులైన మొగపిల్లలు శీతాకోక చిలుకల్లా పరాసగా ఆడపిల్లల్నందర్నీ ముచ్చటగా ముద్దులు పెట్టుకోవాలని ఉవ్విళ్ళూరుతారు.

నా కాళ్లు పడిపోవటం మూలంగా యీ భూమ్మీద పూర్వంలా తిరిగే ఆశ నా కంతరించింది. అయినానేను కనీసం ఒక శీతాకోకచిలుకనై యీ ప్రపంచంలోఉన్న ఆడపిల్లల్నందర్నీ ముద్దుపెట్టుకోవాలనే కోరిక నాకు కలిగింది. నాలో కల్గిన యీ విచిత్రమైన యీ కోరికను దాచుకోలేక నిర్భయంగా బయటికి చెప్పేస్తున్నాను. ఇలాంటి తలంపులు చెడ్డవని మీరంతా నన్ను నిరసించవచ్చుగూడా! పోనీ, అవిటికాళ్ళతో జీవితశేషాన్ని వెళ్ళదీసే ఖర్మం బట్టిన నన్ను యిలాంటి తియ్యని ఆలోచనలైనా ఆలోచించుకోనివ్వరా నామీద జాలిదల్చి? ఈ ఊహలూ, యీ

ఆలోచనల్లోనుండి ఉద్భవించే ఆనందాన్నైనా అనుభవింపనీయరానన్న? మీతోపాటు నాక్కూడా జీవితానందం అనుభవించాలని యెంతో గాఢ మైన కోర్కె ఉంది మనస్సులో. అంతగా ఆశించిన ఆనందానికి నేనీ నాడు నోచుకోలేకపోయినా, మీ సానుభూతినీ, ప్రేమాభిమానాలనైనా నామీద ప్రసరింపజేసి, నా యీ చిన్నకోర్కె తీర్చండి!

అలాంటి సెప్టెంబరునెల గిర్రునతిరిగి మళ్ళీవచ్చిందీసంవత్సరం! ఆంటోనియోగూడా సంవత్సరం గడచిన తర్వాత తిరిగి యింటికివచ్చి మాతో యిక్కడే ఉండిపోయాడు. వాడి పరీక్షాఫలితాలు వచ్చి యిప్పటికి మూడునెలలైంది. అయినా తర్వాత కార్యక్రమం వాడిమనస్సుకు పట్టక, తన హృదయానికే తానొక ఖైదీగాచిక్కి యిక్కడ మాతోటే ఉండి పోయాడు.

లక్ష్మిమీద ఆంటోనియోకు వొళ్ళుతెలియని వెర్రిప్రేమ యేర్పడి అట్టే నిలిచిపోయింది. ప్రేమపాశం యెంత బలీయమైనదో, యెంత గుడ్డిదోగూడా అనుభవించేవాళ్ళే యెరుగుదురు! తక్కినవాళ్ళకేం తెలుస్తుంది? ప్రేమ మానవుణ్ని తన విద్యుక్తధర్మాన్నీ, జీవితభవితవ్యాన్నీ ఆశలనూ, ఆశయాలనూ, చివరకు దైవాన్నీ, మాతాన్నీకూడా మరపింప జేస్తుంది. నాలుగు మాసాలనుండీ యీ ప్రేమ ఆంటోనియోను దహించి వేస్తున్నది. దానికి వాడు బలౌతున్నాడు. ఒక్కముక్కైనా వాడు లక్ష్మితో మాట్లాడడు. లక్ష్మియెంతో భక్తిశ్రద్ధలతో వాడి మేజోళ్ళు కడిగి శుభ్రం చేస్తుంది; వాడిపక్క పరిశుభ్రంగా వేసిపెడుతుంది; వాడినొక ఆరాధ్య దైవంగా భావించి నిష్కల్మష భక్తిభావంతో పరిచర్యలు చేస్తుంది.

ఎంతవరకు వీలుంటే అంతవరకూ లక్ష్మి ఆంటోనియోనుంచి దూరంగానే ఉంటూవచ్చింది. వాడి కళ్ళల్లో తానుచూసి ఆనందించగల్గేది తన ఊహాచిత్రమేకాని, తాను తలపోసిన ప్రేమ కానేరదని లక్ష్మి

భావించింది. తానాశించిన ప్రేమే నిజంగా ఫలిస్తే వాడి తలిదండ్రులకూ తక్కిన కుటుంబానికీ. బంధువర్గానికి తీరని విపత్తు తెచ్చిపెట్టిన దాన నౌతానేమో అని లక్ష్మికి తెలుసు.

లక్ష్మిగూడా నిజంగా ఆంటోనియోను ప్రేమిస్తున్నదా? వాడిని చూసి లక్ష్మి అమితంగా మెచ్చుకొనేది. వాడిని సమీపించి మనసారా మాట్లాడి ఆనందానుభూతి పొందుదామనుకునేది. వాడు లక్ష్మివంక చూడ నప్పుడు, లక్ష్మి వాడివేపు ప్రేమదృక్కులతో ఓరగాచూస్తున్న సమ యంలో, అపిల్ల కండ్లలో ప్రతిబింబిస్తున్న భావాలను నేను గ్రహించ గల్గాను. లక్ష్మి నిజంగా, త్రికరణశుద్ధిగా ఆంటోనియోను ప్రేమిస్తున్న దని నిర్ధారణ చేసుకున్నాను. అయితే వివేకం లౌకికజ్ఞానంగల పిల్ల గనుక, తనప్రేమను అణచివేసుకోడానికి ప్రయత్నించింది. నిజమే! సాంఘికంగా తనకన్నా పై అంతస్థులోఉన్న యువకుణ్ణి ప్రేమించి యేం ప్రయోజనం? అలాంటి వ్యర్థప్రేమ అణగారి నశించకేమౌతుంది? పోనీ, ఆంటోనియో హృదయంలోగూడ తనమీద నిజమైన ప్రేమ అంకురించినట్లు లక్ష్మికి నమ్మకం చిక్కినా, తనప్రేమనెలా బయట పెట్టుకుంటుంది లక్ష్మి? దిక్కులేని నిస్సహాయస్థితిలో తనను దగ్గరకు తీసి, యింత కూడూ, గుడ్డా యిచ్చి ప్రేమతో పెంచి పోషించే తన పెంపుడు తలిదండ్రులకు కృతఘ్నతకాదా యీ చర్య? తన కొడుకు యే ధనవంతుల బిడ్డనో, యే విద్యావంతురాలినో పెళ్ళాడి, కావలసి నంత కట్నం మూటకట్టుకొస్తాడని ఆశపడే తలిదండ్రులకు అపచారం కల్పించడం కాదా యీ ప్రేమ.

పేదవాళ్ళు. ఉన్నతమైన నీతీ, నిజాయితీతో బ్రతుకుతారంటారు. వాళ్ళ కృతజ్ఞతకూడా అలాంటిదే. లక్ష్మి కేవలం ఒక కూలియింటి బిడ్డ. ఎప్పుడూ మానాన్ననూ, అమ్మనూ, "నాన్నా!", "అమ్మా!" అని సంభో

ధిస్తూంటుంది. అలాంటి పెంపుడు తలిదండ్రుల యెడల లక్ష్మి అపచారం చేయలేదు. అందుకే తన మానసిక శక్తినీ, ధైర్యస్థైర్యాలనూ పుంజుకుని తన ప్రేమను అణచుకోగల్గుతున్నది. గుండె దిట్టంచేసుకుని, మనో నిబ్బరంతో జీవించగలుగుతున్నది. ఆంటోనియోమీద తనకసలు ప్రేమ లేనట్లు నటిస్తున్నది లక్ష్మి.

"ఆంటూను నీవు నిజంగా ప్రేమిస్తున్నావుగదూ లక్ష్మీ? నిజం చెప్పు! నాకంతా తెలుసులే!" అన్నాను ఒకరోజున. నాకాళ్ళు మర్దిస్తూ నాపక్కనే కూర్చుంది లక్ష్మి.

ఆంటోనియో ప్రసక్తి తెచ్చినప్పుడల్లా, లక్ష్మి యిదివరలో తప్పించుకుని సమాధానం చెప్పేదికాదు. ఆరోజున నా ప్రశ్నకు సమాధానం చెబుతుందని అనుకోలేదు. ఏం సమాధానం యిన్నాళ్ళనుండి ఆ పిల్ల నోటినుండి వినదలచానో, అది రానేవచ్చింది. "అవును బాబూష్!" అన్నది దైన్యంగా, మెల్లనిగొంతుకతో. "అయితే యేంప్రయోజనం!" అనిగూడా అన్నది నిరాశతో.

ఈ మాటలలో జాలి, నిస్సహాయత, నిరాశ ద్యోతకమై స్త్రీ, పురుష ప్రేమికుల పవిత్రకోర్కె లెక్కాక్కప్పు డీడేరక భగ్న హృదయులు కావడం ప్రపంచలో చూస్తూనేఉన్నాం. మనసారా అన్యోన్యంగా ప్రేమించుకున్న ప్రేమికులకు మానవుడు కల్పించే అవరోధాలను అధిగమించలేక, మౌనంగా విరహబాధ అనుభవిస్తూ, నిరాశతో, నిస్సహాయతతో కృంగి. కృశించి పోతాడు. ఏ దయామయుడైనా కష్ట సమయంలో తమకు సహాయపడి యిద్దరికీ సంధానం చేస్తాడేమో అని గంపెడాశతో యెదురుచూస్తుంటారు. ఇంతకూ, అన్యోన్య ప్రేమాను రాగమే వీళ్ళు చేసిన మహాపరాధం,

సెప్టెంబరు సగపడ్డది. పచ్చిగడ్డి సువాసన నాసికాపుటాలకు తగులుతూ హాయిని కలుగజేస్తున్నది. పట్టివేళ్ళవిసనకర్రితో వీచినట్లుగా మలయమారుతం కమ్మగా వీస్తూంది. తన ప్రేమను గురించి చిట్టచివర కెలాగైతేనేం, ఆంటోనియో లక్ష్మి యెదటపడి చెప్పదలచుకున్నాడు. ఆ నాడు మాకెంతో సంతోషమైనరోజు. మా పంటలు నూర్పిడిపూర్తై, గింజలు యింటికిచేరేరోజది. విత్తనాలు చల్లిననాటినుండీ యీరోజు వరకూ మా పొలాలు పుష్కలంగాపండి, మా గాదెలు నిండిపోవాలని వెయ్యిదేవుళ్ళకు మొక్కుతున్నాం. ప్రకృతి మా మీద దయదలచి. మమ్మల్ని పదికాలాలపాటు సుఖంగా జీవించేట్లు దీవించాలని మాపెద్దలూ, పిల్లలూ దేవుణ్ణి ప్రార్థిస్తున్నాం.

ఆ పేళ ఉదయాన పెందలాడే మా నాన్న, ఆంటోనియో నిద్ర లేచారు. మగకూలీలనూ. ఆడకూలీలనూ వెంటబెట్టుకుని పొలంపెళ్ళారు. పగలంతా అక్కడే ఉండిపోయారు. ఆడవాళ్ళంతా కొడవళ్ళతో వరికోసి చేనిమీద పడేశారు. మగకూలీలు కట్టలుకట్టి వెడల్పైన ఒక దిబ్బమీద కుప్పగా పేరుస్తున్నారు. ఎద్దులు నుగ్గు నుగ్గుగా తొక్కివేస్తున్నాయి. వెన్నునుండి గింజలు జలజలా రాలుతున్నాయి. ఆ రోజంతా కూలీలెంత కష్టపడ్డారు పాపం! ఎముకలు విరుచుకుని పనిచేశారు. తాగేవాళ్ళు నీళ్ళు కడవలకు కడవలు తాగుతున్నారు. ఎండతపనకు యెన్ని నీళ్ళుతాగినా దాహం ఆరడంలేదు. దిగచెమటలు పోస్తున్నాయి. గింజలు పూర్తిగా రాలిపోయాయి. ధాన్యం బస్తాలకుపట్టి బండ్లమీద యిళ్ళకు చేర్చు తున్నారు.

నూర్పిళ్ళకు పోయిన మా నాన్నా వాళ్ళు యీ నాడు యింటికి త్వరగావచ్చే సూచనల్లేవు. మా అమ్మ తిడప తడపకూ వరండాలోకి వచ్చి మా వాళ్ళు వస్తున్నారేమో అని ఆతురతతో చూస్తున్నది.

"ఏమిటబ్బా! యింత ఆలస్యమైనా యిండ్లకురారు మనవాళ్లు!" అప్పటికి ఏడుసార్లు తిరిగింది మా అమ్మ వంటయింట్లోకీ వరండాలోకీ. ఆలస్యం యెందుకవుతున్నదీ ఆమె కర్థం కావడంలేదు,

"ఈ సంవత్సరం పంట బాగాపండి ఉండాలి! అందుకే యీ ఆలస్యం!" అన్నది మేరియా. అందుకే కాబోలనుకున్నాం మేమంతాగూడా.

అంధకారం ఆవరిస్తూంది గ్రామాన్ని. మా అప్పచెల్లెండ్లందరూ వంటయింటిపన్లు ఆదరాబాదరా ముగించుకుని వరండాలో వచ్చిపడ్డారు విశ్రాంతి తీసుకోడానికి. పొలం వెళ్ళిన నాన్నావాళ్లు యెప్పుడొస్తారా అని కండ్లు చిల్లులుపడేట్టు యెదురు చూస్తున్నాం. గాడాంధకారం అలముకుని పోయింది.

"ఏమిటితా ఆలస్యానికికారణం? ఎంత పొద్దుపోయిందిప్పుడు?" అంటూ ఆదుర్దా పడుతున్నది మా అమ్మ. "మధ్యాహ్నమైనా సరిగా అన్నం తినకుండా పగలల్లా అంటూ యెండలో మాడుతున్నాడు. అమ్మాయ్ రూత్! లోపలికిపోయి టైమ్ చూసిరా అమ్మా!"

మా అమ్మ యీ మాట అన్నదోలేదో, ఇంతలో ఇసిడారో గొంతెత్తి నూర్పిళ్ళపాటపాడుతున్నట్లు స్పష్టంగా వినవచ్చింది. నూర్పిళ్ళ తరుణంలో కూలీలూ, రైతులూ యీ పాటలు పాడుతూ తన్మయత్వం చెందిపోతారు మా గ్రామంలో.

మా నాన్నా వాళ్ళూ కూలీలతోకలిసి యిళ్ళకు వస్తున్నట్లుగా మాకు స్పష్టమైంది. వాళ్ళ గొంతుక లంతకంతకు పెద్దవిగా వినవస్తున్నాయి. కనుచూపుమేరలోకే వచ్చేశారు. మెట్లుదిగి పరుగెత్తికెళ్ళి, "ఏయ్! ఏయ్! రండి రండి!" అని సంతోషంతో కేకలేశాను.

"బాగా పండిందికదూ పంట ?" అడిగింది మా అమ్మ సంతోషంతో. ఊరేగుతూ వస్తున్న ఇసిడారో, యింకా యితర కూలీలూ మా అమ్మకు జవాబివ్వకుండా బస్తాలు పట్టుకెళ్ళి నేరుగా ధాన్యపుకొట్లో పోస్తున్నారు.

మా నాన్నా, ఆంటోనియో, అందరికన్నా ఆఖరున నడుస్తూ వస్తున్నారు. మా నాన్న అమ్మ ప్రశ్నకు సమాదానమిస్తూ, "పిల్లా, బలే పండిందిపిల్లా యీ సంవత్సరం! ఇదివరకెన్నడూ పండనంతగా విరగ పండిందనుకో!" అన్నాడు తన్మయత్వంతో.

"దేవుణ్ణి ప్రార్థించండయితే! మన కింత పంటయిచ్చింది ఆయనేగా మరి" అన్నది మా అమ్మ.

"మనస్తోత్రపాఠాలాయన కవసరంలేదు. స్తోత్రపాఠాలకు ఉబ్బి తబ్బిబ్బయ్యేది మనబోటి మానవులు. వాటి మీద జీవించేదిగూడా సామాన్యులైన మనబోటి మానవులే. స్తోత్రపాఠాలకూ, పొగడ్తలకూ భగవంతుడతీతుడు. ఆయన ఉత్కృష్టపురుషుడు, ఒకరి స్తోత్రపాఠాలూ ఒకరిశాపనార్థాలూ ఆయన్నేమీ చేయవు!" అన్నాడు మా నాన్న.

"అయితే కనీసం ఆయనకు వందనాలైనా సమర్పించండి!" అన్నది మా అమ్మ గట్టిగా.

"ఆపని యెప్పుడో చేశాను! ఆయనకు కాదుగాని, ముందు నీకు నిజంగా వందనాలర్పించాలి సుమా! ఇంత గొప్ప భక్తురాలివి! ఇంత చక్కని దానివి! ఇంతటి తెలివైన దానివి! నిన్నభినందించాలి! ఏమంటావ్ ?" అంటూ మా నాన్న మా అమ్మ చేయిపట్టుకుని ఆమె చుట్టూ పరుగెత్తుతూ నాట్యం చేయడం మొదలెట్టాడు.

కూలీలతో కలిసి మా నాన్న తాగివచ్చాడని మా అమ్మ తెలుసుకున్నది.

ధాన్యపుకొట్లో కూలీలు యింకా నిషాతో డ్యాన్సు చేస్తూనేఉన్నారు పాటలుపాడుతూ, అంతా అలిసిపోయారుగూడా. ఇంటిల్లిపాదీ మేమంతా అక్కడకు చేరుకున్నాం. మమ్మల్నిచూసి కూలీలకు హుషారెక్కి అంత కంతకు పెద్దగా పాడసాగారు. లోపలికెళ్ళి ఒక బుడ్డి సారా తెమ్మని మా అమ్మను సంజ్ఞచేశాడు మా నాన్న.

పంటలింకా బాగా పండాలనీ, మా ప్రజలింకా సుఖపడాలనీ, వర్షాలింకా అధికంగా కురిసి, మా చెరువులూ, కుంటలూ నిండిపోవాలనీ మా ఆరోగ్యం మా ప్రజల ఆరోగ్యం బాగుండాలనీ, కష్టించి పని చేసేందుకు మా కాళ్ళచేతులకు భగవంతుడింకా బలం, శక్తీ యివ్వాలని అర్థం వచ్చేట్లు, కూలీ రైతులెన్నో పాటలు పాడుతూనే ఉన్నారు. సారాయి తాగుతున్నకొద్దీ పాటలింకా జోరుగా వస్తున్నాయి.

చాలించండోయ్ మీ పాటలు! చాలించండి! కొలత ప్రారంభిద్దాంయిహ. నిరుటికన్న అదనంగా పండిన ప్రతి మణుగు ధాన్యానికీ ఒక్కొక్క బుడ్డి యేమనుకున్నారో!" అన్నాడు మా నాన్న.

ఇసిడారో ధాన్యపురాసివంక అదేపనిగా పరిశీలిస్తూ, "నిరుటికన్న యీ సంవత్సరం కనీసం ఒక్క పుట్టన్నా యెక్కువ పండి ఉంటుంది! ఇదే నా పందెం!" అన్నాడు.

"ఒక్క పుట్టెడేరా యెక్కువ? నీకు బుద్ధెక్కడలేదురా వెధవ! కనీసం పుట్టెన్నరైనా ఉంటుందని పందెం కడుతున్నా చూసుకో!" అన్నాడు మా నాన్న.

"అంతఉండదు బాబూ! ఒక పుట్టిపైన కొంచెంఉంటుందేమో! అంతే!" అన్నాడు డామింగోస్.

"పోండిరా! ఇసిడారో అన్నచే రైటురా! ఒక్క పుట్టికన్నా యెక్కువ ఉండదురా నిరుటి పంటమీద!" అన్నాడు సెబాస్టియో.

"ఇంకా యెవరైనా అంచనా వేయగలరా?" అన్నాడు మా నాన్న చుట్టూకలియజూచి. ఎవ్వరూ ముందుకువచ్చి పందెం కట్టలేదు. కొలత పా్రరంభమైంది.

ఒకటి, రెండు, మూడు....... అగగంబైంది కొలత ప్రారంభమై ప్రతివాడూ ఆతురతతో యెదురు చూస్తున్నాడు. నిరుటి ప్రమాణం దాటిపోగానే ప్రతివాడూ నోరుతెరుచుకుని ఆశ్చర్యపోతున్నాడు. కుప్ప తరిగిపోతున్నది అంతకంతకూ. చివరకు కొలత పూర్తయింది. మొత్తం పదిపుట్లయింది. నిరుటికన్నా ఒకటిం పాతిక పుట్టి అధికంగా పండించన్నమాట. మళ్ళీ అంతా పాటలు లంకించుకున్నారు. ఆవేశంలో మా నాన్నగూడా అందుకున్నాడు. గొంతుకలు పెద్దవి చేసి కుప్పచుట్టూ ప్రదక్షిణచేస్తూ పాడుతున్నారు. ఈ లోగా మరో బుడ్డి ఖాళీఅయింది. అందరం కలిసి ఆనందంగా కాలం వెళ్ళబుచ్చుకున్నాం. ఒక్క ఆంటోనియో మాకుమారమై మౌనంవహించికూర్చున్నాడు. ఆందోళనలో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు, వాడి మనస్సులో బ్రహ్మాండమైన విప్లవం చెలరేగుతుంది. మా అమ్మ వాడి మౌనంకనిపెట్టి వాడిదగ్గరకుపోయింది. అంత పొద్దుపోయేవరకూ పొలాల్లో ఉండకుండాఉంటే బాగుండేదని వాణ్ణి బుజ్జగించింది.

"ఆంటూ. నీవు అలిసిపోయావురా! నిజంగా పూర్తిగా అలిసిపోయావు. నీవు కష్టపడి పనిచేయలేవురా నాయనా! నీది సుకుమార శరీరం. ఎందుకంతసేపున్నావ్ పొలంలో?"

"పోవేనీవు! వాణ్ణి మరీ సుకుమారంగా చూస్తున్నావ్! కంది పోతాడావాడు? శరీరం కష్టానికి ఓర్చుకునేట్లు చేసుకోవాలి. కాస్తకూ

కూస్తకూ కందుతుందని దాచుకుంటారా? కొందరి శరీరాలు బండచాకిరీకీ కొందరివి సుకుమారమైన పనికీ భగవంతుడు విభజించి సృష్టించాడా? మన శరీరాలు యెలా అలవాటు చేసుకుంటే, అలా తయారౌతాయి. మానవుడై పుట్టినవాడు అన్నిటికీతయారుకావాలి—శరీరాన్ని దాచుకొనడం మహాఘోర పాపం! తలచుకోవాలేగాని, తలచుకుంటే, కొండలైనా పిండి గొట్టగలం తెలుసా?" అన్నాడు మా నాన్న.

"ఆంటూకు పెళ్ళిచేయి బాబూ! పెళ్ళాం పక్కలోకివస్తేగాని అబ్బాయిగారికి కష్టాలంటే యేమిటో తెలిసిరావు!" అన్నాడు ఇసిడారో డోసు మింగుతూ.

డామింగో ఇసిడారోను ఉద్దేశించి, "అరేయ్! నీ పెళ్ళాంవంటిది దొరికితేచాలురా, వేరే నరకం అక్కర్లా!" అన్నాడు.

అందరూ పకపక నవ్వారు,

ఆంటోనియోకు సిగ్గువేసి తలవంచుకున్నాడు. ఏదో మాట్లాడ బోయాడు. మాట పెగిలిరాలేదు. మా అమ్మతోకలిసి గదిలోనుంచి తప్పు కున్నాడు. పోతూపోతూ మా అమ్మతో, "నిజంగా అలసిపోయానమ్మా! చేతులురెండూలాగుతున్నాయే నొప్పిలొ. ముందు హాయిగా స్నానంచేస్తే గాని ప్రాణం కుదటపడదే! లక్ష్మిలొ కాసిని నీళ్లు తోడిపెట్టమని చెబు తావటే అమ్మా?" అన్నాడు ఆంటోనియో.

"వెంటనేతోడిస్తాను నాన్నా!" అంటూ, "లక్ష్మి! లక్ష్మి! ఎక్క డున్నావే అమ్మా?" అని కేకవేసింది మా అమ్మ.

బూట్ పాలిష్ డబ్బాతో తయారైన కిరసనాయిల్‌దీపం ముట్టిం చింది మా అమ్మ. ఆంటోనియో, లక్ష్మి—యిద్దరూ దొడ్లో బావిదగ్గరకు పోయారు. మామూలుగా రోజూ ఆంటోనియో స్వయంగా నీళ్ళు తోడు

కుని బొప్పాయి చెట్టుక్రింద ఫాదులోనిలబడి స్నానంచేసేవాడు. మా యింట్లో ఆడంగులంతా కాచిననీళ్ళను పాళాలుచేసుకుని వంటగది పక్క ఉన్న స్నానాలగదిలో నీళ్ళుపోసుకునేవాళ్ళు.

ఆంటోనియో, లక్ష్మి నిశ్శబ్దంగా బావివద్దకు చేరారు. చల్లని మంద మారుతం హాయిగా వీస్తోంది. లక్ష్మి కడవ బావిలో జారవిడవగానే, ఒక్క గాలివిసురుకు బావి పిట్టగోడమీద పెట్టిన దీపంకాస్తా ఆరికూర్చు న్నది. ప్రకృతి కారణంగా కలిగిన యీ అవకాశం పురస్కరించుకుని ఆంటోనియో ధైర్యం తెచ్చుకోగల్గాడు. లక్ష్మితో తాను మాట్లాడదలుచు కున్న మాటలను యిదివరలో రోజుకు నాలుగుసార్లయినా పునశ్చరణ చేసుకుంటూవచ్చాడు. ధైర్యం తెచ్చుకోడానికి ప్రయత్నించాడు. కాని ప్రతిదఫా లక్ష్మి అవకాశమివ్వకుండా ఆంటూవద్దనుంచి పారిపోనన్నా పోయేది. లేకపోతే, తనమాటలు తనగొంతులోనే దిగమింగి, అవ కాశం చిక్కినప్పుడైనా ఆ కాస్తముక్కా బయటపెట్టలేక పోయేవాడు ఆటోనియో.

"లక్ష్మి నేనుగూడా నీకు తోడుపడతాను! అన్నాడు ఆంటోయో లక్ష్మి వెనకనేనిలచి. చేంతాడు పట్టుకున్న లక్ష్మి చేతిమీదికి మెల్లగా తన చేతిని పోనిచ్చి పట్టుకున్నాడు. లక్ష్మికి సాయంపడుతూ నీళ్లు తోడు తున్నాడు ఆంటూ. "నన్నుగూడా నీకు సహాయం చేయనీ లక్ష్మి!"

అంతా నిశ్శబ్దం! చీమ చిటుక్కుమన్నా వినపడ్డంలేదు లక్ష్మి, ఆంటూల హృదయస్పందనంతప్ప. నక్షత్రాలు కిలకిల నవ్వుతున్నాయి. ప్రకృతిమాత తన 'ప్రేమ విజయం'లో మరో రెండుపేర్లను చేర్చింది. కులం, గోత్రం, హోదా, మతం, విద్య, ధనధాన్య సంపదలూ, ప్రేమి కుల కరస్పర్శలతో మటుమాయమైనాయి. చివరకు వీటన్నిటినీ ఉల్టా సీదా కొట్టించి, ప్రేమే జయించింది.

"మీచేతులు నొప్పిపుడుతున్నాయన్నారుగదూ అంటూ !" అన్నది లక్ష్మి గజగజ వణకుతూ.

"లేదులక్ష్మీ లేదు ! అంతా వట్టిదే ! అబద్ధాలాడాను. నీతో వంటరిగా ఉండి నీయందు నాకున్న గాఢప్రేమను నీకు చెప్పుకుందామని అలా అన్నాను. ఇహ నాప్రేమను అణచుకోవడం అసంభవం" అన్నాడు ఆంటోనియో.

లక్ష్మి ఒక్కమాటగూడా మాట్లాలేదు. ఆపిల్ల దృష్టంతా చీకటి మీదనే కేంద్రీకరించింది. వట్టి పిరికిదైపోయినట్టుంది. గజగజ వణకుతూంది. ఉడుకురక్తం లక్ష్మి నాళాలగుండా ఉరుకులు, పరుగులుతీస్తూంది. కణతలు కొట్టుకుంటున్నాయి. ఆంటోనియో తన రెండోచేతిని లక్ష్మి నడుముచుట్టూ పోనిచ్చి కౌగిట్లోకి తీసుకున్నాడు. తన గడ్డంతో లక్ష్మి తలవెంట్రుకలను ప్రేమసూచకంగా నిమిరాడు.

"ఇదివర కెవర్నీ ప్రేమించనంత గాఢంగా ప్రేమిస్తున్నాను లక్ష్మీ నిన్ను ! నీ మనస్తత్వాన్ని కనిపెట్టే. యిన్నాళ్ళనుంచీ వెనుక్కు తగ్గి ఉన్నాను. మరే కారణం కాదు లక్ష్మీ, నన్ను నమ్ము ! ముమ్మాటికీ నమ్ము !" అన్నాడు ఆంటోనియో ప్రేమావేశంతో.

లక్ష్మి ఆలోచనలో మునిగిపోయింది. భయంతో కంపించిపోతున్నది. అణుకువతో రహస్యంగా "ఇది వివేకమైన పనేనా అంటూ ? మీ నాన్నా, మీ అమ్మా ఏమనుకుని పోతారు ? నీవు నన్ను ప్రేమించడం వాళ్లు సహిస్తారా ?" అన్నది లక్ష్మి;

"నీ యందు నాకు గల ప్రేమ అగాధంవంటిది లక్ష్మీ ! నీ వర్థం చేసుకోలేకపోతున్నావు ! ఎటువంటి కష్టాలనైనా యెదుర్కోడానికి సిద్ధంగా ఉన్నాను. మా నాన్నా, మా అమ్మను గురించి నీవు బెంగపెట్టు

కోకు. నే నా విషయం చూసుకుంటాను. నీవు కూడా నన్ను మనసారా ప్రేమిస్తున్నానని నీ నోటితో చెప్పు! అంతే చాలు నాకు!" అన్నాడు ఆంటోనియో.

అంటూ లక్ష్మిని హృదయానికి హత్తుకుని బిగికౌగిటిలో బంధించు కున్నాడు. తనివితీరా ముద్దుపెట్టుకున్నాడు. లక్ష్మి తన్మయత్వంలో పడి, చేంతాడు పట్టుకున్న రెండో చేతిని కాస్తా వదిలేసింది. గిర గిర నాట్యం ఆడుకుంటూ చేంతాడు బావిలో పడిపోయింది.

రోజులూ, నెలలూ గడిచిపోతున్నాయి. లక్ష్మి, ఆంటూలు బ్రహ్మా నందంలోపడి మునిగిపోయారు. మాసాలు రోజులుగా దొర్లిస్తున్నారు. గోవా రాజకీయ పరిస్థితి నానాటికి తీసికట్టయింది. పోర్చుగీసువాళ్ళమీద మా నాన్న క్రౌర్యం మిన్నుముట్టుతూంది. ఏ దెలావున్నా, ప్రేమికులు సుఖంగా కాలం వెళ్ళదీస్తున్నారు. అరనిమిషం అవకాశం దొరికినా, ఒక ర్నొకరు వదలడం లేదు. గుసగుసలూ, కరస్పర్శలూ, ముద్దులూ, కౌగి లింతలూ అవకాశాన్నిబట్టి రోజు కొకసారైనా సాగిపోతూనే ఉన్నాయి. ఒక్కొక్క సమయంలో లక్ష్మి బావి దగ్గర బట్టలుతుక్కుండేప్పుడు ఆంటూ వచ్చి కలుసుకుని కాబోయే పెళ్ళి ముచ్చటను గురించి మాట్లాడే వాడు లక్ష్మితో.

ఒకటి రెండుసార్లు ఉదయానే దేనికోసమో వెతకడానికి వచ్చి నట్లు లక్ష్మి మా గదిలో ప్రవేశించి తారట్లాడింది. అదే అదను కనిపెట్టి ఆంటూ, లక్ష్మి గాఢంగా కౌగలించుకుని ముద్దులు పెట్టుకొనడం గూడా చూశాను. ఇన్నాళ్ళనుంచీ లక్ష్మిని ప్రణయకలాపాలూ, సరససల్లాపాలూ యెరగని అమాయకురాలుగా జమకట్టేవాణ్ణి. కాని యీ ఉదయంతో. ఆ పిల్లలో దాగిఉన్న ప్రేమోద్రేకం, ఆంటూమీద వున్న గాఢానురాగం యెంత బలీయమైనదో తేలిపోయింది. ఆంటోనియోను ఆ పిల్ల ముద్దు

పెట్టుకుంటున్నప్పుడు లక్ష్మి శరీరం ఆపాదమస్తకం తాచుపాములా నాట్యమాడింది. ప్రేమావేశంతో ఆ పిల్లముఖమంతా తేజస్సుతో ప్రకాశించడం మొదలెట్టింది.

ఆంటోనియోగూడా లక్ష్మికి తీసిపోలేదు. వాడూ ఆవేశంతో ఆ పిల్ల ముఖానికి ముఖం చేర్చి ముద్దులు పెట్టుకున్నాడు. భుజాలకు భుజాలు, యెదురు రొమ్ముకు యెదురు రొమ్ము చేర్చి ఒకర్నొకరు గాఢంగా కౌగిలించుకున్నారు. ఇలాంటి దృశ్యాన్నే యిదివరకు ఒక చిత్రంలో చూసినట్లు చటుక్కున జ్ఞాపకం వచ్చిందప్పుడు। మా ఆంటూ యేంతోసేపటి వరకూ లక్ష్మిని పట్టువదలక బుగ్గలు కొరికే అంతపని చేశాడు. గాఢాలింగనంతో ఆ పిల్లకు ఊపిరిసలుపక ప్రాణం పోయినంత పనైంది. కాళ్ళూ, చేతులూ తోటకూరకాడల్లా వేలాడిపోయినట్లయినాయి. ముఖం వెలవెలబారినట్లుంది. జలగ పట్టినట్లు మా వాడిని పట్టి యెంతకూ వదిలిపెట్టలా లక్ష్మి. ఆంటూ లక్ష్మిని తన శరీరానికి హత్తుకుని బిగికౌగిటిలో బంధించుకున్న పద్ధతి చూస్తే, లక్ష్మి ప్రాణా లెక్కడ యెగిరిపోతాయో అని భయంవేసింది నాకు.

ఈ సందర్భంలో మనం ఒక ముఖ్య విషయం జ్ఞాపకముంచుకోవాలి. ఆడవాళ్లు పైకి కన్పించినంత అమాయకంగా ఉండరని. వాళ్ళ శాంతస్వభావాన్ని బట్టీ, సిగ్గు దొంతరలను బట్టీ, స్త్రీల నిజమైన అంతరంగిక మనస్తత్వాన్ని మనం నిర్ణయించకూడదు. అమాయకంగా కన్పించే స్త్రీలలో కొందరు చిచిందీర్లల్లా వ్యవహరించే వాళ్లూ ఉన్నారు. నంగనాచుల్లా కన్పించే వాళ్ళలో రసికత్వంలో ఆరితేరినవాళ్లూ ఉన్నారు. లక్ష్మి ముద్దులు పెట్టుకునే పోజు చూస్తుంటే, క్యాథొలిక్కు మతంలో సహజలక్షణమైన మూఢభక్తి, పట్టుదల, మూర్ఖత్వంతోపాటు, హిందూ

స్త్రీలలో ప్రధానలక్షణమైన గుడ్డినమ్మకంగూడా నాకు ద్యోతకమైందా పిల్లలో.

దొంగచాటుగా పెట్టుకునే ముద్దులు యెంతో మధురంగా, కమ్మగా ఉంటాయంటారు కామశాస్త్రంలో ప్రవీణులైన పండితులు. అయితే యీ చాటుమాటు ప్రణయ కలాపాలు తెంపులేకుండా దీర్ఘకాలం సాగిపోతూంటే, అవీ విసుగు పుట్టిస్తాయి. చాటుగా ప్రేమించుకున్న యువతీ యువకులు త్వరలో బయటపడి వివాహితులు కావడం యిటు ప్రేమికులకూ, అటు తలిదండ్రులకూ, సమాజానికీ క్షేమదాయకం. మా లక్ష్మి ఆంటూల విషయంలోగూడా అంతే జరుగుతూంది. ఈ రహస్య వ్యాపారంలో నుంచి బయటపడే మార్గం కన్పించక లోలోన కుమిలిపోతున్నారిద్దరూ. ఆంటోనియో ధార్మికుడూ, సత్యవంతుడూ, శీలవంతుడూ, ఆత్మగౌరవంగల వ్యక్తీ. ముక్కుకు సూటిగా నడిచే నిర్మొగమాటి. లక్ష్మి దైవచింతనగల అమాయకురాలు. నిష్కపటి, శీలవతి, విధేయురాలు. దొంగముద్దులకూ, దొంగ కౌగిలింతలకూ, గుసగుసలకూ త్వరలో స్వస్తి చెప్పి, తమ పవిత్రప్రేమను లోకానికి వెల్లడించాలని యిద్దరూ తహతహలాడిపోతున్నారు. మానవులేగాక ప్రకృతిగూడా సహించలేకపోతున్నది దీర్ఘకాలికమైన యీ సందిగ్ధస్థితిని చూసి.

నవంబరు మాసం. ఒకనాడు లక్ష్మి, "ఆంటూ ఎప్పుడు చెబుతావు మీ తలిదండ్రులకా విషయం?" అన్నది.

"త్వరలోనే చెప్పేస్తాను లక్ష్మి! బెంగ పెట్టుకోకు" అని జబాబిచ్చాడు ఆంటోనియో.

లక్ష్మి యెన్నిసార్లు అడిగినా యిదే సమాధాన మిస్తుండేవాడు ఆంటోనియో. ఎప్పటికప్పుడు తృప్తిపరచడానికి ప్రయత్నించేవాడు.

తన ప్రేమను గురించి తలిదండ్రులకు నచ్చచెప్పడం సులభం కాదని మాత్రం గ్రహించాడు ఆంటోనియో.

మా నాన్న మనస్తత్వం మీ కర్థమయ్యే ఉంటుందీ పాటికి. ఆయన కరుణామయుడు; విశాలహృదయుడూ, అభ్యుదయకామి కూడా. పరిస్థితులన్నీ పూర్వాపరాలతో అర్థంచేసుకోగల వ్యక్తి. అయితే మా అమ్మకు నచ్చచెప్పడం యెలా ? క్రైస్తవ మతమన్నా, సాంఘికహోదా అన్నా, అధికార దర్పం అన్నా, ఆమెకు పెద్ద దురభిమానం. ఆమె వర్గ చైతన్యంగల వ్యక్తిగూడా. దైవభీతి ప్రధానంగా గల మనిషి. అయితే అతి సంకుచితమైన మనస్తత్వం గలది. తోటి మానవులపైన ఆమెకూ ప్రేమాభిమానా లున్నాయి. అయినా తన మనస్సుకూ, తన నమ్మకాలకూ వ్యతిరేకంగా నడిచి ఆమెను బాధిస్తే మాత్రం ఆమె సహించలేదు: క్షమించలేదు. మరెలా లక్ష్మి, ఆంటూల ప్రేమను ఆమెకు తెలియ జేయడం ! ఎలా !

క్రిస్మస్, సంవత్సరాది పండుగలూ, వాటికి సంబంధించిన ఉత్స వాలూ, ఊరేగింపులూ జరిగిపోయాయి. ఫిబ్రవరి ప్రవేశించింది. అయినా యింతవరకు లక్ష్మిమీద తన ప్రేమను గురించి ఆంటూ మా తలిదండ్రులకు చెప్పలేదు. తరతరాలుగా సంప్రదాయసిద్ధంగా వస్తూన్న మూఢ నమ్మకాలకు బలైన మా ఆంటూ, భయపడుతూ, భయపడుతూ, వాయిదాలమీద వాయిదాలు వేస్తూ చెప్పదలుచుకున్న అసలు సంగతి మా వాళ్ళకు చెప్పడం మానేశాడు. ప్రేమికుల మాట యెలావున్నా యీ కాలహరణానికి నేను సహించలేక పోతున్నాను.

ఈ లోగా లక్ష్మి హృదయంలో పిడుగు పడ్డంత పనైంది. ఆమె ముఖం వెలవెలబారింది. కళాకాంతులు తప్పినై. ఏదో భయం ఆమె నావహించి దినదినం క్షీణింపజేస్తూంది. పెనుభూతం ఆమెను తరుము

తున్నట్లు గజ గజ వణకసాగింది. ఇహ యీ హృదయభారాన్ని వంటరిగా ఒక్కతే మోయడాని కామె యిష్టపడలేదు. తన బరువుభారంలో ఆంటోనియోగూడా పాలు పంచుకోవాలని కోరింది మనస్సులో. మా అక్క చెల్లెండ్లు లక్ష్మిని వదలకుండా కూడాకూడానే వుండి కబుర్లుచెప్పుకుంటున్నారు. వాళ్ళనుండి యీ రహస్యం మరుగుపర్చడం రోజు రోజుకూ అసంభవమై పోతున్నది. ఎప్పుడూ వాళ్లు తనను వెన్నంటే ఉండడంవల్ల, ఆంటూను కలుసుకొని తన హృదయభారాన్ని వెళ్ళగక్కడానికి అవకాశమే చిక్కడం లేదు. ఒకనాడు లక్ష్మి సహనం కోల్పోయి తనను తప్పక రహస్యంగా కలుసుకోమని కనుసంజ్ఞ చేసింది. ఆ సాయంత్రమే వాళ్ళిద్దరూ గడ్డివామి చాటున కలుసుకున్నారు. లక్ష్మి కంటతడి బెట్టి తన హృదయావేదన చెప్పుకుంది.

"త్వరలో మన కొక బిడ్డ కలుగబోతున్నాడు ఆంటూ! ఏం చేసేది నేను చెప్పు!" అన్నది వెక్కి వెక్కి యేడుస్తూ.

ఆంటోనియో మూగబోయాడు. నోట మాట లేదు. దిగ్భ్రాంతి చెందాడు. ఎలాగో మాట పెగుల్చుకుని, "అలా అనబోకు లక్ష్మీ! నిజమేనా నీవు చెప్పింది?" అన్నాడు.

అవును! నిజమే ఆంటూ! నిజమనే అనుకుంటున్నాను. మీ చెల్లెళ్లు నన్ను చూసి అనుమానిస్తున్నట్లు భయంవేస్తున్నది. ఎప్పుడు చెబుతారు మీ అమ్మా వాళ్ళతో. వెంటనే చెప్పేస్తే పెండ్లి చేసుకుందాం త్వరలో!" అన్నది లక్ష్మి మెల్లగా.

ఆంటూ ముఖంచిట్లించి ఆలోచించసాగాడు. ఆందోళనతో వాడి మనస్సు బేజారెత్తిపోయింది. లక్ష్మి ముఖంలోకీ, కండ్లలోకీ అదేపనిగా తేరిపారచూశాడు. లక్ష్మి కనురెప్పలపైనా, పక్కలా నీలిరంగు చాయ లేర్పడ్డాయి. ఏడ్చిఏడ్చి రెండుకళ్ళూ యీలావున వాచిపోయాయి.

"నేను చెబుతాను వాళ్ళకు! చెబుతాను లక్ష్మీ! తప్పక చెబుతాను. ఇంకెంతమాత్రం తాత్సారం చేయను, చేయగూడదు" అన్నాడు ఆంటూ ఆవేదనతో.

"ఎప్పుడు ఆంటూ? ఎప్పుడింకాచెప్పేది? ఆలస్యం సహించలేక పోతున్నా యీ స్థితిలో!"

"చూడనీ! అవకాశం చూసుకోవద్దా!..........కొంచం ఓపిక పట్టి ఉండుమరి!" అన్నాడు ఆంటూ. వాడి ముఖమంతా చిరుచెమటలు పోసింది. సరేలే! కార్నివల్ పండుగ వెళ్ళిపోగానే చెప్పేస్తాను! సరేనా!"

"నిజంగా చెబుతారుగదూ?"

"నిజంగా! నామీద ఒట్టే! నీ కడుపులోవున్న మన బిడ్డమీద గూడా ఒట్టే! తప్పక చెబుతానుగా! భయపడకు లక్ష్మీ!"

"నిజంగా! ముమ్మాటికీ నిజంగా?"

"ముమ్మాటికీ నిజంగానే!

మళ్ళీ ఒకసారి ఒకరికౌగిల్లో మరొకరు బంధించబడి నిమిషంసేపు పారవశ్యం అనుభవించారు.

---

## ౬

కార్నివాల్ పండుగ ప్రారంభమైంది. అది మూడోరోజు. కార్ని వాల్ ఉత్సవంగూడా గోవాలో అతివైభవంగా జరుగుతుంది. పిన్నలూ, పెద్దలూ ఆ మూడురోజులూ సంసారబాధలూ, యితర తాపత్రయాలూ మరచిపోయి ఆనందంగా కాలం వెళ్ళబుచ్చుతారు.

ఆదివారంనుండి మంగళవారం వరకూ జరుగుతుందీ పండుగ. ఈ మూడురోజులూ స్త్రీలు పురుషులందరూ నిర్విరామంగా అమితానందం అనుభవిస్తారు. బుట్టబొమ్మలూ, నాట్యాలూ, బఫూన్‌వేషాలూ, విచిత్ర వేషాలూ, గుర్రపు ఆటలూ, స్త్రీ పురుషుల పరిహాసాలూ పండుగ మూడు రోజులూ క్షణం తీరికలేకుండా సాగుతాయి. ఆడవాళ్ళనుచూసి సిగ్గుపడే మగవాళ్ళందరూ, ముఖాలకు ముసుగులువేసు కొనడంతో యెక్కడలేని ధైర్యం వస్తుంది. ఆ ధైర్యంతో వెంటబడి తరిమి మనస్సుకు నచ్చిన ఆడపిల్లల్ని తెచ్చుకుని తనివితీరా ముద్దుపెట్టుకుంటారు. చిన్నపిల్లలు డబ్బాలను రంగునీళ్ళతోనింపి దారినపోయే జనంమీద పిచికారీకొడతారు. కొందరు యువకులు సెంటుపౌడరుగూడా ఆడపిల్లలపైనా, పెద్దవాళ్ళపైనా చల్లుతారు. ఒక్కొక్కప్పుడు అందకపోతే, తరిమి పట్టుకొని, కౌగిళ్ళలో యిరికించుకొని సెంటూ, పన్నీరూ చల్లుతారు. ఆడవాళ్లు ఉక్కిరిబిక్కిరై విడిపించుకోడానికి గావుకేకలు పెట్టేవరకూ మగవాళ్ల కౌగిళ్ళనుంచి విడిచి పెట్టరు.

కార్నివాల్ పండుగ మూడురోజులూ యేవీధిలో చూసినా, యే యింట్లో చూసినా ఆనందోత్సాహాలతో వాతావరణం స్తంభించిపోతుంది.

మగవాళ్లూ, ఆడవాళ్లూ ముసుగులూ, విచిత్రవేషాలూ ధరించీ ఉదయం మొదలు అర్ధరాత్రివరకూ వీధుల్లో ఆడుతూ పాడుతుంటారు. ఈ మూడు రోజులూ వాళ్ళకిదే స్వర్గసుఖం అనిపిస్తుంది.

గతించిన మూడుసంవత్సరాలకన్నా, యీసారి కార్నివాల్ పండుగ యెంతో వైభవంగా జరిగింది. జరిగిన మూడు సంవత్సరాలూ మాప్రక్క గ్రామంలో మసూచి విలయతాండవం చేసింది. ఆరోగ్యశాఖాధికార్లు బహిరంగ సమావేశాలనూ, ఊరేగింపులనూ, ఉత్సవాలనూ నిషేధించారు. అదృష్టవశాత్తు యీ మహామారి యీ సంవత్సరం తలెత్తక మమ్మల్ని బతికించింది. మూడు సంవత్సరాల తర్వాత ముచ్చటగా జరుగుతున్న యీ ఉత్సవానికి, మొహంవాచిపోయిన యిరుగుపొరుగు గ్రామాలవాళ్లందరూ యిసకవేస్తేరాలనంతగా హాజరైనారు. తప్పెట్లు, తాళాలు, రండోళ్లు, తాషామరపాల శబ్దంతో చెవులు చిల్లులుపడ్డాయి. ప్రజల వీరావేశం తారాపథం అంటింది. వేలకొద్దీ జనంరద్దీతో ఆకాశాని కెగజిమ్మిన దుమ్మూ, ధూళీ పొగమంచులా అలముకుంది.

ఆ మూడురోజులూ ఎలా పరుగెత్తుకుని పోయాయో తలచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. ఈరోజు మూడోరోజు. సూర్యాస్తమయం కాగానే మిగిలివున్న కొద్దిగంటల వ్యవధిలో యెంత ఏక్కువ ఆనందం అనుభవించడానికి వీలుంటుందో అంతా అనుభవించడానికి ప్రతివ్యక్తీ ప్రయత్నించాడు. చెట్టాపట్టాలు పట్టుకుని వందలకొద్దీ స్త్రీ పురుషులు రోడ్ల మీద నవ్వుతూ, కేరింతలుకొడుతూ, నాట్యంచేస్తూ, పాటలుపాడుతూ యింటింటిముందూ ఊరేగింపులు చేశారు. ఆ రద్దీని వర్ణించడం నాతరంకాదు.

కార్నివాల్ ఉత్సవాలు పూర్తయినాయి. ఒకనాటిరాత్రి పడుకోబోయే ముందు లక్ష్మి ఆంటోనియోను చీకటిమరుగున కలుసుకుని. "ఆంటూ !

యింకా యెప్పుడు చెబుతావు మీవాళ్ళకు? మన భవిష్యత్తెలా జరగబో తుంది?" అని అడిగింది ఆందోళనతో.

"బాధపడబోకు లక్ష్మీ! రాబోయే ఆదివారంనాడు చెబుతాగా! ఏదెలా జరిగినా, ఆనాడు తప్పక చెప్పితీరుతా!" అంటూ ఆంటోనియో లక్ష్మిని మరోసారి ముద్దుపెట్టుకున్నాడు ఆ పిల్లకు నమ్మకం కలగజేయ డానికా అన్నట్లు, లక్ష్మి పోతూపోతూ ఉండగా, "నా ముద్దుల లక్ష్మీ! వెళ్ళి నిర్విచారంగా పడుకొని హాయిగా నిద్రపో!" అన్నాడు.

ఊరంతా సద్దుమణిగింది ఉత్సవంతో ప్రజలందరూ అతలా కుత లమై అలిసిపోయారు. ఆవేశాలన్నీ అణిగిపోయి యథాపూర్వస్థితిలోకి దిగివచ్చి విశ్రాంతి తీసుకుంటున్నారు.

ఆదివారం రానేవచ్చిందింతలో. ఆరోజునే ఆంటోనియో లక్ష్మిని తాను ప్రేమించి వివాహ మాడదలచినట్లు మా నాన్నావాళ్ళకు వెళ్ళడిచేస్తా నన్నాడు.

ఆ సాయంత్రం నేనూ, ఆంటోనియో మా వరండాలో కూర్చుని ఉన్నాం. చర్చిగంటశబ్దం బావురుమన్నట్లుగా, భయభయంగా వినవచ్చింది. ఆనాడు చర్చికి వెళ్ళుదామని మా అమ్మ నన్ను ఉదయాన్నుంచీ పోరు పెడుతూన్నది. సాయంకాలానికల్లా దుస్తులు ధరించి సిద్ధంగా ఉండ మన్నది. నా కాళ్ళలోకి సత్తువరాలేదనీ, చర్చికి నడిచివచ్చేస్థితిలో లేననీ, మా అమ్మకేవో బొంకులుబొంకి చర్చికి వెళ్ళడం తప్పించుకోదలచాను. పసితనంనుంచీ చర్చికిపోయి ప్రార్థనచేస్తూ మోకాటిమీద కూర్చోడమంటే నాకెందుకో తలనొప్పి. చర్చిలో నానారద్దీగా, గలాటగా ఉండేది. వచ్చే జనం, పోయేజనం, పిల్లల యేడుపులూ కర్ణకఠోరమైన మేళతాళాలూ, తప్పెట్లు తాషామరపాలు, ప్రార్థన కవసరమైన ప్రశాంత వాతావరణమే

వుండేడికాదక్కడ. నాలో నాస్తికత్వం అంకురించబట్టే, నేను చర్చికి రాదలచుకోలేదని మా అమ్మ తరుచుగా నన్ను మందలిస్తూండేది. నేను నాస్తికుణ్ణి కాలేదుకాని, గుడ్డినమ్మకాలతొ కూడిన మూఢభక్తంటే చెడ్డ చిరాకు. అయితేనేం మా అమ్మతొ వాదించి యేంప్రయోజనం ? నిరక్షరాస్యులైన యితర గ్రామీణ స్త్రీలతొపాటు, చదువుకున్న మాఅమ్మగూడా మూఢనమ్మకాల్లో మునిగితేలుతున్నది. ఈమూఢభక్తి నానాటికీయెక్కువై చిరాకు కల్గిస్తూంది.

"ఇష్టంవచ్చినట్లు గంతులెయ్యగల్గుదువేం ! కోతికొమ్మచ్చు లాడడానికి కాళ్ళల్లో శక్తుందేం ! చర్చికోసారెప్పుడైనా రారా అని బ్రతిమాలితే సరీ, కాళ్ళల్లో సత్తువలేదని ముందరికాళ్ళకు బందాలేస్తావు ! లేనిపోని వంకలు చెబుతావు ! అని కోప్పడింది మా అమ్మ.

"నిజంగా అమ్మా ! నాకాళ్ళు తేలిపోతున్నాయి, కావాలంటే పట్టుకుని చూడు ! అని అబద్ధమాడేశాను.

"అరేయ్ ! ఎప్పుడూ దేవుణ్ణి ప్రార్థనే చేయకపోతివేంరా ! ఎదటపడి దేవుడితొ ఒక్కమాటైనా మాట్లాడకపోతివి ! మరి నీ కాళ్ళెలా నయమౌతాయిరా ! జ్ఞాపకం ఉంచుకో, చర్చికి వెళ్ళందే నీకసలు కాళ్ళేరావురా !" అన్న మా అమ్మ.

ఆరోజున యింట్లోనే ఉండిపోయాను. ఆంటోనియోగూడా చర్చికి పోదామని సుస్తాబైనాడు. కాని వెళ్ళేప్రయత్నంలోలేదు. ఏమేమో ఆలోచిస్తూ నా సరసనేవచ్చి కూర్చున్నాడు. నోట మాటాపలుకూ లేదు. ఈ విశాలప్రపంచాన్ని తన భుజస్కంధాలపైనే మోస్తున్నట్లె దీర్ఘాలోచనలో పడ్డాడు. చర్చిగంట మోగిందని వాడికి నేను జ్ఞాపకం చేయగానే "ఊఁ" అన్నాడేగాని మాట్లాళ్ళేదు.

"ఏమిటిరా అంటూ ఆలోచిస్తున్నావు ? చర్చికి వేళ అయిందిరా అని చెప్పడంలేదూ ?" అన్నాను ఆతురతతో.

"అవునురా వేళయింది ! నాకు తెలుసు !" అన్నాడు విచారంతో. "కాని నేను వెళ్ళడంలేదు. చర్చికన్నా నన్ను కుంగదీసే మరో జటిల సమస్య యీరోజున నన్నెదుర్కొంటున్నదిరా !" అన్నాడు.

"ఏమిటీ! నిజంగా లక్ష్మి విషయం కాదుగదా ! లేకపోతే లక్ష్మి విషయమేనా ?" అన్నాను.

అంటూ అకస్మాత్తుగా తల కుదిలించి పైకెత్తి, నావంక అదే పనిగా చూశాడు. తర్వాత లేచి నిలబడి బోనులో అడవిజంతువులా వెనక్కూ ముందుకూ అదేపనిగా తిరగడం మొదలెట్టాడు. మళ్ళ నాపక్కనే కూర్చుని, "అవునురా లక్ష్మి విషయమే ! నీ కెలా తెలిసింది?" అన్నాడు అంటూ.

"నాకాళ్ళలో సత్తువ వుడిగింది గాని కళ్ళలో చురుకుదనం యెక్కడికి పోయిందిరా?" అన్నాను.

"అంటే అర్థం?"

"అబ్బే ! ఏంలేదురా ! దేవునిదయవల్ల నాచూపు యింకా బాగానే ఉందంటున్నా ! అంతే !"

"అయితే యేద్తో కనిపెడుతూఉన్నావన్నమాటే ! నిన్ను బతిమాలుతున్నా చెప్పరా ఏం కనిపెట్టావో !" అన్నాడు.

చిరునవ్వు నవ్వి అన్నాను : "ఎక్కువేం చూళ్ళేదురా ! ఇంకా కొన్ని విషయాలు చూడాలని నామనస్సులో ఉంది. ప్రతిరోజూ ఉదయానే లక్ష్మి గదిలోకి వచ్చినప్పుడల్లా ఆపిల్లను నీవు ముద్దుపెట్టు

కొనడం చూశానురా! నేను నిద్రపోతున్నాననుకున్నారు మీరిద్దరూ, నిజంగా యీవూళ్ళో యేమీ తోచడం లేదురా. వాతావరణమంతా మందంగా ఉంది. ఉత్సాహం, ఉల్లాసం చచ్చిపోయాయి. మనసారా ప్రేమించిన ప్రేమికులు ముద్దు పెట్టుకుంటుంటే, అప్పు డప్పుడూ చూసి ఆనందించాలనుందిరా నాకు! ఏమంటావ్?" అన్నాను.

ఆంటోనియో ముఖం జేవురుబారింది. ఖంగారెత్తినోటి వెంట మాట రాలేదు.

"లక్ష్మి ముద్దు కమ్మగా, మజాగా ఉందిగదూ ఆంటూ?" అని వాడినేడిపించసాగాను. "భలే చలాకీ పిల్లరా లక్ష్మి! నిప్పు కణిక లాంటిది. ఏమంటావ్?" అన్నాను.

చివరకెలాగో మాట పెగుల్చుకుని పరిహాసంగా, "అంటే నీవు మేల్కొనే ఉన్నవన్నమాట! నిజంగానా! రాస్కెల్!" అని చిరునవ్వు నవ్వడం ప్రారంభించాడు ఆంటూ.

"కళ్ళు విచిత్రమైన అవయవాలురా ఆంటూ! కొందరికళ్ళు యెప్పుడూ మూసుకుని ఉన్నా, అన్నీ చూస్తున్నట్లే ఉంటాయి, మరి కొందరి గుడ్లు తెరిచే చూస్తుంటారుగాని తమ ముందేం జరుగుతున్నది గూడా వాళ్ళకే తెలియదు!" అన్నాను.

"సరేలేరా వెధవడబ్బీలు! అపునాముందు! నాకో విషయం చెప్పు అడుగుతున్నాను!" అన్నాడు ఆందోళనతో. "అమ్మగానీ, మరెవరైనాగానీ దీనిగురించి యెరుగుదురా?"

"తెలిసుంటుందనుకోను! అయితే మట్టుకేం?" అడిగాను అర్థం కానట్లుగా:

"మా పేర్మిను గూర్చి మామనస్సులో ఉన్నదంతా అమ్మతో చెప్పేయ్యాలనుందిరా! ఇదివరకే యీ విషయం వాళ్ళకు తెలియడం యిష్టం లేదురా!" అన్నాడు ఆంటూ పెదిమలు కొరుక్కుంటూ.

"ఇవ్వాళే?" అని రెట్టించిఅడిగాను. నా కంఠధ్వనిలోఆశాభంగం దాగి ఉన్నట్లు తోచింది.

"అవునురా యివ్వాళే! ఇప్పుడే గూడా! నాన్నా, అమ్మా యింటికి రాగానే చెప్పేస్తాను. ఏం, యివ్వాళ చెబితే తప్పేముంది?" అని అడిగాడు ఆంటోనియో.

"ఏంలేదురా! మరేంలేదు! ఊరికే అన్నానంతే!" అంటూ మనస్సుకు పట్టించుకోనట్లు దాటవేశాను.

కార్నివాల్ ఉత్సవం జరిగిపోగానే, "లెంటెన్" అనే పండుగ వెంటనే వస్తుంది. ఈ 'లెంటెన్' నలభైరోజులూ క్రైస్తవమతస్థులు దీక్షతో ఉపవాసాలు ఉండాలి. నిర్విరామంగా పార్థనలు జరపాలి. ధ్యాన ముద్రలో క్రీస్తును గూర్చి తపస్సు చేయాలి. ఈ దీక్షాసమయంలో ఆనందంగా కాలం గడపడానికి వీల్లేదు. ఒక ఆటగానీ, పాటగానీ, సరదాలుగానీ, యీ రోజుల్లో పూర్తిగా బంద్. కార్నివాల్ అయిపోగానే, యీ కఠోరదీక్ష నాబోటి వాళ్ళకు తలనొప్పి వేస్తుంది. కార్నివాల్‌లో యెన్ని ఆటలు, యెన్ని పాటలు, యెన్ని డ్యాన్సులు! పొరపాటునైనా, మా అమ్మ సరదాగా ఒక పాటపాడుకో నివ్వదు యీ దీక్షాసమయంలో. ఈ నలభైరోజులూ మా అమ్మ కఠోరదీక్షలో మునిగే ఉంటుంది. వాతావరణం విషాదసూచకంగా కన్పిస్తుంది నాకు. నలభైరోజులు సూర్యరస్మి మసక మసకగా ఉన్నట్లు వుంటుంది నాకు. పక్షులగొంతుకల్ని నులిమి వేసి, వాటి మధురగానాన్ని అణచివేసినట్లే తోస్తుంది నాకు. అవంతా నా విచిత్రమైన ఊహేకావచ్చు నేమో! కాని నామట్టుకు నాకీ నలభై

రోజులూ నిజంగా నలభై యుగాలుగా తోస్తుంది. నా మనస్సుకు అంధ కారం ఆవరించినట్లే కన్పిస్తుంది.

ఈ రోజున ఆంటూ పిడుగువంటి వార్తను మా నాన్నా, అమ్మ చెవుల్లో వేయదలచు కున్నాడు.

"ఈ రోజున తెలియచేస్తే, యేమిటిరా తప్పు బాబూష్? ఇవ్వాళ నేను తెలియజేయడం నీ కిష్టం లేనట్టుగా నీ మొహం అదోరకంగా విచారంగా పెట్టావేంరా?"

"ఈ ఉపవాస వ్రతదీక్ష నలభై రోజులు పూర్తయేవరకూ మన వాళ్ళకు చెప్పడం నా కిష్టం లేదురా! ఈ నలభై రోజులూ మంచివికావు. ఈ ఉపవాసాల పండగంటే నాకెందుకో తగని విసుగు, ఎప్పుడెప్పుడు దాటిపోతుందా అని ఉంటుంది నాకు. ఈ తరుణంలోనే మనవాళ్ళకీవార్త చెప్పి, యీ పండుగను మరింత విషాదకరంగా చేయ గూడదని నా ఉద్దేశ్యం." అన్నాను నేను.

ఆంటోనియో నా వంక ఒక నిమిషం తేరిపార చూసి, "అయితే నేను చెప్పబోయే విషయం వాళ్ళు ఒప్పుకోరనే గా నీ అభిప్రాయం! అంతేనా?"

"ఆ సంగతి యివ్వాళ నన్ను అడుగుతున్నావా? నీకిదివరకే తెలి యదూ? అయితే అయింది కాని, యింతకూ యేమని చెప్పదలచు కున్నావురా?" అన్నాను.

ఆంటూ ఒకక్షణం సేపాగి, రెండు చేతులూ గట్టిగా బిగబట్టి తన మాటలు వినడానికి తానే భయపడ్డట్లు, "నేను లక్ష్మిని పెళ్ళాడ నిశ్చ యించుకున్నట్లు చెప్పదలచానురా!" అన్నాడు.

ఈ మాటలనగానే నా మనోభావాలను పరిశీలించడానికి నా మొహం వంక చూశాడు. నా మొహం సంతోషంతో వికసించినట్లు తెలుసుకుని వాడు గూడా ఆనందం వెలిబుచ్చాడు. వాడిమొహం నూతన తేజస్సుతో ప్రకాశిస్తుంది.

"అయితే నీక్కూడా నచ్చిందా లక్ష్మి? పెళ్ళాడ మనేనా నీ అభిప్రాయం గూడా?" అన్నాడు అంటూ ఉత్సాహంతో.

"నచ్చకేంరా! చక్కగా నచ్చింది. నీ వదృష్టవంతుడివిరా! లక్ష్మి నిజంగా చక్కని చుక్క; బుద్ధిమంతురాలు; కష్టించి పనిచేసేపిల్ల. నిజంగా చెబుతున్నా విను. నీ విప్పటివరకూ రాకుండా ఉంటే, ఆ పిల్లను నేను ప్రేమించి పెళ్ళాడే వాణ్ణి. ఆ అదృష్టం నాకే దక్కేది! వెర్రి వాడా, లోకులకూ, నాకూ నచ్చకపోతేనేంరా! వాళ్ళేమనుకుంటే యేం? ఒకరి అభిప్రాయాలతో నీకు పనేముంది? ఆ పిల్లను నీవు మనసారా వలచావు! అంతే! నూరుమంది కాదన్నా పెండ్లాడు ధైర్యంగా! నీవు వయస్సు వచ్చిన మగవాడివి. సంకల్పించు కున్నదేదో ధైర్యంగా చేసి తీరాలిరా!" అన్నాను.

"నీవు భలేవాడవురా! నాకు నచ్చినవాడవు!" అంటూ నన్ను కౌగలించుకున్నాడు వాడు.

ఒక నిమిషమూ, రెండు నిమిషాలో ఆంటోనియో ఉత్సాహముగా కన్పించాడు. మళ్ళీ దీర్ఘాలోచనతో వాడి ముఖాన నాగటి చాళ్ళేర్పడ్డాయి. విచారంలో మునిగిపోయాడు. మా అమ్మ వాళ్ళతో యెదటబడి మాట్లాడు తున్నట్లుగానే నోటిమాట లేకుండా చేతుల్తో అభినయం చేయడం ప్రారంభించాడు. కాసేపు వాడివంక తమాషాగా చూశాను. మళ్ళీ వాడి ముఖం నా వైపుతిప్పి చిరునవ్వు నవ్వుతూ "నాన్నా వాళ్ళతో యెలా

చెప్పాలో నా కర్థం కావడం లేదురా! కొంచెం నాకు సహాయం చేసి పెట్టవూ?" అన్నాడు.

"నన్నెలా సహాయపడ మంటావురా? నీ బరువు భారాన్ని నేను వదిలించాలంటే, ఒక్క సహాయమే చేయగలను! నేనే లక్ష్మిని పెళ్లాడ తానని అమ్మా వాళ్ళకు చెప్పేస్తే వదిలిపోతుంది నీ బెడద! ఏమం టావ్?" అన్నాను.

"ఇప్పుడు వేళాకోళాలు కట్టిపెట్టరా! తమాషాలకూ, పరిహాసా లకూ యిది సమయంకాదు!" అన్నాడు వాడు గంభీరంగా.

మళ్ళీ వాడు లేచి నిలబడి అటూ యిటూ పచార్లు చేసాడు తీవ్రాం దోళనతో.

"అమ్మను గురించేరా నేనింతగా ఆందోళనపడేది. తతిమ్మా వాళ్ళంతా నా సమస్యను అర్థం చేసుకున్నారని నాకు గట్టిగా తెలుసు!" అన్నాడు ఆంటూ.

నేనే మీ మాటాళ్లేదు. వాడు పడుతున్న అవస్థకు నిజంగా నాకు విచారం, జాలివేసింది.

"అమ్మను నేనెంతగా ప్రేమించినా, ఆమె అవివేకతకు, మూర్ఖ తకూ, క్రైస్తవమతానికి విరుద్ధమైన కొన్ని యితర దురలవాట్లకూ నాకు తలనొప్పి వేస్తుంది! క్రైస్తవమతస్థురాలనని యెంత గర్వపడ్డా, దాన్లో ఉన్న గొప్పదనాన్ని ఆమె అర్థం చేసుకోలేక పోయింది. ఆమెలో ఉదా రత శూన్యం; సహనం సున్న. ఓరి దేవుడా! ఆమె వైఖరి మార్చాలంటే తాతలు దిగిరావాలి! పూర్వర యెన్నడో అనుకున్న మాత్రాన్నే అద్భుత చిత్రాలు జరిగేవనీ, మానవుల కోర్కె తీడేరేవని చెప్పుకుంటారు! అలాంటి అద్భుత సంఘటన యీ నాడూ ఒకటి జరిగి, మా అమ్మ మన

స్తత్వం అమాంతంగా మారిపోతే బ్రతికి పోదునే!" అనుకున్నాడు ఆంటూ తన మనస్సులో.

ఎంతోసేపు యీ ఆలోచనతో గొణుక్కున్నాడు ఆంటూ. ఎటూ పాలుబోక, తలవెంట్రుకల్లో వేళ్ళు దూర్చుకొని, ముఖం తుడుచుకుంటూ క్రిందికీ, పైకీ పచారు చేశాడు. అంతసేపూ అమ్మా, నాన్నలతో యీ పరమ రహస్యం యెలా చెప్పి ఒప్పిద్దామా అన్న భయంతోనే కంపించి పోతున్నాను. ఇంతలో చర్చిగంట మోగింది. ప్రార్థన పూర్తయింది. గంట వినవస్తున్నంతసేపూ, యేదో అపశకునం రాబోతున్నదనే బెదురు నా మనస్సును కళవళ పెడుతూనే ఉంది. మా యింట్లో మరో విషాద సంఘటన సంభవించ బోతున్నదని అంతర్వాణి చెబుతున్నది.

మా అమ్మవాళ్లూ తిరిగి యింటికి వచ్చారు.

ఇరుగు పొరుగిండ్లకు పోయిన మా అమ్మ, అప్పచెల్లెండ్లు, యింకెవరో యితర స్త్రీలు సంధ్య చీకట్లో యింటికి వస్తుంటే, నలుపు తెలుపు గుడ్డలు ధరించిన దయ్యాలో, భూతాలో అన్నట్లు కనిపించింది నాకు. వాళ్ళ ముఖాలు నల్లటి ముసుగులతో సగంవరకు కప్పబడున్నాయి. రూత్ తన ముఖం పూర్తిగా కప్పివేసుకుంది. నల్లటి ముసుగు ధరించిన స్త్రీలు పతివ్రతలుగా, శీలవతులుగా, సౌందర్యవంతులుగా కన్పిస్తారని అంటూండేది మా రూత్. అడుగులో అడుగు వేసుకుంటూ మావాళ్ళు దగ్గరకు వచ్చారు. వాళ్ళు మాట్లాడే మాటలు మాకు వినవస్తున్నాయి. ఆంటోనియోను గురించి యేవో చెప్పుకుంటున్నారు.

"నిన్ను గురించేరా ఆంటూ! మాట్లాడుకుంటున్నారు! ఏమై ఉంటుందిరా?" అన్నాను.

"నాకు తెలుసురా ఏమైఉండేదీ!" అన్నాడు ఆంటోనియో నిరాశతో.

మా అమ్మవాళ్ళు మెట్లుసమీపించారు. నా పక్కనే ఆంటోనియో కూర్చుని ఉండడం మా అమ్మ చూసి ఆశ్చర్యపడ్డది.

"అప్పుడే యెప్పుడొచ్చావురా అంటూ? ఇంతకుముందే గదరా చర్చి గుమ్మంముందు ఫెర్నాండోతోనూ, తక్కినవాళ్ళతోనూ నీవు మాట్లాడుతుండగా నేను చూసింది!" అన్నది మా అమ్మ.

మా అమ్మ వెనకనే తాబేలునడక నడుస్తున్న మేరియా, రూత్, లక్ష్మీగూడా యిల్లు చేరుకున్నారు. రూత్ ఆంటోనియోను చూడగానే ఉత్సాహం తెచ్చుకుని అంతులేని ముచ్చట్లు చెప్పడం ప్రారంభించింది వాడితో.

"ఇంకెందుకురా, నీవు భలే అదృష్టవంతుడివిలేవో! నక్కను తొక్కివచ్చావ్!" అన్నది రూత్ మామూలుగా చేతులు తిప్పుకుంటూ అభినయంతో. ఆంటోనియోను సమీపించి. సంతోషం పట్టలేక వాడి ముందు డ్యాన్సు చేయడం మొదలెట్టింది. "డోనాఎర్మెలిండా అమ్మను యేమనడిగిందో తెలుసా? ఉహించు చూద్దాం ఏమడిగిందో! ఊఁ బాగా ఆలోచించు! నీవురా బాబూష్! నీవైనా ఊహించగలవా యేమడిగిందీ?" అంటూ రూత్ కొంటెతనంగా నవ్వడం సాగించింది.

"నోరుముయ్ రూత్! అంతటితో నీ వాగుడు కట్టిపెట్టు!" అన్నాను చిరాకుతో. రూత్ మాట్లాడేది నా కర్థంకాలేదు. "నీ వెప్పుడూ యిలాగే అర్థంలేని అల్లరిచేస్తుంటావే! నీ వాగుడుకు అంతులేదే! ఇప్పుడూ అదేగా అల్లరి! మరేమైనాఉందా?" అని కేకలేశాను.

"నీవే నోరుముయ్ బాబూష్! నేను చెప్పేది శ్రద్ధగా వినకుండా యెందుకా తొందర! విను నేను చెప్పేది ముందు!" అంటూ నదురూ బెదురూ లేకుండా దబాయించింది రూత్. మొహంమీద ముసుగు

తొలిగించుకుని ఆంటోనియో పక్కన చేరింది, దాని ఉత్సాహానికీ, ఉద్రేకానికీ కారణాలు వివరించింది.

"ఇదిగో వినరా చెబుతున్నాను ఆంటూ! డోనాఎర్మెలిండా అమ్మనేం అడిగిందో తెలుసా? సెనార్ బాల్టజార్ నిన్ను అల్లుణ్ణిగా చేసుకోదలచాట్ట! నిజమేనా అది" అని అడిగింది. "బాల్టజార్ యెంత గొప్పవాడు! ఎంత ఐశ్వర్యవంతుడు! అలాంటి గొప్పవాడికి ఆంటూ అల్లుడు కాబోతున్నాడన్నమాట! ఎఫిజీనియా ఆయనకు ఒక్కగాను ఒక్కకూతురు. ఆ పిల్లకు నీవు భర్తవు కాబోతున్నావు కాబోలు! నీ రొట్టెవిరిగి నేతిలో పడ్డట్టేరా ఆంటూ! ఏమంటావ్ మాట్లాడవేం!" అన్నది రూత్ ఆవేశం పట్టలేక.

"ఏమిటే నీవు అర్థంలేకుండా మాట్లాడుతావ్? బుద్ధిలేదూనీకు?" అన్నాను సహనంతప్పి. "ఎప్పుడూ యెందుకే వసపోసిన పిట్టవాగినట్లు వాగుతావ్ రూత్?"

రూత్ నన్నుచూసి కోపంతో గుర్రుమన్నది. "వెర్రినాగన్నా, చెబుతున్నా విను! నీ కింకా అర్థంకాలా? డోనాఎర్మెలిండా తరుచుగా తన చెల్లెలి వద్దకు వస్తూ పోతూ ఉంటుంది. ఆంటూ మంచిచెడ్డల్ని గురించి బాల్టజార్ వివరంగా విచారణచేస్తున్నాడని ఎర్మెలిండా తన చెల్లెలింట్లోనే విన్నది. అక్కడి మాటల సందర్భాన్నిబట్టి రేపో మాపో తన కూతురు మనుం విషయంలో నాన్న దగ్గరకు బాల్టజార్ రాయబారం పంపబోతున్నాడని ఎర్మెలిండా అనుమాన పడుతూంది. ఇప్పటికైనా బోధపడ్డదిరా మూర్ఖుడా?" అన్నది రూత్.

ఆంటోనియో బెల్లంకొట్టిన రాయిలా మాట్లాళ్ళేదు. లక్ష్మివంక అదేపనిగా చూశాడు. ఈ సంభాషణ లక్ష్మి మనస్సును కలవరపెట్టిందని

వాడు తెలుసుకున్నాడు. ముఖం మరో వైపుకు తిప్పుకుని చీకట్లోకి చూస్తున్నాడు.

ఆంటోనియో మౌనం సహించలేక, "ఏమీ మాట్లాడవేంరా అంటూ! నీకేం వచ్చింది, వాడికేం వచ్చిందిరా? బెల్లంకొట్టిన రాళ్ళలా కూర్చున్నారు! దయ్యమో, భూతమో పట్టినట్లు గుడ్లు తెరుచుకుని అలా చూస్తారేం?" అన్నది రూత్ అర్థంకాక.

అప్పటికీ ఆంటోనియో కదల్లేదు, మెదల్లేదు, నోటిమాటాలేదు. గ్రామాన్ని ఆవరించిన కారు చీకటిని మాత్రం కన్ను మూయకుండా అదేపనిగా చూస్తున్నాడు.

మా పొరుగు గ్రామంలో బాల్డజార్ గొప్ప ధనికుడు. మొన్న మొన్నటివరకూ, గోవాలో ప్రధానమైన ఒక జిల్లాకు అధికారిగూడా. పెద్ద సంపన్నుడూ, పలుకుబడి గలవాడు. పెద్ద పెద్ద అధికార్లతో సంబంధాలు కలవాడుగూడా. అంత హోదాగల పెద్దమనిషి అందమైన తన ఒక్క కూతుర్నీ ఆంటోనియోకిచ్చి పెళ్ళి చేయడానికి ఉవ్విళ్ళూరు తున్నాడు. అలాంటి గొప్ప సంబంధం చేసుకుంటే, మాకూ ఘనంగా ఉంటుందని మా అమ్మ గర్వంతో పొంగిపోతూండేది. ఈ సంబంధం విన్నప్పట్నుంచీ మా అమ్మ పొందే వెర్రి ఆనందానికి అంతులేదు. ఎక్కడలేని ఉత్సాహంతో మురిసి పోతున్నది. లెంట్ ఉత్సవాల సందర్భంలో మా అమ్మ పట్టిన మూగనోముకూ, ఆ రోజుల్లో ఆమె ప్రకటించిన విచారానికీ, యీ నాడామెపొందే ఆనందానికీ పోలికేలేదు. నా అక్కచెల్లెండ్లుగూడా యీ వార్త వినగానే, యెంతో ఉల్లాసం ప్రకటించారు. మా నాన్న యింటికి రాగానే, రూత్ పరుగెత్తిపోయి యీ వార్త ఆయన చెవులవేసింది.

"దాన్ని గురించి నా కంతా తెలుసు. నేను పూర్తిగా అలిసి పోయాను. ఒక్క గ్లాసు మంచినీళ్లు పట్టుకురా ముందు!" అన్నాడు మా నాన్న నిరుత్సాహంగా.

మా అమ్మ మా నాన్నవంక అనుమానంగా చూసింది.

"నా కెప్పుడూ మాటమాత్రం చెప్పారుగారేం? అలా ఎలా చేయగలిగారు మీరు? నా కెందుకు చెప్పలేదండీ?" అన్నది మా అమ్మ.

"ఏమే నీకు చెప్పేదేమిటి నేను? మనకు దీటైనవాళ్లు మనతో వచ్చి ముఖాముఖిగా మాట్లాడితేగా! ఎవరో కళ్ళన్నవచ్చి నాలుగు మాటలు మాట్లాడినంతమాత్రాన, అంతగా మనం పట్టించుకుంటామా? ఏదో సందర్భ వశాత్తు మనింటికివచ్చిన పెరీరా ఆంటోనియో సంబంధం పట్ల బాల్తజార్ ఆసక్తి చూపుతున్నాడని మాటవరస కన్నాడు అంతే. అన్నదే తడవుగా మనంవెళ్ళి వాళ్ళను పూసుకుంటామా? మనకూ ఆత్మ గౌరవం ఉంది! మనవాడికి పెళ్ళికాదని దిగులా; ఈడు మించిపోయిం దనిదిగులా!" అన్నాడు మా నాన్న.

"అయితే సంబంధం విషయం నిజమన్నమాటే!" అన్నది మా అమ్మ సంతోషంలో తేలిపోతూ.

"నిజం ఏమిటే వెర్రిదానా?" అడిగాడు మా నాన్న ఆశ్చర్య సంభ్రమాలతో.

"ఎర్మెలిండా చెప్పింది నిజమన్నమాట! బాల్తజార్ నేడో రేపో పెండ్లి రాయబారానికి యెవర్నో ఒకర్ని మనింటికి పంపుతాడన్నమాట. ఎంత సంతోషకరమైన వార్తవిన్నాను! మీకు మాత్రం యీ సంబంధం ఘనంగాలేదూ చెప్పండి!" అన్నది మా అమ్మ.

మా అమ్మ యింత తన్మయత్వంలో పడిపోవడం యెన్నడూ మేంచూళ్ళేదు. ఉద్రేకంతొ కేకలేస్తున్నది. నవ్వుతున్నది. ఒక మాటకూ మరో మాటకూ సంబంధం లేకుండా మాట్లాడుతున్నది అదేపనిగా. సంబంధం కలవబోతున్నదన్న పుకార్లే ఆమెకింత ఆవేశాన్ని కలిగిస్తే, పెండ్లి ఖాయమై, యిద్దరి కొంగులూ ముడిపడితే, ఆమె తన్మయత్వం పిచ్చిలోకి మారేట్లున్నది.

"మీకీ వార్త గర్వకారణం కదూ! మీ హృదయంలోనైనా ఆనందించడంలేదా యీ శుభ వార్తవిని ?" అని తరిచి తరిచి అడిగింది మా అమ్మ మా నాన్నను.

"అలాంటి దేదైనా ఫలిస్తే, మీతోపాటు నేనుగూడా సంతోషిస్తే, సంతోషిస్తానేమో! కాని యీసంఘటన చూసిమాత్రం నేను గర్వించను, గర్వించదలచుకోలేదు. ఎందుకు గర్వించాలి?" సమాధాన మిచ్చాడు మా నాన్న ప్రతి మాటా తూచి మాట్లాడుతూ.

మా అమ్మ విస్మయం చెందిందీమాటకు. "గర్వించరామీరు? ఎందుకిలా అవాచ్యపుమాటలు మాట్లాడుతారు మీరెప్పుడూ! ఘరానా అధికారి బాల్టజార్ ముందు మీరెంతచెప్పండి! ఆయన ఐశ్వర్యం, ఆయన పేరు ప్రతిష్ఠలు, ఆయనహోదా, పలుకుబడీముందు మనమెంత!"అన్నది మా అమ్మ రుసరుసలాడుతూ.

"అదుగదీ! అందుకే! బాల్టజార్‌లో యే గుణగణాలు మీరూ, మీబోటివాళ్ళూ మెచ్చుకుంటూ అతన్ని ఆకాశపథానికి లేపనెత్తుతున్నారో, ఆ లక్షణాలనే నేను అసహ్యించుకుని, ఆయన మొహంగూడా చూడలేక పోతున్నాను. ధనికుల్నీ, దర్పంగలవాళ్ళనీ, అధికార్లనూ, దురహంకార్లనూ అసహ్యించుకుంటానని నీకు తెలియదూ? అధికార దుర్మదాం

ధుల్నీ, అందులో ముఖ్యంగా పోర్చుగీసు నిరంకుశుల్నీ ద్వేషిస్తానని మీకు తెలియదూ? ఒకవంక యీ ధనికవర్గం ప్రజానీకంలో దౌర్భాగ్యాన్నీ, దైన్యాన్నీ, అవినీతినీ సృష్టిస్తూంటే, మరోవంక యీటోటి అధికారదుర్మదాంధులు యీఘోరదుస్థితి చిరకాలంగా వర్ధిల్లుతూ సాగిపోయేట్లు చేస్తూనేఉంటారు" అన్నాడు మా నాన్న ద్వేషం వెళ్ళకక్కుతూ.

మా నాన్న ధోరణి మా అమ్మకు విపరీతమైన వెగటుపుట్టించింది. సంపన్నకుటుంబంలో పుట్టిన చక్కని కోడల్ని సంపాదించుకుని యీ సంబంధంవల్ల మా కుటుంబానికింత పేరుప్రతిష్ఠలూ, కావసినంత డబ్బూ మూటకట్టుకుందామన్న ఆశగూడా విడిచి, యీ సదవకాశాన్ని జారవిడిచిన మా నాన్న, ఆత్మగౌరవాన్నీ, దేశగౌరవాన్నీ కాపాడి, సాహసోపేతంగా తన అభిప్రాయాన్ని అసందిగ్ధంగా వ్యక్తంచేశాడని నా కనిపించింది.

ఈ సంబంధంవల్ల మా కుటుంబానికన్నివిధాలా లాభిస్తుందని మా అమ్మ ఆశపడ్డది. అంటోనియోకు వచ్చే కట్నంతో మా చెల్లెండ్లలో ఒకపిల్ల వివాహంగూడా జరిగిపోతుందని ఆశించింది. ఈ ఆలోచనలన్నీ మా నాన్నమనస్సుకు తట్టలేదా? తట్టిగూడా నిర్లక్ష్యంతో త్రోసిపుచ్చాడా? తన భావిపరిస్థితిని గురించీ, మా కుటుంబపరిస్థితిని గురించీ మా నాన్న యేమాలోచించాడో అని నేనూ ఊహించుకునేకాణ్ణి.

ఒకనాడు మా అమ్మ సహనం కోల్పోయి ఆగ్రహం ఆపుకోలేక మా నాన్నతో "మీరేదో గొప్పవారనీ, ఘనకార్యాలు సాధించగలరనీ మిమ్మల్నిచూసి మీరే గర్వపడుతుంటారు. మీ మనస్సుకు మీరే రాజాధిరాజనీ, తక్కినవాళ్లెవరూ మీ కాలిగోటికిగూడా పనికిరారనీ అనుకుంటారేమో పాపం! ఇతర తండ్రులైతే, నిక్షేపమైన యీసంబంధాన్ని వదులు

కుంటారా ? ఎగిరి గంతేసి చేసుకుంటారు. దేవుళ్లాగా గద్దెక్కికూర్చుని వచ్చేపోయేవాళ్ళకు ధర్మపన్నాలు బోధిస్తూంటారు. మీకబుర్లిక కట్టి పెట్టండి. ఇదిగో చెబుతున్నా వినండి! మీ అహంభావం, మీ వెర్రిమొర్రి ఆలోచనలూ చివరకు మీకే చేటుతెస్తాయి. నామాట నమ్మండి!" అన్నది.

మా అమ్మ ఆగ్రహానికి మా నాన్నకు పొట్టచెక్కలయ్యేట్లు నవ్వు వచ్చింది. ఆమెనింకా ఏడిపించదలచాడు మా నాన్న. "నాకునేనై చేటు తెచ్చుకొనడం కనీసం కొంతవరకైనా సహించవచ్చు. లోకుల దురాలోచనల్నీ, దుస్సలహాల్నీ నీవు పాటించదలిస్తే, నీ ఒక్కదానికేకాక, నీబోటి యితరులగ్గూడా చేటు కలిగితీరుతుందనే విషయం మరవవద్దు. నాఒక్కడి పతనానికీ నేను కారకుణ్ణయితే, లోకుల బుద్ధిమాంద్యానికీ, మూర్ఖతకూ, అవివేకతకూ మీబోటివాళ్ళంతా బానిసలౌతారన్నమాట! ఏది మెరుగు? ఏమార్గం సరైంది? అన్నాడు మా నాన్న.

ఉన్నకొద్దీ మా నాన్న సూటిపోటీ మాటలకు మా అమ్మ ఉక్రోషం పెరిగిపోతూంది. కోపంతో కుతకుతమని ఉడికిపోయే మా అమ్మను మా నాన్న హాస్యంతో శాంతిపరుద్దామనుకున్నాడు. నామట్టుకు నాకే పరిస్థితి చూసి భయం పెనవేసుకున్నట్లనిపించింది,

"పిచ్చిదానా! ఈ సంబంధం ఖాయమైతే మీతోపాటు నేనూ సంతోషించనూ!" అన్నాడు మా నాన్న ఊరడిస్తూ. తటాలున పడక కుర్చీనుండి లేచి అమ్మవద్దకెళ్ళి ఆమెను కౌగిట్లోకి తీసుకుని తల ముద్దు పెట్టుకున్నాడు. "నిన్ను అనవసరంగా రెచ్చగొట్టి కోపంతెప్పించినందుకు విచారపడుతున్నాను. ఊరికే నిన్ను కవ్వించడానికే అలా అన్నాను. ఈ వివాహం ఖాయపడితే, నేనూ నిజంగా గర్విస్తా. ఎంత గర్విస్తానో తెలుసా! పాదాలనుండి శిరస్సువరకూ నేను నిండిపోయేలా ఒక కొత్త సూటుకు ఆర్డరిస్తాను! ఏమంటావ్?"

మా నాన్న వ్యంగార్థంతో చేసిన అపహాస్యం మా అమ్మ కర్థం కాలేదు. అర్థంకాక నిజమేనని నమ్మి చిరునవ్వు నవ్వింది. ఆనందం మళ్ళీ తొణికిసలాడింది ఆమె ముఖంపైన.

పరిస్థితులన్నీ వివేకంతో అవగాహన చేసుకోగలవ్యక్తి మానాన్న. ధనికుల యిండ్లలో పుట్టిన ఆడపిల్లల్ని పేదవాళ్ళు పెండ్లాడడం ప్రపంచంలో యెక్కడా జరగనిపని అని మా నాన్నకు తెలుసు. భాగ్యవంతులైన తలిదండ్రు లెప్పుడూ ధనికుడైన అల్లుణ్ని కోరి తెచ్చుకుంటారు. అందుకై వాళ్ళెంతైనా ప్రయత్నం చేస్తారు. అలాకాకపోతే కనీసం ఉద్యోగహోదావున్న అల్లుణ్ణైనా సంపాదించుకుంటారు. మా ఆంటోనియోకు ఒక్క డిగ్రీతప్ప యింకేముంది నిజానికి? ఈ డిగ్రీలు సంపాదించుకున్న యువకుల మేధస్సూ ధనికుడు గడ్డిపోచగ్గూడా జమ కట్టడు. అదీ ఈనాటి ప్రపంచం నడత.

అయితే మానాన్న తన ఆలోచనల నన్నింటినీ తన మనస్సులోనే దాచుకున్నాడు. పైకిమాత్రం బాల్డజార్‌ను మెచ్చుకుంటూ మా అమ్మను సంతోషపెడుతున్నాడు. అప్పుడే వివాహమైపోయినట్లుగా మా అమ్మ సంతోషపడుతూంది. ఆకాశాన్నంటే గాలిమేడలు నిర్మిస్తూంది. వీటికి వేటికీ మానాన్న అంతరాయం కల్గించలేదు. ఆమెమనస్సు యెలా స్వేచ్ఛగాపరిగెత్తితే, అలాపోనిస్తున్నాడు. చర్చినుంచి వస్తూ ఎర్మెలిండాతో తాను చేసిన సంభాషణ మాటిమాటికీ జ్ఞప్తికి తెచ్చుకుని మా అమ్మ మురిసిపోతుండేది. ఆంటోనియో అప్పుడే గదిలోనుంచి బయటికిపోయి వెంటనే తిరిగివచ్చాడు. వాడు మకమకలాడుతూ విచారంగా ఉన్నాడు. వెలవెలబోయిన మొహంతో మా నాన్నకూ, మా అమ్మకూ మధ్యవున్న ఒక కుర్చీమీద కూర్చున్నాడు దిగాలుపడి.

"ఏమిటిరా అన్టోనియో! బాధపడుతున్నట్లున్నావ్ యివ్వాళ?" అడిగాడు మా నాన్న విచారంతో, మా అమ్మవంక దృష్టి తీక్షణంగా పోనిచ్చి ఆంటూతో మా నాన్న. "నీ వాలకం యేమీ బాగుండలేదు. నీ మొహం అదో తీరుగా ఉంది. ఇలాంటి గొప్ప సంబంధం వెతుక్కుంటూ మన కాళ్ళముందుకు వచ్చి పడుతూంటే. యెంతో సంతోషంగా కనపడా ల్సింది. అలా వున్నావేంరా? బొంబాయిలో అప్పుడే నీ కిష్టం వచ్చిన పిల్లదాన్నెవర్నైనా చూసుకున్నావా యేంరా? అలాంటి దేదైనా ఉంటే చెప్పేసేయ్!" అన్నాడు.

మా అమ్మ అయోమయంగా ఆంటోనియో వంక చూసింది విచా రంతో. "ఏమిటిరా నాయనా! ఏమిటి నీ కీ బాధ? ఎందుకలా ఆలోచిస్తూ కూర్చున్నావ్?"

ఒక నిమిషం మాట్లాడకుండా అలాగే కూర్చున్నాడు ఆంటోనియో. మేమంతా వాడివంకే కళ్ళుపెట్టుకుని చూస్తున్నాం ఏం చెబుతాడో అని. మాలో ఆందోళనా, ఆతురత, అనుమానంగూడా బలమైంది. పిడుగుపడే ముందు యీ ప్రశాంతత అర్థం యేమిటో నా ఒక్కడికే తెలుసు.

"నీకూ నాన్నకూ ఒక అతి ముఖ్యమైన విషయం చెప్పదలిచానే అమ్మా!" అన్నాడు ఆంటూ వాళ్ళవంక చూడకుండానే. వాడి దృష్టంతా నేలమీదనే కేంద్రీకరించి ఉంది. వాడి రెండు పిడికిళ్ళూ కలిపి గట్టిగా బిగించుకుని కూర్చున్నాడు.

"ఏమిటిరా ఆంటూ అది?" అడిగింది మా అమ్మ యెన్నడూలేని ఆతురతతో.

కొన్ని క్షణాలు గడిచాయి. మాటలేదు. ఆ క్షణాలే యుగాలుగా తోచాయి మా ప్రాణాలకు. ఆంటోనియో చివరి కెలా అయితేనేం,

సాహసించి, తన మనస్సును బయటపెట్టుకోడానికి స్థిర సంకల్పం చేసుకున్నాడు.

"లక్ష్మి విషయమేనే అమ్మా!"

"ఏమిటి, లక్ష్మి విషయం యేమిటిరా నాయనా?" అన్నది మా అమ్మ. ఆమె ముఖాన నాగటి చాళ్ళలా గీతలేర్పడ్డాయి విచారంతో కూడుకున్న ఆలోచన కారణంగా.

లక్ష్మిని ప్రేమించానమ్మా! ఆ పిల్లను పెండ్లాడదలచానే!" అన్నాడు మెల్లగా వణుకుతూ.

వాడి అభిప్రాయం ఒక్క ముక్కలో మా అందరి చెవుల్లో పడగానే, టేబిల్‌పై ఉన్న బుడ్డి దీపం కాంతి వెలవెలబోయినట్లయింది. అంధకారం ఆవరించినట్లుంది. మా అమ్మ నోటవెంట మాటపోయింది. కుర్చి రెండు చేతుల్నీ తన పిడికిళ్ళతో గట్టిగా పట్టుకుని తల వెనక్కు వేలాడవేసింది. పైత్యభ్రమలో అపస్మారం వచ్చిందా అనుకున్నాం. మేరియా. రూత్ యీ వార్త విని నివ్వెరపోయారు. అంతవరకూ మా నాన్న ముఖంమీద నాట్యమాడుతున్న చిరునవ్వు మంత్రం పెట్టినట్లు క్షణంలో మాయమైంది. ఏదో మాట్లాడ్డానికి ప్రయత్నించాడు మా నాన్న. కదిలిస్తే కబుర్లుపోగైన మా నాన్న నోటివెంట యెంతసేపటికీ మాట పెగిలి రాలేదు. ఆయన సహనశీలుడూ, ఉదార స్వభావుడూ, హేతువాది గూడా. కష్టసమయాల్లో యెంతో మనోనిబ్బరం, నిగ్రహం ప్రదర్శించ గల వ్యక్తి. అంత ధీరత్వంగల మా నాన్నగూడా యీ వార్త విని విస్మయం చెందడం చూసి మా ఆంటోనియో బాధపడ్డాడు. మా నాన్నను ఒక్క నాన్నగానే గాకుండా, ఆప్తమిత్రుడుగా, మార్గదర్శిగా, ఆచార్యుడుగా, ఆదర్శ పురుషుడుగా చూసుకుని గర్వంతో మురుసుకునేవాడు ఆంటోనియో. లోకంలో యువతీయువకుల నిష్కల్మష ప్రేమానుబంధం,

యెంత పవిత్రమైనదో, యెంత లోతైనదో, యెంత గాఢమైనదో ఒక్క మా నాన్నకు మాత్రమే తెలుసునని ఆంటూ అనేకసార్లు నాతో అంటూ ఉండేవాడు. మా అమ్మ కీ విషయాలు అంతుపట్టకపోయినా, కనీసం మా నాన్నకైనా తెలుసునని వాడు తృప్తిపడేవాడు.

ఆ రాత్రి భోజనాలముందు మామూలు ఉల్సాహం, పరిహాసాలూ, హాస్యాలూ మచ్చుకైనా లేవు. ఎవరికి వాళ్ళు మౌనందాల్చి కూర్చున్నారు. ఒక ముద్దయినా నోట్లో పెట్టుకుందామనీ, ఒక మాటైనా మాట్లాడదామనీ యెవరికీ మనస్కరించలేదు. ఎవరి ముఖాలు చూసినా కళ దప్పివున్నాయి. ఆంటోనియో ఆ కొత్త ముక్క బయటపెట్టగానే మా అమ్మ అశ్రుధారలు కార్చుతూ గదిలోకి చరచరా వెళ్ళిపోయింది. ఆ నిమిషం నుండి మళ్ళీ బయటకొచ్చి ముఖం కనబర్చలేదు. మా అక్క చెల్లెండ్లూ యీ వార్త విని ఆంటోనియోను చూసి ముఖాలు చిట్లించుకొనడం మొదలెట్టారు. ఆంటూ మా కుటుంబానికి తీరని అవమానం, అప్రతిష్ఠ తెచ్చిపెట్టడమే కాకుండా, మా అమ్మను మంచానగూడా పట్టించబోవడానికి కారకుడౌతున్నాడని వాడిమీద కసురుకునే వాళ్ళు. అంతవరకూ ఒక్క మాటా, పలుకూ లేకుండా అంతా గంభీరంగా ఉన్నారు. ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటూ విచారగ్రస్తుల మైనాం. ఒక్క ముద్దయినా మింగకుండా కంచాలముందు నుంచి విచారంతో లేచిపోయాం. జరిగిన సంఘటనకు ప్రతివాళ్ళు నిట్టూర్పు విడిచారు. మా గదిలో అంతా ప్రశాంతంగానే వుంది. మా ఆంటూను ఓదార్చి, మనోధైర్యం కల్గించడానికి యేవేవో మాట్లాడ్డానికి ప్రయత్నించాను. కాని వాడు మంచంపైన దోసిలిలో తల పెట్టుకుని కూర్చుని, నా మాటలు వినరానట్లు నటించి కూర్చున్నాడు.

పిడుగు పడనేపడింది. దాని విషపరిణామాలు నేను గానీ, ఆంటోనియోగానీ పారచూడలేక పోయినాం అప్పట్లో. నేను మేలుకునే మంచం

పైన పడుకున్నాను. సాయంకాలం జరిగిన సంఘటన లన్నీ తలపోసు కుంటున్నాను. మా అమ్మా, ఆంటోనియో మొదలైన వాళ్ళ దైన్యస్థితి తలచుకుని విచారించాను. పరిస్థితి యావత్తూ ప్రశాంతంగా, నిష్పక్షపాతంగా పరిశీలించి, తప్పెవరిదా అని తేల్చుకోడానికి పూనుకున్నాను. పర్యవసానంలో యెవరు నిందితులు? ఎవ్వరూ నిందితులు కారని చివరకు నిర్ధారణ చేసుకోగల్గాను. ప్రతి స్త్రీకీ, ప్రతి పురుషుడికీ, తన వ్యక్తిగత భావాలూ, తన మనస్తత్వాలూ వుంటాయి. తన ఆలోచనలూ, తన ఆత్మగౌరవం తన కుంటుంది. ఎవడి విధి ప్రకారం వాడు నడుచుకోవాలి. ఎవడి కర్మ వాడనుభవించాలి. మా యింట్లో యీ నాడు జరుగుతున్నదీ, జరగబోయేదీగూడా యింతే. లక్ష్మిని మా ఆంటూ ప్రేమించాడు మనసారా. అంచేత ఆ పిల్లను సహజంగా. న్యాయంగా పెళ్ళాడాలని వాడు కోరుకుంటున్నాడు. అదే కారణం పురస్కరించుకుని లక్ష్మి గూడా ఆంటూనే పెండ్లాడితీరాలని నిశ్చయించుకొంది. తన కుమారుడికి లక్ష్మి తగిన పిల్ల కాదని మా అమ్మ నమ్మకం. అంచేత యీ యిద్దరి పెళ్ళికీ మా అమ్మ యిష్టపడ్డం లేదు. దీన్లో యెవరిది తప్పు? ఎవరిది ఒప్పు?

రాత్రి పొద్దుపోయేవరకూ నేను మేలుకునే ఉన్నాను. పరిస్థితు లన్నీ మథించి, యెలాగైనా లంకాలుపడి నిజం నిగ్గు తీయాలని విశ్వ ప్రయత్నం చేశాను. కాని నా ప్రయత్నం వృథా అయింది. ఆ తర్వాత నా ఆలోచనలన్నీ మేరియానూ, రూత్‌ను చుట్టవేసుకున్నాయి! ఈ వివాహం వల్ల మేరియా, రూత్‌లకు కలిగేబాధ యేమిటా అని ఆశ్చర్యం వేసింది నాకు. లక్ష్మి వీళ్ళిద్దర్నీ ఒక్క నిమిషంగూడా విడిచి వుండేది కాదు. ఆ పిల్ల సుగుణాలను వీళ్ళిద్దరూ యెప్పుడూ మెచ్చుకుండే వాళ్ళు. లక్ష్మిమీద వాళ్ళ పంచప్రాణాలు యుండేవి. అలాంటి సుగుణరాసి లక్ష్మిని

వీళ్ళ సోదరుడే ప్రేమించి పెళ్ళాడతానంటే వీళ్ళిద్దరూ మొహాలుమాడ్చు కుని ఆంటోనియోతో మాట్లాడ్డమే మానివేశా రెందువల్ల ?

ఎందువల్ల మాట్లాడ్డం మానివేశారు ? ఏమిటీ కారణం ........ అని నన్ను నేనే ప్రశ్నించుకుంటూండగానే యింతలో నిద్ర నన్నా వహించింది.

———

# ౭

"ఎందుకురా నన్నింత అల్లరిపెడతారు ? పెద్దవాళ్ళయిన తర్వాత మీ వల్ల యింకా యెంత అల్లరిపడాలోగద!"

పసిబిడ్డలమై వున్న రోజుల్లో అల్లరితో విసిగించినప్పుడు మా అమ్మ తిట్టిన తిట్లు యిప్పుడు నాకు జ్ఞాపకం వస్తున్నాయి. ఆ నా డామె అన్న మాటలు యిప్పుడు నిజమౌతున్నట్లున్నాయి. ఫ్రాన్సిస్కో ప్రేమాస్పదుడూ, విధేయుడూ అయినా, ఆఫ్రికా వెళ్ళగానే ఆకస్మికంగా మా కుత్తరాలు వ్రాయడం మానేశాడు. ఇదిలా ఉండగా నిన్న మా అమ్మను ఆంటోనియో కొట్టిన అదురుదెబ్బనుంచి ఆమె కోలుకునే ఆశ కనిపించ లేదు. ప్రమాదకరమైన యీ దెబ్బ ఆమె ప్రాణాలే తీసేటంత తీవ్రంగా వుంది నా మనస్సుకు.

రాత్రిల్లా మా అమ్మ ఆమె చీకటి గదిలోనే పడుండి మొహం ఉబ్బిపోయేట్లు ఒకటే యేడ్చింది. తెల్లవారిన తర్వాత ఆంటోనియోసూ, లక్ష్మిని చూడనే లేదు. కాని హృదయఘాతంతోనే, ఉబ్బిపోయిన కళ్లతో ప్రార్థనా గీతాలు పాడుతూన్న దామె. మా యిల్లిప్పుడు యిదివరకులాగా గాక కళ కాంతులతో ప్రకాశించడం లేదు. చీకట్లావరించినట్లు బావురు మంటున్నది. ఎటుచూసినా అనుమానమూ. భయమూ వెంటాడు తున్నాయి. ఒకరొకరిని శత్రు సమానులుగా చూసుకుంటున్నారు. ఎవ రికి వారే ఆవేదనతో హృదయఘాతంతో కుంగిపోతున్నారు. ఒక్క రాత్రిలో యీ భయంకర పరిణామం కల్గింది. ఈ వాతావరణమంతా చూసి నా గుండెలు జేజారెత్తి పోతున్నాయి.

రాత్రింతా ఆంటోనియో పక్క కుదరక అటూ యిటూ కొట్టుకుంటూ కలవరిస్తున్నాడు. వాడు పడే యమయాతన వర్ణించలేను. మర్నాడుదయం యేం జరుగబోతున్నదో వాడేకాదు, యెవరూ ఊహించలేని అయోమయస్థితి అది. తెల్లవారి ఝాము పొద్దెక్కిన తర్వాత మళ్ళీ కాస్తంత మనోధైర్యం పుంజుకుని, ఆశ అంకురించడం ప్రారంభించింది. మా నాన్న ఆంటోనియో వద్ద చేరి ఓదార్పు మాటలతో అదరించడం మొదలెట్టాడు.

"నిన్న రాత్రి నిన్ను కష్టపెట్టి నీ మనస్సు నొప్పి కలిగే మాటలేమైనా అన్నానేమో క్షమించరా నాయనా!" అని ఆంటోనియో బుజాల పైన మా నాన్న తన చేత్తో నిమరడం మొదలెట్టాడు. నీ వా మాట అనే సరికల్లా నిజంగా నేను నిశ్చేష్టుణ్ణైపోయాను. కాని యిప్పుడు నా మనస్సుకు తేట చిక్కింది. అన్ని విషయాలు యిప్పుడు నేనర్థం చేసుకున్నను. ప్రతి జీవీ యీ లోకంలో సుఖించాలని కోరుతాడు. ప్రతివాడికీ సుఖించడానికి హక్కున్నదికూడ. సుఖం యే ఒక్కరి సొత్తూ కాదు. నీవు నీ యిష్టం వచ్చినట్లుగా సుఖపడ్డానికి నీకూ హక్కున్నది. యుక్త వయస్సు వచ్చిన ప్రతి స్త్రీ, పురుషుడూ తన భవిష్యత్తును తాను స్వయంగా ఆలోచించుకుని, తన జీవిత విధానం నిర్ణయించుకోవాలి. నీ వా నిర్ణయాన్ని యీనాడు చేసుకున్నావు. కొద్దో గొప్పో కొన్ని పరిధుల్లో పసిబిడ్డలక్కూడ వ్యక్తిత్వం ఉంది. తలిదండ్రులైనవాళ్ళు యీ సత్యాన్ని తరచుగా విస్మరించడమో, అలక్ష్యం చేయడమో జరుగుతూంది. నా మనస్సిప్పుడు హాయిగా నిర్మలంగా ఉంది. తక్కినవాళ్ళ మాదిరే లక్ష్మి బుద్ధిమంతురాలైన చక్కని పిల్ల. ఆ పిల్లవల్ల నీకు తప్పక సుఖం చేకూడుతుందని నమ్ముతున్నాను. మీ అమ్మగూడా నీ

నిర్ణయంపట్ల విస్మయం చెంది స్మారకం తప్పి పడిపోయింది. త్వరలో ఆమెగూడా యీ దెబ్బనుండి తేరుకుని, నీ నిర్ణయాన్ని హృదయ పూర్వకంగా ఆమోదిస్తుందని నాకు విశ్వాసముంది. ఏదేలా అయినా, నా ఆశీర్వచనం నీకెప్పుడూ ఉండనే ఉంది." అని మా నాన్న ముగించాడు.

మమ్మల్నందర్నీ యెప్పుడూ సంతోష పెడుతూండే చిరునవ్వు మళ్ళీ మా నాన్న ముఖాన్ని అలంకరించింది. చిరునవ్వులు తొలకరించడంతో ఆంథోనియో భయాందోళనలు పటాపంచలైనాయి. ఆంటూగూడా చిరునవ్వు నవ్వాడు. నీరసంగా నవ్విన వాళ్ళ చిరునవ్వులు అస్పష్టంగా ఉన్నా, ఒకరి మనోభావాలను మరొకరు అర్థం చేసుకోగల్గారు.

అయినా మా అమ్మ మనస్సింకా మారలేదు. ఆంటూపైన కనికరం యింకా కలగలేదు. ఆరు రోజులవరకూ సాధ్యమైనంత మట్టుకు మా అమ్మ గదికి అంటిపెట్టుకునే ఉంది. మూలుగులూ, నిట్టూర్పులూ, వెక్కి వెక్కి యేడ్పులూ వినవస్తూనే ఉన్నాయి. ఏడవ రోజున మా అమ్మ లక్ష్మిని గదిలోకి రప్పించుకుని, "నీవు కృతఘ్నురాలివి లక్ష్మీ! నిన్ను నా ఒడ్డుతో సమంగా పెంచి పెద్దదాన్ని చేశానే! అలాంటిదానివి నీవా, నాకింత పనిచేసేది?" అన్నది కఠినంగా.

"నేనేం చేశానమ్మా?" అన్నది భయంతో వణుకుతూ లక్ష్మి.

"నీవేం చేశావూ? చేయవలసినంత పనీ చేశావు! అలాంటి ప్రశ్న అడగడానికి నీకు ధైర్యం యెలా వచ్చిందే లక్ష్మీ? మా కుటుంబానికీ, మా వంశానికీ నీవు తెచ్చిన అపఖ్యాతి, నీవు చేసిన అవమానం యిప్పటికీ నీవు గుర్తించలేదా అని అడుగుతున్నా!"

లక్ష్మి కాసేపు తలవంచుకుని మళ్ళా, "ప్రేమించడం తప్పా అమ్మా?" అని అడిగింది.

"ప్రేమ! లక్షాధికారికీ బిక్షాధికారికీ ప్రేమ యెలా పొసగుతుందే? మా అబ్బాయికీ, నీకూ అసలు పోలిక యెక్కడిది? నీవు అంట్ల తప్పేలాలు తోముకునేదానివైతే మావాడు హంసవంటివాడు! తెలిసిందా! నీవు నీచురాలివి; చౌకపారుదానివి. అసలామాటకొస్తే, నీవు మనిషివే కాదు. అంత డబ్బు పోసి వాడి కంత చదువు చెప్పించింది నీబోటి పనికి మాలినదాన్నీ, కాసు చేయని నిరక్షరకుక్షినీ పెండ్లాడడానికా? సిగ్గులేక ప్రేమ, ప్రేమ అని పేలుతున్నావు!" అన్నది మా అమ్మ ఆగ్రహంతో మండిపడి.

మా అమ్మ లక్ష్మిని యీ ధోరణిలో అనరాని మాటలతో ఆడిపోస్తూనే ఉంది. లక్ష్మి ఆమె ముందు దీప స్తంభంలా నిలబడే ఉంది భయంతో వణకిపోతూ.

"నీబోటి బికారివల్ల మావాడికి సుఖం యెలా అబ్బుతుందే లక్ష్మీ? వాణ్ణీ, మమ్మల్నీ యింతటితోనైనా వదిలిపెట్టు యెక్కడికైనా యెందుకు పారిపోవు? ఇంతటితోనైనా మమ్మల్ని బ్రతకనిచ్చి, మా కష్టాలు గట్టెక్కించవే లక్ష్మీ!" అన్నది మా అమ్మ సూచనప్రాయంగా. ఈ మాటే మళ్లా మళ్లా లక్ష్మి చెవులు గింగురు మనేట్టు మా అమ్మ అరవసాగింది. ఈ బొబ్బరింతలకు లక్ష్మి చెవులు దిబ్బెళ్లు వేసి రెండు చేతులతో గట్టిగా మూసుకున్నది. "వెయ్యిజన్మలెత్తినా నీవు మా వాడితో యీడుజోడూ కాలేవే లక్ష్మీ! వెయ్యిపుటాలుపెట్టినా వాడి కాలి గోటికి సమం కాలేవే నీవు! నీవు తక్కువకులం దానివి; నీచురాలివి; వాడికి యీడూ జోడూ కాలేవు! నీవూ......".

ఈ బొబ్బరింతలతో, గాండ్రింపులతో మా అమ్మ లక్ష్మిని బెదరగొట్టింది. ఎంతసేపు విన్నా యీ దూషణ వాక్యాలే. లక్ష్మి అప్పటివరకూ గుడ్ల నీరు కుక్కుకుని యేడుస్తూనే ఉంది. ఇహ సహించలేక తల

పైకెత్తి మృదువుగా ప్రశాంతంగా, "మీతో నేను సమంకాదంటున్నానే అమ్మా! అయితే దేవుని దృష్టిలో మనమంతా సమానులమే అని ఎప్పుడూ నాకు చెప్పేదానివే! నన్నెందుకు క్రైస్తవ మతంలో దింపావమ్మా? ఆదిపురుషుడైన ఆదాముకు మనమంతా ప్రియతమమైన బిడ్డలమని నీవు పలుసార్లు నాకు బోధించలేదా అమ్మా! మనం ఒక రకమైన క్రైస్తవ సిద్ధాంతాలను వల్లెవేసి, మరోవిధంగా నిత్యజీవితంలో ఆచరణయందు పెట్టవచ్చునా? ఆలాంటి దా క్రైస్తవమతం? క్రైస్తవమతం నిజంగా అలాంటిదే అయితే, నన్నసలు క్రైస్తవరాలుగా యెందుకు మార్చావు?" అన్నది లక్ష్మి.

మెరుపు మెరిసినట్లీమాటలు లక్ష్మినోటినుండి ఊడిపడ్డాయి. పిడుగుపడ్డట్లు మా అమ్మ మీద విరుచుకుని పడ్డాయి. ఈ మాటలతో మా అమ్మమనస్సు చెదిరిపోయింది. నోటివెంట ఒక్కమాట లేదు. చైతన్యంలేనట్లు మారిపోయింది ముఖం. పంచేంద్రియాలూ స్తంభించినట్లు కనిపించాయి నా కంటికి. ఆరుబయట శూన్యం లోకి రెప్పవాల్చకుండా చూస్తుంది మా అమ్మ. చీకటి పడట్లూ, దీపాలింకా వెలిగించనట్లు ఆమెకు తోచలేదు.

ఒక పక్షంరోజులు గడిచిపోయాయి. ఆంటోనియో, లక్ష్మి యిల్లు విడిచి ప్రయాణమై పోయే రోజది. వాళ్ళిద్దర్నీ రైల్వేస్టేషనుకు తీసుకుని పోవడానికి గుఱ్ఱపుబండి వచ్చి గుమ్మంముందర సిద్ధంగా ఉంది. ఇద్దరూ బొంబాయిపోయి, అక్కడ పెళ్ళాడాలని నిశ్చయించు కున్నారు. వాళ్ళయెడబాటు భరించలేని విచారం కల్గించింది మాకు. దుఃఖం లోనుండి తెరలుతెరలుగా పొంగి పొరలుతున్నది. ఎంతోకష్టంమీద అణచుకోగల్గాం. ప్రయాణమై పోబోయేముందు, లక్ష్మి ప్రతిగదిలోకీ పోయి తను ఆప్యాయంగా మెంచుకొనే ...

స్పృశించింది, తన చేతులు వాటిపైన వేసి నిమిరింది. వాటికి వీడ్కోలిస్తున్నట్లుగా కాసేపక్కడే నిలబడి యేదో సంభాషించింది వాటితో.

మా అమ్మకు వాళ్ళముఖాలు చూడాలనీ. వాళ్ళతో మాట్లాడాలనీ ఆలోచనే కలగలేదు. లక్ష్మితోనే ప్రపంచం అన్నట్లుగా భావించి, అపిల్లనెప్పుడూ యెడబాయని మా అక్క చెల్లెండ్లు గూడా ఒక్క సాను భూతి వాక్యం పలకలేదు లక్ష్మితో. వూళ్ళో అమ్మలక్కలూ గూడా లక్ష్మికి యెడమొహం పెడమొహం పెట్టారు.

ఒక్క మా నాన్న, నేనూ మాత్రమే మెట్లుదిగి బండిపక్క నిలబడి ఉన్నాం. ఆంటూకూ, లక్ష్మికీ హృదయపూర్వకమైన వీడ్కోలివ్వడానికీ, మా శుభాశీస్సు లందజేయడానికీ సిద్ధంగా ఉన్నాం. విషాద వాతావరణం మధ్య మేమిద్దరం యివ్వబోతున్న యీ వీడ్కోలుకూ, ఆనాడు ఆంటోనియో యింటికి వచ్చినపుడు మేమంతా సమిష్టిగా కలిసి యిచ్చిన ఘనస్వాగతానికీ యెంత తేడాఉంది! ఆంటోనియోకూ, లక్ష్మికీ మా నాన్నకూ కళ్ళవెంట జలజలా నీళ్లు రాలాయి. ఆపుకోడానికి మా నాన్న విశ్వప్రయత్నం చేశాడు. ఒకనిమిషంసేపు చొక్కా చెంగుతో తుడుచుకున్నాడు. కాని ధారవాహినిగా ప్రవాహం కట్టగానే, చేసేది లేక వాటిదోవన వాటిని పోనిచ్చాడు.

"నాయనా, ఆంటూ! లక్ష్మిని ప్రాణంలో ప్రాణంగా చూసుకో. భగవంతుడు మిమ్మల్ని దీర్ఘాయు రారోగ్యాలతో ఆశీర్వదించు గాక!" అన్నాడు మా నాన్న గద్గద కంఠంతో. "మీలోమీరు యే ఒక్కరూ మరొకరి వద్దనుండి భోగభాగ్యాలాశించ బోకండి... ఈ ప్రపంచంలో దుఃఖమయమైన జీవితానికీ ప్రధాన కారణాలు దురభిమానం, ఐశ్వర్య కాంక్ష....ఒకర్నొకరు అర్థంచేసుకోడానికి ప్రయత్నించి, ఒకరి తప్పు

లను, ఒకరిలోపాలను పాపాలనూ మరొకరు క్షమించుకొనండి. మీ హృదయాలనుండి ద్వేషాన్ని, దుఃఖాన్నీ, అసహనాన్ని దూరంగా పారద్రోలండి. ఉన్నదానితో సంతృప్తిపడి జీవించండి. అమ్మనూ, అక్కచెల్లెండ్లనూ మన్నించండి। బొంబాయి చేరగానే క్షేమ సమాచారాలతో జాబువ్రాయండి। మీకు శుభం కల్గుతుంది। వెళ్ళిరండి నాయన్లారా వెళ్ళిరండి!"

సాయంత్రం కావచ్చింది. ఎండతీవ్రత కొంతతగ్గింది. మందంగా వీచే గాలితాకిడికి రాలిన పండుటాకులు యెండి గలగలశబ్దం చేస్తున్నాయి. ఆంటూ, లక్ష్మిల నెక్కించుకుని గుర్రబ్బండి నెమ్మదిగా సాగిపోయింది. ఇన్నిసంవత్సరాలుగా యీ యింటినీడక్రింద మేమంతా కలిసి యెంతోఆనందంగా, సుఖంగా గడిపాం. ఇట్టి విషాదపరిస్థితుల్లో లక్ష్మి ఆంటీలు మమ్మల్ని యెడబాసి వెళ్ళిపోవడం మా హృదయాలకు మరుపురాని ఆవేదన కల్గించింది. మళ్ళీ వాళ్ళిద్దర్నీ చూడగలమో లేమో అని బెంగ పుట్టింది. మమ్మల్ని విడిచిపెట్టి పోతుంటే, నా శరీరంలో కొంతభాగం నానుండి విడిపోయి వాళ్ళతోకలిసి ప్రయాణం చేసినట్లే ఉంది. రక్తబంధువులకు వీడ్కోలిచ్చేప్పుడు అందరూ అనుభవించే విచిత్రానుభూతి యిది.

---

౮

బ్లాటింగుకాగితంపై సిరాచొట్టుపడి కాగితమంతా వ్యాపించి నట్లు విషాదచ్ఛాయలు మా యిల్లు నలువేపులా అలముకున్నాయి. రోజు రోజుకూ మా విచారం అనంతంగా పెరిగిపోతున్నది. ఒకప్పుడు ఉత్సాహానికీ, ఆనందానికీ, చిహ్నమైన యీ కట్టడం, యీ నాడు ఊగిసలాడుతూ, బీటలువారి, క్రమంగా విచ్ఛిన్నమై పోయే స్థితికి వచ్చింది.

ఆడవాళ్ళూ, మగవాళ్ళూ, అంతా లక్ష్మినే నిందించారు. ఒకప్పుడు అకాశాని కెత్తి పొగడిన వాళ్ళంతా ఆ పిల్లనిప్పుడు అనరాని మాటలతో ఆడిపోయడం సాగించారు. ఆ పిల్లే ఆంటూను మరులు కొల్పిందనీ, మాయోపాయం చేత, కపట ప్రేమచేత వాణ్ణి వశం చేసుకున్నదనీ దూషించారు. ఆంటోనియో యే పాపం యెరగని అమాయకుడనీ. వాడి ఖర్మం చాలక లక్ష్మి నక్కజిత్తులకు బలై పోయాడనీ అన్నారు.

వీళ్ళందరూ లక్ష్మిమీద యెంత నిర్దాక్షిణ్యం, యెంత క్రౌర్యం పెంచుకున్నారు!

నా ఒక్కడికైనా యధార్థ పరిస్థితులన్నీ అర్థం కావడం మేలయింది. లక్ష్మి హృదయ కుహరంలో అణగారిపోవడానికి సిద్ధంగా ఉన్న నిప్పు రవ్వలను మళ్ళీ రగిల్చి, ప్రకోపింప జేయడానికీ, ప్రేమజ్వాలలుగా పెంపొందడానికీ బాధ్యులెవరో గూడా నాకుతెలుసును. ఇంతవరకది బాహ్య ప్రపంచానికి బయటపడని పరమ రహస్యం. ఆమె ప్రేమ జ్వాలను ఆర్పివేసుకోడానికీ, ఉబికుబికి వచ్చే ఆమె భావ పరం పరలను అణచి వేసుకోడానికీ చేయాల్సిన కృషింతా ఆమె చేసింది. లక్ష్మిని రెచ్చ

గొట్టింది ఆంటోనియో. తనను చేపట్టుమని ఆపిల్లను అదేపనిగా వెంటాడి వేధించింది ఆంటోనియో. వాడా పిల్లయందు చూపుతున్న గాఢ ప్రేమను తిరిగీ తన యందు చూపమని ప్రాధేయపడింది ఆంటోనియో. మరులుకొలి పిందిగూడా నిజానికి ఆంటోనియో. ఇన్నాళ్ళుగా లక్ష్మి చూపుతున్న అణకువ, వినయవిధేయతలను గూడా అధిగమించి, తన ప్రేమనే ప్రధాన విషయంగా ఎంచుకుని తన ఆశయ సాధనకు పూనుకున్నది గూడా ఆంటోనియో.

అయినా నిజాన్ని తెలుసుకోడానికి ప్రయత్నించక, లోకులతో పాటు మావాళ్ళు గూడా లక్ష్మికే పాపమంతా అంటగట్టడానికి సాహసించారు. ఇహ సత్యానికి రోజు లెక్కడ ప్రపంచంలో.

లోకు లెప్పుడూ స్త్రీనే యెందుకు యెక్కువగా నిందిస్తారు? పురుషుల దృష్టిలో స్త్రీ లెందుకు తేలికౌతారు? ప్రేమించడమే పాపమైతే, స్త్రీ చేసిన యీ నేరానికి ఆమెను కొరతను వేసి, అదేనేరానికి, పురుషుణ్ని కనికరించిగానీ, క్షమించిగానీ, భయపడిగానీ యెందుకు వదులుతున్నారు? ప్రజల దృష్టి యింత పక్షపాతంగా ఉన్నదేం? ఇదేనా న్యాయం, నీతి? స్త్రీకి ఒక న్యాయ సిద్ధాంతం, పురుషునికి మరొకటీనా? పురుషులే కాకుండా, పురుషులను మించి స్త్రీ సమాజమే స్త్రీలను దూషించి, చిన్నచూపు చూడడ మెందుకు?

వర్షాకాలం రానూవచ్చింది, పోనుపోయింది. చలికాలం గూడా దాటిపోయింది. సూర్యుని చుట్టూ భూమియెడ తెగకుండా పరుగెత్తుతుండడంతో, సంవత్సరాలకు సంవత్సరాలే దొర్లిపోతున్నాయి బ్రతుకు నానాటికీ మరింత దుఃఖ భూయిష్టమై, దుర్భరమై పోయింది. మాకుటుంబానికి వాటిల్లిన కష్టపరంపరలను తలపోసుకుంటూ యెలాగో జీవితాన్ని వెళ్ళ దీస్తున్నాం. జీవించక మరితప్పేదే ముంది కనక. గోవా ప్రజల్ల

పరిస్థితి మరింత హీనమైంది. వాళ్ళ కడగళ్ళు మితి మీరిపోతున్నాయి. వాళ్ళను నిరాశ, నిస్పృహ. నిస్సహాయత పూర్తిగా అలముకుంది. పోర్చుగీసు ప్రభుత్వం తలపెట్టిన కొత్తబిల్లుకు వ్యతిరేకంగా ప్రజా వెల్లువ ఉవ్వెత్తుగా లేచింది. అయినా ప్రజాభిప్రాయాన్ని తృణీకరించి బిల్లును పార్లమెంటు ఆమోదించి చట్టంగా మార్చివేసింది. నూతన నియంతృత్వం ప్రజల్ని నిరంకుశ హింసాకాండకు గురిచేయనున్నదనీ, ప్రజల స్వాతంత్ర్య కాంక్షనూ, దేశభక్తినీ సర్వనాశనం చేయడానికి పూనుకున్నదనీ రుజువైంది.

దీనితో గోవా ప్రజలకు ఒక నూతన బానిసయుగం ప్రారంభమైంది.

సెనార్ బ్రాగాంకా, సెనార్ పెరీరా మొదలైన గోవా ప్రధాన నాయకులు పోర్చుగీసు ప్రభుత్వం ప్రారంభించిన హింసాకాండను ఖండిస్తూ ప్రకటనపై ప్రకటన చేశారు. ప్రజాభిప్రాయాన్ని పూర్తిగా తమవేపు తిప్పుకోడానికి ప్రచారం సాగిస్తున్నారు. కాని ప్రయోజనం లేకపోయింది. నూతన ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని వినడానికి నిరాకరించింది. పశుబలంతోనే రాజ్యం పాలించి ప్రజల హక్కులను, స్వాతంత్ర్యకాంక్షను నిర్మూలం చేయడానికి నిశ్చయించుకుంది. ప్రజల కనీస పౌరహక్కులుగూడా మాయమౌతున్నాయి. తమ సామ్రాజ్య ప్రయోజనాలనూ, తమ ధనపు సంచులనూ పరిరక్షించుకుని పెంపుచేసుకునేందుకై పోర్చుగీసు పాలకులు మానాభిమానాలు విడిచి నానా గడ్డి కరుస్తున్నారు.

విషాదాంత నాటకంలో ప్రథమాంకం పూర్తయింది.

ఆ తర్వాత వెంటనే గోవా ప్రజల పక్షాన పోర్చుగీసు పార్లమెంటులో యిద్దరు ప్రతినిధులను యెన్నుకోడానికై యెన్నికలు జరప

డానికి ప్రభుత్వం నిశ్చయించింది. పత్రికలో ప్రకటనగూడా వెలవడ్డది. జాతీయవాదులైన యిద్దరు స్వతంత్ర అభ్యర్థుల పక్షాన ప్రచారంచేయ డానికి మా నాన్న నిశ్చయించుకున్నాడు. పొలంపన్లూ, యింటిపన్లూ గూడా పూర్తిగా మరచిపోయి, ప్రతిరోజూ యింటింటికీ తిరిగి పోర్చు గీసు పాలకులు ప్రజలకు చేసే అవమానాలను, అక్రమాలను గురించి నచ్చచెప్పేవాడు. ప్రక్క గ్రామాలక్కూడా పోయి ప్రచారంచేసి వస్తూండేవాడు. జాతీయవాదులైన స్వతంత్ర అభ్యర్థులను యెన్నుకుంటే, కనీసం పార్లమెంటులోనైనా ప్రజల కష్టాలను గూర్చి నిర్భయంగా, నిర్మొగమాటంగా ఆందోళన చేయగల్గుతారనీ, ప్రజల యిబ్బందులను వున్నవి వున్నట్లు పార్లమెంటులో చెప్పగలుగుతారనీ మా నాన్న ప్రజా నీకంలో బహుళ ప్రచారం చేశాడు. ప్రభుత్వం యెన్ని కష్టాలకు, నష్టా లకు గురిచేసినా, స్వతంత్ర అభ్యర్థులనే గెల్పించమని ప్రబోధించాడు.

వారం రోజులపాటు ప్రతి ఉదయం మా నాన్న పక్క గ్రామా లకు ప్రచారానికి బయల్దేరిపోయి తిరిగి సాయంత్రానికి యిల్లు చేరేవాడు. ఇలా వుండగా శుక్రవారం నాడు యెవరో యిద్దరు పెద్ద మనుష్యులు కార్లో మా నాన్నని చూడ్డానికి మా యింటికి వచ్చారు. వాళ్లు బస్తీ మను ష్యుల్లా కనిపించారు. పాలిష్ చేసిన బూట్లూ, వెయిస్ట్ కోట్లతో వీళ్ళు తయారైనారు.

"నా వల్ల మీకేం సహాయం కావాలో చెప్పండి! నన్ను యేదో రాష్ట్రానికి గవర్నరు చేయదలచి రాలేదుగదా మీరు?" అన్నాడు వాళ్ళతో మా నాన్న కరచాలనం చేస్తూ.

వాళ్ళిద్దరూ నవ్వుకున్నా రీ మాటకు. రాబోయే యెన్నిక సంద ర్భంలో సెనార్ ఫర్టాడో తమను మా నాన్నతో మాట్లాడి రమ్మని పంపి నట్లు చెప్పుకున్నారు.

సెనార్ ఫర్టాడో ఆబెల్ కు తండ్రి. ఆబెల్ కు మా మేరియా నిచ్చి వివాహం చేయాలని నిశ్చయమైంది. ఫర్టాడో ప్రభుత్వాధికారి. తక్కిన ప్రభుత్వాధికార్ల మాదిరే, ఆయనగూడా ప్రభుత్వం నియమించిన అభ్యర్థుల పక్షానే పని చేస్తానన్నాడు. అలా చేయడాని కాయన కిష్టం లేక పోయినా, ఆయన్ను హడలగొట్టి మరీ చేయించింది ప్రభుత్వం.

"ఓ ! అలాగా !" అన్నాడు మా నాన్న ఉల్సాహం అభినయిస్తూ. అంతకు కొద్ది రోజుల క్రితమే ఫర్టాడో నుంచి మా నాన్న కో ఉత్తరం వచ్చింది. వీళ్ళిద్దరూ మా నాన్నతో ఒక ముఖ్య విషయం మాట్లాడ్డానికి త్వరలో వస్తారని ఆ వుత్తరంలో తెలియబర్చాడు ఫర్టాడో. "అయితే, యిప్పుడు నన్నేం చేయమంటారు చెప్పండి ? నేను పేదరైతును. నా వల్ల మీరు ఆశించే సహాయం యేమీ ఉండబోదు. నాబోటి గాడేం చేయ గలడు చెప్పండి!" అన్నాడు మా నాన్న.

"మీరు పొరపాటు మాట్లాడుతున్నారు టాబ్ ! తల్చుకుంటే మీ రెంతైనా సహాయం చేయగలరు. మీ పలుకుబడి, మీ పేరు ప్రతిష్ఠలు బహుశా మీకు తెలియవేమో ! చుట్టుపట్ల గ్రామాల కూలీల్లో, రైతుల్లో మీ కున్న పలుకుబడి మాకు తెలియదనుకున్నారా ?" అన్నాడీ పెద్దల్లో ఒకాయన.

దుబ్బుగా పెరిగి ఉన్న కనుబొమ్మల క్రిందుగా వాళ్ళ వంక అనుమానంగా, కోపంగా తేరిపార చూశాడు మా నాన్న.

"నాకు వాళ్ళలో పలుకుబడి ఉందనుకుందాం ! దానివల్ల మీకు జరిగే ప్రయోజనం యేముంది ?

"ఎంతో ప్రయోజనం వుందండీ ! వాళ్ళందరిచేతా ప్రభుత్వ అభ్యర్థులకు ఓటు వేయించాలని మా కోర్కె" అన్నాడు గట్టిగా వాళ్ళలో పొడగరైన ఒకాయన.

"ఓట్లా !" అన్నాడు ఆశ్చర్యంతో మా నాన్న. ఆయన వింటున్న మాటలను ఆయనే నమ్మడం కష్టమయింది. వాళ్ళవంక అదో తీరుగా చూసి, మీ రనే మాటలు నా కర్థం కావడం లేదు! ఈ రైతులూ, కూలీలూ చదువురాని వాళ్ళని మీకు తెలియదూ? వాళ్ళకు చదవడం, వ్రాయడం యేమీ తెలియదుగదండీ! అలాంటి వాళ్లు యెలా ఓటు చేయగలరు? ఎన్నికల నిబంధనల ప్రకారం వీళ్ళకు ఓటు హక్కు లేదుగా!"

ఇద్దరూ మా నాన్నవంక ముందు యెగాదిగా చూసిన తర్వాత వాళ్లు ఒకర్నొకరు చూసుకున్నారు. వాళ్ళలో ఒకాయన భరవాసాగా "టాబ్, ఆ విషయం మాకు వదిలెయ్యండి! మేం చూసుకుంటాంగా. ఆ తలనొప్పిపని మీరు పెట్టుకోవద్దులెండి! వాళ్ళ పేర్లను మాత్రం మా కివ్వండి. అంతేచాలు. ఓటర్ల జాబితాలో యీ పేర్లన్నీ యెక్కేట్లు చూస్తాంగా! మీరు తర్వాత చేయవలసిందల్లా ఒక్కటే! ఎన్నికల రోజున యీ జనాన్నంతా పోలింగు బూతుల వద్దకు వెంటబెట్టుకొని వచ్చి, ప్రభుత్వ అభ్యర్థులకు ఓటు చేయించడం మాత్రమే. ఖర్చుల విషయం మీరేమీ బాధపడకండి!" అన్నాడు.

రిపబ్లిక్ పరిపాలన కింద గూడా యెన్నికల తంతు అవినీతిపద్ధతుల పైనే జరుగుతుండేది. అయితే యీ నియంతృత్వ పాలనక్రింద అవినీతీ. అక్రమాలు, దౌర్జన్యాలూ మ్రితిమించి రాగాన పడ్డాయి. ఎలాగైనా తమ అభ్యర్థులను గెలిపించుకో దలచి, మానాభిమానాలు వదిలి, అన్ని అకృత్యాలకూ పాల్పడ్డానికి నిశ్చయించుకుంది ప్రభుత్వం. మా నాన్న యీ విషయం గ్రహించి, ఉడికిపోతున్న కోపంలో యిద్దర్నీ ఉద్దేశించి అన్నాడు;

"ఏమన్నారూ ? ఈ అవినీతి చర్యలో నేనూ ఒక భాగస్వామి నౌతా ననుకున్నారా ? నా సంగతి అర్థం కాలేదా మీకు ? అవమానకర మైన తేలిక మాటలు నా ముందు రానివ్వబోకండి!" ఇద్దరూ మా నాన్న వంక కోరచూపులు చూసి, వాళ్ళలో వాళ్లు ఒక నిమిషం గుసగుసలాడు కున్నారు. వాళ్ళలో ఒకరు "సెనార్ ఫర్టాడో తన కొరకు మీరే పనైనా చేయడానికి మనస్ఫూర్తిగా యిష్టపడతారని అన్నాడు మాతో. అంతే కాదు ; మీరింకా.....................

వాక్యం పూర్తిగానివ్వకుండా, మానాన్న మధ్యనే తుంచివేశాడు. ఆయన కండ్లు నిప్పులు కక్కుతున్నాయి. అమాంతం వాళ్ళపైనబడి చంపేద్దామన్నంత కోపం వచ్చిందాయనకు. ఆయన ఆగ్రహంతో ఉడికిపోతున్నాడనడానికి బలమైన నిదర్శనం ఎర్రబాడిన ఆయనచెవులే. "ఆయనామాట అన్నాడా ?" గర్జించాడు మానాన్న. ఆయన కంఠధ్వనిలో వెక్కిరింత, అపహాస్యం దాగిఉన్నాయి, "మీ ఫర్టాడోవద్దకుపోయి నా మాటగా చెప్పండి ; ఆయనబోటి తొత్తులెవరైనా గోవాలో ఉంటే, వాళ్ళ నాశగ్రియించమనండి ! నావంటి వానితో యీ నీచసంభాషణలు యెన్నటికీ తలపెట్టవద్దని చెప్పండి. ఆయన వెంటవేసుకొస్తున్న అభ్యర్థులు పోర్చుగీసు హంతకుల తొత్తులనీ, కక్కినకూటి కాశబడే పరమనీచు లనీ, దేశద్రోహులనీ చెప్పండి ! అలాంటివాళ్ళకు నావంటివాడు సహా యపడకపోగా, శక్తిఉంటే, వాళ్ళ ప్రాణాలుగూడా తీసేవాడినని చెప్పండి ; స్వతంత్ర అభ్యర్థుల పక్షాన పని చేస్తున్నాననీ, యీ గ్రామం లోనూ, పక్క గ్రామాల్లో గూడా మెజారిటీ ఓట్లతో వాళ్ళను గెలిపించ డానికి నాసర్వశక్తులనూ ధారబోస్తున్నాననిగూడా చెప్పండి ; లంచాలకూ, మోసాలకూ, వంచనకూ పేరుపడ్డ యీనియంతృత్వ ప్రభుత్వం పెట్టే బెదిరింపులకునేను జంకననీ, నీతిమార్గాన న్యాయంగా మా అభ్యర్థులను

గెలిపించుకోడానికి కృతనిశ్చయులమై ఉన్నామనీ చెప్పండి! ఈవిషయా లన్నీ త్రికరణశుద్ధిగా ఖండితంగా చెప్పానని ఆయనతో అనండి. మీ పాపిష్టి మొహాలను మరోసారి నాముందు చూపిస్తే, పక్కటెముకలు పొడుంపొడుం అవుతయన్నాడనీ గూడా చెప్పండి మీ పర్టాడో దొర గారితో!" అన్నాడు గర్జిస్తూ మానాన్న.

నిజంగా మానాన్నకు అంత ఆగ్రహం వచ్చింది. కోపంతో పిచ్చెక్కిపోరాదేమో అనుకున్నాను. ఇహఅక్కడ నిమిషంఉండడం కూడా ప్రమాద కరమౌతుందని గ్రహించి, హాట్లూ, చేతికర్రలూ చం కని తగిలించుకుని చల్లగా కాలికిదిబుద్ధిచెప్పారిద్దరూ.

కారు కదలిపోవడం మా నాన్న చూసి తనలో, "చివరకు మన రాజకీయాల కెక్కడి దౌర్భాగ్యస్థితి పట్టింది! మనల్ని బంధించిన సం కెళ్ళనే మనం కౌగలించుకుంటే, మనకింక ఆశయెక్కడిది!" అనుకున్నాడు.

మూడునెలల తర్వాత యెన్నికలు జరిగాయి. వ్యయ ప్రయాసల కోర్చి యిన్నాళ్ళనుంచీ మా నాన్న యింటింటికీ, వాడ వాడకూ, పల్లె పల్లెకూ తిరిగి ప్రచారం చేస్తున్నాడు. నిద్రాహారాలు పట్టక స్వతంత్ర అభ్యర్థులకు సహాయపడమని ప్రజల్లో ప్రబోధం చేస్తున్నాడు. కాని యెన్నికలు దగ్గర పడ్డకొద్దీ, ప్రభుత్వం అవలంబిస్తున్నదమన నీతి విధానం, లంచగొండితనం, మోసకృత్యాల ముందు తానిన్నాళ్ళనుంచీ పడ్డ అష్ట కష్టాలూ వృథా అవుతాయేమో అని భయంవేసింది మా నాన్నకు. ఏ విధానైనా ప్రభుత్వ అభ్యర్థులు గెలుపొందడానికి అధికార్లు చేయాల్సిన మోసాలన్నీ చేస్తున్నారు. ఏ ప్రజలు మానాన్నతో సహకారిస్తామని వాగ్దానమిచ్చారో, ఆ ప్రజలే—మా గ్రామస్థులే—మా

నాన్న ముఖం తప్పించసాగారు. గ్రామమునసబు, ధనికరైతుల సహాయ సహకారాలలో ప్రభుత్వ అభ్యర్థుల గెలుపు ఖాయమేనని తేలిపోయింది.

అయినా మానాన్న పట్టు విడువలేదు. ఆశ వదల్లేదు. చివర నిమిషంవరకూ తన ప్రబోధంద్వారా ప్రజల్ని తనవైపు తిప్పుకోడానికి తీవ్ర కృషి చేస్తునేఉన్నాడు. కొత్తదిల్లివల్ల కనీస పౌరహక్కులు యెలా భంజింపబడ్డాయో, ప్రజలు యెన్ని అవమానాల పాలౌతున్నారో, ప్రజల్ని ప్రభుత్వం యెలాచీల్చి పరిపాలిస్తున్నదో మానాన్న చిలకకు చెప్పినట్లు వివరంగా చెప్పాడు. ప్రజల్లో దేశభక్తీ, ఉత్సాహోద్రేకాలూ పురిగొల్పడానికి చేయవలసిందల్లా చేశాడు.

"నీవు చెప్పిందంతా నేనంగీకరిస్తా టాబ్! అయితే నన్నేం చేయమంటావు చెప్పు! నా పెన్షన్ కాస్తా ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుందేమో! అప్పుడు నా గతేమైపోతుందో నీవే ఆలోచించు!" అన్నాడు అనిసిటో.

మానాన్న యెవర్ని కలుసుకుని మాట్లాడినా, యిలాంటి ప్రశ్నలే వేసి తప్పించుకో చూచారు ప్రజలు.

"నేను తప్పకుండా స్వతంత్రులకే ఓటు చేద్దామనుకుంటున్నాను టాబ్! కాని ఏమి జరిగిందో తెలుసా? ప్రభుత్వ అభ్యర్థులకు ఓటు చేయకపోతే, మా కుర్రాణ్ణి పరీక్షల్లో తప్పిస్తానని మునసబు బెదరించాడయ్యా! ఏం చావమంటావు చెప్పు!" అన్నాడు ఆల్మేడా.

ప్రైమరీస్కూలు పోలింగుబూత్‌గా యేర్పాటు చేయబడింది. ఉదయం పదిగంటలకల్లా బూత్ పరిసరాల్లో సందడి యెక్కువైంది. అక్కడికి చేరిన ప్రతివాళ్ళూ ప్రభుత్వ అభ్యర్థులకే ఓటుచేయడానికి నిశ్చయించుకున్నట్లు కనిపించింది. ఈ వాతావరణంచూసి, మానాన్న,

యిద్దరు స్వతంత్ర అభ్యర్థులూ నిరాశ చెందారు. భూస్వాములూ, యిత రులూ తమ ఓట్లను ప్రభుత్వ అభ్యర్థులకు వేయడం మానాన్న నిస్స హాయ స్థితితో చూచి విచారించాడు. మా ప్రజల లొంగుబాటు తత్వాన్ని చూసి సహించలేక మానాన్న తలవంచుకుని అక్కణ్ణించి తప్పు కున్నాడు.

గ్రామమునసబు ధనిక భూస్వాములూ కోరుకున్నంతా జరిగింది. పక్కయింట్లో దాచిపెట్టబడ్డ రైతుల్ని, కూలీలను కబురుచేసి పిలి పించాడు మునసబు. వాళ్ళందరిచేతా ప్రభుత్వ అభ్యర్థులకు ఓటు చేయించాడు. మునసబుతోపాటు ధనికరైతులుగూడా తోడైనారు.

స్వతంత్ర అభ్యర్థుల పక్షాన పోలింగు యెజెంట్లుగా పనిచేసే వ్యక్తులు పరాయి గ్రామంవాళ్ళు. ఓట్లువేసే వాళ్ళంతా నిబంధనల ప్రకా రం నిజమైన ఓటర్లోకాదో కనిపెట్టడం వాళ్ళకసంభవ మైనది. ఎన్నికల గుమాస్తా ఓటర్లను పేరుపెట్టి పిలవగానే ఒకరొకరే వచ్చి ఆయన ముందు నిలబడేవాళ్ళు. "అవునండీసార్" అని చిలుకపలుకులు వల్లించే వాళ్ళు. ఈ చిలుకపలుకులు యెన్నాళ్ళనుండో మునసబూ, ధనికరైతులూ నేర్పి యెన్నికలకు సిద్ధంచేశారు. ఈ పలుకు పలకడం తోటే, రహస్య ప్రదేశానికి పోయి పెట్టెలో ఓటు కాగితం వేసిరమ్మని పంపేవాడు గుమాస్తా.

"జోస్ ఫ్రాన్సిస్కో ఫర్నాండెస్!" అని పేరుపెట్టి పిలవగానే, ఆమనిషి రొమ్ములిరుచుకుని టేబుల్‌వద్దకు నడిచి వచ్చేవాడు. గుమాస్తా బ్యాలెట్‌ముక్క యిచ్చేవాడతనికి.

"నీపేరు జోస్ ఫ్రాన్సిస్కో ఫర్నాండేసేనా?" అడిగాడు యెన్నికోద్యోగి పోర్చుగీసు భాషలో.

"అవునండీసార్ !" జవాబిచ్చాడు ముసలాయన.

"చదవడం వ్రాయడం తెలుసా నీకు ?"

"అవునండీసార్ !"

"మంచిది ! అయితే యిదిగో బ్యాలెట్ కాగితం !"

ఓట్లెయ్య వచ్చిన వాళ్ళందరికీ యివే ప్రశ్నలు. ఇవే జవాబులు. ఈ విధంగా అనేకమంది రైతులు దొంగవోట్లు వేయడం సాగించారు. "అవునండీసార్" అని వల్లిస్తే చాలు! అన్నిపాపాలు ఒక్కదెబ్బతో తుడుచుకుపోతాయి. ఓట్లువేసినవాళ్ళంతా మరోగుమ్మం గుండా ఒక పెద్దహాల్లో కూలబడ్డారు. తిన్నన్ని ఫలహారాలు, తాగినంత సారాయి సిద్ధంచేసి పెట్టారక్కడ.

ఈ మోసం నిరాఘాటంగా సాగిపోతుంది చాల సేపటివరకూ. ఇంతలో 'రోకికటానో' అనే వడ్రంగి బ్యాలెట్ కాగితంకోసం లోపలికి వచ్చాడు. ఆతని ముఖవైఖరి అనుమానంగాఉంది. గాభరా పడుతున్నాడు. ఇతనివిషయమై పేచీవచ్చింది.

"అవునండిసార్" అనే ముక్క వల్లించడానికి 'రోకికటానో' వెనకాముందాడి కంగారు పడుతున్నాడు. ఆపాదమస్తకం వణికి పోతున్నాడు. స్వతంత్ర అభ్యర్థుల ప్రతినిధి మాక్జిమియానో కాస్టా గట్టిగా అనుమానించాడతన్ని. తన అనుమానం అధికారికి గట్టిగా వెల్లడి చేశాడు. కటానో అధికారి అడిగిన ప్రశ్నలకు గురికావలసి వచ్చింది.

"మీయిల్లెక్కడ ?" అడిగాడు అధికారి.

"అవునండీసార్ !"

"నీ వయస్సెంత ?"

"అవునండీసార్ !"

అధికారి మండిపడి, "నీకు బుద్ధిలేదా, లేకపోతే, నాకే బుద్ధిలేదని అనిపించ దలుచుకున్నావా ?" అన్నాడు.

ఈ ప్రశ్నకూ్కడా "అపునందీసాబ్" అనేసమాధానమే వచ్చింది. వెంటనే మాక్జిమియానో కాస్టాతో పాటుగా స్వతంత్ర అభ్యర్థుల్ని బలపర్చే యితరులూ అధికార్ని చుట్టువేసి, యెన్నికలను తక్షణం ఆపు చేయమని కోరారు, మొదట్నుంచీ యిలా దొంగవోట్లు వేసినవాళ్ళెంత మందో ఉన్నారని దబాయించి చెప్పారు. వాగ్వివాదంతో వాతావరణ మంతా అల్లరైంది.

మరో నిముషం, రెండు నిముషాల్లో కొట్లాట ప్రారంభ మయ్యేట్లుంది. మానాన్నకు కబురువెళ్ళింది. అప్పటికి స్వతంత్ర అభ్యర్థుల పక్షాన రంగంలో నిలబడి పోట్లాడేవాళ్ళ సంఖ్య పన్నెండు వరకూ పెరిగింది. అధికారికి అధిక్షేపణ పత్రం అందించారు. ఎన్నికల అధికారి ప్రభుత్వోద్యోగి కావడంవల్లా, ప్రభుత్వ అభ్యర్థులను బలపర్చే వ్యక్తి కావడంవల్లా, అధిక్షేపణ పత్రాన్ని అలక్ష్యంచేసి త్రోసిపుచ్చాడు. ఎన్నికను కొనసాగించడానికే నిశ్చయించుకున్నాడు. ఇంతలో మాక్జిమి యానో కాస్టా బ్యాలెట్ పెట్టెవద్దకు పోయి, తన చేతులతో పెట్టెచిల్లని మూసివేశాడు. ఇదిచూసి ప్రభుత్వం అభ్యర్థుల పక్షాన పనిచేసేవారంతా, యిన్నాళ్ళనుంచీ చచ్చిచెడీ తాము చేసిన కృషి వృథా అవుతుందని భయపడి, ఒక్కుమ్మడిగా కాస్టా మీదపడి ఆయన్ను యీడ్చి లాగి పారేశారు. దానితో కొట్లాట ఆరంభమైంది. సోడా బుడ్లూ, బడితెలూ విచ్చలవిడిగా ఉపయోగించారు రెండు పక్షాలవాళ్లు.

స్వతంత్ర అభ్యర్థుల పక్షంవాళ్ళు బహు కొద్దిమందే అవడంవల్ల కొట్లాటలో వాళ్ళే తీవ్రంగా గాయపడ్డారు. అందరి గుడ్డలూ బదా బదలై పోయాయి. వాళ్ళల్లో చాలామందికి తీవ్రమైన గాయాలు తగిలాయి.

కొద్దిమందే వున్నా నష్టం చాలా కలిగించారు. బ్యాలెట్ పెట్టె ముక్కలు ముక్కలైపోయింది. అధికారి కళ్ళజోడు పొడుంపొడుమైంది. చివరకు ఆయన టేబిల్‌కింద దూరి వళ్ళు కాపాడుకో వలసి వచ్చింది.

ఎన్నికల పేరుతో జరిగిన మాయనాటకం పూర్తయింది.

ఒక వారంతర్వాత యెన్నికల ఫలితాలు వెల్లడైనాయి. మాప్రజ లంతా ప్రభుత్వ అభ్యర్థుల్నే యేకగ్రీవంగా యెన్నుకున్నారని ప్రభుత్వం ప్రకటించుకుంది. ఒక్కవ్యక్తిగూడా స్వతంత్ర అభ్యర్థులకు ఓటు చేయలేదు!

జయ్ పోర్చుగల్! జయ్ సాలజార్!

*　　*　　*　　*

గత మూడుమాసాలనుంచీ మానాన్న యెన్నికల కార్యక్రమంతో సతమతమౌతున్నాడని మాఅమ్మ తెలుసుకుంది. కాని ఆమె పల్లెత్తు మాటైనా మానాన్నతో మాట్లాళ్ళేదు. అయితే గ్రామంలోని ధనిక భూస్వాములకూ, అధికసంఖ్యాకులైన ప్రజలకూ దూరమై ప్రత్యర్థుల శిబిరంలో మానాన్న కలిశాడని మాఅమ్మకు తెలియగానే ఆమె చాలా వ్యధపడ్డది. ఆంటోనియో యిల్లువదిలి వెళ్ళినప్పట్నుంచీ మాఅమ్మ గడప దాటి యెరగదు. మాయింట్లోవాళ్ళతో గూడా ఒకటిరెండు మాటలకు మించి మాట్లాడి యెరగదు. ఆమె ఆలోచనలేమో, ఆమె నిట్టూర్పులేమో, ఆమె వెక్కివెక్కి యేడ్పులేమో! అంతే! స్వతంత్ర అభ్యర్థుల పక్షాన పనిచేయడం ఫలితంగా కలిగిన విపరీత పరిణామాలు మా అమ్మ చెవిన పడ్డప్పట్నుంచీ మాఅమ్మలో క్షమాశక్తిగూడా మృగ్యమైంది. కొన్నిరోజులవరకూ మానాన్నముఖమే చూడదలచుకోలేదు మా అమ్మ.

ఎన్నికలైన ఒక నెలలోగానే, ఆవిషపరిణామాలు మాగ్గూడా తెలిసివచ్చాయి.

రెండు మాసాలక్రితమే కస్టమ్స్ ఆఫీసులో ఆబెల్‌కు నౌకరీ అయింది. ఆబెల్, మేరియాల వివాహంగూడా నిశ్చయమైంది, వచ్చే ఏప్రిల్‌లో ముహూర్తం ఖాయమైందిగూడా. ఒకనాడు ఆబెల్ మాయింటికి వచ్చాడు. ఆతని ముఖం యెంతో అలిసి పోయినట్లుంది. నిరాశా, నిస్పృహలు అతని ముఖాన తాండవిస్తున్నాయి. ఇదివరలో వచ్చి నప్పుడల్లా సైకిల్‌మీదినుండి దిగగానే దానిని భద్రంగా గోడకానించి వచ్చే ఆబెల్, యీనాడు విసుగుతో దాన్ని ప్రహరీ గోడమీదికి అలక్ష్యంగా పడనెట్టి, మెట్లెక్కి రావడం చూశాను.

మేరియా అతన్ని మొట్టమొదట చూసింది. అతనివద్దకు అమాం తంగా పరుగుతీసింది. దిగులు మొహంతో తలవనితలంపుగా రావడం చేత, అతనితండ్రి జబ్బుయెలావుందో అని ఆందోళనపడ్డది మేరియా. అందుకేతన ప్రియుడికి ప్రసన్నురాలుగా కనిపించడానికైనా అద్దంలో నైనా ముఖాన్ని చూసుకోకుండా ఉన్నదున్నట్టుగా పరుగెత్తుకొచ్చి రెండుచేతులూ పట్టుకుంది. "ఏమిటి ఆబెల్! మీరిప్పుడెందుకొచ్చారు? వేళగానివేళ రావడం ఆశ్చర్యంగా ఉంది నాకు! మీనాన్న పరిస్థితి విష మించలేదుగద!" అన్నది మేరియా.

కొద్దిక్షణాలు ఆబెల్ మౌనం వహించాడు. రెప్పపాటు కాలం పస్తాయించి" లేదుమేరియా లేదు! ఆయన ఆరోగ్యంగానే ఉన్నాడు. ఉండబట్టే మనకీ విషాద పరిస్థితేర్పడ్డది."

"మనకు" అంటే మీ ఉద్దేశ్యం యేమిటి ఆబెల్? అయనేం చేశాడు?"

ఆబెల్ ముఖం తుడుచుకుని, అలిసిపోయినట్లుగా కాళ్లు బారజాపి వరండాలో బల్లపైన పడుకున్నాడు. మేరియాను తనసరసనే కూర్చుండ బెట్టుకున్నాడు. తాను చెప్పదలచుకున్న విషయాన్ని వినగలిగే ధైర్య

స్థయిర్యాలూ, మనో నిబ్బరం దానికున్నవో లేవో కనిపెట్టడానికా అన్నట్లు, మేరియా ముఖంవంక తేరిపార చూశాడు. అది గుండె నిబ్బరం గలపిల్లే అని తెలుసుకుని గద్గదకంఠంతో మాట పెగిలిరాక బాధపడుతున్నాడు. మేరియాకన్న అతనికే ముందుగా గుండెధైర్యం చెడ్డట్లు గ్రహించాను.

"ఏమిటది ఆబెల్ ?" అతను చెప్పదలచిన విషయాన్ని తానే అతనికి అందిస్తూ, "ఇంతకూ మీరు నన్నిక ప్రేమించలేననేగా మీరు చెప్పవచ్చింది ?" అన్నది మేరియా.

ఈ ఆరోపణ బుద్ధిపూర్వకంగా గాక, పరిహాసానికి వెలిబుచ్చినా, ఆబెల్ హృదయంలో పిడుగుపడ్డట్లు చేసింది. అతను చెప్పదలచుకున్న విషయం ముందుగా మేరియా నోటనుండే వచ్చినందుకు అతను దిగ్భ్రాంతి చెందాడు. ఆక్షణంనుంచి ఆబెల్ గబగబా మాట్లాడ్డం మొదలెట్టాడు.

"ఏందుకంటావు మేరియా అలాంటి మాటలు ? నేను నిన్ను ప్రేమించక పోవడమా ? అదెన్నటికైనా సంభవమేనా ?"

"మరేమిటి మీరు చెప్పదలచుకున్నది ?"

ఆబెల్ తటపటాయించాడు. ఈ విషాదవార్తను మేరియా చెవుల వేయడం యెలాగా అని లోలోన తర్జనభర్జన లాడుకున్నాడు. బిగబట్టుకున్న అతనిముఖం, గంభీరమైన అతని ఆకృతీ, అతని హృదయంలో ఒక మహావిప్లవం చెలరేగుతున్నట్లు తెలియ జేస్తున్నాయి. ఇంకెంత మాత్రం ఆలస్యం చేయగూడదన్నట్లుగా తల విదిలించి ఆబెల్ . మేరియాతో ప్రశాంతంగా, "నిన్ను వివాహమాడడం మానాన్న కిష్టంలేదు మేరియా" ! అన్నాడు

మేరియా గాభరా పడ్డది. ఆశ్చర్యంతో, "ఎందువల్ల? నేను మీనాన్నకే అపకారం చేశానని నన్ను వివాహ మాడవద్దంటున్నాడు?"

"అదికాదు మేరియా! నీవు కాదు ఆయనకు చేసిన అపకారం! మీనాన్న ఆయనకు చేసిన అపకారం, యింకా యితర పరిస్థితులూ కలిసి యింతపని చేశాయి."

"ఏమిటీ?"

ఆబెల్ కనురెప్పలు ముకుళిస్తూ, పెదిమలు బిగబట్టి శూన్యంలోకి కాసేపు చూశాడు. మేరియాకు ఉపశమనం కల్గించే ప్రయత్నం చేయలేదు. తమ వివాహానికి తనతండ్రి యెలా ప్రతికూలుడైనాడో వివరించాడు ఆబెల్.

"ఆంటూ, లక్ష్మిల సంగతి వినగానే మా నాన్న కెక్కడిలేని కోపం వచ్చింది నా మీద," అని ప్రారంభించాడు. ఆబెల్ పిడికిలి బిగించి, "ఎలాగో ఆ విషయం ఆయనకు నచ్చచెప్పి శాంతి పరచాను. కాని యీ విషయం.........మీ నాన్న వాళ్ళ పక్షం వహించడం........ వాళ్ళ తరపున ప్రచారం........! ఈ సంఘటన మా నాన్న మనస్సును పూర్తిగా మార్చేసింది. మీ కుటుంబం పేరు వింటేనే, ఆయన సహించలేకపోతున్నాడు, అంత కోపం వచ్చిందాయనకు!"

"అయితే మన సంబంధం యింతటితో రద్దు చేసుకోమనేగా ఆయన కోరేది? అందుకేనా నిన్ను పంపించిందాయన?" అన్నది మేరియా ఆందోళన పడుతూ.

"దయచేసి కోపం తెచ్చుకోకు మేరియా! నిజమే! మా నాన్న అందుకే నన్నిక్కడికి పంపాడు. నిన్ను పెళ్లాడితే, నా ఉద్యోగం ఊడ పీకించుతా ననీ. తన ఆస్తికి నా వారసత్వాన్ని రద్దు చేస్తాననీ భయ

పెట్టాడు మేరియా! అయితే యీ విషయంలో మా నాన్న అభిప్రాయంతో నేనేకీభవించను. నీకీ సంగతి యిదివరకే తెలుసు. నేను నిన్నెంతో ప్రేమిస్తున్నాను. మన వివాహాన్ని రద్దు చేసుకోడానికి నాకే మాత్రం యిష్టం లేదు. అయితే యీ తుపాను పోయేదాకా నీవు కొంచెం ఓపిక పట్టి ఉండాలి!" అన్నాడు ఆబెల్ బ్రతిమిలాడుతూ.

ఆబెల్ చెప్పిన కథలూ మేరియా శ్రద్ధగా ఆలకించింది. ఒక్క మాటైనా మాటాడ్లేదు. తన ముఖం వెనక్కు తిప్పుకుంది. మతీ, మాటా పోయిన మనిషిలా శూన్యంలోకి చూస్తున్నది. దాని మౌనం భరించలేక ఆబెల్ దాన్నెలాగైనా మాట్లాడించ దలచాడు. "ఏం మేరియా! ఏమీ మాట్లాడవేం? నేనుమాత్రం నీకన్న తక్కువ బాధపడుతున్నా ననుకున్నావా?" అన్నాడు.

కండ్లవెంట జల జలా కారబోతున్న నీళ్లను వెనక్కు మరల్చ ప్రయత్నించింది. రెప్పలు ఒక్కసారిగా మూసుకుని మళ్ల తెరిచింది. ఎంత సేపటికీ నోటివెంట మాట పెగిలిరాక చివరకు "వద్దు! ఆబెల్ వద్దు! దయచేసి వద్దు. హృదయపూర్వకంగా నిన్నెంతగానో నేనూ ప్రేమిస్తున్నాను. ఆ సంగతి నీకు తెలుసు. అయినా యీ పరిస్థితుల్లో నిన్ను పెళ్ళాడ దల్చుకోలేదు నేను. జరిగిన విషయమంతా నీవు వివరించిన తర్వాత, నిన్ను పెళ్లాడగూడదని నిశ్చయించుకున్నాను. నన్ను నీవు పెళ్లాడవద్దని మీ నాన్న కోరితే, ఆయన కోరిక ప్రకారమే జరగనీ! మా కుటుంబంతో వియ్యమందడం, మీకు తల వంపులనీ, అవమానకరమనీ మీ నాన్న భావిస్తే, యేమో, ఆయన అభిప్రాయమే సరైనదేమో!" అన్నది మేరియా.

"కాని నేను నిన్ను మనసారా ప్రేమించి వివాహమాడ దలచానని నీకు తెలిసిగూడా అలా మాట్లాడుతావేం మేరియా? మా నాన్న

మాటలే మనస్సులో పెట్టుకుని యెందుకిలా బాధపడతావు? ఆ మాటల్నే తిరిగితిరిగి రెట్టిస్తావెందుకు?"

మేరియా కళ్లు పైకెత్తి చూసింది. కళ్లవెంట జలజల నీళ్లు దార గా కారుతున్నాయి. ఆబెల్‌తో ప్రశాంతంగా. "మీ నాన్న అన్న ముక్క ముఖ్యమైనది ఆబెల్! ఇష్టంలేని పెళ్లిళ్లు చేసుకుంటే తలిదండ్రులకూ, కుటుంబానికీ జీవితాంతంవరకూ కలిగే విచారం, అశాంతి ప్రపంచంలో చూస్తూనే ఉన్నాం. ఇది లోకానుభవం. ఇలాంటి భగ్న జీవితాలనెన్నో చూశాన్నేను. అంటూ వివాహాన్ని గురించి మా అమ్మ యీనాటివరకూ పడుతున్న ఆవేదన నేను జన్మలో మరవలేను. నా మూలంగా మీ తలిదండ్రులకు బాధ కలగ్గూడదనినా కోరిక."

"అయితే మన యిద్దరి ప్రేమ మాటేమిటి?"

"మనం యింకా చిన్నవాళ్లం. మనకింకా కష్టాల్ని భరించే శక్తి ఉన్నది. అంతే కాకుండా, మీరు నన్ను త్వరలో మరచిపోగలరు!"

ఆబెల్ మేరియావంక అప్పుడే కొత్తగా పరిచయం చేసుకున్న మనిషిని చూసినట్లు చూశాడు. "మేరియా, దయచేసినన్నర్థం చేసుకో డానికి ప్రయత్నించవూ? ఇన్నాళ్లు ఓపికపట్టి ఉన్నావు. ఇంకో సంవత్సరంలో నాకు మరి కొత్త ఉద్యోగం వచ్చితీరుతుంది. అంత వరకూ వేచి ఉండకూడదూ? ఆ ఉద్యోగం వచ్చిన మర్నాడు మానాన్న అభిప్రాయానికి ఒక్క కాసైనా విలువయివ్వను. నిర్భయంగా ఒక్క గంతేసి నిన్ను పెళ్ళాడుతాను మేరీ!"

"అలాకాదు ఆబెల్! నేను ఒకే నిర్ణయం చేసుకున్నాను. ఈ పరిస్థితుల్లో నిన్ను పెండ్లాడలేను. మమ్మల్ని గురించీ, మా కుటుంబాన్ని గురించీ మీ వాళ్ళు వెలిబుచ్చిన అభిప్రాయం నీ వల్ల విన్నతర్వాత,

నా నిర్ణయానికి తిరుగంటూ ఉండదు" అని ప్రశాంతచిత్తంతో అన్నది మేరియా. ఆ వేశం, ఉద్రేకం యెక్కడా కనిపించలేదు. భౌతిక ప్రపంచానికి అతీతురాలైన విరాగినిలా ఉన్నాయామాటలు. సంభాషణ అంతటితో చాలించిందా అన్నట్లు మేరియా వెంటనేలేచి నిలబడ్డది.

"ఇవేకడసారిమాటలా ? ఇంతటితో యిద్దరం విడిపోవడమేనా ? అడిగాడు ఆబెల్. మేరియా మాటలు విని నిర్విణ్ణుడైనాడు. అతని కళ్ళల్లో భరించరాని ఆవేదన కన్పడ్డది.

"అవును ఆబెల్ ! ఇదేమన వీడ్కోలు—నేను నీ కెప్పుడూ స్నేహితురాలినే. నీక్షేమంకోరుతా నేనెప్పుడూ దేవుణ్ణి ప్రార్థిస్తుంటాను." అన్నది మనస్థైర్యంతో. మేరియా తన చేతిని ఆబెల్‌కు అందించింది.

ఆబెల్‌కు అట్టేయిష్టం లేకపోయినా, మేరియాతో కరస్పర్శ చేయ దలచాడు. విచారగ్రస్తమైన ముఖంతో నిటారిగా నిలబడి, నెమ్మదిగా సాగిపోయాడు. మేరీ హృదయంనుంచి గూడా అదృశ్యమైనాడు.

———

# ౯

ఎన్నికల ఫలితం ప్రతికూలంగా పరిణమించింది. పర్యవసానంగా మా యింట్లో విషాదచ్ఛాయలు పొడసూపాయి. మా అమ్మ ఒక్కతేగాకుండా, మేరియాగూడా తన వివాహ విచ్ఛిన్నానికి మా నాన్నబాధ్యుడని ఆయన్ను నిందించడం మొదలెట్టారు. అయితే మానాన్నగుండె నిబ్బరం సడల్లేదు. ఆయన కర్మవాది; యదార్థవాదిగూడా. మళ్ళీ యెప్పట్లే పొలాలకు పోతున్నాడు; వస్తూన్నాడు. చెమటోడ్చి పనిచేస్తున్నాడు. కొత్తచట్టాలు యేవిధంగా ప్రజల్ని చీలించి పాలిస్తున్నాయో తెల్లవాళ్ళకన్నా, ముఖ్యంగా నల్లవాళ్ళకే యీ చట్టం యెలాప్రమాదకరంగా పరిణమిస్తున్నదో, మా నాన్న రైతులకూ, కూలీలకూ ప్రశాంతంగా, ఓపికతో ప్రబోధం కల్గిస్తున్నాడు. రైతు, కూలీల్లో నవచైతన్యం కల్గుతున్నది. సామ్రాజ్య వాదులయెడల ప్రజల్లోద్వేషం, క్రౌర్యం నూరిపోస్తున్నాడు. మా ప్రజలజీవిత పరిమాణాన్ని పెంచలేకపోగా, మాపైన అవమానాలు దూషణపరంపరలు ప్రభుత్వం యెలాకురిపిస్తున్నదో మా నాన్న ఓపికతో ప్రబోధిస్తున్నాడు. జాతీయ స్వతంత్రభావాలను, నాటడం ప్రారంభించాడు. గ్రామరైతాంగమంతా మా నాన్నను ఆప్యాయంగా ప్రేమించారు. ఆనాడు కూలీ తగ్గింపు సమస్యపైన మా నాన్న అవలంబించిన వైఖరికి, ఆయన్నువాళ్ళెంతో గౌరవించారు. ఆయన్ను తమ ఆప్తమిత్రునిగా పరిగణించారు. అవసరమైనప్పుడల్లా, తన శక్తికొద్ది పేదరైతులకు ధనసహాయంగూడా చేసేవాడు. మా అమ్మనగలను తాకట్టుపెట్టయినా, డబ్బుతెచ్చి, కొందరు పేదరైతులకు అండగా నిలవడానికి మా నాన్న వెనుదీయలేదు.

"నీవు చెప్పేదంతా అర్థంచేసుకున్నాం. నీమాటలను మేంనమ్మాం గూడా. అయితే మమ్మల్ని యేంజేయమంటావు? పెద్దపెద్ద మోతుబరి రైతులూ, చదువుకున్నవాళ్ళూ యేమీ చేయలేకపోతూంటే, బక్క రైతులం మేమేంచేస్తాం! మేమేంచేయగలంగూడా చెప్పు!" అడిగారు రైతులు మా నాన్నను.

"మనం ఏపనైనా చేయగలం. అయితే మనకు ఓర్పేకావాలి" అంటూ క్రమంగా ఒక్కొక్కర్నే మానాన్న తనవైపు తిప్పుకుంటు న్నాడు. రైతు కూలీలంతా ఆయన ఉపన్యాసాలు వినడానికీ, కొత్త సంగతులు తెలుసుకోడానికీ ఆతురత చూపడం మొదలెట్టారు,

"మీరేంపని చేయమంటే ఆపనిచేయడానికి సిద్ధంగా ఉన్నాం. అయితే మీరు చేయమనే పనేమిటి యింతకూ? మనహక్కులనూ మన గౌరవాన్నీ యెలా కాపాడుకోగలం?" అడిగారు రైతులు.

మా నాన్నకు యేమి చేయడానికీ పాలుపోవడంలేదు. ఏవిధానం, అవలంబిస్తే, రైతుకూలీ హక్కులు కాపాడబడగలవో ఆయనా నిర్ణ యించలేక పోతున్నాడు. అంతకంతకూ ఆయన ఉపన్యాసాలు వినే వాళ్ళు విపరీతంగా పెరిగిపోతున్నారు. కార్యక్రమంకొరకు ఉవ్విళ్ళూరు తున్నారు. ప్రజల ఉత్సాహానికీ, శక్తికి తగినట్లుగా కార్యక్రమం రూపొందించి, ఆచరణలో పెట్టకపోతే, ఉత్సాహం నీళ్లుకారిపోతుందనీ తిరిగీ మళ్ళ వాళ్ళను కార్యోన్ముఖులను చెయ్యడం కష్టమనీ మా నాన్న గ్రహించాడు.

అయితే యెలాంటి కార్యక్రమం, రైతుకూలీల ముందుంచాలి. మానాన్న యెక్కువగా సత్యాగ్రహోద్యమాన్ని గురించీ, అహింసా యుత సహాయ నిరాకరణోద్యమాన్ని గురించీ, బహిష్కరణోద్యమాన్ని

గురించీ విన్నాడు. భారతీయులు యీ ఉద్యమాలద్వారా బ్రిటిష్ ప్రభు త్వాన్ని లొంగదీయ గలిగారనీ గూడా తెలుసుకున్నారు. అయితే యీ కార్యక్రమాలతో పోర్చుగీసు నియంతృత్వాన్ని అంతం చేయగలమా అన్నదే మా నాన్న అనుమానం!

ఒకరోజున యీ ఉద్యమాల్నిగురించి మానాన్న రైతు కూలీలతో వివరించి చెప్పాడు. వాళ్ళకు నవ్వొచ్చింది. ఈ చచ్చు కార్యక్రమాల్లో వాళ్ళకు విశ్వాసం లేదన్నారు. నిజమైన కార్యక్రమం, నిజమైన పోరాటం కావాలని కోరారు. అలాంటిపథకం యేదైనా తనముందుంటే, వాళ్ళ ప్రాణాలైనా బలియిచ్చి, చివరనెత్తురుబొట్టు ఉన్నవరకూ పోరాడి తీరుతామని రైతు కూలీలు మానాన్నకు హామీ యిచ్చారు.

"బాబూ! నిర్జీవమైన యీచచ్చు సత్యాగ్రహాలతో మాకు పనిలేదు! మా కసలు వాటిల్లో నమ్మకమేలేదు." అంటూ వ్యాఖ్యానించాడు తోళ్ళ కార్మికుడు పైడేడి. ఇతని బాపమరదిని కొద్దిరోజుల క్రితమే పోలీసు అధికార్లు మార్గో లాక్కొనిపోయి ఒళ్ళు వాయగొట్టారు. ఆ నాటినుండి పైడేడీ పోలీసువాళ్ళమీదా, పోర్చుగీసు అధికార్లమీదా కసిదీర్చుకోడానికి కనిపెట్టు కున్నాడు. తెల్లవాడు కంట కనిపిస్తేచాలు, నమిలిమింగేటంత కడుపుమంట అతనికి. "ఏదో కార్యక్రమం మాకివ్వండి బాబూ! కాని చచ్చు సత్యాగ్రహం మట్టుకు వద్దు బాబూ వద్దు! మీకు వెయ్యినమస్కా రాలు. ఈ పోర్చుగీసు లంజకొడుకులకు కత్తులతోనూ, తుపాకులతోనే సమాధానం చెప్పాలి బాబూ"! అన్నాడు పైడేడీ.

గోడలకు సున్నాలుకొట్టే చాకలి పాస్కోల్ మండిపడుతూ మా నాన్నతో, "ఈ గాడిద కొడుకుల నెత్తురు కళ్ళచూస్తే తప్ప పరుగు తీయరుబాబూ! ఇద్దర్ని కాల్చిపారేశామా, అప్పుడు చూద్దురు గాని వాళ్ళ పొగరు యెలా అణిగేదీ!" అన్నాడు.

మహాత్మాగాంధి పట్ల మానాన్నకు భక్తివిశ్వాసాలున్నా అహింసా ఉద్యమాల్లో ఆయనకు నమ్మకంలేదు. తక్కిన ఐరోపా రాజ్యాలకన్నా, పోర్చుగీసు ప్రభుత్వం యెంతో వెనకబడ్డది. పోర్చుగీసు ప్రభుత్వం యీ అహింసాఉద్యమాలకు బెదిరి చూస్తూ చూస్తూ మాకు స్వాతంత్ర్య ప్రదానం చేసిపోదని మానాన్న అభిప్రాయం. ఈ చప్పుఉద్యమాలవల్ల పోర్చుగీసు మూర్ఖుల్లో మానసికంగా మార్పురాదని ఆయన గట్టినమ్మకం. ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కొల్లగొట్టి వాటిమీదబతుకుతున్న నియంతృత్వం అంతకంతకూ నిరంకుశ రూపందాల్చింది. రైతులూ, కూలీల మాదిరే, మానాన్న గూడా నియంతృత్వాన్ని నిర్మూలించాలంటే, పోర్చుగీసు అధికార్లను అదరగొట్టి తీయగలిగినన్ని ప్రాణాలు తీయడం ఒక్కటే మార్గమని నమ్మాడు. అప్పుడుగాని తెల్లవాళ్లు బతుకు జీవుడా అని ప్రాణాలతో బయటపడి, పోర్చుగల్ పారిపోరనీ మానాన్న అభిప్రాయంగూడా.

అయితే యీ బీదకూలీలూ, రైతులూ, మానాన్న. హింసాయుత కార్యక్రమాన్ని యెలానడపగలరు ? గెరిల్లాపోరాటం నడపడానికి ఆయుధాలూ, మందు గుండుసామానూ యెక్కడ సంపాదించగలరు ?

మెనిజీస్ బ్రాగాంకా పేరు మా నాన్నకప్పుడు తట్టింది.

ఈ కార్యక్రమానికి సహాయ, సహకారాలందించగల వ్యక్తి ఒక్క బ్రాగాంకా అనుకున్నాడు మా నాన్న. తన తిరుగుబాటుప్లానుతో, బ్రాగాంకాను కలుసుకుని చర్చించాలని నిశ్చయించుకున్నాడు.

పోర్చుగీసు అధికార్లు, బ్రాగాంకాను జాతీయ, అభ్యుదయ సిద్ధాంతాలను బహిరంగంగా ప్రచారం చేయనివ్వకుండా తీవ్రమైన అవరోధాలు కల్గిస్తున్నారు. ఆయన వ్యాసాల్ని ప్రచురిస్తున్న పత్రికల్ని

ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటున్నది. పత్రికాధిపతుల్నీ, సంపాదకుల్నీ, ముద్రణాలయాధికార్లనూ నానా అగచాట్లు పెడుతూంది. ఈపరిస్థితుల్లో తన పథకానికి బాగ్రాంకావల్ల సహాయం తప్పక లభించగలదనీ, తన పథకం ఫలిస్తే, పోర్చుగీసు అధికార్లు గోవానుంచి ఉడాయించడం తప్పదనీ మా నాన్న ఆశించాడు. ఇదివరలో బాగ్రాంకాకు కుడిభుజంగా ఉన్న అనుచరులంతా అధికార్లుపెట్టే బాధలు పడలేక, ఆయన్ని వదిలేసిపోయారనీ, యీసంఘటనవల్ల బాగ్రాంకా తీవ్రమైన ఆశాభంగం, నిస్పృహ చెందాడని, గోవా ప్రజల్లో ధైర్యసాహసాలు సన్నగిలి ప్రభుత్వానికి లొంగిపోతున్నట్లు బాగ్రాంకా విని విచారపడుతున్నాడనీ మా నాన్న విన్నాడు.

జులైనెల్లో ఒకనాటి సాయంత్రం. చల్లని గాలి ప్రాణానికి హాయినిస్తూ దక్షిణదిక్కునుంచి వీస్తున్నది. ఊరికి చివరగాఉన్న ఒక పొలంలో మా నాన్న ఒక సమావేశం యేర్పాటుచేశాడు. అది రహస్య సమావేశం. నూతన కార్యక్రమం చేపట్టిన యీ ముఠాకు రహస్యందాచి ఉంచడమనేది ప్రప్రథమమైన క్రమశిక్షణ. సమావేశానికి నూరుమంది రైతుకూలీలు హాజరైనారు. కార్యక్రమం మా నాన్న వివరించి చెప్పిన తర్వాత, పోరాటానికందరూ సిద్ధమేనా, అని ప్రశ్నించాడు.

"మీరుచెప్పే యీ బాగ్రాంకా యెవ్వరో మేమెరగం. కాని మమ్మల్ని సక్రమమార్గాన నడిపితే, మేమంతా పోరాటానికి సిద్ధమే." అన్నాడు యువకనాయకుడు పైడేడీ.

"తుపాకులివ్వండి బాబూ! ఈ పోర్చుగీసు తెల్లపందుల్నీ, వాళ్ళ తొత్తుల్నీ యేరి యేరి యెలా కాల్చి పారేస్తామో! మీలో మాకు విశ్వాసం ఉందిబాబూ! మాకంతేచాలు!" అన్నాడు భీకరంగా డెబ్భయి యేండ్ల పైబడ్డ మేరియానో,

అక్షరం ముక్కరాని ఈ పేదరైతుకూలీలు ప్రదర్శించిన ఉత్సాహ చైతన్యాలు యెంతో ప్రోత్సాహాన్నిచ్చాయి మానాన్నకు. వాళ్ళకు కృతజ్ఞత వెల్లడించాడాయన. అదీ నిజమైన ఉత్సాహం. మీరు మీ విశ్వాసాన్ని నాలో ఉంచండి. నేను నా విశ్వాసాన్ని మెనిజీస్ బ్రాగాంకాలో ఉంచుతాను. దానితో తుదినిర్ణయం అయిపోతుంది. నా ప్లాను సిద్ధంగానేఉంది. కొద్దిరోజుల్లో దాన్నిగురించి మీకింకా వివరాలు తెలియ చేస్తాను. నా ప్లానుగురించి బ్రాగాంకాకు అసలేమీ తెలియదు. అసలు నేనంటూ ఒకణ్ణిక్కడ ఉన్నాననీగూడా ఆయనకు తెలుసో తెలియదో. ఆయన చాల గొప్పవ్యక్తి. ధనికుడు గూడా. రేపులేదా యెల్లుండి ఆయన్ను కలుసుకోదలచాను. ఆయన స్వగ్రామం చాందార్లో మీలో ఒక్కొక్కరూ వ్యక్తిగతంగా మీ సహాయ సహకారాలు నాకివ్వ డానికి యిదివరకే మీ నిర్ణయం తెలిపారు. ఇప్పుడు మీరంతా ఒకేచోట సమావేశమై మీ సమిష్టి నిర్ణయాన్ని గూడా నాకు తెలియజేశారు. మీ నిర్ణయాన్ని పురస్కరించుకుని బ్రాగాంకాను కలుసుకో బోతున్నాను. నా వద్ద నూరుమంది యోధులున్నారనీ, స్వాతంత్ర్య సంపాదనకు ప్రాణాలైనా ధారపోయడానికి సిద్ధంగా ఉన్నారనీ చెప్పబోతున్నాను." అన్నాడు మానాన్న."

"నూరుమందికాదు! నూటముగ్గురు" అన్నాడు మేరియానో. "జిపెడ్రూ, రాకో, నేనూ మీతోకలిసి పోరాడ్డానికి సిద్ధంగా ఉన్నాం. మాకు వయస్సు మళ్ళినా, మాతుపాకి గురిమాత్రం యింతవరకూ తప్పలేదు.

"ధన్యవాదాలు మేరియానో ధన్యవాదాలు! మీ ఉత్సాహం, మీ ధైర్య సాహసాలను గురించి బ్రాగాంకాకు చెబుతాను" అన్నాడు మా నాన్న చిరునవ్వుతో. ఇంకోవిషయం. మీరంతా బాగా ఆలోచించుకుని

నిర్ణయించుకోవాలని కోరుతున్నాను. ఈ పోరాటంలో మనం బ్రహ్మాండ మైన త్యాగాలకు సిద్ధంకావాలి. మీలో యెందరు సిద్ధంగా ఉన్నారు త్యాగాలకుమరి? మనం యీ పోరాటంలో చనిపోవచ్చుగూడా! ఈ విష యం జ్ఞాపకముంచుకోండి. మన జీవితాలు యీ పోరాటంలో అంత మయ్యేస్థితికూడా కలగవచ్చు. మీలో యెవరైనా త్యాగానికి సిద్ధంగా లేకపోతే, యిప్పుడే ముందుగా పోరాటం నుంచి విరమించవచ్చు!"

ఒకటిరెండు నిమిషాలు పూర్తి నిశ్శబ్దం. ఎవ్వరూలేచి నిలబళ్లేదు. ఎవ్వరూ చేతులెత్తలేదు. మా నాన్న తన ఉపన్యాసం కొనసాగించాడు. "బ్రాగాంకా మన ప్లాను అంగీకరించి సహాయం చేస్తానని వాగ్దాన మిస్తే, మనం రెండుమాసాలు కఠినశిక్షణతో తర్ఫీదు కావాలి. ఆతర్వాత పోర్చుగీసువాళ్ళపని పట్టగలం. మన సంకల్పసిద్ధి మన క్రమశిక్షణ మీదా, మనత్యాగ నిరతిమీదా ఆధారపడిఉంది, మన రహస్యాలు ప్రాణం పోయినా, పైకి పొక్కగూడదు. మనకీనాడు క్రమశిక్షణ అన్నిటికన్నా అత్యవసరం. దానికి చాలింది మరేదీలేదు. నేనుచెప్పింది మీకందరికీ అర్థమైందా కామ్రేడ్స్!"

ప్రతివాడూ తనపూర్తి అంగీకారంప్రకటించాడు, విధేయతతో ఆజ్ఞలను పాలిస్తానని ప్రమాణంచేశాడు. ఆకాశాన ఒక పక్కగా నల్లని మేఘంపట్టింది. సమావేశం పూర్తికాగానే సన్నగా వర్షపుజల్లు చిలక రించింది. వానదేవుడు గూడా మాయందు వాత్సల్యంచూపి కనికరించి నట్లు భావించాం. రైతులూ, కూలీలూ యిళ్ళకు తిరుగుముఖం పట్టారు. గుడ్డలు వర్షానికి తడిసి చలితో వణికి పోతున్నారు. వాళ్ళ హృదయాలు ఛలించక స్థిరసంకల్పంతోనే ఉన్నాయి.

ఆ రాత్రి, మరునాడు మా నాన్న హృదయంలో నూతనోత్సాహం, నవచైతన్యం, ధైర్యసాహసాలూ పెల్లుబుకుతున్నట్లు కన్పించాయి. ఆయన్ను యిన్నాళ్లుగా పట్టుకుని పీడిస్తున్న నిరాశ, నిస్పృహలు ఎగిరిపోయాయి. మా అమ్మా. మేరియా మా నాన్నవంక యింకా ఓరకొర చూస్తున్నా, ఆయన యిద్దరితో కులాసా కబుర్లు చెబుతూ, పరిహాసాలాడుతూనే ఉన్నాడు.

"ఇవ్వాళ యెందుకు నాన్నా అంత ఉత్సాహంగా ఉన్నావు?" అడిగింది రూత్ అర్థం కాక.

"నా ఉత్సాహం ఒకప్పుడు చచ్చిందా? మామూలుకన్నా ఎక్కువ ఉత్సాహంగా కన్పిస్తున్నానా? నిజంగా నీ కళ్లకు అలా ఉన్నానా?" అన్నాడు తెలియనట్టుగా మా నాన్న. "నీవు ఊరికే ఊహిస్తున్నావు రూత్! మామూలుకన్న ఎక్కువ ఉత్సాహ పడ్డానికి పెద్ద విశేషమేమీ జరగలేదే! ఏమో! నీ కళ్ల కలా అసాధరణంగా కన్పిస్తున్నానేమో యివ్వాళ! అంతకన్న మరేం లేదు!"

"అదికాదు నాన్నా! నిన్ను యింత ఉత్సాహ పరచే సంఘటన యేదో జరిగి ఉంటుంది! ఏదో జరిగిందిలే! నీవు చెప్పవు మాకు!"

"ఏమీ జరగలేదమ్మా రూత్! ఏమీలేదు!" అంటూ రాగాలాపన చేయడం ప్రారంభించాడు మా నాన్న.

ఆ రాత్రి, మర్నాడూ మా నాన్న సంతోషానికీ, ఉత్సాహానికీ అంతులేదు. మరేమీ గొప్ప విషయం జరగలేదని ఆయన గట్టిగా వాదించినా, ఆయన మాటలు మేమెవరం నమ్మలేదు. ఏదో ఒక గొప్ప సంఘటన జరిగే ఉంటుందనుకున్నాం. మూడోరోజు తెల్లవారు ఝామునే

మా నాన్న నిద్రలేచి, మార్గోలో యేదో అవసరమైన పని ఉన్నదని మా అమ్మకు చెప్పి, తన దారిన తాను ప్రయాణమై పోయాడు.

మా నాన్న యెంతో ఉత్సాహంతో బయల్దేరి పోతున్నాడు. ఏ పని మీద వెళ్లుతున్నాడో నాతోనైనా రహస్యంగా చెప్పలేదు. ఏదో బ్రహ్మాండమైన సంఘటన మాత్రం ఒకటి త్వరలో జరగబోతున్నదని నాతో సూచనప్రాయంగా అన్నాడు. అంతకన్న అధికంగా ఒక్కముక్కగూడా చెప్పలేదు.

పాపం ! మా నాన్న యెంతో ఆశతో, యెంతో సంతోషంతో బయల్దేరి పోయాడు. చాందార్‌లో ఆయన రైలు దిగగానే, బ్రాగాంకా సెరిబ్రల్ జ్వరంతో బాధ పడుతున్నాడనీ, చర్చి పక్కనే ఉన్న తన భవనంలో ఆయన మరణవేదన అనుభవిస్తున్నాడనీ వార్త విన్నాడు. గ్రామం యావత్తూ విచారంలో మునిగిపోయింది.

ఈ వార్త వినగానే తన పాదాలకింద ఉన్న భూమి బీటలువారి తనను కబళించి వేస్తున్నదా అనిపించింది మా నాన్నకు. స్టేషన్ ప్లాట్‌ఫారంమీద ఉన్న మా నాన్న కదలక మెదలక శిలగా మారిపోయినట్లు నాడు, కొన్ని నిమిషాలైన తర్వాత తేరుకున్నాడు. ఏమాలోచిస్తున్నాడో, యెక్కడికి పోబోతున్నాడోగూడా ఆయనకు తోచలేదు. ఆయన మనస్సు ఆయన స్వాధీనంలోలేదు. బ్రాగాంకా భవనానికి పోయే జన సమూహంతో కలిసి మా నాన్నగూడా కాళ్ళీడ్చుకుంటూ పోయాడు.

బ్రాగాంకా జీవించే ఆశలు అంతరించాయి. ఘన వైద్యులందరూ చేయగలిగిన కృషి చేశారు. ఆ మహాపురుషుడి ప్రాణాలు మానవుని అధీనం తప్పినాయి. మా నాన్న కాళ్ళీడ్చుకుంటూ ఆయన యిల్లు

చేరుకునేటప్పటికి, బ్రాగాంకా మరణించాడన్న ఘోర వార్త మా నాన్న హృదయంలో పిడుగు పడ్డట్టు పడింది.

మా నాన్నలో నిరాశా, నిస్పృహ, నిస్సహాయత మళ్ళీ ప్రవేశించాయి. ఆయన ఆశలన్నీ అడియాసలైనాయని తిరుగు ముఖంపట్టి యింటికి వచ్చేటప్పుడు మా నాన్న యెంతో క్షోభించాడు. ఏ వ్యక్తిమీద తన ఆశలన్నీ పెట్టుకున్నాడో, ఆ వ్యక్తి ప్రపంచానికి దూరమైపోయిన తర్వాత, యిహ గోవాకు విముక్తి ఉన్నదా అని ఆయన ఆశ్చర్యపోయాడు.

---

౧౦

కాల చక్రంలో మరో రెండేళ్ళు గడిచాయి. వాతావరణమంతా మరింత నిరాశాజనకమైంది. పోర్చుగీసు పాలనక్రింద ప్రజల యిక్కట్లు దుర్భరమైనాయి. హాహాకారాలు మిన్నుముడుతున్నాయి. గోవా అంతటా కరువు కాటకాలు వ్యాపించి, ఆకలి బాధతో ప్రజలు అలమటించిపోతున్నారు. ఇంతలో ప్రళయ భీకరంగా రెండో ప్రపంచ యుద్ధం రానేవచ్చింది.

సెప్టెంబరు నెల్లో మందంగా కాచే సూర్యరస్మి మమ్మల్ని కొంచెం ఉత్తేజపరచి ఉత్సాహం పురిగొల్పుతూంది. మా నాన్న హడావిడిగా యింటికి పరుగెత్తుకొచ్చి యుద్ధ వార్త మా చెవుల వేశాడు.

భయపడుతూ భయపడుతూ "యుద్ధం ప్రకటించారు!" అన్నాడు మా నాన్న. ఆలోచనతో రోడ్డువేపుచూస్తూ "నా జీవితంలో మరో యుద్ధం చూడబోనని అనుకున్నాను! ఈ పాపిష్టి రాజకీయ వేత్తల పుణ్యమా అంటూ, యుద్ధం రానే వచ్చిపడ్డది మన నెత్తిపైన!" అన్నాడు మా నాన్న.

ఈ భయంకర వార్త మా అమ్మ ప్రశాంత హృదయంతోనే వినగల్గింది. యుద్ధంవల్ల ప్రపంచానికి గలిగే బీభత్సం, మానవాళి అనుభవించే దుర్భర బాధలు, మా నాన్న విపులంగా వర్ణిస్తున్నాడు. ఇంతలో ఒక కారు మా ప్రహరీ గోడను చుట్టివచ్చి మా యింటిముందు ఆగింది. అనుకోకుండా మా మేనత్త అస్సుల్ క్వెటా ఊడిపడ్డది కార్లోనుంచి.

"ఏమే అమ్మాయి! అనుకోకుండా అకస్మాత్తుగా వచ్చావు అస్నూ! విశేషాలేమీ లేవుగదా?" అన్నాడు మానాన్న.

మా అత్త ప్రయాణం బడలికతో అలిసిపోయింది. దగ్గరే ఉన్న పడక కుర్చీలో జేరగిల పడ్డది. ఒక నిమిషం ఆగి చెప్పులు ఊడదీసుకుంది. చెమట పట్టిన ముఖం జేబు రూమాలుతో తుడుచుకుంది.

"ఈ రోడ్లూ, యీ మోటారుకార్లూ పాడైపోను! ఒళ్ళంతా నుగ్గునుగ్గయింది గదరా! సరేగాని యీ యుద్ధం అంటే మీకు భయంగా లేదురా? ఎందువల్లనో యీ మహా యుద్ధంలో పోర్చుగల్ గూడా యిరుక్కోక తప్పించుకుంది!" అన్నది మా మేనత్త.

"అవునే అమ్మాయి! భయంకరంగా లేదా అని మెల్లగా అంటావేం!" అంటూ మా నాన్న కోపంతో పెదిమలు బిగబట్టాడు. "సరేగాని యేంపనిమీద వచ్చావేనీవు? ఇంత దూరంనుంచి యీ పాడు యుద్ధవార్త తెలియజేయడానికి రాలేదుగద!"

తాటాకుల విసనకర్రతో విసురుకుంటూ, "కాదురా అబ్బాయి కాదురా! ఊరికే మిమ్మల్నందర్నీ ఒకసారి చూసిపోవాలని వచ్చాను. అంతే!" అంటూ తర్వాత యేమిమాట్లాడ్డానికీతోచక తటపటాయించింది. రెండు మూడు నిమిషాలాగిన తర్వాత, "మేరియా వివాహ సంబంధం విచ్ఛిన్నమైన తర్వాత, దాని మనస్సెలావుందో ఒకసారి చూసిపోదామని ప్రత్యేకంగా వచ్చాను. ఎలా ఉన్నావమ్మా మేరియా? అమాయకురాలు యెందుకలా బెంగపెట్టుకున్నట్లుంది! నీ దిగులుకు అర్థంలేదు మేరియా! వెర్రిమొర్రి ఆలోచనల్తో ధైర్యం చెడగొట్టుకోకు. పెళ్ళి మాయలో పడక తప్పించుకున్నందుకు ఒకప్పుడు నీవే దేవుడికి ధన్యవాదాలర్పిస్తావు చూసుకో. నిజంగా వివాహం అనేది ఒక గ్రంథం వంటిది. దాని ప్లాటు యెంతో అద్భుతంగా ఉన్నదని యితరులెంత గొప్పగా

వర్ణించి చెప్పినా, నీకై నీవు స్వంతంగా చదువుకోవాలనుకుంటావు. అప్పుడే మవుతుందో తెలుసా! తీరా డబ్బు ఖర్చుపెట్టి కొనుక్కుంటావు. చదవడం ప్రారంభిస్తావు. పూర్తికాగానే మొదటి పేజీ మళ్ళీ తిప్పిచూసి నీలోనీవు "యెంత డబ్బయిందిరాబాబూ!" అనుకుంటావు. అలాంటిదే పెళ్ళంటే! ఎన్నో వ్యయప్రయాసలతో కూడుకున్న విషయం! ఏమను కున్నావో!" అన్నది మా మేనత్త.

"అత్తా! నీవూ పెళ్ళిచేసుకున్నావుగదా! పెళ్ళిమూలంగా కష్టాలు పడుతున్నానని సాహసించి చెప్పగలవూ నీవు? నీ హృదయంమీద చేయి వేసుకుని చెప్పు! నిజంగా నీవు సుఖపడటంలేమూ? అడిగింది రూత్.

మా అత్త దానివంకచూసి పకపక నవ్వింది.

"మగవాడికి రోజులువచ్చి కాలంతీరపోతే, కళ్ళనీళ్ళు పెట్టుకునే ఆడది పరమమూర్ఖురాలు! తెలివితక్కువదిగూడా. చూడు! రేపు నార్బర్టో కాస్తా గుటుక్కుమంటే, నేను ఒక్క కన్నీటిబొట్టుకూడా విడుస్తానేమో! ఆయనపోయాడే అని అసలు విచారించనే విచారించను"అన్నది మా అత్త.

రూత్ ఆశ్చర్యపోయి, "నీవెంత కఠినురాలివత్తా! ఎంత క్రూరురాలివి! నార్బర్టోనుగురించి అంత నిర్దయగా మాట్లాడ్డానికి నీమనస్సెలా ఒప్పిందత్తా?" అన్నది.

"ఎందుకనీ! నా వయస్సులో ఉన్న యే ఆడదానికీ పరాయివాడు చనిపోతే హృదయం చలించదు. తనకు మరణం సమీపిస్తున్నదని తెలిసి నప్పుడే ఆవ్యక్తి కెక్కడలేని భయమూ కలుగుతూంది" అన్నది మా అత్త గంభీరంగా.

"అయితే నార్బర్టో నీకు పరాయివాడు కాదే! కేవలం నీభర్తే! అలాంటి భర్తను నీవు పరాయివాడుగా జమకట్టి మాట్లాడుతున్నావత్తా! నీ సాహసం యేమనుకోను!" అన్నది రూత్.

మా అత్త అస్వాభావికమైన వికృతపునవ్వు నవ్వింది. మా నాన్న వంకచూసి, "అరేయి టాబ్! నీ కూతుళ్లు వట్టి తెలివితక్కువ దద్దమ్మ లురా! ఇంతకన్న అమాయకులు మరెవరూ లేర్రా! పల్లెటూర్లోపడి కూపస్థమండూకాల్లా జీవించబట్టే అమాయకులుగా తయారైనారు! ఏమం టావ్?" అన్నది. మళ్ళీ రూత్ వేపు మొహంపెట్టి "అంత పమకారంతో భర్తలను చూసి ఆదరించుకుంటాం. కాని పరాయివాళ్ళకన్నా హీనంగా ప్రవర్తిస్తారు వాళ్ళు. మనల్ని ఒక్కొక్కప్పుడు శత్రువులకన్నా క్రురంగా చూస్తారు తెలుసా! దేవుడిలా అరాధించబోకు నీ మొగుణ్ణి! నీకు పుణ్యం ఉంటుదిగాని, అలా యెన్నటికీ చేయవద్దు. ముఖ్యంగా పురుషులు భార్యల యెడల పశువులకన్నా హీనంగా ప్రవర్తిస్తారు!" అన్నది.

మౌనంగా ఉన్న మేరియా మా అత్తకు ఘాటైన సమాధాన మిచ్చింది. "నార్బర్టో విషయంలోమాత్రం నీవలా అనలేవు. ఆయన చాలా మంచివాడు. స్త్రీల కష్టసుఖాలు బాగా అర్థంచేసుకోగల వ్యక్తి."

"అది నిజమేనమ్మా! నిజమే! మంచిభర్తలు దొరకడంగూడా ఒకచిక్కే. వాళ్లు మరీ మంచివాళ్లైనకొద్దీ, వాళ్ళకే కష్టాలెక్కువ! ఎక్కడలేని శ్రమా, ఆయాసమూ కల్పించుకుంటారు! ఇంకోవిషయం జ్ఞాపకం ఉంచుకో, ఎంతగొప్ప భర్తయినా, తనభార్యకుమాత్రం అరాధ్య దైవం కాలేడు; ఒక మహావీరుడూ కాలేడు" అన్నది మా మేనత్త.

మామూలు ధోరణిలోనే మా అత్త హాస్యాలతో, తమాషాలతో మమ్మల్ని ఉత్సాహపరుస్తూ కాలక్షేపం జరుపుతుంది. ఆమె కబుర్లలోపడి మానాన్న యుద్ధవార్తలుగూడా చెప్పడం మరిచిపోయాడు. అసలాప్రసక్తే

రాలేదుమన్కీ. మా అత్త మాయింటికి రావడం అంటే, మాకావేళ పెద్ద పండగన్నమాట. అన్నం మానేసిగూడా ఆమెచుట్టూ కూర్చుంటాం కబుర్లువింటూ. ఆమె మాయింటికి రావడమంటే మలయమారుతం మా మీద వీచినట్లే భావించుకుంటాం. పోయినప్రాణాలు తిరిగి లేచినట్లే ఉంటుంది. పూర్వంకన్న యీసారి ఆమె ముఖంలో ముసలితనం ప్రవేశించిన చిహ్నాలు కనిపిస్తున్నాయి, ఇదివరకున్న జవసత్వాలు ఆమెలో యీనాడు సన్నగిలాయి. కాని ఆమె మాటల్లో చేవదనం యేమాత్రమూ చావలేదు. కబుర్లతో తమాషాలతో, పరిహాసాలతో మమ్మల్నెప్పుడూ కడుపుబ్బ నవ్విస్తుండేది.

" మా మేరియా నర్సువృత్తి అవలంబించడానికి నిశ్చయించుకుంది తెలుసా అత్తా?" అడిగింది రూత్. రూత్ అంతకుముందే స్నానం చేసి, బట్టలు మార్చుకుని అందరితోపాటు మా అమ్మ గదిలో వచ్చి కూర్చుంది.

మేరియా భగ్నహృదయంతో కుమిలిపోతున్నది. తన జీవితంలో సుఖపడే రోజులు ముందు రావని నిర్ధారణ చేసుకుంది. నర్సింగ్ వృత్తి నేర్చుకుని శేషించిన తన జీవితాన్ని ప్రజాసేవకు అంకితంచేయడానికి నిశ్చయించుకుంది. తన నిర్ణయాన్ని గురించి రూత్‌కు తప్ప మరెవరికీ చెప్పలేదు. రూత్ ఈ వార్త కాస్తా బయటపెట్టేసింది. మా అమ్మ విని నిర్ఘాంతపోయింది. మా అత్త అసంతృప్తితో పెదవివిర్చి చప్పరించింది.

"నర్సా! ఏం గౌరవం ఉందా వృత్తిలో!" అంటూ యేగతాళిగా నవ్వింది మా అత్త. "మరెవరినీ పెండ్లాడ్డం నీ కిష్టం లేకపోతే, కనీసం చర్చిలో సన్యాసినివైనా కారాదూ మేరియా!"

"నర్సుగా ఎందుకుకాగూడ దత్తా? నర్సులంటే నీ కింత చిన్న చూపెందుకూ?" అడిగింది మేరియా విషయం తెలుసుకోవాలని.

"ఓసి పిచ్చిపిల్లా! ఎలాంటి వాళ్ళే నర్సు వృత్తి చేపట్టేది? గతి లేని తక్కువకులాల వాళ్ళు ఆ వృత్తికి పాల్పడుతారు. ఓరి భగవంతుడా! ఆ మాలిన్యంలోకీ, ఆ నరక కూపంలోకీ శత్రువునైనా దించబోకురా బాబూ!" అన్నది నిర్వేదంతో మా అత్త.

నర్సు వృత్తియందు ఆమె ద్వేషాన్ని, అసహ్యతను మరింత ప్రస్ఫుటంగా ప్రదర్శించి చూపడానికి మా అత్త జేబురుమాలు ముక్కుకు అడ్డంపెట్టుకున్నది నాసికాపుటాలకు చెడు గౌలుకొడుతున్నట్లుగా.

"చూడు మేరియా సన్యాసినుల విషయం వేరు. ఆ వృత్తిలో మర్యాద, గౌరవం, ఘనతా ఉన్నాయి. మనవంటి వాళ్ళు అవలంబించ దగిన వృత్తి అది. వైరాగ్యంలో బడ్డ స్త్రీలూ, తగిన భర్తను సంపాదించుకోలేని స్త్రీలూ యీ రోజుల్లో సన్యాసినులౌతున్నారు తెలుసా? డోనా ఆర్సెలీనాను నీ వెరుగుదువుగదూ! ఆమె కూతురు ఇసబెల్లా గూడా తెలుసుగా నీకు! పాపం అమాయకురాలైన ఆ పిల్ల విషయం యేమైందో తెలుసా? ఏదో వూళ్ళో మంచి సంబంధంగూడా నిశ్చయమైంది. ఆ వూరు పేరు నోట్లో ఆడుతూనే వుంది. ఇప్పుడే చెబుతాను నీకు. ఇంతలో యేం జరిగిందో తెలుసా? పెళ్ళి పదిహేను రోజులు గద్దనంగా బుద్ధిలేని ఆ వెర్రివెధవ యెక్కడో చెర్లో యీతగొడుతూ మునిగిపోయాట్ట. ఎంత సిగ్గుచేటు! ఎంత ఘోరమో ఆలోచించు! ఎన్నో సంవత్సరాలనుంచీ తగిన భర్తను చేసుకుందామని ఆ పిల్ల ఆరాటపడడం, చివరికా అభాగ్యురాలికాగతి అలా పట్టడం! ఇసబెల్లా వయసిప్పుడు ముప్పైఅయిదు సంవత్సరా లుంటాయి. ఆ అమ్మాయి తల్లి మాత్రం యిప్పటికీ యిరవైనాలుగు సంవత్సరాలే అని చెబుతుంది. గతించిందేదో గతించిపోయినా వివేకవంతురాలైన ఇసబెల్లా చర్చిలో సన్యాసినినిగా చేరిపోయింది. నా

కెంతో సంతోషంగా ఉందీ వార్త వినడానికి. ఆ పిల్ల జీవిత సమస్య పరిష్కారమైనట్లేగా అంతటితో !" అన్నది మా మేనత్త.

ఇలాంటి కథలూ, గాథలూ చెప్పడంలో ఆమె ఆరితేరింది. ఇసుక పాతరలా తీస్తుంటే తరగనే తరగ వా కథలు. చమత్కారంగా ఆమె మాట్లాడే మాటలు వింటూంటే, యెలాంటి వాడికైనా కడుపుబ్బే నవ్వు రాకమానదు.

"ఎక్కడో ఒకచోట ఒక పెద్ద చర్చి ఉందట. దాని పేరు నాకిప్పుడు జ్ఞాపకం లేదు. అక్కడ తయారయ్యే ఆహారపదార్థాలు అద్భుతమైన రుచిగా వుంటాయట. ఆ చర్చిలో సన్యాసినులకు అస్తమానం ప్రార్థనలు చేయడం తప్ప మరే పని ఉండదట. ఆ సన్యాసినులకు అలాంటి ఆహారం, అలాంటి సౌఖ్యం దొరకడం వాళ్ళ అదృష్టంకాదూ ! నా పెళ్ళికాకముందే యీ చర్చి సంగతి నా చెవిన పడుంటే, నే నీ పెళ్ళి చేసుకునేదాన్నా ! ఆ నిమిషంలోనే చర్చిలో చేరిపోయేదాన్ని! ఇప్పుడైనా మించిపోయిందేమీ లేదులే! నార్బర్టో కన్నుమూయగానే, ఆ చర్చిలో చేరదల్చుకునే ఉన్నాను. ఆ నిర్ణయం యెన్నడో చేసుకున్నాను" అన్నది మా అత్త అందరికీ ఆశ్చర్యం కలిగేట్లుగా.

"ఎలాంటి దానవమ్మా అత్తా నీవు ! అలా మాట్లాడ్డానికి నోరెలా వచ్చింది నీకు !" అన్నారు రూత్, మేరియాలు ఆశ్చర్యం ప్రకటిస్తూ.

"ఓసి పిచ్చి పిల్లల్లారా! ఏం తప్పుందే యీ మాటలో?" అన్నది మా అత్త సగం నవ్వుతూ సగం గంభీరంగా ముఖం పెడుతూ. "నే నొకటే మాట చెబుతున్నా వినండి! మన మత గురువులూ, మన సన్యాసినులూ మాత్రమే యీ ప్రపంచంలోకల్లా సుఖానికీ, అదృష్టానికీ నోచుకున్న వాళ్ళని నే నొక నిర్ణయానికి వచ్చాను. వాళ్ళ కొక దిగులూ

చింతా లేదుగదా ! సంసార బాధలూ, తాపత్రియాలూ అసలే లేవుగదా ! వాళ్ళు తిండి యెలా తింటారో యెంత కాలం జీవిస్తారో యేమన్నా తెలుసా మీకు ! గోవాలో యే మతగురువైనా యౌవనంలో చనిపోవడం మీరు విన్నారా ? ఒకప్పుడు నేను.....................”

మతగురువుల్ని గురించీ, సన్యాసినులను గురించీ, మా అత్త చెవికింద ఒకటే సోది పెడుతుంటే మా అమ్మ భరించలేక “అది భగవంతుడి దయాభిక్షగాని భోజనంకాదు ఆన్నా ! వాళ్ళు అంత దీర్ఘకాలం బతికి ఉండగల్గుతున్నారంటే, దానికి కారణం భగవంతుని దయారసమే ఆయన కారుణ్యమే !” అంటూ మా అత్త ఉపన్యాస ధోరణికి అడ్డం తగిలింది.

మా అత్త మా అమ్మ ముఖంపంక తేరిపారచూసింది. తన ధోరణి ఆమెకు తలనొప్పి కలిగించిందని తెలుసుకుంది. మా అమ్మను యింకా యేడిపించ దలచి, “అలా రా అమ్మా! అలారా దార్లోకి! దేవుడు మానవుల యెడల అంత దయారసంగలవాడైతే, వాళ్ళను ముందుగానే తన స్వర్గానికి లేవదీసుకునిపోయి, సర్వసౌఖ్యాలూ అక్కడే సమకూర్చ రాదూ ? అసలు వాళ్లు స్వర్గానికి వెళ్ళడమే నోచుకుంటే సంగతి నేను చెప్పేది! స్వర్గానికే వెళ్ళుతారంటావా? ఏమో అబ్బ! నా కంతగా నమ్మకం కుదరడం లేదు” అన్నది మా అత్త.

ఆ పగలల్లా ఏవో కాకమ్మ కబుర్లతో తెంపులేకుండా మా అత్త మమ్మల్ని నవ్విస్తూనే వుంది. అలాంటి వ్యక్తి ప్రతి యింట్లో ఒకరుంటే మనవాళ్ళు కష్టాలే మరచిపోయి ఉందురు ! ఆ రాత్రి భోజనాల ముందు రాజధాని నగరంలో రాజకీయ పరిస్థితిని గురించి మా నాన్న మా అత్త నడిగాడు. ఆమెకు గోవా రాజకీయాలంటే రోత. ఈ రాజకీయాల్లో పడి తన్నుకునే వాళ్ళను చూస్తే ఆమెకు చెడ్డ అసహ్యం. వాళ్ళ జీవితాలను

కాసుకు కొరకాకుండా ఊరికే వ్యర్థం చేసుకుంటున్నారని ఆమె అభి ప్రాయపడేది.

పోర్చుగీసు ప్రభుత్వం ప్రజలపైనా, పత్రికలపైనా పూర్వం కన్నా యెక్కువగా క్రూర నిర్బంధ శాసనాలు ప్రయోగించ బోతున్న దని గోవా అంతటా వర్షాకాలం మూడు నెలలూ విపరీతమైన పుకార్లు వ్యాపించాయి. నిర్బంధ విధానాన్ని ప్రతిఘటించడానికై పంజిమ్‌లో నేషనలిస్టు పార్టీ ఒకటి నిర్మించబడుతున్నదనిగూడా అందరి నోటా విన వచ్చింది. ఈ విషయం తనకు తెలుసేమో అని మా నాన్న మా మేన త్తను భోజనాల ముందడిగాడు. ఆ సంగతే తనకు తెలియదని జవా బిచ్చిందామె.

మా అత్త కళ్ళు ముడుచుకుంటూ, "ఏరాజకీయాలను గురించిరా నీవు మాట్లాడేది టాబ్! ఏ నేషనలిస్టు పార్టీ సంగతి కావాలి నీకు? గోవా రాజకీయాలంటే, చీడగజ్జితో సమానమన్న సంగతి నీవు జ్ఞాపక ముంచుకో. ఈ గజ్జి తలకాయనుగాక, మిగిలిన అవయవాలనే యెక్కు వగా పట్టి పీక్కుతింటుంది. పంజిమ్‌లో పోర్చుగీసు దొరలూ, వాళ్ళ అధికార్లూ సర్వసౌఖ్యాలతో జల్సాగా కాలం వెళ్ళబుచ్చుతున్నా రనుకో. నాలుగు రోజుల క్రితం గవర్నరుచేసిన విన్నటు పార్టీని గురించి నీవు వినే వుంటావు! ఎంత గొప్పగా ఉందనుకున్నావు ఆ విందు! "మొరిగే కుక్కలు మొరగనీ!" అంటారు పోర్చుగీసు అధికార్లు తెలుసా! ఇంతకూ పల్లె ప్రజలే బాధ లనుభవించేది! పోర్చుగీసు పాలన క్రింద గ్రామీ ణులేగా యెక్కువగా అణగారి పోతున్నారు?"

"ఆమ్మా! గోవాకు గ్రామసీమలే ప్రాణం అన్న విషయం మరచిపోవద్దు" అన్నాడు మా నాన్న ఒక నిమిషం తటపటాయించి. ఇంతకూ పంజిమ్‌లో యేం జరుగుతున్నదీ నీకు తెలియదన్న మాట.

నీకు తెలియకుండా ఉన్నదంటే నేను నమ్మను. ఒక పోర్చుగీసు అధికారి భార్యవైన నీకు యీ స్వల్ప విషయం తెలియదూ ? నీభర్తబోటి అధికార్లకు పోర్చుగీస్ పాలన స్వర్గంలా ఉంటుందనుకుంటాను. నేనడిగిన నేషనలిస్టు పార్టీలో ప్రభుత్వాధికార్ల నెవ్వర్నీ చేరనివ్వరు. ప్రభుత్వానికి ప్రతికూలంగా పనిచేసే యిలాంటి ప్రజాసంస్థల్లో ప్రజాప్రతినిధు లొక్కళ్ళే సభ్యులుగా ఉంటారు."

"అయితేకావచ్చు టాబ్! అదంతా నేనెరగను" అన్నది తెలియనట్లుగా మా అత్త. మా నాన్న చిరాకు పడుతున్నాడని ఆమె గ్రహించింది. "నేనొక సంగతి చెబుతున్నా విను. నావాక్కు దైవ వాక్కనుకో. అంత యదార్థమున్నది నా మాటలో. ఈ పార్టీని గురించే నీవు నన్నడుగుతున్నావనుకో! నిజంగానాకేమీ తెలియదే దాన్నిగురించి! ఇప్పటికైనా నమ్ముతావా నామాట ?"

మానాన్న మాఅత్తవంక ఆతురతతో యెదురు చూశాడు. ఆమె యేదో చెప్పబోతున్నట్లు గ్రహించాడు. ఆమె మాటలధోరణిలో మా నాన్నకు కావలసిన సమాచారాన్ని గురించి ఆచోకీచిక్కే ఒకటి రెండు ముక్కలు ఆమెనోటినుండి వెలువడ్డట్లు ఆయన విన్నాడు. ఆ ఒకటిరెండు ముక్కలూ వివరించి చెబుతుందేమో అని మా నాన్న ఆశతో యెదురు చూస్తున్నాడు.

ఇంతలో మా అత్త తిరిగి మొదలెట్టింది తనధోరణి. "నీవు ఎర్నెస్టోక్రజ్‌ను గురించి విన్నావు గదరా! ఆయన తనయింట్లో ఒక రోజున యేభై మందిని పిలిచి ఒక సమావేశం యేర్పాటు చేశాడు. గోవా పరిస్థితులు చర్చించా రీ సమావేశంలో. అర్థరాత్రయే సరికల్లా యీ యేభై మందీ తప్పతాగి ఒళ్ళూపై తెలియకుండా పడున్నారు. పుల్ క్వేరియా

భర్త యీ యేభైమందిలో ఒకడు. అతన్ని మామూలు స్థితికి పట్టుకు రావడానికి పూర్తిగా రెండు రోజులు పట్టిందని ఆమె మొన్ననే నాతో చెప్పింది."

మరోసారి, మా నాన్నా, మేమూ నవ్వుకున్నాం.

"నీవెప్పుడూ యిలాంటి కబుర్లే చెబుతావు! మరో విషయం నీ నోటినుంచి రానేరాదు. ఏమంటావు?" అన్నాడు మా నాన్న.

"నిజమేరా నేను చెప్పింది! పరిహాసానికి కాదు" అన్నదామె గంభీరంగా నిజం చెబుతున్నట్టు. "పంజిమ్‌వచ్చి యెవరైనా అడుగు కావాలంటే! నా మాట నిజమో అబద్ధమో నీవే తెలుసుకుంటావు. జులై నెలల్లా యీ కబుర్లే చెప్పుకుంటూ మా వూరి వాళ్ళంతా కాలక్షేపం చేశారు. ఇంకో ప్రసక్తేలేదంటే నమ్ము!" అన్నది మా అత్త.

తర్వాత రెండురోజులవరకూ మాయిల్లు నవ్వులతో ప్రతిధ్వనించి పోయింది. మా అత్తపుణ్యమా అంటూ ఒక కొత్త జీవకళ మా యింటిని అలంకరించినట్లు తోచింది నాకు. మంగళవారం సాయంత్రం పిడుగు వంటివార్త మా చెవుల వేసింది మా అత్త. అంత ఆకస్మికంగా ఆనాడు మాయింటికామె యెందుకొచ్చిందో అప్పుడు వివరించి చెప్పింది.

ఈ వార్త మా చెవుల పడగానే, అందరికన్నా మా అమ్మకు కలిగిన మనోవేదన ఆమెను మరింతగా కుంగదీసింది. వెయ్యి యుద్ధ భయాలైనా యీ ఘోర వార్తతో సమానం కాదని తర్వాత మా అమ్మ తరచుగా అంటూ ఉండేది.

"రోబు మాయింట్లో ఉండడంలేదు. ఎక్కడికో లేచిపోయాడు" అన్నది మాఅత్త వెనకాస్తుందాడుయా. మాఅమ్మనూ, మా నాన్ననూ

ఒకేసారి చూడసాగింది వాళ్ళ ముఖ కవళిక లెలా మారుతాయో అని. నాతో పోట్లాడి, నార్బర్ట్‌ను అవమానపరచి యెక్కడికో పారిపోయాడు రోబు."

"ఏమిటి" అన్నారు మా నాన్నా, మాఅమ్మా ఒకే గొంతుకతో. "ఎందువల్ల? ఏమిజరిగింది ఆస్నా?''

మా అమ్మ ముఖంపైన చీకట్లు కమ్మినట్లు కళాకాంతులు తప్పి పోయాయి. ఆమె వణికిపోతున్నది యేదో విచిత్రమైన రోగం ఆవ హించినట్లు. మా నాన్న పళ్లుపటపటకొరికి యేమీ మాట్లాడ్లేదు.

"నేనిక్కడికి రాకపూర్వం రెండురోజుల క్రితం యిల్లువిడిచి పోయాడు వాడు. ఈ మధ్య వీడు ఒకపిల్లను మరిగాడు. ఆ పిల్లతో సంబంధం తెంచుకోమని గట్టిగా హెచ్చరించడం నేను చేసిన పాప మైంది. దాని కలిగిపోయినాడు. ఇప్పుడు పిల్లయింట్లోనే ఉన్నాడు గూడా. ఆ పిల్ల పోలీసు సార్జెంటు పెరీరాలోప్స్ కూతురు!" అన్నది మా అత్త.

"పెరీరా లోప్సా!" కోపంతో గుర్రుమాడు మా నాన్న. "పోయిన ఎన్నికల్లో గన్‌సాల్వ్‌స్‌ను చావగొట్టిన కిరాతకుడు వీడే యీ పెరీరా!" అన్నాడు,

"అవునురా టాబ్! అతనే!'' అన్నది మాఅత్త మెల్లగా. "ఇతనెలా చెబితే అలా ఆడుతున్నాడు రాబర్టో. అతని ప్రభావం బాగా పడింది మనవాడిమీద. వేషభాషల్లో, ఆచార వ్యవహారాల్లో, అహంభావ, స్వాతిశయాల్లో, అసలా తెల్లపోర్చుగీసు వాళ్ళనే మించిపోయాడు మన వాడు. పోర్చుగీసు వాళ్ళను తృణీకరిస్తూ మాట్లాడినందుకు మనవాడు ఎవర్నో పాపం చావచితక కొట్టాట్ట" అన్నది మా అత్త.

ఈ మాటలు మా నాన్న నమ్మలేక, "నిజమేనా అమ్మా నీవు చెప్పేది?" అన్నాడు. తనలో తాను. "నా కొడుకై పుట్టి, పోర్చుగీసు హంతకుల్లా ప్రవర్తించడమా! వీడు నాశనమై పోనూ! వీడి దుర్మార్గానికి వీణ్ణి కాల్చిపారేసినా పాపంలేదు!" అని మండి పడ్డాడు మా నాన్న.

రాబర్టో రాజకీయాల కెప్పుడూ దూరంగానేఉండేవాడు. మమ్మల్ని యెవరుపాలిస్తున్నారో, యెలా పాలిస్తున్నారో అనేఆలోచనే ఉండేదిగాదు వాడికిదివరలో. పంజిమ్ పోగానే, వాడు ఫ్రాగాంకా పలుకుబడి కిందకు తప్పక వస్తాడనీ, ఫ్రాగాంకా వ్యాసాలూ, ఉపన్యాసాలూ, ఆయన తత్వ సిద్ధాంతాలూ, విద్యార్థులు, యువకులు, యితర దేశభక్తులు మెచ్చుకొనడం వల్ల, రాబర్టోగూడా ఆ వాతావరణంలో పడి బాగుపడతాడని మా నాన్న ఆశించాడు. తండ్రికి తగిన కొడుకుగా తయారౌతాడని కలలుకన్నాడు.

"వీడా పిల్లను పెళ్ళాడదలచుకున్నాడని నా ఊహ. అలాంటి దేదీ జరగకూడదని నా కోర్కె!" అన్నది మా అత్త.

జరిగిన విషాద సంఘటనలన్నీ ఒకటి తర్వాత ఒకటి ఆమె యేకరవు పెడుతూంది—మా అమ్మ శరీరం ఆపాదమస్తకం ఉడికి పోతూంది. "ఎన్నాళ్ళనుండి ఆ పిల్లతో పరిచయం వీడికి?" అడిగింది మా అమ్మ గద్గద స్వరంతో.

"రెండు సంవత్సరాలనుండి అనుకుంటాను. అందే వీడు ఉద్యోగం చేయడం మొదలెట్టినపట్నుంచి!" అన్నదామె.

"ఇన్నాళ్ళనుంచీ మాకీ విషయం మాటమాత్రం చెప్పకపోతివే! ఎందుకు చెప్పలేదు వదినా?" అడిగింది మా అమ్మ ఆవేదనతో.

"ఏమని చెప్పేదమ్మా చెప్పు? వాడి పరిస్థితి యీ విధంగా పరిణమిస్తుందని నేనూహించలేదు. మామూలుగా ఆ అమ్మాయితో స్నేహంగా ఉన్నాడనుకున్నా! అంతే! పంజిమ్‌లో ఆడపిల్లలతో స్నేహం చేయని కుర్రాడున్నాడా యీ రోజుల్లో. ఇంతకు మించి వీడి వ్యాపారం యిలా ముదురుతుందని కల్లోనైనా నే ననుకోలేదు!" అన్నది మా అత్త.

"ఆ అమ్మాయి యెలా ఉంటుందమ్మా వదినా?" అడిగింది మా అమ్మ.

"అన్నిటికన్నా ఘోరం అదేనమ్మా!" నిజం చెప్పడమా చెప్పక పోవడమా అని మా అత్త కాసేపు సంకోచించింది. చివరకు చెబుదామని నిశ్చయించుకుంది. "ఆ పిల్ల వట్టి పుచ్చువంకాయనుకో! కనీసం అరడజను మంది వెధవలతోనన్నా పడుకుని ఉంటుందది! తల్చుకుంటే జలదరిస్తుంది వళ్ళు! అబ్బ! భయంకరం!" అన్నది.

విషాదకరమైన యీ వివరాలన్నీ విని మా నాన్న, మా అమ్మ పడ్డ మనోవేదన వర్ణించలేను. తర్వాత చాలా రోజుల వరకూ ప్రతి రోజూ మా నాన్న, మా అమ్మ సాయంత్రం వేళ వరండాలో కూర్చుని అదేపనిగా ఆందోళన పడడం మొదలెట్టారు. మా యింటికి వరసగా పట్టిన యీ దురవస్థలన్నిటికి మా నాన్నే కారణమని మా అమ్మ యెప్పుడూ ఆయన్ను ఆడిపోసుకునేది. మా నాన్న మాట్లాడేవాడుకాదు. దీర్ఘంగా ఆలోచిస్తూ, పెదిమలు బిగించి, కోపంతో చీకట్లో తేరిపార చూస్తుండేవాడు.

రోజులూ, నెలలూ దొర్లుకుపోతున్నాయి. యుద్ధం కారణంగా గోవా అంతటా ప్రజల దుర్భర బాధలు మిన్నుముట్టుతున్నాయి. మా యింట్లోగూడా కష్టాలెక్కువైనాయి. ఎటు చూసినా దిక్కులు

చీకట్లు కమ్ముకొస్తున్నట్లున్నాయి. పోర్చుగల్ ప్రపంచ యుద్ధంలో చిక్కుకోకపోయినా, గోవా ప్రజల జీవితం నానాటికి తీసికట్టయింది. గోవా ప్రజలు ప్రధానంగా దిగుమతులమీద ఆధారపడి జీవిస్తారు. పోర్చుగీసు పాలన పుణ్యమాఅంటూ గోవాయెప్పుడూ స్వయం పోషకమైన ప్రాంతం కాదు. ఆహారధాన్యాలు విదేశాలనుంచి దిగుమతైతేనే సంవత్సరం పొడుగూనా మా ప్రజల జీవనం ఒడుదుడు కుల్లేకుండా సాగిపోయేది. గోవాలో ఉత్పత్తయ్యే పంట సంవత్సరంలో ఆరు మాసాలక్కూడా చాలదు. అంచేత ఆహార పరిస్థితి మరింత క్లిష్టమైంది. నిత్య జీవితావసర వస్తువులు కరవైనాయి. మార్కెట్లో ధరలు చుక్కలంటుతున్నాయి. గోవాలో రూపాయి విలువ పడిపోవడంవల్ల, బొంబాయి, మరి యితర ప్రాంతాలకు ఉద్యోగాల కొరకై పోయినతండ్రులు, కొడుకులవద్ద నుండి డబ్బుకై యెదురుచూస్తున్న గోవా ప్రజలు విపరీత ధరలుపెట్టి నిత్యావసర వస్తువులు కొనుక్కోలేక పోతున్నారు. యుద్ధంమూలంగా గోవా వ్యాపారం పూర్తిగా మందగించింది. పరిసర గ్రామాలనుండి ఆకలిచావులుగూడా వినవస్తున్నాయి.

ప్రజలిన్ని బాధలనుభవిస్తున్నా ప్రభుత్వాని కేమీ పట్టలేదు. నల్లుల్లా మాడిపోతున్నా, తమను ఆందోళన పరచనట్లుగా అధికార్లు అలక్ష్యం చేస్తున్నారు. సామాన్య ప్రజలు పడే బాధలు పడుతూండగా, నిరంకుశాధికార్లు ధనికరైతులతోకూడి టీ పార్టీలూ, డిన్నరు పార్టీలూ, డ్యాన్సులతో వినోదంగా గడుపుతున్నారు. బ్లాక్‌మార్కెట్ వ్యాపారం నిరాఘాటంగా సాగిస్తున్న ధనికవ్యాపార్లు పిశాచాల్లా ప్రజల నెత్తురు మాంసాలను పీల్చుకుని తింటున్నారు.

ఎక్కడచూసినా ప్రజల ఆక్రందనాలు! హాహాకారాలు! గోవా అంతా స్మశానమయమయ్యే ప్రమాదంగూడా ఆసన్నమైనట్లుంది. ప్రజల్ని

ఒకేఒక సమస్య యెదుర్కొంటున్నది. గోవాలోనేఉండి తిండిలేక మాడి చావడమా? లేక ప్రాణాలతో గోవానుండి బయటపడటమా? పూర్తిగా దివాలాతీసిన ప్రస్తుత ఆర్థికవిధానంలో, పరాయిదేశాలనుంచి దిగుమతులు యెప్పటికప్పుడు వస్తేనే మాబతుకు నిజమని మాకుతెలుసు. దిగుమతులు లేనినాడు మాపొయిల్లో పిల్లులేవవు. ఈపాపిష్టి ప్రభుత్వం మాప్రాణాలు రక్షించి మమ్మల్ని బ్రతకనిస్తుందని మా ప్రజల కేకోశానా ఆశల్లేవు. ఈ దుర్భర పరిస్థితుల్లో, యీ రాక్షసపాలనకింద బతకలేమని మాప్రజలు నిశ్చయించుకున్నారు. వందలకొద్దీ ప్రజలు బ్రిటిష్ యిండియాలోకి వలస పోవడం ప్రారంభించారు ప్రాణాలువిసిగి. ఇండియాలో కనీసం రేషను మెతుకులైనా తిని ప్రాణాలు నిలుపుకోవచ్చుననే ధైర్యం మా ప్రజల కేర్పడ్డది.

మహాప్రవాహంలా కదిలారు గోవా ప్రజలు.

డిశంబర్ నెల్లో ఒకనాటి సాయంకాలం.

ఎండిన రాలుడాకులు మండుతూ చిటపటశబ్దం చేస్తున్నాయి. మంటలోనుండి వత్తుగా ఘాటైన వాసనతోవచ్చే పొగ దొడ్డియావత్తూ చుట్టవేసుకుంది. నీళ్ళకాగుకిందనుంచి వచ్చే బూడిదరంగుపొగ దొంత రలు దొంతరలుగా పడమర దిక్కునుంచి వచ్చే గాలిని ఆలింగనం చేసు కుని, ఉంగరాలు ఉంగరాలుగా నాట్యమాడుకుంటూ పైపైకి యెగిరిపో తున్నది. చివరకాపొగంతా నల్లనిమబ్బుల్లో లీనమైపోయింది. ఈపొగంతా ఆకాశంలో కెగిరిపోయి మేఘాలుగా, మబ్బుతెరలుగా మారిపోతుందని పసిబిడ్డ లీనాటికీ ఊహించుకుంటారు.

ఆ సంవత్సరానికదే ఆఖరురోజు. సాయంకాలం చలిచలిగా ఉంది. ఆనాటిలో సంవత్సరం దాటిపోతున్నదే అన్న విచారంతో పడమరదిక్కు నుంచి ఆ చేగాలి దుఃఖసూచకంగా శబ్దంచేస్తున్నట్లుంది. కొంచెంమారంగా

ఉన్న స్టూలుమీద మా అమ్మ కూర్చునిఉంది. మారూత్ గొంతుక్కూర్చుని యెండుటాకులను కర్రపుల్లతో లోపలికి తెగదోస్తూ, నీళ్ళకాగుకింద మంట పెడుతున్నది.

ఆకుల పొగకు రూత్ కళ్ళవెంట నీళ్ళుకారడం ప్రారంభించాయి. దాని చూపుగూడా మందగించింది. ఒకటే చిరాకుపడుతూ అర్థంలేని వాగుడు వాగడం మొదలెట్టింది ఆకులను పొయిలో కెగదోస్తూనే: మా అమ్మ విచారంతో, ఆలోచనలో మునిగిపోయింది. ఆ ఉదయాన్నే కాన్వెంటుకు ప్రయాణమైపోయిన మేరియా మా అమ్మ మనస్సులో మెదులుతూ ఉన్నట్లు నేను ఊహించుకోగల్గాను.

రూత్ ముసిలిదానిలా ఒక కర్రపుల్ల ఊతగా పుచ్చుకొని తడబడే పాదాలతో మా అమ్మ వద్దకు నడిచి వచ్చింది. "యెందుకే అమ్మా యెప్పుడూ యేడుస్తుంటావు ? ఏడ్చియేడ్చి కళ్లు కాస్తా పోగొట్టుకునేట్లు న్నావు. నీవు ఉత్సాహం తెచ్చుకుని మమ్మల్నిగూడా యింత ఉత్సాహ పర్చు. ఎందుకమ్మా అలా యెప్పుడూ కళ్ళ కాయలు కాచేట్లు యేడుస్తావు ?" అన్నది. మా యింటికి తరుచుగా వస్తూ మా అమ్మను ఓదార్చే పంగలి అవ్వను అనుకరిస్తున్నట్లుగా మాట్లాడింది మా అమ్మతో. దాని నోరు మా అమ్మచెవి దగ్గరపెట్టి రహస్యంగా, "రూత్ గూడా సన్యాసినై పోతేదేమో అని నీవు విచారపడుతున్నావా అమ్మా ? నీ సంతానంలో యిద్దరు మత గురువులూ, యిద్దరు సన్యాసినులు తయారు కావాలని కోరుకుంటున్నావు కదూ !" అన్నది రూత్.

"అవతలికి పోవే ! నీవూ, నీ అర్థంలేని మాటలూనూ ! హాస్యానికేం మిరం ఉండక్కర్లా ! దిగులుపడి దిగనాసిల్లే దానితోనా నీ పరిహాసాలు !" అన్నది మా అమ్మ కసురుతూ.

రూత్ చేతిలో కర్రిపుల్లను జారవిడిచింది. పరిహాసాలు చాలించి మామూలు ధోరణిలో మా అమ్మను బ్రతిమాలి, బుజ్జగించడం ప్రారంభించింది. "విచారం మానేయమ్మా! త్వరలోనే నీకు మంచి రోజులు వచ్చి అదృష్టం పట్టబోతున్నది. పూర్వంవలె గాక, నీవిప్పుడు సంతోషంతో కాలం గడిపే రోజులు రానున్నాయి."

"ఇంకా నాకీ జీవితంలో అదృష్టమూ, సుఖమూ! ఎందుకు నీకీ పిచ్చి. సుఖపడే రోజులెన్నడో గతించాయి. ఇక యీ జన్మ యింతే. ఇంకా నేను చావక బతికి ఉన్నానంటే, గడిచి బతికిన రోజులు జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఉండడం వల్లనే కాబోలు!"

"అలా అనకే అమ్మా! నేను పెళ్లి చేసుకున్న తర్వాత, సంవత్సరంలో ఆరు మాసాలు నీవు నా వద్దనే వచ్చి ఉందువుగాని. తతిమ్మా ఆరు మాసాలు నీతో నేను వచ్చి ఉంటానమ్మా!"

నీరసంగా ఉన్న మా అమ్మ పెదవులపైన చిరునవ్వు నాట్యమాడింది. ఆమె రూత్ చేతిని తన చేతిలోకి తీసుకుని గట్టిగా బిగించి పట్టుకుంది. "ఎంత బుద్ధిమంతురాలవమ్మా నీవు! అయితే నీ భర్త రాగానే ప్రతి చిన్న పనికీ, ప్రతి పెద్దపనికీ, ఆయన వద్దనుండి ఆజ్ఞలు తెచ్చుకుని మరీ సంచరించాలి తెలిసిందా! ఈనాడు నీకున్న స్వాతంత్ర్యం, స్వేచ్ఛా ఆనాడుండదు! జ్ఞాపకం ఉంచుకో. అమ్మమీది ప్రేమకొద్దీ అలా అంటున్నావు!"

"ఏమిటమ్మా అలా అంటావ్! ఆర్మండో యెంతమంచివాడో తెలుసా! నీమీద అయనకు యెంత ఆదరణో నీకు తెలియదు. నీవు మావద్దఉండి సుఖంగా కాలక్షేపం చేయడం ఆయన కెంతో యిష్టం తెలుసా అమ్మా!"

"ఆలూలేదు, చూలూలేదు కొడుకుపేరు సోమలింగం అన్న సామెతగా, యిప్పట్నుంచీ యెందుకులే ఆ ముచ్చట్లు! ఆ శుభదినం రానీ, అప్పుడాలోచిద్దాం. ముందునీవు పెళ్ళాడితే నాకదే అదృష్టం!"

రూత్ తనసహజమైన చిలిపిచేష్టలలో, పరిహాసాలతో, బుజ్జగింపులతో పెల్లుబికివచ్చే ఉత్సాహంతో అస్తమానం మనోవేదనతో కుంగిపోతున్నమా అమ్మను ఊరడించడానికి ప్రయత్నం చేస్తుండేది. ఆంటోనియో యిల్లు విడిచి పోయినరోజునుంచీ రూత్ పెద్దగా నవ్వడం మొదలెట్టింది. గొంతుపైకెత్తి పాటలు పాడడం సాగించింది. పరిహాసాలతో యింటిల్లిపాదినీ పొట్టలుబ్బేట్లు నవ్వించడం ప్రారంభించింది. రూత్ పుణ్యమా అని ప్రీతకళబడ్డ మాయింటికి కొంచెంకొంచెంగా కళాకాంతులు రావడం ప్రారంభించాయి.

ఇదివరలో మాఅమ్మ పెళ్ళిప్రసంగం తెచ్చినపుడల్లా అసలు తాను పెళ్ళేచేసుకోనని పెంకెపట్టు పట్టేది. కాని ఆర్మాండోను కలుసుకున్నప్పుడు అతని గుణగణాలు, అతని ధైర్యసాహసాలు మెచ్చుకుని మారూత్‌గూడా అతన్ని ప్రేమించింది. అతన్నే పెండ్లాడాలని నిశ్చయించుకుంది. ఆర్మాండో అతని స్వగ్రామంలోనే మెడికల్ ప్రాక్టీసు పెట్టి అప్పుడప్పుడే పుంజుకుంటున్నాడు. జరిగిన మేనెల్లో మా మేనత్తతో కలిసి రూత్ కొన్నిరోజులు కాలాసాగా గడుపుదామని కలాంగ్యూట్ వెళ్ళినపుడు, ఆర్మాండో దాన్ని అక్కడకలుసుకుని మాట్లాడాడు. అతనంత అందమైన కుర్రాడు కాకపోయినా, యెవరిపిచ్చి వాళ్ళకానందమన్నట్లు, మా రూత్ అతన్నే వలచింది. దాని కళ్ళకతనే నవమన్మధుళ్లాగా కనిపించాడు కాబోలు. అతన్ని వివాహమాడడం వల్లనే తాను సుఖం అనుభవించగలనని రూత్ ఆశ పెట్టుకున్నది గూడా.

రెండునెలలైన తర్వాత వాళ్ళ వివాహం ఖాయమైంది.

మా అమ్మ ఈ శుభవార్తవిని యెంతో ముచ్చటపడ్డది. కాని రూత్ కూడా తనకుదూరం కాక తప్పదని ఆమె ఆలోచనకు తట్టినప్పుడు హృదయ భారంతో ఆమె కుంగిపోయి ఆ రోజుల్లా వెక్కి వెక్కి యేడుస్తునే ఉండేది,

సాయంకాలమైంది. పొగతో దొడ్డీ, వాకిలీ, యిల్లు నాలుగదుగా చుట్టవేసుకున్నాయి. కాని యీనాడు నీళ్లు వెచ్చపడేటప్పటికి తాతలు దిగి వచ్చేట్లున్నారు. రూత్ విసుగుతో ఆకుల్నీ, గాలిదేవుణ్ణీ శాపనార్థాలు పెడుతున్నది. చేతులు పడేట్లు ఆకుల్ని యెగదోస్తూనేఉన్నది పొయిలో. పొగబాధకు ధారాపాతంగా నీళ్లుకారే కళ్ళతో రూత్ మా అమ్మవద్ద కొచ్చి ఆమెను ఉత్సాహ పర్చడం ప్రారంభించింది.

"నీవుకార్చే ప్రతి కన్నీటి బొట్టుకూ, నిన్ను నూరుసార్లు నవ్విస్తాను చూసుకో అమ్మా! నీవే చూస్తూ ఉందువుగాని ముందెలా సుఖపడబోతున్నావో!"

"రూత్ ముఖంలో స్పష్టంగా ఆందోళనా, ఆతురతా కన్పిస్తున్నది. దాని ముఖంవంక మా అమ్మ అదేపనిగా తేరిపార చూస్తున్నది చూసి చూసి ఒక్కపెట్టున మా అమ్మ యేడుస్తూ "నీవుకాస్తా నీ భర్తయింటికి వెళ్ళిపోతే, బాబూష్, మీ నాన్నతప్ప యింకనాతో యెవరుంటారు? బావురుమనే లంకంత యింట్లో ఒక్కతెనూ యెలా ఉండగలను! ఒకప్పుడు పిల్లా, జెల్లాతో అల్లారుముద్దుగా కళకళలాడుతూ ఉన్న యీ యిల్లు యీ రోజున బోసిపోతూంది. నన్ను విడిచిపెట్టి యెవరిదారిని వాళ్లు వెళ్ళిపోతున్నారు," అంటూ తనలోతాను గొణుక్కొంటూ ఒక్కనిట్టూర్పు విడిచింది.

"సంవత్సరంలో ఆరుమాసాలు నీదగ్గరే వచ్చి ఉండిపోతానంటిని గదే అమ్మా! ఎందుకదేవనిగా అనుకున్నదే పదిసార్లనుకుని దిగులుతో కుళ్ళిపోతున్నావు!" అన్నది రూత్.

"నీవు వెళ్ళిపోతావంటె, నేను పడేవిచారం నీకు తెలియదే అమ్మాయి! నీవు పెళ్ళాడబోతున్నావంటే విని యెంతో సంతోషించాను. కాని మేరియా యిల్లువిడిచి పోయినతర్వాత, నీవుగూడా నేడో రేపో వెళ్ళిపోతావని తలుచుకుంటేనే, నాగుండెల్లో రాయిపడ్డట్లుంది. బ్రతికి నన్నాళ్ళు ఒక్కతెనూ యెలా కాలంవెళ్ళదీయాలో తోచడంలేదు. నీవసలు పెండ్లే చేసుకోకుండా ఉండేదాగుండు ననిపించింది ఒక్కొక్కప్పుడు. ఒక్కొక్కబిడ్డను దూరంచేసుకునే తల్లి బతుకు యెంత దుఃఖ భాజనమైనదో పసిపిల్లవు నీకుతెలియదు" అన్నది మాఅమ్మ.

రూత్ తల్లిని ఓదార్చుతూ "నీవు మాట్లాడేమాటలు యెవరైనా వింటే, యేమనుకుంటారో తెలుసా అమ్మా? నీబిడ్డలందరూ చనిపోయారు కాబోలనుకుంటారు. బిడ్డలందరూ నిన్ను వదిలేసిపోయారని ఆవేదన పడుతున్నావు! బిడ్డలకేంకరువే! నన్ను పెళ్ళాడనీ, యెందరు బిడ్డల్ని కంటానో చూద్దువుగాని! ఇంటినిండా పిల్లలే! గీ జాఅంటూ, "అమ్మమ్మా" అని పిలుస్తూ కావలసినంత సందడిచేస్తారు. ఇంకోవిషయం ఆలోచించడానికి నీకప్పుడు ఒకనిమిషంగూడా తీరికఉండదు చూసుకో!" అన్నది రూత్.

మా అమ్మ పెదిమలు బిగించి, గజగజ వణకుతూ, రూత్‌వంక యింకా చూస్తూనే ఉంది. రూత్‌కు సమాధాన మేమీ చెప్పలేక ఒకటి రెండు నిమిషాలు మౌనంగా ఉండిపోయింది. రూత్‌కు విస్మయం కల్గించేట్లుగా "అసలు నీవు పిల్లలే పుట్టకపోతే బాగుండు ననిపిస్తున్న

దమ్మా! నాకిందరు పిల్లలుండి నేనేం సుఖపడ్డాను, నీవు పిల్లలతో సుఖపడ్డానికి! మనబోటి నిర్భాగ్యులకు పిల్లలవల్ల కష్టాలూ, నలుగురిలో అవమానం, అప్రతిష్టా తప్ప, వీసమెత్తుగూడా సంతోషం లేదనుకో!" అన్నది మా అమ్మ.

"అమ్మా యేం అలా అంటావు? పిల్లల్లేకపోతే యెలా......?"

"అవునే రూత్! అవును! నేనన్నమాట అక్షరాల నిజం? స్వానుభవంమీద చెబుతున్నాను! చూడు ఆంటూ యేం చేశాడో! రోబు భ్రష్టుడై పోయాడుగదా! చికో ఉత్తరం ముక్కగూడా వ్రాయడంలేదు. చూస్తున్నావుగదా! ఇన్ని బాధలూ వీళ్లతో పడడం నీవు ప్రత్యక్షంగా చూస్తూనే వున్నావు గదా? నీకీ నరక బాధ జన్మ జన్మాలకు వద్దని వెయ్యి దేవుళ్ళను ప్రార్థిస్తున్నా. నేననుభవిస్తున్నవి చాలునమ్మా చాలు" అన్నది మా అమ్మ విచారంతో గూడిన విసుగుతో.

"అయితే అలా అంటున్నావుగాని, మత గురువులైన నీ యిద్దరి కొడుకుల సంగతేమంటావు? త్వరలో సన్యాసిని కాబోతున్న మరో కూతురు విషయమేమంటావు? ఏడ్రియానో బుద్ధి మంతుడుగా! వాడి సంగతేమంటావు? డాక్టర్‌ను చేపట్టబోతున్న నా అదృష్టాని కేమంటావు? మమ్మల్నందర్నీ ఆశీర్వదించి మా క్షేమం కోరుతూ దైవ ప్రార్థనలతో సుఖంగా కాలం వెళ్ళబుచ్చక, యెందుకలా దిగులుతో దిగనాసిల్లి పోతావమ్మా!" అన్నది రూత్.

"అవునే రూత్! నీవన్న విషయాలన్నీ నాకు తెలియక కాదు! ఈ సంతోషమంతా ఒక యెత్తూ, ఆంటూ, లక్ష్మి మనకు చేసిన అపకారం, అవమానం మరొకయెత్తూ. ఈ విషాద సంఘటన నా కడుపులో చిచ్చుపెట్టి నన్ను దహించి వేస్తున్నదే. దీన్ని జన్మాంతరం వరకూ మరవలేనే!"

రూత్ పెళ్ళి యేర్పాట్లు చురుకుగా సాగుతున్నాయి. మా యింట్లో జరగబోయే మొదటిపేళుకయిదే. అంచేత మానాన్నా, మా అమ్మా యీ వివాహాన్ని గొప్పగా చేయదల్చుకున్నారు. పెండ్లికెవరెవర్ని పిలవాలో ఒకపెద్ద జాబితాగూడా అప్పుడే తయారు చేస్తూ కూర్చున్నారు. పేదలూ, ధనికులూ అనే విచక్షతలేకుండా, మావూళ్లోవాళ్ళ పేర్లన్నీ జాబితాలో కెక్కాయి. ఇరుగుపొరుగు గ్రామాల్లో గూడా చాలామందిని జాబితాలో చేర్చారు.

"వెర్రివెర్రి ఆలోచనలు పోకండి మీరు టాబ్! ఇంతమందిని యెలా పిలుద్దామనుకున్నారు చెప్పండి! వీళ్ళందరికీ యెక్కడ వసతి చూపిస్తారు? యెలా సంబాళిస్తారు?" అన్నది మా అమ్మ.

"ఎలాగో అలా వసతి యేర్పాటుచేస్తే సరిగా! నీకేందుకాగొడవ నాస వదలిపెట్టెయ్! ఆవిషయం నేను చూసుకుంటాగా! ఈ ఉత్సాహ సమయంలో పందలమంది జనం మన సంతోషంలో పాలుపంచు కోవాలని నా కోరిక!" అన్నాడు మా నాన్న.

"మీకోరిక బాగానే ఉంది. ఆవిషయానికొస్తే, నాకు మాత్రం వేడుకగాదా యేం! పచ్చని యింట్లోకి పదిమంది పిన్నాపెద్దావస్తే నాకూ సంతోషమే! అయితే వీళ్ళందరికీ భోజనాలెలా పెట్టగలమనే నా బాధ! ఎంతఖర్చవుతుందో లెక్కవేశారా?"

మా నాన్న ఒక్కసారిగా ముఖం గంభీరంగా పెట్టాడు. ఆయన ముఖాన నాగటిచాళ్ళలా గీత లేర్పడ్డాయి దీర్ఘాలోచనతో. ఆయనకళ్ళల్లో కాంతిమందగించింది. మా అమ్మ వంక కాసేపు అదేపనిగా చూసి తర్వాతశూన్యంలోకి దృష్టిమరల్చాడు. "డబ్బుసంగతా! ఓరి భగవం తుడా! దాన్నిగురించి నేనసలు ఆలోచించనే లేదు! ఇంతడబ్బు నే నెక్కడ తేగలనో తోచడంలేదు!" అన్నాడు మానాన్న గొణుగుతూ.

యుద్ధం కారణంగా మా గోవా ప్రజల జీవితం విచ్ఛిన్నమైంది. జీవితావసర వస్తువులు కంటికి కరవైనాయి. పంచదార, కిరసనాయిలు మొదలైన పదార్థాలు బంగారం అమ్మినట్లు అమ్ముతున్నాయి. బియ్యం ధర చుక్కలు చూస్తున్నది. కూలీ రైతుల అందుబాటునుండి యెప్పుడో దాటిపోయింది. ప్రతి వస్తువుకూ, ప్రతి ఆహారపదార్థానికీ, మా ప్రజలు మొహంవాచి పోయినారు. మామూలుగా భారతదేశంనుండి దిగుమతయ్యే గొడ్డుమాంసం గూడా యిప్పుడు ధారాళంగా రావడంలేదు. ఉత్పత్తయ్యే మాంసంలో అత్యధిక భాగం బ్రిటిష్ సైన్యమే మింగివేస్తున్నది. కాగా పోగా సారాయి ఒక్కటే పుష్కలంగా తయారయ్యేవరకు. మా ప్రజలు సారాయి కడుపునిండా తాగి తమ దుఃఖాలనూ, ఆకలి బాధనూ అణచు కుంటున్నారు.

మామూలు రోజుల్లోగూడా మానాన్న ఆర్థికపరిస్థితి చెప్పదగినంత మెరుగనవానికి వీల్లేదు. ఇప్పుడాయన సంసార ఖర్చులు ఆయన స్థితిని మించిపోయాయి. పిల్లల చదువుకోసం యిదివరకే ఆయన భూస్వాముల వద్ద రుణాలు చేశాడు. అనుకున్న ప్రకారం సకాలంలో తీర్చలేక పోవడంవల్లా, నీరసించి పోతున్న ఆర్థిక పరిస్థితివల్లా, భూస్వాము లాయనకు కొత్తగా అప్పులిచ్చే ఆలోచన మానుకున్నారు. పై పెచ్చు లోగడ యిచ్చిన బాకీలు త్వరలో తీర్చమని వత్తిడిచేస్తూ, కారాలూ, మిరియాలూ నూరుతున్నారు. మానాన్నకీ పరిస్థితిలో భూస్వాముల వద్ద అప్పుపుట్టే ఆశగూడా అంతరించింది.

ఈ ఆర్థిక దుస్థితిలో రూత్ పెళ్ళి జరుగ బోతున్నది. అయితే ఆశారేఖ ఒక్కటే ఒక్కటి కన్పిస్తున్నది. ఆర్మాండో కట్నం వద్దంటే వద్దని గట్టిగా నిరాకరించాడు. రూత్ వివాహం కట్నం యివ్వకుండా జరుపుతున్నందుకు మమ్మల్ని మేమే అభినందించు కోవాలి.

మే మిప్పుడు పడే బాధల్లో యిది కొంతవరకు గుడ్డిలో మెల్ల. అప్పిచ్చే వాళ్ళెవరూ మా వూళ్ళో లేనందు వల్ల పెళ్ళిఖర్చు కొంతవరకు తగ్గించు కోక తప్పలేదు. అతిధుల జాబితానుంచి యింకాచాలా పేర్లు కొట్టివేయ బడ్డాయి. కొట్టివేతలతోనూ, తుడుపులతోనూ ఉన్న ఆ జాబితా చూస్తే, పిచ్చివాడు గుడ్డియెద్దును అడ్డంపెట్టుకుని దున్నుకుంటున్న పొలంలా ఉంది.

"రూత్ పెళ్ళి కట్నం కానుక లవేవీ లేకుండానే జరుపు కుంటు న్నాం గనక, కనీసం దానికి విలువైన గుడ్డలన్నా పుష్కలంగా కుట్టిం చాలండీ!" అన్నది మా అమ్మ. దాన్ని రాణీలా అలంకరించి ఘనంగా పెళ్ళిచేయాలని మాఅమ్మ ఉబలాటం. తనకునచ్చిన గుడ్డలు కొనడానికి మా అమ్మ రెండుసార్లు మార్గోనగరానికి వెళ్ళివచ్చింది. ఆ ప్రాంతంలో కల్లా అందంగా ఫ్యాషనుప్రకారం కుట్టే పేరుమోగిన దర్జీవాళ్ళను కబురుచేసి పిలిపించింది. నాజూకు గుడ్డలను తానుతానులు వరండాలో వేసుకుని దర్జీవాళ్ళు రాత్రింగళ్ళు కుడుతున్నారు. కొత్తఫ్యాషన్ల ప్రకారం అందమైన డ్రెస్సులు తయారౌతున్నాయి. రాత్రిళ్ళు నిద్రపోయే సమ యంలో ధరించుకునే కొన్ని రకాల ఉడుపులకు అంతనాజూకైన గుడ్డను వృధాచేయడం వట్టిదండుగా, వళ్లు పై తెలియని తనం అని నేననుకున్నాను. వరండాలో గుట్టలుగుట్టలుగా తయారౌతున్న డ్రస్సులు చూస్తుంటే, నాకళ్లు జిగేలు మన్నాయి.

ఒకనాడు దర్జీవాళ్ళు గుడ్డలు కుడుతున్నప్పుడు రూత్ వాటివంక అదేపనిగా చూస్తూ, ఆకస్మికంగా మాఅమ్మవైపు తిరిగి, "అమ్మా! ఇంతంత విలువైనగుడ్డలు కుట్టిస్తున్నావుగదా! కట్టుకుని అనుభవించే అదృష్టంలేక అకస్మాత్తుగా నేను చచ్చిపోతాననుకో! అప్పుడు నీకెంత ఆశాభంగం కలుగుతుందో అని ఆశ్చర్యపడుతూ ఆలోచిస్తున్నానే!"

అన్నది రూత్. ఏదో జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్లుగా ఒక క్షణం నిదానించి, "నిజంగా అమ్మా! ఎందుకోగాని, యీ ఆలోచనలే నామనస్సుకు మాటిమాటికీ తగులుతున్నవి!"

"ఛీ, నోరుముయ్! అమంగళం మాట్లాడకు!" అని మందలించింది మా అమ్మ. యథాప్రకారం జాకెట్టుపైన లేసుతో నగిషీకుట్టు కుట్టడం సాగిస్తూపోతున్నదామె.

"నిజంగానే అమ్మా! అబద్ధం ఆడుతున్నాననుకున్నావా? నాచిన్నతనంనుంచీ యీ ఆలోచనలు నన్ను వెంటాడుతూన్నాయి. ఈక్షణం వరకూ నన్ను వదిలిపెట్టలేదు. ఈ డ్రెస్సుల్లో ఒక్కటైనా వేసుకోకుండా ఉన్నట్లుండి నేను చనిపోతే యేం జరుగుతుందే అమ్మా? నా సమాధిలో నాకు మనశ్శాంతీ ఉండదేమో! అంతేనా?" అన్నది మళ్ళీ రూత్.

"అవునేమో లేవే!" అన్నది మా అమ్మ వ్యంగ్యంగా. "నీవు అహంకార స్వాతిశయాలతో యెప్పుడూ పనికి మాలిన ఆలోచనలు ఆలోచించడం వల్లే నీ మనస్సుకు పిచ్చి పిచ్చి ఊహలు పుడుతున్నాయి. ఐహిక సుఖాలు పట్టించుకోక సాధ్యమైనంత వరకు వాటికి దూరంగా ఉండిపోవడానికి ప్రయత్నించాలి. అలా అయితే యీ పిచ్చి ఆలోచనలే రావు నీ మనస్సులోకి; ఈ విధంగా నీవు బాధ పడవు!" అన్నది మా అమ్మ.

అక్టోబరు నెల సూర్య రశ్మి అతి ప్రకాశ వంతంగా ఉంది. సాయంత్రం చల్లని మంద మారుతం హృదయానికి గిలిగింతలు పెడుతూంది. పెళ్ళి యేర్పాట్లుతో పాటు, దర్జీవాళ్ళు తయారు చేస్తున్న రకరకాల డ్రెస్సులన్నీ పూర్తికావచ్చాయి. రూత్‌కు అండర్‌వేర్‌పైన ప్రత్యేకమైనమోజూ, అభిమానమూ. తనమనస్సుకు నచ్చినట్లు తానే స్వయంగా

వాటిని కుట్టుకోదలచింది అందంగా. ససేమిరా దర్జీవాళ్ళ కివ్వనని మొరాయించింది. యిరుగుపొరుగు స్నేహితురాళ్ళంతా అండర్ వేర్లను నాజూకుగా తయారు చేయడంలో రూత్‌కు సహాయపడుతున్నారు. ఒకనాటి సాయంత్రం స్నేహితురాళ్ళు మా యింటి కొచ్చారు పనిమీద. అప్పుడే సూర్యాస్తమయం కాబోతుంది. అస్తమించే సూర్యభగవానుడు కేసరీ, సువర్ణ ఛాయలతో పడమర దిక్కును ధగధగ మెరిసిపోయేట్లు చేస్తున్నాడు. అండర్ వేర్సు, లేసులతోనూ, గుండీలతోనూ అలంకరిస్తూ రూత్ స్నేహితురాళ్ళు ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. మధ్య మధ్య పరిహాసాలతో, పకపక నవ్వులతో, మా యింటి కప్పుడే పెళ్ళి కళ తెస్తున్నారు. వాతావరణమంతా అప్పుడే, పెళ్ళి యివ్వాళా రేపా అన్నట్లు సందడిగా ఉంది. ఎక్కడ యెవరినోటా విన్నా పెళ్ళి కబుర్లే. ఇదంతా చూస్తూంటే, మా చిన్నతనపు రోజులు జ్ఞప్తికి వచ్చాయి నాకు.

" జాగ్రత్తసుమా రూత్ ! అండర్ వేర్లను యింతకష్టపడి తయారుచేస్తున్నాం ! మొదటిరాత్రి మీ ఆయన చించకుండా చూసుకో !" అంటూ అప్పుడే లేసుతో తయారైన అండర్ వేర్‌ను చూపిస్తూ బీట్రిజ్ సరసాలాడింది. రూత్ సిగ్గుతో తలవంచుకుంది. చుట్టూ కూర్చుని యెగతాళి పట్టించడానికి సిద్ధంగా ఉన్న స్నేహితురాళ్ళందరూ బీట్రిజ్ మాటకు పకపకా నవ్వారు.

"నంగనాచుల్లా అమాయకంగా కనిపించే యీ మగాళ్ళంతా కొండజాతి సరుకే ! ఎలా నడుచుకుంటావో మరి ! జాగ్రతగా, మెలకువతో మాత్రం సంచరించుకో !" సలహాయిచ్చింది జేలా. ఆమాట కామాటకు పకపకలూ, వికవికలూ యెక్కువైనాయి చలోక్తులతో.

ఇదేధోరణిలో స్నేహితురాళ్ళు కొన్నాళ్ళవరకూ రూత్‌ను పరిహాసాలతో విసిగించడం సాగించారు. ఒకనాటి సాయంత్రం మామూలు

ప్రకారం వాళ్లయింటికి వచ్చినపుడు, రూత్‌కొంచెం అస్వస్తతతో పడుకునిఉంది.

"ఏమిటే రూత్! రోగంతో మంచంలో పడుండాలని మన సైందా యిప్పుడు? పెళ్ళిసందడేమిటీ, యీపడుకోవడమేమిటే! చాలు చాలు! లేలే! జ్వరమూలేదు గిరమూలేదు! లేలే!" అన్నది బేలా.

"కాదే బేలా! చాలాబాధగావుంది! విపరీతంగా జ్వరం వచ్చినట్లు లోపల మంట మండిపోతున్నది!" సమాధానమిచ్చింది రూత్.

"బాగా అలిసిపోయి వచ్చిన జ్వరంలేవే అది! కంగారుపడకు!" అన్నది బేలా. అందరూ రూత్ మంచంచుట్టూ కూర్చుని ఊళ్లోముచ్చట్లు ఒకసారి చెప్పుకుని యెవరికితోచినవ్యాఖ్యానాలు వాళ్లు చేస్తున్నారు.

బేలా అన్నట్లు, అలుపువల్లా, ఆందోళనవల్లా వచ్చిన జ్వరమేమో అనుకున్నాం మొట్ట మొదట. తీరా మూడోరోజు జ్వరం ముట్టుకోనివ్వకుండా ఉధృతంగా వచ్చేసరికి, డాక్టర్ ఆక్వినోగూడా ఆందోళన మొదలెట్టాడు.

"టైఫాయిడ్ జ్వరం కాదనుకుంటా నమ్మా యిది! ఏజ్వరమయిందీ యిప్పుడే నిర్ణయించి తేల్చిచెప్పడం కష్టం. ఏమైనా టైఫాయిడ్ మాత్రం కాదనే నానమ్మకం" అన్నాడు డాక్టర్ మా అమ్మతో.

"ఓ!........టైఫా....... టైఫాయిడ్!" అని గొణుగుతూ మా అమ్మ పూర్తిగా కంగారెత్తి, మనస్సు మనస్సులో లేకుండాపోయింది. "అలా చెప్పకండి డాక్టరుగారూ........ ఎంత భయంకరం ........ఎంత ఘోరం........నేనేం చేసేదిప్పుడు......"

మా అమ్మ విచారంలో మునిగిపోయిందని డాక్టర్ గ్రహించి ఆమెను ఓదార్చడానికి ప్రయత్నించాడు,

"దిగులు పడకమ్మా! ఒకవేళ టైఫాయిడైనా, నేను నయం చేస్తే సరిగా! నాకొదిలేసెయ్యండమ్మా! నాకొదిలేసెయ్యండి!"

మాయిల్లంతా మళ్ళీ విషాదచ్ఛాయలు అలముకున్నాయి. ఎవరి ముఖానా జీవకళలేదు. తర్వాత రెండురోజులవరకూ రూత్ పరిస్థితిలో యేమాత్రం అభివృద్ధి కనిపించలేదు. మాఅమ్మ దిగులుతో కుమిలిపోతున్నది. రాత్రింబగళ్లూ రూత్ మంచంసరసనే కనిపెట్టుకునికూర్చున్నది. మధ్యమధ్య కునికిపాట్లు పడ్డప్పుడు, కూర్చోలేక చెంగువాల్చుకుని కటికినేలమీదనే ఒకనిమిషం ఒత్తిగిలేది. ఎడతెగకుండా దైవప్రార్థనలు చేయసాగింది రూత్ ఆరోగ్యం కుదటపర్చమని. కునుకు పట్టుతూండగానే, యింతలో తెప్పరిల్లుకుని, ప్రతి ఐదునిముషాలకూ, రూత్ నొసలుపట్టి చూస్తూ, త్రాగడానికేదైనా ఆహారంకావాలేమో అడుగుతూండేది.

"అంత దిగులు పెట్టుకోకమ్మా! నేనుచావన్లే! ఈజ్వరం మేం చేస్తుందినన్ను! కొద్దిరోజుల్లోనే నెమ్మదిస్తుందిగా!" అన్నది రూత్ చిరునవ్వు నవ్వుతూ. దిగులుతో కుళ్ళిపోతున్న మాఅమ్మకు తానే ధైర్యం చెబుతూంది.

"ఇస్స్! మాట్లాడకమ్మా రూత్! మాతల్లివికాదూ, మాట్లాడకు! ఒక్కమాటగూడా మాట్లాడవద్దని డాక్టరుగారు మరీమరీ చెప్పిపోయారు. నీకు పూర్తిగా విశ్రాంతికావాలట!" అన్నది మాఅమ్మ.

"పోవేఅమ్మా! నీవోపిచ్చిదానివి! డాక్టరు వల్లించే ప్రతి అక్షరం నీవందుకుంటావేం! అన్నదిరూత్. డాక్టరు సలహాఅంటే దాని కిష్టంలేదసలు, "నాకు లేటగాఉన్నదీ లేనిదీ నిర్ణయించాల్సింది డాక్టరా,

నేనా చెప్పవేసీవు? నాఒంట్లో యెంతో బాగుందిప్పుడు తెలుసా! విశ్రాంతి కావాలని నాకు లేనేలేదు మనస్సులో!"

"కాదు కాదు! నీవసలు మాట్లాడనేకూడదు. నేనుచెప్పింది వినమ్మా! నీవు చిన్నపిల్లవు! నీకింకా యేమీతెలియదు. నేను అమ్మనుకదూ! పెద్దదాన్నిగదూ! నామాటవిను!" అన్నది కాసేపు మాఅమ్మ బ్రతిమిలాడుతూ, కాసేపు మందలిస్తూ.

మాఅమ్మ రూత్‌ను యెంత బ్రతిమాలుకున్నా, అది అంతు లేకుండా వాగుతూనే ఉంది. ఒకనాటిఉదయం మాఅమ్మ యెవర్నీ రూత్ పడుకున్నగదిలోకి పోనివ్వలేదు. ఎవ్వరూ దాన్ని పలకరించక పోతే. కాసేపయినా విశ్రాంతి తీసుకుంటుందేమో అని ఆశపడ్డది. కాని రూత్ పెద్దపెట్టుగా అరుస్తు, కేకలేస్తూ గందరగోళం చేయసాగింది. మాఅమ్మ ఆశకాస్తా అడియాసైంది.

రూత్ జ్వరంతో బాధపడుతూందని ఆర్మండోకు జరూరుగాకబురు పోయింది. అతను తక్షణంవచ్చి మాయింట్లోవాలాడు. మాతో మాదిరే అతనితోగూడా రూత్ పరిహాసంగా మట్లాడటం ప్రారంభిం చింది. ఆర్మండోకు కబురుపంపడం దానికిష్టంలేదు. కాని మా నాన్నకు కాళ్ళాడక జ్వరం అయిదోరోజున ఉత్తరంవ్రాసి మనిషిద్వారా కబురుపంపాడు ఆర్మండోకు.

ఆర్మండోను చూడగానే రూత్ ఆశ్చర్యపోయింది. మళ్ళీ మామూలుధోరణికివచ్చి, ఆర్మండోచేతిని తనచేతితో పట్టుకొని అతన్ని తనదగ్గరకు లాక్కుంది. "చూడు డాక్టర్ నేనెంత బలంగాఉన్నానో!" అన్నది. ఒకటిరెండు నిమిషాలైనతర్వాత, తన మంచంపక్కనే ఉన్న కుర్చీలో అతన్ని కూర్చోమన్నది. "డాక్టర్ ఆర్మండో! నీకిదో

పరీక్ష! నీవుకూడా నాకు పూర్తిగా విశ్రాంతికావాలని సలహా యివ్వ దలిస్తే, నీరోగుల్లో నన్నుగూడా ఒకరోగిగానే పరిగణించుకో. అంతే కాని, నేను నీభార్యనౌతానని యెంతమాత్రం అనుకోవద్దు! కొమ్ములు తిరిగిన యేడాక్టరు సలహానైనా నేనుపాటించను తెలిసిందా!"

ఆర్మండో నవ్వుతూ, "డాక్టర్లంటే నీకెందుకంతమంట రూత్?" అన్నాడు. రూత్ చురుకుగా, ఉత్సాహంగా, తెలివిగా మాట్లాడు తున్నందుకు అతని ఆందోళన కొంతతగ్గినట్లు కనిపించాడు. "డాక్ట ర్లంటే నీకు అభిమానమనీ, అందులో ఒక డాక్టరును నీవు ప్రేమించి నందుకు నీవు గర్వపడుతున్నావనీ అనుకుంటున్నాను! ఏమంటావు?" అంటూ మాఅమ్మను థెర్మామీటరు తెమ్మన్నాడు ఆర్మండో.

"డాక్టర్లంటే నాకభిమానమా! ఎవరిచ్చారీ తప్పుడుఅభిప్రాయం నీకు?" అన్నది రూత్ గాభరాగాచూస్తూ. పసిబిడ్డలమాదిరిగా కోపంతో పెదవులు విరిచి మూతి ముడుచుకున్నది. "నాకు డాక్టర్లంటే చెప్పరాని అసహ్యం. నేను పసిపాపగా ఉన్నరోజుల్లో, డాక్టర్ ఆక్వినో ఒక రోజున టీకాలు పొడిచాడు. నాకెంతో బాధకల్గించాయి. ఆనిమిషం నుంచీ డాక్టర్లమీద పగసాధించాలని శపథంపట్టాను. అందుకే డాక్టర్, నిన్ను పెళ్ళాడబోతున్నాన్నేను! తెలిసిందా? మగవాణ్ణి యేడిపించి యెర్రిమన్ను చేయాలంటే, భార్యకన్నా మరెవరు చేయగలరాపని?"

పక్కఉన్న మావాళ్ళందరూ పకపక నవ్వారీమాటలువిని. రూత్ మళ్ళీ తనధోరణి ప్రారంభించేలోగానే థెర్మామీటర్ దానినోట్లోపెట్టారు. ఒకనిమిషం అంతా మౌనంవహించారు. ఆర్మండో థెర్మామీటర్ దాని నోట్లోనుండి బయటికి తీశాడు. అతని ముఖవైఖరిలో అపనమ్మకం, ఆదుర్దా సమ్మిళితంగా కన్పించిందినాకు. థెర్మామీటర్‌వంక మళ్ళీచూసి

తక్షణమే రూత్ ముఖంవైపు దృష్టిమరల్చాడు. నాడిగూడా పరీక్ష చేశాడు.

ఆర్మండో కళ్ళు చిన్నవిగాచేస్తూ, "నీవు తమాషాపిల్లవిరూత్! ఒకపంక నీశరీరం కుంపటిలా మండిపోతూంది; మరోవంకచూస్తే యేమీ బాధలేనట్లే నటిస్తున్నావునీవు! నీకు నిజంగా బాధలేదా, ఉన్నా లేనట్లు నటిస్తున్నావా?" అన్నాడు ఆర్మండో.

"ఇందాకటినుండీ ప్రతిమనిషికీ నేనుచెబుతున్నమాట అదే! నా వంట్లో హుషారుగా, హాయిగాఉంది! ఒకసారి పరుగెత్తి చూపించ మంటావా?" అన్నది రూత్ ఖంగుఖంగుమనే కంఠధ్వనితో.

"పరాచకాలకేంగాని, యిప్పుడైనా నేనుచెప్పేమాట అర్థం చేసుకో. నిజం మాట్లాడుకుందాం! నీకు జ్వరం చాలా తీవ్రంగా ఉంది. థెర్మామీటర్ అబద్ధం చెప్పదుగా! మనపెళ్ళి యింకారెండు నెలలుంది. అందుకని నీవు జ్వరం త్వరలో కుదుర్చుకొని పూర్తి ఆరోగ్యం చేకూర్చుకోవాలి తెలిసిందా? మంచిపిల్లలా ప్రవర్తిస్తావుగదూ! శరీరం, మనస్సూ అనవసరంగా ఆయాసపెట్టుకొని కంగారుపడబోకు!" అన్నాడు ఆర్మండో.

మంత్రించినట్లుగా రూత్ ఒక్క రెప్పపాటుకాలంలో అమాయ కురాలుగా, విధేయరాలుగామారి, ఆర్మండోవంక చూసింది. చెదిరి పోయి చిక్కుపడ్డ తలవెంట్రుకలూ, జాకెట్టూ, గౌనూ, బ్లాంకెట్టూఅన్నీ సరిగా సర్దుకుంది. ఆర్మండో ఉపదేశం రూత్‌కు ఉపశమనం కల్గించి శాంతి పరచినందుకు మాఅమ్మప్రాణం కుదుటపడింది ఒక్క క్షణంసేపు. అంతలోనే తన అభిప్రాయం మళ్ళీ మార్చుకోవాల్సి వచ్చింది.

"ఏమిటీ గడబిడ డాక్టర్?" అన్నది రూత్ చిరాకుతో. "నేను కనీసం మాట్లాడనైనా మాట్లాడగూడదా? నీవనేదాంట్లో అర్థంలేదు!

మీడాక్టర్లవల్ల రోగులకు ఉపకారంకన్నా అపకారమే యెక్కువ జరిగేట్టుంది. మీతో పడలేకుండా ఉన్నాంబొత్తిగా. కాస్తంతఉంటే గంపంత చేసి చెప్పడం మీడాక్టర్లకే తగిపోయిందయ్యా! చిన్న తలనొప్పి, జలుబుఖారం చేసినంతమాత్రాన్నే, గోరంతలు కొండంతలుచేసి గాభరా పెట్టడం అలవాటైపోయిందిమీకు, ఇలాచేయడం మీవృత్తిరహస్యమేమోమరి! అంతేనంటావా? ఎంతో ప్రమాదకరమైన జాడ్యమని రోగులనూ, వాళ్ళ తల్లిదండ్రులను గాభరాపెట్టటం, తీరా నయమైన తర్వాత ఆకాశంనుండి ఊడిపడ్డ ఉద్ధారికుల్లావేషాలువేయడం. "చూశారా యెంత సేవచేశామో!" అన్నట్లుగా ఒకచేయి వాళ్ళ రొమ్ములమీదవేసుకుని, మరోచేయిని రోగిజేబుల్లో చల్లగాదూర్చడమే డాక్టర్లునేర్చుకున్న విద్య!" అన్నది రూత్.

ఆర్మండోకు నోటినిండా నవ్వువచ్చింది. మాఅమ్మ రూత్‌ను కోపగించుకుంది. రోజురోజుకూ మానాన్నమాదిరి వసపిట్టగా తయారౌతున్నదని మాఅమ్మ రూత్‌ను మందలించింది.

పూర్తివిశ్రాంతి తీసుకోవాలని ఆర్మండో రూత్‌ను యెంతబ్రతిమాలి చెప్పినా, చెవిటివానిముందు శంఖు ఊదినట్లయింది. దానిచేత కనీసం మాట్లాడడమైనా మానేయించలేక పోయాడతను. లేనిపోనివి కల్పించుకుని యెవరెవరి ముచ్చట్లో అస్తమానం చెబుతూనేఉండేది. వినేవాళ్ళే ఉండాలిగాని, దానినోటికి నొప్పిలేదు. అసందర్భమైనకబుర్లు విసుగనేదిలేకుండా చెప్పుకుని పోతూనేఉంది. చివరకు ఆర్మండోకు విసుగెత్తి యింటికిపోవడానికి సిద్ధమై లేచినిలబడ్డాడు. రూత్ అతన్ని చూసి మృదువుగా, "ఆర్మండో, కోపగించుకోకు! నోరుమూసుకుని కూర్చోడం నాచేతగాదు. ఏదో పిచ్చాపాటీ మాట్లాడక ఉండకపోతే నాకేమీతోచదు" అన్నది. అతని రెండుచేతులూ గట్టిగాపట్టుకుని,

"నీఆజ్ఞలను పాలించలేదని నీవేమీ అనుకోవద్దు. ఇప్పుడేగా మనసొచ్చినట్లు మాటలాడేఅవకాశం నాకు కల్గేది! పెళ్ళయినతర్వాత మీఆజ్ఞలను శిరసావహించవద్దూ నేను! ఏం వాగినా, యేంచేసినా, పెళ్ళికాకముందిప్పుడేగా!".

ఆర్మండో రూత్‌గదినుండి బయటపడ్డాడు. రూత్‌నుగురించి మాఅమ్మచెవిలో యేదో రహస్యం చెప్పాడు. వరండాలోఉన్న మానాన్నవద్దకుపోయి కూర్చున్నాడు. రూత్ పరిస్థితినిగూర్చి మానాన్న ఆందోళనపడుతున్నాడు. ఆర్మండో కనిపించగానే, ఆందోళన కప్పిపుచ్చుకోడాని కాయన ప్రయత్నం చేయలేదు. ఉన్నపరిస్థితి నిర్మొగమాటంగా, నిర్భయంగా చెప్పేయ్యమన్నాడు. "జబ్బు యేస్థితిలో ఉంది? నీఅభిప్రాయం ఏమిటి? తీవ్రంగానేఉందికదూ?"

రూత్ తెలివిగా, హుషారుగా, ఉత్సాహంగా ఉండడంచూసి, ఆర్మండో దాన్ని టైఫాయిడ్ జ్వరంగా అనుమానించలేదు. ఒకవేళ తేలికపాటి టైఫాయిడ్ అయినా, యేవిధంగానూ ప్రమాదంలేదనిఅతను ఊహించాడు.

"అయితే కావచ్చు నీవు ఊహించినట్లు!" అన్నాడు మానాన్న కొంచెం ధైర్యంతో. "అంతకంతకూ నాకు పెద్దతనంవస్తున్నది; అందుకే కాబోలు, పిల్లలకు దగ్గొచ్చినా, పడిశెం పట్టినా, ఓటికీమాటికీ ధైర్యం సన్నగిలి గాభరాపడుతున్నాను. గుండెనిబ్బరం సడలిపోతున్నది."

"మీ యింటి పరిస్థితీ, మీ గ్రామపరిస్థితీ చూస్తే, యెలాంటివాడికైనా ధైర్యం చెడుతుంది. అది సహజమే. ఈ పాపిష్టిప్రభుత్వం పాడైపోనూ!" అన్నాడు ఆర్మండో మానాన్నయివ్వబోయిన సిగరెట్టు వద్దంటూ.

మానాన్న అర్మండోవంక పరిశీలనాత్మకంగా చూశాడు. అర్మండో దేన్నిగురించి మాట్లాడుతున్నాడో ఆయనకు బోధపడ్లేదు.

"పోర్చుగీసు పాలనలో ప్రతి గోవాపౌరుడికీ ధైర్యం సడలి పోయింది. వాళ్ళ రాక్షసచర్యలవల్ల ప్రజల్లో భీతావహం యేర్పడ్డది. ఆకలిబాధతో అలమటించిపోతున్నారు. కొన్నికొన్నిగ్రామాల్లో ప్రజలు రోగులుగా వస్తులుంటున్నారు. తిండికరువై కందమూలాలూ, వేళ్ళూ, ఆకులూ గతైనాయి." అన్నాడు అర్మండో ద్వేషం వెలిగక్కుతూ.

"అలాగా?" అన్నాడు మానాన్న. గోవాపరిస్థితులు అంత హీనాతి హీనంగా దిగజారినట్లు ఆయనకు తెలియదు.

"తినడానికేమీలేదండీ! సరైనతిండిలేక, భయంకరవ్యాధులుపట్టి పీడిస్తున్నాయి. ఇలాంటి కేసులన్నీ నేనుస్వయంగా చూస్తున్నాను. తిండిలేక ప్రజలు మలమలమాడిచస్తుంటే, గవర్నరుగారి జన్మదినోత్సవ మంటూ అధికారులు ప్రజల్నిపీడించి చందాలు వసూలుచేస్తున్నారు. ఛీ! ఛీ! ప్రజలప్రాణాలు యింతచౌకపారుగా చూడడం మీరెప్పుడైనా విన్నారూ? ప్రాణాలతో చెలగాటమాడే పోర్చుగీసు హంతకుల పాలన యింకెంతోకాలం ఉండబోదు!" అన్నాడు అర్మండో ఆవేదనతో.

ఇదివరకెప్పుడూ అతనితో మానాన్న రాజకీయాలు చర్చించలేదు. మేరియా వివాహ విచ్ఛిన్నానికి తానే బాధ్యుడనన్న విషయం గుర్తించి అర్మండోకు తన భావాలను తెలియజేయడంలో జాగ్రత్తవహించాడు. ఉద్రేకంతో పైకి పొంగకుండా ప్రతి మాట తూచి మాట్లాడాడు. కాని అల్లుడు కాబోతున్న అర్మండో తనంతటతానే చొరవతీసుకుని పోర్చు గీసుపాలకుల్ని ఖండిస్తుంటే, మానాన్న నిర్ఘాంతపోయాడు. అతని వంక తేరిపార చూశాడు. సంభ్రమాశ్చర్యాలతో, ఆనంద పారవశ్యంతో

ఆయన నోట మాటగూడా రాలేదు. దప్పిక గొన్న మనిషిలా ఆర్మండో మాట్లాడే ప్రతి మాట అమృతంలా స్వీకరించాడు.

"నేను రాజకీయవేత్తను గాను. గోవా పరిస్థితులు యెంత దారుణంగా ఉన్నా, నావంటివాడికెంత ఆవేదన కలిగించినా, నేను నా డాక్టరు వృత్తి కట్టిపెట్టుకుని ఉండవలసిన వాడినే. దానికి భిన్నం రాకూడదు; రాదు, నిజమే! ఆత్మాభిమానం గల యే గోవా పౌరుడూ నేటి పరిస్థితుల్ని హర్షించి ఊరుకోలేడు. మన జాతీయ గౌరవాభిమానాల యెడల పోర్చుగీసు పాలకులు అమానుషంగా ప్రవర్తించినా, దానిగ్గూడా నేనంతగా లక్ష్యం చేయను. కాని యీ ఘోరాన్ని మాత్రం సహించలేం! ప్రజల్ని ఆకలిబాధకు గురిచేసి, ప్రాణాలతో చెల గాటమాడే పోర్చుగీసు రాక్షసత్వాన్ని ప్రత్యక్షంగా చూస్తున్న నాబోటి వాడికూ్కడా పిచ్చెత్తి పోతున్నది. తినడానికి ధాన్యం లేదంటున్నారు! బ్లాక్ మార్కెట్లో చూడండి! ఎంతపుష్కలంగా ఉందో ధాన్యం! ఇతర జీవితావసర వస్తువులు గూడా బ్లాక్ మార్కెట్లో యెక్కడి తొక్కిడిగా ఉన్నాయి. వ్యాపారస్తులు, అధికార్లూ లాయీచీఅయి ప్రజల రక్తమాంసాలు పీల్చుకొని తింటున్నారు. పందులనైనా పాపం దలచవచ్చుగాని యీ రాక్షసిమూకను మాత్రం క్షమించలేం. ఈ ఘోర పరిస్థితిని చూస్తుంటే, నాకు శివమెక్కిపోతున్నది. ఏంమాట్లాడుతున్నానో నాకే అర్థంకావడంలేదు. ఈ గాడిదకొడకుల్ని బజార్లో నిలబెట్టి కొరడాలతో బాదివదలిపెట్టాలి. ఇలాంటి ప్రభుత్వం వల్ల యేంప్రయోజనం? అన్నాడు ఆర్మండో.

ఆర్మండో మాయింటినుంచి బయలుదేరే సమయానికి అస్తమానమైంది. ఆకాశం నీలిరంగులో ఉంది. అక్కడక్కడా దూది బంతుల్లా తెల్లని మబ్బులు కన్పిస్తున్నాయి. మానాన్న మెట్లుదిగి వీధిగుమ్మంలోకి

పోతున్నాడు. ఆకాశంపంక దృష్టి నిగిడ్చి ప్రకృతి సౌందర్యం ఆనందిస్తు న్నాడు. రూత్ ఖాయిలా ప్రమాదకరమైనది కాదని ఆయన లోలోన సంతోషం పడుతున్నట్లు నాకర్థమైంది. త్వరలో దానిరోగం నయమౌ తుందనీ, తనకు మనసారా నచ్చిన యువకుడు అల్లుడుకాబోతున్నాడనీ మా నాన్న మురిసిపోతున్నాడు. ఇంతలో ఒక పెద్ద అగ్ని గోళంలా చర్చివెనుక ప్రక్కనుంచి చంద్రోదయం అయింది. మా గ్రామం అంతటిపైనా బాలచంద్రుని అరుణ కాంతులు ప్రసరిస్తున్నాయి. అంత కంతకు పైపైకి వస్తున్న చంద్రబింబం అలిసిపోయినట్లుగా వెలవెల బోతున్నది. వెలవెలబోతున్న చంద్రబింబం తన ప్రతి బింబాన్ని సరస్సుల్లో చూసుకుని, తన అహంకారం అణగినందుకు తలపంచుకుని సిగ్గుపడుతున్నది. అదివరదాకా అక్కడక్కడా వెలిసుబ్బులు వేసిన ఆకాశం అంతలో నీలిరంగుకుమళ్లింది.

చంద్రబింబంలో వచ్చిన మార్పులా గాక, మారూత్ జ్వరం కొన్ని రోజులవరకూ యేవికారాలకూ లోనుగాక, అలాగే నిలబడి ఉంది. చివరకు పంధొమ్మిదో రోజున జ్వరం నిశ్శేషంగా హరించి పోయింది. మేమంతా ఎంతో సంతోషించాం. ఆ రోజు మాకోపండుగ లా ఉంది. మా భుజాలమీదనుంచి పుట్టెడు బరువుదించుకున్నట్లు నిట్టూర్పు విడిచాం.

ఆనాడువయం రూత్ మాఅమ్మనుపిలిచి, "దర్జీవాళ్లను ఎప్పుడు పిలుస్తావే అమ్మా? ఇప్పుడు నాజ్వరం నయమైపోయిందిగా! మళ్లీ వాళ్లపని సాగించవచ్చుగా! ఏమంటావమ్మా?" అన్నది.

"వాళ్ల విషయం నీవు మరేంబాధపడకు. నీ వళ్లు బాగానయం చేసుకుని బలంపుంజుకో! దర్జీవాళ్లసంగతి మేం చూస్తాంగా,"

రోజులు గడిచిపోతున్నాయి. మా అమ్మ తన గది దగ్గరకు వచ్చినట్లు అలికిడికాగానే రూత్ మాట్లాడం తగ్గించడానికి ప్రియత్నిస్తుండేది. కాని ఆమె మళ్ల ముడ్డి మలపగానే, అదియెప్పటట్లే పిట్టవాగినట్లు వాగి చివరకు అలిసి దిండుపైన పడుండేది. డాక్టరు సలహాగూడా అతిక్రిమించి, గదిలో అటూ యిటూ పచార్లు చేయడం మొదలెట్టింది. ఒక్కొక్క సారి ఒంటికాలిమీద నడపగల నేమోనని ప్రియత్నించిందిగూడా.

బుధవారంనాడు రూత్ ఒంటికాలిమీద నడవడానికి ప్రియత్నిస్తుండగా నాకు కోపం వచ్చింది. "డాక్టరుగారి సలహా యెందుకు వినవే రూత్? ఎవరేంచెప్పినా, నీ మంచికోసమే అని తెలుసుకోవే!" అని గద్దించాను.

"నీవు గూడా ముసలాళ్లలా నసపెట్టకన్నయ్యా! అయిన వాళ్లూ కాని వాళ్లూ నన్ను యిది చెయ్యొద్దు, అది చెయ్యొద్దు అంటూ వత్తిళ్లు పెట్టడం చాలు! డాక్టర్లు బాధ పడలేకుండాచస్తున్నాం! ఏమీలేకపోయినా ఆర్భాటం చేయడం వాళ్లకో జబ్బు అయిపోయింది. వాళ్ల సలహాలను మనం యెంత తక్కువగా వింటూంటే అంత యెక్కువ కాలం మనం బతగ్గలుగుతాం? అన్నది రూత్.

"తక్కిన డాక్టర్లు పోనీ వెర్రిపుల్లాయిలే అనుకుందాం! మరి మీ ఆర్మండో మాటేమిటి? నీ యోగక్షేమం కోరేవాడేగదా అతను! ఆయన గూడా నిన్ను పూర్తి విశ్రాంతి తీసుకోమన్నాడుగా మరి! దానికేమంటావు? అన్నాన్నేను.

"పోరా నీవు బాటూష్! తక్కిన వాళ్లలా నీవు గూడా యీ కొంపలో నాకో శనిగ్రిహానివై పోయావు! నాశరీరం యిప్పుడు పూర్తి ఖులాసా చిక్కితే యింకెంతకాలం యీ మంచం కుక్కిలో పడుండ

మంటావు? నా పెళ్లి యింకా నెలేగాఉంది! ఈ నెలరోజులైనా హుషారుగా తిరగొద్దూ అన్నది రూత్ చిరాకుతో. దానికెప్పుడెప్పుడు మంచం విడిచి గంతులేద్దామా అని ఆతురతగా ఉంది. మేమెవ్వరం కనిపెట్టి ఉండకపోతే, అదెప్పుడో మా ఊరిని చుట్టబెట్టి వచ్చేదే.

రూత్‌ను యిప్పుడు కదిలిస్తే చిరాకు; పిలిస్తే కోపంపలుకుతుంది! ఇవ్వాళ నావంక తీక్షణంగా చూసి, ఆకస్మికంగా తినడాని కేమన్నా చిరుతిండి తెచ్చిపెట్టమని బతిమాలింది. విపరీతంగా ఆకలవుతున్నదని కూడా చెప్పింది నాతో.

"నీకు కావలసిందేమిటే రూత్? అమ్మకు చెబుతాలే! నీకు కావలసింది ఆమే తెచ్చిపెడుతుంది!" అన్నాను.

"అదికాదురా! రోజూతిని విసుగు పుడుతున్నదిరా దానితో. ఇంకోకొత్తరకం, నోటికి రుచికరమైన ఆహారం కావాలిరా. తెచ్చిపెట్టుపో. ఆవకాయా, అన్నం, మంచిఘాటైన మసాలకూర, మాంసం - వీటిమీద పోతున్నదిరా ప్రాణం యివ్వాళ!" అన్నది రూత్.

"ఊహూఁ! అలాంటివేవీ నేను తెచ్చిపెట్టను. డాక్టరుగారు అలాంటిపదార్థాలను అసలు దగ్గరకే రానివ్వవద్దని మరీమరీ చెప్పిపోయారు తెలిసిందా?"

"అలాఅయితే యిక్కణ్ణుంచి తక్షణం నీవు వెళ్ళిపో! నీమొహం గూడా మళ్ళీనాకు చూపించ వద్దు" అంటూ కళ్ళుమూసుకుని నిద్రపోతున్నట్లు నటించింది రూత్.

మధ్యాహ్నం భోజనాలైనాయి. వాతావరణం ప్రశాంతంగా ఉంది. చీమచిటుక్కుమన్నా శబ్దం వినవస్తుంది. అలిసిసొలసిపోయిన పక్షిజాలమంతా చెట్లకొమ్మలపైన గూళ్ళలో విశ్రమిస్తున్నాయి. వీధులన్నీ దాదాపు

నిర్మానుష్యంగా ఉన్నాయి. రెక్కలు విరుచుకుని మధ్యాహ్నం వరకూ పనిచేసి, భోజనాలకు తిరిగివచ్చిన రైతుకూలీలు యిండ్లవద్ద సేదదీర్చుకుంటున్నారు. మా నాన్న ఒకేసారి ఉదయాన్నే భోజనంచేసి పొలం పోయాడు. మా అమ్మ అప్పుడే మంచంపైన వాలి ఒకకునుకు తీస్తున్నది. రూత్ చప్పుడుకాకుండా మంచంపైనుంచి లేచి వంటగది వేపుగా ప్రయాణమైంది. మునివేళ్ళమీదనడుస్తూ నడవలోగుండా వంటగదిలో ప్రవేశించడానికి సిద్ధమైంది. ఎలాగైనా మా అమ్మకళ్ళు కప్పిపోవాలని రూత్ బహువిధాలుగా ప్రయత్నించింది. నేను దానిమీద ఒక కన్నువేసి కనిపెట్టేఉన్నాను,

"ఇక్కడేం చేస్తున్నావ్ రూత్? అమ్మను లేపి నీ విక్కడున్నావని చెబుతున్నాను?" అన్నాను.

నన్నుచూసి రూత్ నిర్విణ్ణురాలైపోయింది. పెదవులపైన వేలుంచుకుని, "ఇస్సా" అంటూ నన్ను నిశ్శబ్దంగా ఉండమని హెచ్చరించింది. నాచేయిపట్టుకుని వంటయింట్లోకి తీసుకునిపోయి నన్ను బ్రతిమాలింది. "అరేయ్ అన్నయ్యా! ఆకలితో చస్తున్నారా! చూడరా యెంత నీరసంగా ఉన్నానో. నేను కోరుకున్న ఆహారం తిననీ, యెలా బలుస్తానో నీవే చూస్తావు! ఆటే అల్లరిచేయక మెదలకుండా చూస్తూ ఊరుకో!" అన్నది.

"అయితే డాక్టరుగారి సలహా మాటేం చెబుతావు?" అని జ్ఞాపకం చేశాను.

"ఈ డాక్టర్లు పాడుగాను! అన్నంపెట్టక మాడ్చి చంపే డాక్టర్లేం డాక్టర్లురా! ఒక్కముద్దకన్న యెక్కువ తినలేనురా! ఒక్కముద్దంటే ఒక్కముద్దరా! నీవే నా పరిస్థితిలో ఉంటే, నేనే నీదగ్గిర యిలాఉంటే,

నీమీద డాక్టరుతోగానీ, అమ్మావాళ్ళతోగానీ చాడీలు చెప్పేదాన్నిగాదు. ఒక్కసారినన్ను రుచి చూడనీయవూ ?" అంటూ రూత్ బ్రతిమాలింది.

రూత్ నన్ను అదేపనిగా విడవకుండా బ్రతిమిలాడడం చూసి జాలిపడ్డాను. నిజంగా ఆకలౌతున్నదేమో అనుకున్నాను. ఆకలి తీర్చు కోకుండా అడ్డంవచ్చి పాపం మూటగట్టుకొనడం యిష్టంలేక పోయింది నాకు. అది కోరినతిండి ఒక్కసారి రుచిచూసినా, దాని ఆరోగ్యం వికటిస్తుందని నాకు తెలుసు. అయినా దానియిష్టంవచ్చినంతా తింటూ కూర్చుంటే మారుమాట్లాడక గుడ్లు అప్పగించి చూస్తూ కూర్చున్నాను.

గిన్నెమీదిమూత చప్పుడుకాకుండా కింద పెట్టింది, పసిపిల్లమాది రిగా మాంసంకూరలో ఫోర్కుదూర్చి యిష్టంవచ్చినట్లుగా తినడం సాగించింది, కేకలేస్తున్నా నామాట వినుపించుకోలేదు. తర్వాత అన్నం గిన్నెలో చేయి దూర్చి రెండు కరుళ్ళను కంచంలో పెట్టుకుని మాంసం కూడ వేసుకుని కంచంనిండా కలుపుకుంది. అలమరాతీసి, మామిడి కాయ, ఊరు మిరపకాయలు కావలసినమట్టుకు తీసుకుని అన్నంలో కలుపుకుని, ముద్దవెంటముద్ద ఊపిరాడకుండా నమలకుండగానే మింగడం మొదలెట్టింది. రెప్పపాటులో కంచం అన్నం ఊదేసింది.

"స్వర్గానికి బెత్తెడెడంలో ఉన్నానాన్రి యిప్పుడు!" అన్నది రూత్ మెల్లగా. క్షణంలో దాని గదిలో వచ్చిపడ్డది మళ్ళా "ఇందాక నేను చెప్పలానీకు! ఆకలి బాధతో అలమటించి పోయ్యానాన్రి యిన్నాళ్ళూ! అబ్బ! యిప్పుడు చూడునన్ను! ఎంతబలంగా ఉన్నానో! దున్నపోతంత శక్తి వచ్చిందినాకు. ఈ వారం ఆఖరుకల్లా యెంతదూరమైన నడవగల్గుతాను. నీవు దగ్గరేఉండి నేను కంచండు అన్నం తింటుంటే, ఊరికేచూస్తూ కూర్చున్నానని విచారంగా ఉందా నీకిప్పుడు?"

"నీవు ఆరోగ్యంగా ఉన్నావని చెబుతుంటే నేను సంతోషిస్తు న్నాను. నేను కోరేదల్లా ఒక్కటే! నీవు చేసిన పని అమ్మకు తెలియ తెలియకుండా ఉంటే నాకంతేచాలు" అన్నాను.

"అమ్మకెలాతెలుస్తుంది నీవు చెప్పకపోతే!" అని రూత్ నావంక తీవ్రంగా చూసింది. "నీవసలు అమ్మకు చెప్పనేవద్దు జాగ్రత్త! నాకు బాగానయమై మామూలుప్రకారం తిరిగేప్పుడు జరిగిందంతా చెప్పు! తమాషాచేద్దాం. మనంచేసినపనికి, వాళ్ళప్పుడు పొట్టలు చెక్క లయ్యేట్లు నవ్వకుండా ఉండగలరా!"

ఇంకా కప్పురకప్పుర చీకటుంది. బాగాతెల్లవారలేదు. రూత్ గదిలో దీపము కీనీడలింకా కనిపిస్తూనే ఉన్నాయి. గదిలో ప్రవేశిం చాను. తెల్లని దిండుపైన వాల్చిన రూత్ ముఖం అందంగా ప్రకాశిస్తూ న్నది. దాని చెక్కిళ్ళు అద్దాల్లా నునుపుతేరి ఉన్నాయి. కోరిన పదా ర్థాన్ని తినవద్దని మొట్టమొదట్లో రూత్‌ను అభ్యంతరపెట్టినందుకు నన్ను నేనే తిట్టుకున్నాను. ఆనాడు తిన్నతిండి వల్లనేయిప్పుడు రూత్ ముఖా నికి కొత్తతేజస్సు పుట్టుకొచ్చిందని అనుకున్నాను.

కాని మా అమ్మను మోసంచేయడం అసంభవం. ఆవులిస్తే పేగులు లెక్కపెట్టగల తత్వం మా అమ్మది. కిటికీ తలుపులు తెరవ డానికి మా అమ్మ గదిలోకి వచ్చింది. వచ్చీరాగానే రూత్ ముఖంవంక చూసి అనుమానపడింది. "ఏమిటి రూత్. ఎందుకలా......" అంటూ హటాత్తుగా మా అమ్మ ఆపివేసింది. రూత్ ముఖం తేరిపార చూస్తూ, "నీఒంట్లో బాగున్నదటే రూత్? అదోతీరుగా ఉన్నట్లున్నావే! జ్వరం తగిలినట్లు ముఖం జేవురించింది.!"

"ఏమిటమ్మా అలా అంటావు? నేను ఆరోగ్యంగా, బలంగా ఉంటే!"

కాని మా అమ్మకు ముఖం చూస్తేచాలు! అంతా అర్ధమైపోతుంది వెంటనే రూత్ నొసలు పట్టిచూసింది. వేడిగాఉన్నట్లు తోచి థెర్మామీటర్ తెచ్చి రూత్ నోట్లోపెట్టి చూసింది.

"అనవసరంగా నీవు గందరగోళం చేస్తున్నావమ్మా! ఇప్పుడు నాకున్నఆరోగ్యం, యిదివరకెప్పుడూ లేదని గట్టిగా చెప్పగలను!" అంటూ థెర్మామీటరు నోట్లో ఉంచుకోడాని కిష్టంలేక మారాము చేసింది రూత్.

"అమ్మో! జ్వరం వచ్చినట్లే ఉందే! ఒక్కక్షణం కదలకుండా పడుకో!" అన్నది మాఅమ్మ థర్మామీటర్ నోట్లోనుండి బయటికిలాగి. "నేనేం చెప్పానే! చెప్పినంతా అయింది చూశావా! నీముఖమే చెప్పింది జ్వరంవచ్చిందని. ఓరిదేవుడా! ఏంచేయ నిప్పుడు?" అన్నది మా అమ్మ తొట్రుపాటు పడుతూ.

పదినిమిషాల్లో డాక్టరు అక్వినో రోగిమంచం వద్దకు పరుగుపెంగ వచ్చాడు. మళ్ళీజ్వరం యెలా తిరగ బెట్టిందాఅని అంతా ఆశ్చర్య పోతున్నారు. మా అమ్మ తనకు తెచ్చిపెట్టిన ఆహారం తప్ప మరో వస్తువు ముట్టుకోలేదని రూత్ ఒట్లూ, సత్యాలూ పెట్టుకుంది. ఒత్తిగిలి పడుకున్నరూత్ నావంక ఓరచూపు చూసి, జరిగిన విషయాన్ని బయట పెట్టవద్దని బ్రతిమాలుతూ సంజ్ఞ చేసింది.

నేనేం చేయకలను? క్రిందటిరోజున రూత్ చేసినపని యెవరికీ బయటపెట్టనని దానికి వాగ్దాన మిచ్చాను. నేనక్కడ ఒక్కక్షణంగూడా కాలు కుదిరి ఉండలేక పోయాను అందర్నీ చూస్తూ. మానాన్న, అప్పా

డాక్టరూ, అంతా తలకాయలు బద్దలు చేసుకుంటున్నారు రోగం తిరగ బెట్టడానికి కారణం అర్థంకాక. మధ్యాహ్నానికల్లా జ్వరం మరీ యెక్కువైంది. నిజం చెప్పేయ్యమని నా అంతరాత్మ నన్ను క్షణక్షణానికీ తొందరపెడుతున్నది. "ఆలస్యం అమృతం విషం" రోగం విషమించక ముందే జరిగినవిషయం చెప్పకపోతే, చేతులారా నాచెల్లెల్ని పోగొట్టు కుంటానేమో అని భయంవేసింది. మా అమ్మవద్దకు మూడు అంగల్లో పరుగెత్తి పోయి యదార్థాన్ని కాస్తా వెల్లడి చేశాను.

"ఆగిన్నెలో ఉన్నదంతా తినేసిందటరా నాయనా? అంతపని చేసిందట్రా అది! కొంప నిలువునా కూల్చిందిరా!" అన్నది మాఅమ్మ భోరున ఏడుస్తూ. ఆమె వేళ్ళన్నీ కుంగర్లుపోయినట్లు వంకర్లు తిరిగి పోయాయి. పిచ్చిదానివలె కట్టుకున్న గుడ్డలు చించివేసుకున్నది. కంగారుతో గదంతా గంతులుపెట్టి, డాక్టరువద్దకు -యేడ్చుకుంటూ పరు గెత్తుకొనిపోయి జరిగిన విషయం చెప్పింది.

నిజం వెల్లడిచేసినా, రూత్‌కు ప్రయోజనం కలగలా. అప్పటికే ఆలస్యమైపోయింది. అంతకంతకూ జ్వరం పెరగడం ఆరంభించింది. సాయంకాలానికే రూత్‌కు అపస్మారకం యేర్పడి సంధించింది. తన ఫ్రాకుల్నిగురించీ, దర్జీవాళ్ళను గురించీ, ఆర్మండోను గురించీ, పెళ్ళి కబుర్లను గురించీ యేవేవో లక్షవిషయాలు గుక్కతిప్పుకోకుండా గొణ గడం మొదలెట్టింది.

అంతత్వరలో ఒక్కరోజున రూత్ అలా మారిపోతుందని యెవ్వరం నమ్మలేదు. క్రితంరోజువరకూ ఉత్సాహంగా, హుషారుగా మాట్లాడిన రూత్ ఆకస్మికంగా అంత జ్వరముతో బాధపడడం, సంధిం చడం, నిర్జీవంగా పాలిపోవడం యెవ్వరూ ఊహించలేదు. కొద్దిగంటల విషజ్వరమే దాని శక్తినీ, దాని రక్తాన్నీ పీల్చివేసింది. రూత్ కళ

మూసుకునిపోయాయి. పెదిమలు ఎండిపోయి. నల్లకప్పు వేశాయి. కోయిల వంటి దాని మధురస్వరం నీరసమై నిర్జీవమైపోతున్నది క్రమంగా.

మా చుట్టు అంధకారం ఆవరించుకున్నది. మా అమ్మ శోకాలు పెడుతూ యేడవడం ప్రారంభించింది. నెత్తి, నోరుబాదుకుంటున్నది. మా నాన్న ఆశలుగూడా అంతరించాయి. విషాద వాతావరణంలో పగళ్ళే గడపడం కష్టమైంది. రాత్రిళ్ళు మాకు నరకయాతనే అనుకోండి. ఒక్కొక్క నిమిషం ఒక్కొక్క యుగంగా వెళ్ళబుచ్చాం. ఈసారి రోగం తిరగబెట్టిన తర్వాత, డాక్టర్ ఆక్వినో, ఆర్మండోలు చేసిన ప్రయత్నాలన్నీ వృధాఅయినాయి. మా గ్రామప్రజలందరూ రూత్ ఆరోగ్యంకొరకై చేసిన ప్రార్థనలన్నీ రూత్‌ను బ్రతికించలేకపోయాయి.

చమురులేని దీపపు ప్రమిదలో మిణుకుమిణుకులాడే దీపం క్రమంగా కొడిగట్టుకుని పోయినట్లు, పంచభూతాత్మకమైన ప్రాణ వాయువు రూత్ భౌతిక శరీరాన్ని శుక్రవారంనాడు వదిలేసి పోయింది.

రూత్ స్వర్గస్థురాలైంది మాఅందర్నీ ఆవేదనలో ముంచి.

పెళ్ళికోసం అన్నిముచ్చట్లు పడింది. ఆప్యాయంగా కుట్టించుకున్న ఫ్రాకుల్లో ఒకదాన్నైనా వేసుకోలేదు. మమ్మల్ని చూసి ఒక్కమాటైనా చెప్పిపోలేదు. మాయింటిని అంధకారం ఆవరించి, దారీ, తెన్నూ తోచని రోజుల్లో, మాకు నూతనోత్సాహాన్ని కలిగించి, మాకు ధైర్యం కలిగించిన మా రూత్ మాయమై పోయింది.

---

౧౧

రూత్ చనిపోయిన తర్వాత మాఅమ్మ ఆరోగ్యం మళ్ళీ కోలుకో లేదు. మా యింట్లో యెవరితోను మాఅమ్మ మాట్లాడ్డం మానివేసింది. ఆమె పడకగదిలోనే తనకాలంఅంతా గడుపుతూండేది. కొన్ని సంవత్స రాలుగా ఆమె అన్నం పూర్తిగా పడిపోయింది. తినే నాలుగు ముద్ద లైనా, మేమెవరమైన బ్రతిమిలాడి బుజ్జగిస్తేనే తప్ప నోట్లో పెట్టు కునేదికాదు. క్రమంగా ఆమె పాలిపోవడం ప్రారంభించింది. ఊపి రాడని దగ్గుగూడా వెంటబడ్డ దామెకు. దగ్గినప్పుడల్లా, అదురుకుని ప్రాణం అన్నుబట్టిపోయేది.

రూత్ మరణంవల్ల మా నాన్న హృదయంగూడ విచారంతో కుంగిపోయింది. ఆయన సన్నగా వృక్షి పోయాడు. అయినా ఓపిక తెచ్చుకుని మా అమ్మను ఓదార్చుతూ, ధైర్యం చెబుతూండేవాడు. మా అమ్మ మంచంమీద రెండుచేతులూ రెండుచెంపల కానించుకుని కూర్చుని రూత్‌ను జ్ఞప్తికి తెచ్చుకుంటూ పొరలిపొరలి దుఃఖించేది. మాట్లాడే నాలుగుముక్కలైనా నాతోతప్ప మరొకరితో మాట్లాడేది కాదు. నాచేత నైనంతవరకూ మాఅమ్మ మనస్సును రూత్‌మీదకు పోనివ్వకుండా తక్కిన విషయాలమీదకు మరలించడానికి ప్రయత్నించే వాణ్ణి.

"నేనేం పాపం చేశానని దేవుడు నాకీ దుర్గతి కల్గించాడు? భగ వంతుడు నన్నెందుకీ కఠినశిక్షకు గురిచేయాలి? రూత్, రూత్! ఎక్క డున్నావే తల్లీ? నాకు తోడునీడగా ఉండి, నాకష్టాల్లో భాగం పంచుకుని నన్నెప్పుడూ ఊరడిస్తూ ఉండేదానివి! ఇప్పుడెక్కడున్నావే నా ముద్దుల

బిడ్డా ? నీవు లేని బ్రతుకెందుకే నాకు !" అంటూ పదేపదే విలపిస్తూం డేది మా అమ్మ.

మంచంలోపడి యీవిధంగా రాత్రింబగళ్లూ ధోరున యేడుస్తుంటే మా హృదయాలు దహించుకుని పోయేవి. రూత్‌ను తడవతడవకూ పేరుపెట్టి పిలుస్తుండేది బ్రతికున్నట్లు భావించి. పిలిచిపిలిచి అలిసి పోయేది. మధ్యమధ్య నిశ్శబ్దంగా పడుకుని, ఉన్నట్లుండి అకస్మాత్తుగా పెద్దపెట్టున యేడ్వడం సాగించేది. పాలి, పీక్కుని పోయిన దవడలమీద నుంచి ఆమెకు కన్నీళ్లు కడవలుగా కారుతున్నాయి. ఏడ్చి, యేడ్చి వెక్కిళ్ళుగూడా రావడం మొదలెట్టాయి.

కొన్ని మాసాలక్రితం మా అమ్మకు సంభవించిన దురవస్థను పోగొట్టి సుఖం చేకూర్చుతానని మా అమ్మకు రూత్ వాగ్దానం చేసింది. రూత్ అన్నమాటలు మళ్ళీమళ్ళీ జ్ఞాపకం చేసుకుని వెక్కివెక్కి యేడు స్తుండేద మా అమ్మ. రూత్ చేస్తూవచ్చిన తమాషాలు, దాని పరిహాసాలు, అదినవ్వించే నవ్వులూ రోజుకు పదిసార్లయినా ఆమె జ్ఞప్తికి తెచ్చు కునేది. పసితనంలో చేసిన అల్లరి పనులన్నీ ఒక్కసారి మాఅమ్మ స్మృతిపథంలోకి వచ్చి, ఆమెను విచారసాగరంలో ముంచెత్తేవి. తన వివాహమైన తర్వాత, ఆరుమాసాలు మా అమ్మను తనవద్ద ఉంచుకుని, తక్కిన ఆరుమాసాలు తానువచ్చి మా అమ్మవద్ద ఉండిపోతానని రూత్ పదేపదే మా అమ్మను ఊరడించిన మాటలు ఆమె జ్ఞప్తికి తెచ్చుకుని మరింతగా దుఃఖించేది.

"ఇదేనా. నీవు నన్ను సుఖపెట్ట దలచిందమ్మా ! ఇదేనా నీవు నాకు కలిగిస్తానన్న ఆనందం ?"

డాక్టర్ ఆక్వినో మా అమ్మ దుఃఖాన్ని ఉపశమింప దలచి, నిద్ర పట్టడానికై రకరకాల మందులిచ్చాడు. అయితే ఆమందు లేవీ మా

అమ్మకు పనిచేయలేదు. అయిదునిమిషాల పాటు నిద్రపోయినట్లే పోతుంది. చివరకెలాగు నిద్రపట్టిందిలే అని నేనూ, మా నాన్నా సంతోషించే వాళ్ళం. మా సంతోషం రెప్పపాటు కాలమే ! ఆకస్మికంగా రూత్‌ను పేరుపెట్టి పిలిచేదామె. ఒక్కొక్కప్పుడు పెద్దగా యేడ్చి, అలిసిపోయి దిండుపైన పడి నిద్రపోయేది రెండునిముషాలసేపు. కార్లస్ సీజర్ మా అమ్మను ఓదార్చుతూ వుత్తరాలు వ్రాశారు. దుఃఖం యెలాగైనా మ్రింగి సహనం వహించాలని వాళ్ళిద్దరూ యెంతో బ్రతిమాలుతూ వ్రాసినా, మా అమ్మ రూత్‌ను మరవడం అసంభవమైంది. దుఃఖ భారాన్ని సహించడానికి చాలినంత శక్తి మా అమ్మకు ప్రసాదించమని తానుదేవుణ్ణి ప్రార్థిస్తున్నట్లు మేరియా మా అమ్మకు జాబు వ్రాసింది. మేరియా వ్రాతలగ్గూడా మా అమ్మ మనస్సు కుదటపడలేదు.. ఆంటోనియో, లక్ష్మి, ఇద్దరూ మా అమ్మదుఃఖంలో పాల్గొంటున్నట్లు తెలియ చేస్తూ, ఆమెకో ఓదార్పు ఉత్తరం వ్రాశారు.

కాలం గడిచినకొద్దీ దుఃఖం మాసిపోతుందంటారు. ఇవ్వాళఉన్న దుఃఖం రేపూ, రేపువున్న దుఃఖం మరురోజూ ఉండదనుకుంటాం. కాని మా అమ్మవిషయంలో దీనికి భిన్నంగానే జరిగింది. రూత్ చనిపోయి రోజులుదాటి మాసాల్లో పడ్డది. మా అమ్మ దుఃఖభారం మరీ భరించరానిదైంది. ఆమె ఆరోగ్యం మరింత చెడింది. ఆమె శరీరం శుష్కించి నీరసించిపోతున్నది.

" ఎన్నాళ్ళని దుఃఖిస్తూ కూర్చుంటావు ? ఎలాగో మరచిపోవడానికి ప్రయత్నించాలి. దిగులుతో కృషించి కృషించి బలవంతాన ప్రాణాలు తీసుకుంటే, నీవుపోయిన మర్నాడునేనెవర్నిచూసుకుని బ్రతికేదిచెప్పు!" అన్నాడు మా నాన్న అమ్మను ఓదార్చుతూ.

"మరేంభయకండి టాట్! నేను దాటిపోయినా, మీవిచారం పోగొట్టడానికి మీ రాజకీయా లుండనేఉన్నాయి. వాటితో కాలక్షేపం చేయుడానికి మీకెంతైనా ఓపికఉంది. నావిషయం అలాకాదు. ఏసుఖం ఆశించి యీబ్రితుకు వెళ్ళదీయాలి చెప్పండి. నాకీజీవితంపైన మమ కారమే అంతరించింది. దేవుడు నామీద దయవుంచి, యింతటితోనైనా నన్ను లేవదీసుకునిపోతే సంతోషిస్తాను." అన్నది మాఅమ్మ.

భారతదేశంలో రాజకీయ సంఘటనలు విద్యుద్వేగంతో పరుగెత్తు తున్నాయి. ఈసంఘటనలపట్ల మానాన్న విపరీతమైన ఉత్సాహం ప్రక టిస్తున్నాడు. అగస్టు యెనిమిదోతేదీన, భారతజాతీయ కాంగ్రెసు "క్విట్ ఇండియా" ఉద్యమం ప్రారంభించింది. మహాత్మాజీతో పాటు, కాంగ్రెసు వర్కింగ్‌కమిటీ సభ్యులను, పెక్కుమంది యితర కాంగ్రెస్ నాయకులను బ్రిటిష్‌ప్రభుత్వం నిర్బంధించింది. ఇంత బలమైనదెబ్బ భారతీయులవల్ల బ్రిటిష్‌ప్రభుత్వం లోగడ యెన్నడూ తినలేదు. భారత ప్రజ యావత్తూ ఒక మహాసైన్యంలా కదిలి విజృంభించింది. ఈ మహా విప్లవాన్ని యెదుర్కొనే శక్తి బ్రిటిష్‌ప్రభుత్వానికి లేనట్లు మాకర్థమైంది. ఈ తిరుగుబాటులో, రైల్వేస్టేషన్లు, ప్రభుత్వ కార్యాలయాలు, భస్మమై నాయనీ, టెలిగ్రాఫ్ తీగలు, టెలిఫోన్ తీగలు తెగిపోయినాయనీ, ప్రభుత్వ ధనాగారాలను లూటీచేస్తున్నారనీ, పోలీసు ఠాణాలపైన ప్రజా సైన్యాలు దాడిచేసి ఆక్రమించుకుంటున్నాయనీ, బొంబాయి, కలకత్తా వంటి మహానగరాల్లో లక్షలమంది ప్రజలు సమావేశమై బ్రిటిష్ వ్యతి రేక నినాదాలతో బ్రహ్మాండమైన సమావేశాలు, సభలూ జరుపుకుంటు న్నారనీ, బ్రహ్మాండమైన రహస్యోద్యమం శక్తివంతమైన నాయకత్వం క్రింద కొనసాగుతున్నదనీ, ప్రజల వీరోచిత కార్యకలాపాలకు ప్రభు

త్వం బెదిరి, క్రూరనిర్బంధ విధానం అమలు జరుపుతున్నదనీ మాకు ప్రతిరోజూ సమాచారం అందుతూనే ఉంది.

ఇదివరలో భారత రాజకీయాలపట్ల మా ప్రజలు ఉదాసీనత చూపేవాళ్ళు. అక్కడి వార్తలుగూడా మాకు చేరడం కష్టమయ్యేది. కాంగ్రెసు సంస్థ ఆధిపత్యం క్రింద జరుగుతున్న స్వాతంత్ర్య పోరాటాన్ని గురించి మాకేమీ అర్థమయ్యేది కాదు. ఇప్పుడిప్పుడే భారత స్వాతంత్ర్య పోరాటాన్ని గురించి మాకు వార్తలందుతున్నాయి. మా ప్రజలు అక్కడ జరుగుతున్న సంఘటనల్ని గురించి చర్చిస్తున్నారు. దేశవ్యాపితంగా చెలరేగుతున్న జాతీయ విప్లవోద్యమం మా ప్రజల్లో నవచైతన్యం కలిగించడం ప్రారంభించింది. ముఖ్యంగా గోవాలో ఉన్న హిందువులు కాంగ్రెసు కొనసాగిస్తున్న ప్రజా పోరాటాన్ని చూసి మరింత ఉత్తేజం పొందుతున్నారు. బ్రిటిష్ పాలన భారతదేశంలో అంతరించబోతున్నట్లే, గోవాలో పోర్చుగీసు నియంతృత్వం గూడా నశించగలదని ఆశిస్తున్నారు.

మా నాన్నలోగూడా మళ్ళీ ఆశా రేఖలు చిగురించాయి. భారత దేశంలో జరుగుతున్న సంఘటనల్ని గూర్చి చర్చించినపుడల్లా, ఆయన కళ్ళల్లో ఆనందం నాట్యమాడినట్లుండేది. ఆయన ముఖాన కొత్త తేజస్సు తాండవమాడేది. పోర్చుగీసు నియంతృత్వం తన క్రూరదమన విధానం ద్వారా మా ప్రజల స్వాతంత్ర్యేచ్ఛనూ, కనీస పౌరహక్కుల్నిగూడా నిర్మూలించడానికి పూనుకున్నందువల్ల, గోవా ప్రజలు తమ స్వయం శక్తితో తమంతట తామే పోర్చుగీసుపాలనను తుదముట్టించగలరన్న ఆశ మా నాన్నకీనాడు లేదు. ఎన్నటికైనా భారత సోదరులే పోర్చుగీసు ప్రభుత్వాన్నిగూడా గోవానుంచి మూటాముల్లెతో బయటికి సాగనంప

గలరని గంపెడాశతో ఎదురు చూస్తున్నాడు. భారతీయులే తమ వీరో చితమైన విప్లవచర్యలద్వారా గోవా ప్రజల్ని నవచైతన్యంలో కార్యోన్ముఖులుగా చేయగలరనీ, వాళ్ళ అండదండలతోనే పోర్చుగీసు పాలనకు స్వస్తి చెప్పగలమనీ మా నాన్న నిరీక్షిస్తున్నాడు. పోర్చుగీసు కిరాతకులనుండి గోవాకు దాస్య విముక్తి భారతీయులతోడ్పాటు లేనిదే సాధ్యం కాదని మా నాన్న నిర్ధారణ చేసుకున్నాడు.

"వెన్నెముక లేని యీ చచ్చు సత్యాగ్రహులా బ్రిటిష్‌వాళ్ళను భారతదేశంనుండి వెళ్ళగొట్టేది! నీవు వట్టి వెర్రిబాగులవాడివి కాబట్టి నమ్ముతున్నావు!" అన్నాడు నోయల్‌బాటిస్టా మా నాన్నతో. నోయల్ బాటిస్టా మా వూళ్ళో భూస్వామి. పోర్చుగీసుపాలకులకు అడుగులకు మడుగులొత్తే నమ్మకమైన బంటితను. అందుకే యితన్ని మా గ్రామానికి కొత్తగా మునసబుగా నియమించింది ప్రభుత్వం.

బాటిస్టా అల్పసంతోషానికీ, తెచ్చిపెట్టుకున్న అధికార దర్పానికీ మా నాన్న జాలిపడేవాడు. అతనితో మా నాన్న వ్యంగ్యంగా, "అయితే యింతకూ భారత సత్యాగ్రహులు బ్రిటిష్‌వాళ్ళను వెళ్ళగొట్టలేరంటావు! అంతేనా? ఏమో నీవు చెప్పిందే నిజం అయితే కావచ్చు. నీబోటి మోతుబరు మునసబు చెప్పే మాట అబద్ధమౌతుందా! నీకు తప్ప మరెవరికి తెలుస్తాయి యీ రాజకీయాల్లోని మర్మాలు!" అన్నాడు.

"నీవే చూస్తావులే టాబ్! ఆఖరుకు నా మాటే నిజమైందనీ, నీ అభిప్రాయమే పొరపాటనీ నీవే విచారపడతావు చూసుకో!" అన్నాడు ద్వేషంతో కాండ్రించి ఉమ్మేస్తూ మునసబు.

"అలా అయితే ఈ సత్యాగ్రహాన్ని విరమించమని తక్షణం గాంధీగారికి ఉత్తరం వ్రాయాలి!" అన్నాడు మా నాన్న వ్యంగ్యంగా.

"అనవసరంగా మాట్లాడబోకయ్యా! ఇప్పటికైనా బుద్ధి కలిగి స్వాతంత్ర్యం, స్వేచ్ఛ అని పిచ్చి పిచ్చి కబుర్లన్నీ కట్టిపెట్టండి" అన్నాడు మునసబు.

అగస్టులో వర్షాలు ముమ్మరంగా కురిసినట్లే, భారతదేశంలో "క్విట్ ఇండియా" ఉద్యమంగూడా ఉధృతంగా సాగుతోంది. క్రమంగా వర్షాలు వెనకబట్టడం ప్రారంభించాయి. మేఘావృతమైన ఆకాశం మళ్ళీ నీలిరంగుకు తిరుగుతూంది. పగలు ప్రమాణం తగ్గి రాత్రి ప్రమాణం క్రమంగా పెరగడం ప్రారంభమైంది. భారత కాంగ్రెసు నాయకులంతా జేళ్ళల్లో నిర్బంధించ బడ్డారు. ప్రజల్ని అదుపులో పెట్టి, సుశిక్షణతో నడిపే నాయకులెవరూ బయటలేక పోయారు. ప్రజలు తమంతట తామె విప్లవ పోరాటానికి నాయకత్వం వహించి, ముందుకు సాగిపోతున్నారు. ప్రభుత్వ కార్యాలయాలమీద చరఖా చిత్రించబడ్డ జాతీయ పతాకం ప్రతిష్ఠించబడ్డది. రైళ్ళరాకపోకలు బందైనాయి. ప్రభుత్వం కార్య కలాపాలన్నీ స్థంభించి పోయాయి. గ్రామాలకూ, పట్టణాలకూ సంబంధ బాంధవ్యాలు, రాకపోకలూ భగ్నమైనాయి.

భారతదేశంలో బ్రిటిష్ నిరంకుశాన్ని ఉగ్రూత లూగిస్తున్న విప్లవోద్యమం వాడవాడలా వ్యాపించింది. అక్కడి వీరోచిత సంఘటన లన్నీ మా ప్రజలు మహోత్సాహంతో వింటున్నారు. బ్రిటిష్ క్రూర నిర్బంధ విధానాన్ని భారతప్రజలు, అనుపమాన దేశభక్తితో, ధైర్య సాహస త్యాగాలతో ప్రతిఘటిస్తున్నారు. పోర్చుగీసు అధికార్లకు వ్యతి రేకంగా వల్లెత్తి మాట మాట్లాడ్డానికైనా మా ప్రజలకు దమ్ములు లేని సమయంలో, భారతీయలు అసమాన ధైర్య సాహసాలతో బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని యెలా ప్రతిఘటించ గల్గుతున్నారు. పోర్చుగీసు పాలకులు మమ్మల్నీ, భారతీయులకన్నా వేయిరేట్లెక్కువగా చిత్ర

హింసలకూ, హీనాతిహీనమైన అవమానాలకూ గురిచేస్తున్నా, మా ప్రజలకు చీమకుట్టినట్లు లేదు. బ్రిటిష్ అధికారాన్ని ప్రతిఘటించే శక్తి యుక్తులు భారతీయులెలా సంపాదించ గల్గారు?

భారతదేశంనుంచి వినవస్తున్న సింహగర్జనలు మా ప్రజల చెవుల్లో గింగురు మంటున్నాయి - మా ప్రజలు ఆత్మ పరిశోధనకు పూనుకున్నారు. తమ పిరికితనానికీ, కర్తవ్యతా మూఢతకూ కారణం కనుక్కున్నారు. నాలుగు శతాబ్దాల పోర్చుగీసు నిరంకుశ పాలన, బానిస జీవితమూ తమ నైచ్యస్థితికీ, తమ పిరికితనానికీ, తమ బలహీనతకూ కారణమని గ్రహించారు.

అక్టోబరు నెలలో ఒకనాటి సాయంత్రం మా నాన్నా, డాక్టర్ అక్వినో మా వరండాలో కూర్చున్నారు. డాక్టర్ అప్పుడే లడవర పోసిన ఒక రోగిని చూసివచ్చాడు. "భారతదేశంలో జరుగుతున్న తిరుగుబాటు వల్ల మన గోవా కేం ప్రయోజనం? భారతీయులు అంతబలవత్తరమైన బ్రిటిష్ అధికారాన్ని జయప్రదంగా ప్రతిఘటించగలరా? ఈ పరిణామాల వల్ల భారతదేశానికీ, మన గోవాకూ విముక్తి కలుగుతుందనే ఆశ నాకే మాత్రంలేదు" అన్నాడు డాక్టర్. -

మా నాన్న, డాక్టర్ అక్వినో అధైర్యాన్నీ, నిరాశనూ, నిస్పృహనూ అలక్ష్యం చేసినట్లుగా ఆయనవంక ఓరచూపుగా చూశాడు. తన మాటలను డాక్టర్ శ్రద్ధగా ఆలకిస్తున్నాడా లేదా అనే ఆలోచన లేకుండా ఆవేశంతో తన ఉపన్యాసం మొదలెట్టాడు తన సహజ ధోరణిలో.

"ఒక నూతన శకం ఆరంభమైంది. మానవుని ఆధ్యాత్మిక, మానసిక శక్తులకు పరీక్షా సమయం వచ్చింది. మానవుని దాస్య శృంఖలాలను యే నిరంకుశ శక్తులూ శాశ్వతంగా బంధించి ఉంచ జాలవు.

ప్రపంచ చరిత్రను ఒకసారి తిరగవేసి చూస్తే, ప్రజాశక్తిముందు నిరంకుశత్వం రూపు మాసిపోయిందని బోధపడుతుంది. భారతదేశంలో కొనసాగుతున్న మహత్తర విప్లవం లాంటిది ప్రపంచంలో యిదివర కెన్నడూ జరిగియుండలేదు. ఈ మహా విప్లవంలో భారతీయులు జయం సాధించ గలిగితే, మానవజాతి అభ్యుదయ మార్గాన పురోగమిస్తున్నట్లు స్పష్టమౌతుంది. ఈ మహా సంగ్రామంలో యే ఒక్క పక్షానికీగాక, ఉభయ పక్షాలకూ జయం లభ్యమైనట్లే పరిగణించాలి. అహింసాత్మక మైన పోరాటంలో భారతీయులు తమ ఆశయం సాధించారని లోకం ఉగ్గడిస్తుంది. ఇది ప్రజా విజయం కాగా భారతీయుల న్యాయమైన స్వాతంత్ర్య వాంఛను బాంబులూ, తుపాకులూ, మరఫిరంగులూ మొద లైన మారణాయుధాలు అణచజాలవని బ్రిటిష్ సామ్రాజ్యవాదులుగూడా గుర్తించినట్లు ప్రపంచ ప్రజలు అభినందిస్తారు.

"అయితే బ్రిటిష్‌వాళ్ళు సామ్రాజ్యవాదులుగదా టాబ్ ? ఈ అహిం సాత్మక ప్రతిఘటన వాళ్ళు లక్ష్యంచేస్తారా ?" అన్నాడు డాక్టర్ అక్వినో.

"నిజమే ! వాళ్ళు సామ్రాజ్య నిర్మాతలే; అలాగే రోమన్లుగూడా. ఏరీ, ఆరోమన్లేమైనారీనాడు ? పోర్చుగీస్ నిరంకుశుల మాదిరిగా వాళ్ళు పరమమూర్ఖులుగారు. బ్రిటిష్‌వాళ్ళకుముందు చూపున్నది. సమయోచిత జ్ఞానం ఉన్నది. రాబోయే పరిస్థితిని వాళ్ళు ముందే గుర్తించి తదను గుణ్యంగా ప్రవర్తిస్తారు. ఎదిరి బలాన్ని గమనించి, తమది క్రిందిచేయి అయినప్పుడు, వాళ్ళతో సమాధానపడడంలో బ్రిటిష్‌వాళ్ళతోసాటి మరొ కరు లేరనేచెప్పాలి. తమకు ఓటమి యేపరిస్థితుల్లో సంభవించేదీ ముం దుగానే పారచూచేశక్తి వాళ్ళకుంది. వాళ్ళకు తెలుసు, వాళ్ళకు తెలుసు........" అన్నాడు మానాన్న.

ముందు భారతదేశానికీ, ఆ తర్వాత గోవాకూ స్వాతంత్ర్యం సిద్ధిస్తుందనే ఆశ మా నాన్నను చాలావరకు ఉత్సాహపరచినా, ప్రతి సాయంకాలం మా యింట్లో అడుగుపెట్టగానే, మా నాన్నను యేదో విచారం, చిరాకు బాధపెట్టసాగేది. మా అమ్మను ఉత్సాహ పరచడానికి ఆయన యత్నిస్తాడు. కాని ఆయన ఓదార్పు మాటలవల్ల ప్రయోజనం లేదని తెలుసుకుని, తిరిగి వరండాలో పడక కుర్చీమీద వచ్చి వాలుతాడు. కన్ను పొడుచుకున్నా కనిపించని కటిక చీకట్లోకి తన దృష్టిని సారిస్తాడు. ఉండిఉండి పడకకుర్చీలోనే పడుకుని నిద్రపోతాడు. అలిసిపోయిన ఆయన ప్రాణానికి కాస్త మనశ్శాంతి దొరకడాని కదే అవకాశం. మా నాన్న తన ఆరవ ప్రాణంగా యెంచుకుని ప్రేమించిన రూత్ కాస్తా దాటిపోయింది, రూత్ ఆయనకు తోడునీడగా ఆయన కష్టసుఖాలన్నిటిలో పాలుపంచుకునేది. ఆయన కాల్లో కసుక్కున ముల్లు విరిగితే, తనకు విరిగినట్లుగానే భావించి బాధ పడేది. తననంతగా ప్రేమించిన రూత్‌ను అకాలమృత్యువు లేవనెత్తుకుని పోయినా, ఆయన గుండె నిబ్బరంతో, ధైర్య స్థయిర్యాలతో కాలం వెళ్ళబుచ్చడానికి ప్రయత్నించాడు. ఆయన అంతర్గత భావాలనూ, బాధలనూ, వంటరితనాన్నీ, అణచుకుని వ్యవసాయపు పనులను గురించో, భారతదేశంలో జరుగుతున్న మహావిప్లవాన్ని గురించో, నాతో చర్చిస్తూ, నాకు పరిజ్ఞానం కలిగిస్తుండేవాడు.

ఆనాడు మానాన్నకు నేను మంచినీళ్ల తెచ్చియిచ్చినప్పుడు ఆయన ఆకస్మికంగా, "మనందరకూ మృత్యువు యేనాడో ఒకనాడు వచ్చి తీరుతుంది. మనం యేదోవిధంగా యీ జీవితాలను దొర్లిస్తున్నాం. ఎవ్వరమూ శాశ్వతంకాదు. వృద్ధాప్యం రాగానే కాటికి కాళ్లు జాచుకొని ఉండకా తప్పదు. మనం యీ లోకం విడిచి పోకా తప్పదు" అన్నాడు.

రూత్ బతికి ఉండగా మానాన్న ప్రతిసాయంకాలం పొలంనుంచి రాగానే అది మంచినీళ్లు తెచ్చియిచ్చేది. ఇవ్వాళ ఆయన యింటికి రాగానే మంచినీళ్లగ్లాసుతో నేనాయన ముందునిలబడి ఉన్నప్పుడు, ఒక క్షణం సేపు నావంక అదేపనిగా తేరిపార చూశాడు. వెంటనే తన చేతులతో కళ్లు కప్పుకుని, నా చేతిలోనుంచి నీళ్లగ్లాసు తీసుకున్నాడు. ఇంతలో చూతునుగదా మా నాన్న కండ్ల వెంట బొటబొట నీళ్లు కారడం ప్రారంభమైనాయి. తన యెదట నిలబడ్డది రూత్ అని మా నాన్న భ్రమపడ్డట్లు అప్పుడు నేను గ్రహించగల్గాను.

జాలి హృదయంతో, "ఏం జరిగింది నాన్నా?" అని అడిగాను. "ఏమిలేదురా అబ్బాయ్! నా దృష్టే నన్ను ఆటలు పట్టించి నన్ను మోసం చేస్తున్నది. ఒక రెప్పపాటు కాలం నిన్ను చూసి ………… అన్నాడు" మా నాన్న.

"నన్ను చూసి యెవరనిభ్రమించావు నాన్నా?"

"ఓ హో, మరేం గాభరాపడబోకు నాయనా! బ్రతుకు బహు దుర్లభమైనది. ధైర్య సాహసాలూ. మనోనిబ్బరం అలవరచుకుంటేగాని యీ ప్రపంచంలో జీవించలేం. ఈ జన్మలో యెంత యెక్కువగా బాధలు పడి దుఃఖాన్ని భరించ గల్గుతామో. మరో జన్మలో అంత అధికంగా మనం ప్రతి ఫలం పొందగల్గుతాం. ఈ జీవితాలు శాశ్వతం గావు. మృత్యువు మనల్నెప్పుడూ వెంటాడుతూనే ఉంటుంది. వృద్ధాప్యం రాగానే కాటికి ప్రయాణం కట్టి సిద్ధమై ఉండక తప్పదు .... .... .... .... .... ఉండక తప్పదు. .... .... ...."

మా అమ్మ ఆరోగ్యాన్ని గురించి కొద్ది రోజులుగా చాలా ఆందోళన పడుతున్నాం. రూత్ చనిపోయినప్పట్నుంచి ఆమె ఆరోగ్యం క్షీణ

దశకు మళ్లింది. మేం భయపడుతున్నట్లుగానే ఆమె పరిస్థితి రోజు రోజుకూ తీసి కట్టయింది. లోజ్వరం ఆమెను క్రమంగా కుంగదీసింది. శరీరం శుష్కించి పోతున్నది. మార్గోనుండి సలహాకోసం వచ్చిన మరో డాక్టరు, డాక్టర్ అక్వినో కలిసి యెలాగైనా మా అమ్మ పరిస్థితిలో మార్పుతే వాలని శాయశక్తులా ప్రయత్నించారు. కాని యేమీ ప్రయోజనం లేక పోయింది. ఆమె కంఠస్వరం సన్నగిలింది. ఆమె మాట్లాడుతుంటే, నూతిలో నుంచి మాట్లాడినట్లుంటుంది. మా నాన్న మా అమ్మ మంచం దగ్గర చేరి, త్వరలో ఆమెకు నయమౌతుందనీ, యే దూర ప్రాంతమో పోయి తమ కష్ట పరంపరలను మాపుకుని కొంతకాలం విశ్రాంతి తీసు కుందామనీ ఓదార్చుతుంటే, నా మనస్సులో యేదో విచారంగా ఉండేది.

"ఎక్కడికీ వద్దండీ టాబ్! నావంటి దానికి ఒక్క చోటికే ప్రయాణం! త్వరలో నేనూ పరలోకానికి ప్రయాణం కట్ట బోతున్నాను మీకు తెలియదేమో! నన్ను ఉత్సాహ పర్చడానికి మీరు చేసే ప్రయత్నా లకు మీకు నా ధన్యవాదాలు" అంటూ లేచి చిరునవ్వుతెచ్చుకుని సమా ధాన మిచ్చింది మా అమ్మ.

కాని అంతలో మా అమ్మకు మృత్యు దేవత ముగించుకొస్తుందని మేమెవ్వరం అనుమానించలేదు. ఫిబ్రవరి నెల సగపడ్డది. చలిగాడ్పులు వెనకబట్టి క్రమంగా యెండలు ముదరడం ప్రారంభించాయి. ఇప్పు డిప్పుడే అరికాళ్లు కొంచెం కొంచెం చురుక్కుమంటున్నాయి. నిగ నిగ లాడే లేతాకుల మధ్య పక్షులు కిల కిలా రావాలు చేస్తూ ఆనందంతో కాలం గడుపుతున్నాయి. వసంతకాలపు ప్రకృతి శోభ గ్రామ సీమ అంతటా అల్లారు ముద్దుగా నాట్యం చేస్తున్నది. ఉదయభానుడు తన అరుణ కాంతులను మా పల్లె ప్రాంతమంతటా ప్రసరింప జేస్తున్నాడు. సుందరమైన ఆ దృశ్యం మాకమితానందం కలుగజేస్తూంది. ఆనాడు మా

అమ్మగూడా మామూల్లా గాక ఉత్సాహంగా కన్పించింది. ఆమె ముఖం గూడా తేటగా ఉన్నది. మాతో కులాసా కబుర్లు చెబుతూ, మమ్మల్నందర్నీ నవ్విస్తున్నది. ఆమె ఉత్సాహానికి మా నాన్న సంతోషం తెచ్చుకుని, ఆమె రోగం వెనక పట్టిందనీ, త్వరలో పూర్తి ఆరోగ్యం చేకూరుతుం దనీ ఆమెకు ధైర్యం చెప్పాడు.

"ఇవ్వాళ పొలంనుంచి పెందలాడే తిరిగి వచ్చి, రాజకీయ పరిస్థితుల్ని గురించీ, గ్రామంలోని యితర ముఖ్య విషయాల్ని గురించీ నాకు వివరంగా చెప్పండి!" అన్నది మా అమ్మ ఉత్సాహంగా. "ఇవ్వాళ యేంవారం? బుధవారం కదూ? వచ్చే ఆదివారంనాడు చర్చికి పోయ్యేట్లు భగవంతుడు నాకు శక్తి కల్గిస్తాడా!" అడిగింది మా నాన్నను.

మానవుడికి ఆశ బ్రతికినన్నాళ్లూ ఉంటుంది. ఆశ లేని మానవుడు జీవించనే లేడు. మా నాన్నను యీ నాడు సంతోషంగా పోనివ్వగల్గింది ఆశ. ఇన్నాళ్లూ నిరాశా, నిస్పృహ మా యింటినీ, మమ్మల్నీ ఆవరించింది. ఈనాడు మళ్లీ బ్రతుకుమీద మళ్లీ యింత ఆశ అంకురించింది మాలో. మా అమ్మకు త్వరలో రోగం కుదిరి యెప్పటిలా మనిషవుతుం దనే ధైర్యం కుదురుకుంది. హృదయం ఉప్పొంగే ఆనందంతో, మా నాన్న వాయువేగంతో పొలం చేరుకున్నాడు. సంతోషాతిశయంతో ఆయన దేవుణ్ణి ప్రార్థిస్తూ, మనస్సులో, "ఓరి భగవంతుడా! కరుణా సముద్రుడా! నా భార్యను ఆరోగ్యవంతురాలుగా చేయి; ఎప్పటిలా ఆమెను ఒక మనిషివలె చేసిపెట్టు" అన్నాడు.

సాయంకాలం యింకా కాలేదు. సూర్యుడిప్పటివరకూ మరీ తోపు దిగిరాలేదు. ఇంతలో అప్పుడే మా నాన్న యింటికి తిరిగి వచ్చే

శాడు. విరక్తి భావంతో చేతిలో గడ్డపలుగు కింద పడేశాడు. నేరుగా మా అమ్మ గదిలోకి పోయి ఆమెను అభినందిస్తూ ఉత్సాహంగా పలకరించాడు.

మా నాన్న చిరునవ్వు నవ్వుతూ ఉత్సాహం ఉట్టిపడేలా అమ్మను చూసి, "నీ విధేయుడూ, నీ సేవకుడూ నీ ముందిక్కడే ఉన్నాడు సిద్ధంగా. నీకేం కావాలో కోరుకో. ఈ రోజు మధ్యాహ్నం నీకు బాగా కులాసాగా ఉందికదూ?" అన్నాడు.

మా అమ్మ ముఖం పైకెత్తి చిరునవ్వుతో మా నాన్న వంక చూసింది. ఇప్పుడు నవ్వుతున్న చిరునవ్వుకూ ఉదయం చిరునవ్వుకూ యెంతో తేడా వున్నట్లు కనిపించింది. "ఓ! మీరప్పుడే వచ్చారూ!" అని మా అమ్మ అంటూండగానే మా నాన్న ఆమె పక్కనేవచ్చి కూర్చో డానికి ప్రయత్నించాడు. "మీరు టీ పుచ్చుకున్న తర్వాత నా పక్కవచ్చి కూర్చోండి!" అన్నది మా అమ్మ.

"కాని నీవు నా ప్రశ్నకు సమాధానం చెప్పలేదు? ఎలావున్నావు నీవు? నీ శరీరంలో యిప్పుడెలా వున్నది?" అడిగాడు మా నాన్న.

మా అమ్మ ఆయన వంక నిసితంగాచూస్తూ, "నా మాటకేం గాని మీరే అలసిపోయి, అదోతీరుగా ఉన్నారు బాబ్! పొలం పని అంత కష్టంగా ఉందా?" అన్నది.

మా నాన్న అమ్మసరసనే కూర్చొని, "కష్టపడి పనిచేయాలి! మరి తప్పదు! ప్రతి కూలి మనిషీ పొట్ట చేతపట్టుకొని గోవా వదలి బొంబాయివంటి నగరాలకు వలసపోతుంటే, నాబోటివాడు పొలంలో కష్టపడి పనిచేయకేంచేస్తాడు?" అన్నాడు.

"పరిస్థితి అంత హీనంగా ఉందా? ఇసిడార్, బ్రిజ్, సంటాన్, రోజార్ మొదలైన వాళ్ళంతా యేమైనారు? వీళ్ళంతా ఊళ్ళో లేరా? వీళ్ళు ఊరు విడిచి లేచిపోయారా?" అన్నది మా నాన్నవంక జాలిగా చూస్తూ.

నిజంగానే పరిస్థితి విషమించింది. ఇంకా సంవత్సరంలో పరిస్థితులెంత తీవ్రంగా పరిణమిస్తాయో చెప్పలేం. పెద్దపెద్ద రైతాంగమంతా తమ పొలంపనులు తామే నిర్వహించుకునే రోజులు సమీపిస్తున్నాయి. తినడానికి తిండిలేక ప్రతివాడూ గోవా వదిలి వెళ్ళిపోవడానికి ఆతురత చూపుతున్నాడు. ఇసిడార్, మొదలైనవాళ్ళు గూడా అలా వెళ్ళిపోయినా మనం ఆశ్చర్యపడాల్సిన పని లేదు.

ఈ మాటకు మా అమ్మ విచారంతో మునిగిపోయింది. "మన గ్రామాని కెలాంటి విపత్తు వచ్చింది టాబ్! భగవంతుడు మనల్నెందుకీ శిక్షలకు గురి చేస్తున్నాడు?" అన్నది సంభ్రమాశ్చర్యంతో.

"ఈ దుస్థితి మన ఒక్క గ్రామానికే పట్టలేదు. గోవాలో ప్రతి గ్రామం ఆకలిబాధకు ఆహుతైపోతున్నది. ప్రజలు యిళ్ళు వదలి తండోపతండాలుగా బ్రిటిష్ ఇండియాకు వలసపోతున్నారు. కనీసం రేషను బియ్యంతోనైనా తమ ప్రాణాలను నిలుపుకోవచ్చునని ఆశ పడుతున్నారు. మనల్ని శిక్షించేది భగవంతుడు గాదు. ఈ దుర్భర బాధలకు గురిచేసింది పోర్చుగీసు నిరంకుశులు. దీనికంతటికీ బాధ్యులు ముమ్మాటికీ వాళ్ళే. మనం చచ్చినా బతికినా యీ కిరాతకులకు లెక్కలేదు" అన్నాడు మా నాన్న ఆవేశంతో.

"అబ్బ! మీరూ మీ పోర్చుగీసువాళ్ళూ! మళ్ళీ మొదలెట్టారూ! ఎందుకండీ వాళ్ళ నెప్పుడూ అలా షడతిడతారు?" అన్నది మా అమ్మ.

అయితే యిదివరకు మాదిరిగా ఆమెలో కోపం కనిపించలేదు. మా నాన్న ఆందోళనకూ, ఆవేదనకూ నవ్వువచ్చినట్లు తమాషాగా మాట్లాడింది మా అమ్మ.

"వాళ్ళను అలా తిట్టడానికి తగినంత కారణం నాకు లేకపోలేదు!" అన్నాడు మా నాన్న చిరాకుతో. తనకోపం కొంత అణచుకుని ప్రశాంతంగా "ఆ విషయాన్ని గూర్చి వదిలేద్దాం యిప్పుడు. పోర్చుగీసు కిరాతకుల నిరంకుశ పాలనం గురించి ఈ ఉత్సాహ సమయంలో చర్చించి మనమనస్సులను పాడుచేసుకొనడం నాకు సుతరామూ యిష్టం లేదు. అందులో యీ రోజున ఆ పాపిష్టివాళ్ళ సంగతి తలచవద్దు. నిన్ను సంతోషపెట్టే విషయాన్ని గూర్చి మాట్లాడాల్సిన యీ రోజున నీ మనస్సు చీకాకు పర్చడం నాకసలు యిష్టం లేదు" అన్నాడు.

మళ్ళీ మా అమ్మ పాలిపోయిన పెదవుల మీద చిరునవ్వు చిందులాడింది. ఆమె కళ్ళు పైకెత్తి చూసింది మా నాన్నవంక ప్రియురాలు ప్రియుణ్ణి చూసినట్లు.

"నాకు చెప్పండి టాబ్ భారతదేశంలో యే యే సంఘటనలు జరుగుచున్నయ్యో. భారతీయులు యింత ఆందోళన చేయడం యెందుకండీ? పోలీసుస్టేషన్లనూ, రైల్వేస్టేషన్లనూ తగలబెట్టడం యెందుకండీ? ప్రభుత్వ ఆస్తులకు యింత విపరీత నష్టం కలిగించడం యెందువల్ల?" అడిగింది యెక్కడలేని ఆసక్తితో. ఇంతవరకూ రాజకీయ విషయాల పైన మా అమ్మ యింత శ్రద్ధాశక్తులు చూపలేదు.

"అలాంటి తీవ్రమైన రాజకీయ సమస్యలు మనం యిప్పుడెందుకు చర్చించడం?" అన్నాడు మా నాన్న ఆమె మనస్సు అర్థంకాక,

"నాకు తెలుసుకోవాలని ఉందండీ। నిజంగా తెలుసుకోవాలని ఉంది.। దేనికండీ యీ మహా విప్లవం? నాకు చెప్పరూ?"

మా నాన్న ఒక్కసారి దగ్గి, గొంతు సాఫీచేసుకొని ఉపక్రమించాడు. "నీకు తెలుసుకోవాలనిఉంది కాబట్టి చెబుతున్నావిను. అసలు విషయం యిది. ఒత్తిడి తగిలినప్పుడు అతిస్వల్పమైన పురుగుకూడా ప్రతిఘటిస్తుంది. ఈ సామెత నీవు వినలేదా? గిన్నెనిండా నీళ్ళుపోసి ఉంచినప్పుడు తప్పనిసరిగా పొర్లి పక్కలకు ప్రవహిస్తుంది. అంతే గాదూ? మనమంతా సమంగానే జన్మ మెత్తాం; దీన్నికూడా నీ వంగీకరిస్తావు గాదూ? మానవజాతి అంతా భగవంతుని బిడ్డలేననీ, అందరికీ సమానావకాశాలు, సమాన హక్కులూ ఉండాలనీ మనం తెలుసుకుంటున్నాం. కాని యీనాడు మన ముందు జరుగుతున్నదేమిటి? ఏ కొద్దిమందో కోటానుకోట్ల యితర ప్రజలపైన పెత్తనం చెలాయించాలని కోరుతున్నారు. అధికారం దురహంకారం, దురాశ యీ పెత్తనానికి మూల కారణాలు. ఈ కొద్దిమంది దురహంకారులూ ప్రపంచాన్ని యేలడానికీ, ఉద్ధరించడానికీ భగవంతుడు తమను పుట్టించాడనీ, తమ నెత్తిన మహత్తరమైన బాధ్యత వేసుకొని యీదుతున్నామనీ చెప్పుకుంటారు. అర్థమైందా?" అంటూ ఒక నిమిషం ఆగి మా అమ్మకు మరింత గట్టిగా నచ్చచెప్పడం యెలాగా అని గడ్డక్రింద చేయి పెట్టుకుని ఆలోచించి ఆలోచించి మళ్ళీ "సరే మంచిది। చూడు। ఈ ప్రపంచంలో యీనాడు కొన్ని దేశాలపైన యితర దేశాలు పెత్తనం చెలాయిస్తున్నాయి. ఉదాహరణకు బ్రిటన్, పోర్చుగల్, మరికొన్ని యిలాంటివి విశాల భూభాగం గలిగిన దేశాలపైన వీళ్ళకు న్యాయంగా లేని హక్కును పురస్కరించుకొని బలత్కారంగా వాళ్ళపై బడి నిరంకుశంగా పాలిస్తున్నారు. సామ్రాజ్యవాద దేశాల అధినేతలు తామే నాగరికులమనీ తమ

నాగరికతను ప్రపంచమంతటా వ్యాపింపజేసే మహదాశయంతో ప్రపం చాన్ని ఆక్రమించుకుంటున్నామనీ చెబుతున్నారు. బ్రిటిష్ ప్రభుత్వం రెండు శతాబ్దాలుగా భారతదేశాన్ని దాస్యంలో ముంచివేసింది. భారతీ యుల్ని దోచుకు తిన్నది. భారతీయులు తమదాస్యాన్ని, దోపిడీని సహించ లేకపోతున్నారు. అటు బ్రిటిష్ ప్రభుత్వము కట్టుకొన్న పాపం, యిటు భారతీయు లనుభవించిన కష్టపరంపరలూ పండిపోయాయి. వాళ్ళు యీనాడు స్వాతంత్రం సాధించుకోడానికి సర్వసంసిద్ధులైనారు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని వైదొలగమంటున్నారు. పిలవని పేరంటానికి హాజరై నీ పంచ చేరి నీ యింటివాసాలు లెక్క బెట్టే శత్రువును లేచి పొమ్మన డంలో తప్పేముంది ? నీవే బాగా ఆలోచించి చెప్పు యేం తప్పుందో ! పోర్చుగీసు వాళ్ళుగూడా........"

మా నాన్న మా అమ్మపక్కపైన ఆమె సరసనే కూర్చొని ఆమె చెయ్యి పట్టుకొన్నాడు. భారతదేశంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఒక్క టొకటిగా పూసగ్రుచ్చినట్లు చెప్పడం ప్రారంభించాడు. ఉద్రేకపరచే కొన్ని సన్నివేశాలను వర్ణించడం మొదలెట్టాడు. ఇంతలో చీకటి ఆవ రించింది. దీపం వెలుతురులో మా నాన్న, అమ్మ ముఖాలు రెండూ నవ యవ్వనంతో తొణికిసలాడినట్లుగా మిసమిసలాడుతున్నాయి. ఇద్దరూ అంత విపరీతమైన ఆనందాతిశయంలో ఉప్పొంగిపోతున్నారు. నా చిన్న తనంలో మా నాన్ననూ, మా అమ్మనూ చూసిన సన్నివేశం చటుక్కున జ్ఞాపకం వచ్చింది నాకు. ఆ రోజులు తలుచుకుంటే నా ఒళ్ళు పులక రిస్తుంది. మా నాన్న వర్ణించే వర్ణనలకు మా అమ్మ మధ్యమధ్య సంతో షం పట్టలేక పెద్దపెట్టున నవ్వడం మొదలెట్టింది. దాదాపు వయస్సు మళ్ళినవాళ్ళిద్దరూ, తమ ప్రస్తుత పరిస్థితిని మరచిపోయి, తిరిగి యౌవ

నంలో పడ్డట్టుగా కాలం గడుపుతున్నట్లు పూర్తిగా మారిపోయారు. ఉత్సాహంలో మా నాన్నకు ముసలితనం గూడా పోయినట్లు సైనికునిలా నిటారునా నిలబడి ఆవేశంతో కబుర్లు చెబుతూంటే, మా అమ్మ రూపవతి అయిన యువతిలా, మా నాన్న అభివర్ణించే సంఘటనలన్నీ విని తన్మయత్వంతో ఆనందిస్తున్నది.

మా నాన్న ఉపన్యాసాని కంతరాయం కలిగించింది మా అమ్మ. ఉన్నట్లుండి "మన ఊరికి పట్టిన దురవస్థ వింటుంటేనే నా హృదయం తరుక్కు పోతున్నది. దేవుడు నాకు ప్రత్యక్షంకాగానే మన వూరు క్షేమంకోసం, మీ అందరి క్షేమంకోసం, ఆయన్ని ప్రార్థిస్తాలే!" అన్నది.

మా నాన్న కంగారెత్తి ఆశ్చర్యంతో, "ఏమిటి అర్థంలేని మాటలు మాట్లాడుతున్నావు? ఇలాంటి అపశకునాలు పలుకబోకు. దేవుడు నీకు యెప్పుడు ప్రత్యక్ష్యమౌతాడంటావు?" అన్నాడు.

ఒక మూలగా నిలబెట్టివున్న శవపేటికను మా అమ్మ వేలితో చూపించి "త్వరలోనే భగవంతుడు నాకు ప్రత్యక్షం కాబోతున్నాడు టాబ్! త్వరలోనే. ఆ మూల ఉన్న శవపేటిక చూశారు గదూ! ఆ పెట్టె తెరిచి అడుగున వున్న నల్ల గుడ్డను నాకోసారి తెచ్చిపెట్టండి!" అన్నది.

"ఎందుకా గుడ్డ యిప్పుడు? ఈ సమయంలో ఆ నల్లగుడ్డతో యేంపని వచ్చింది?" అన్నాడు మా నాన్న. మా అమ్మ మనస్సులో ఆకస్మికంగా అలాంటి మార్పు రావడానికి కేం కారణమో ఆయన కర్థం కాలేదు,

"ఆ నల్లగుడ్డతోనే నాకు త్వరలో అవసరం పడుతుంది. చేతులకు తొడిగే రబ్బరు మేజోళ్లు అలమారాలో ఉన్నాయి జ్ఞాపకం ఉంచుకోండి. రూత్‌ను కలుసుకోవడానికి త్వరలో ప్రయాణం కాబోతున్న నన్ను అవసరమైన అన్ని డ్రస్సులతో చక్కగా అలంకరించి పంపండేం!"

ఈ మాటలు విని మా నాన్న మళ్ళీ విచారంలో పడ్డాడు. ఆయనలో నిరాశ, నిస్పృహ ప్రవేశించాయి. ఆయన్ను దుఃఖం ఆవహించింది. "ఇంతలోనే నీ విలా అయిపోయావెందుకు? ఈ వికారపు మాటలేమిటి? నీకు రోగం నయమైందిగదా! త్వరలో యెప్పటిలా ఆరోగ్యవంతురాలవి గూడా కాబోతున్నావు. మరిప్పుడీ అసందర్భపు మాటలేమిటి? ఇంతలో మమ్మల్నెందుకూ యీ మాటలతో భయపెడుతున్నావు? ఇప్పటిదాకా కులాసాకబుర్లతో మమ్మల్ని నవ్వించిన నీవు మమ్మల్నిలా కంగారు పెట్టకు" అన్నాడు మా నాన్న.

"మీకు విచారం కలిగించినందుకు క్షమించండి టాబ్! కాని త్వరలో భగవంతుణ్ణీ, రూత్‌నూ కలుసుకోబోతున్నానని మాత్రం నాకు స్పష్టంగా తెలుసు" అన్నది మా అమ్మ మెల్లగా.

మా నాన్న కళ్ళవెంట నీరు కారడం ప్రారంభించింది. తల వంచుకొని కంటి నీరును గ్రుడ్లల్లో కుక్కుకోడాని కాయన ప్రయత్నించాడు. కాస్సేపు నిశ్శబ్దంగా నిలబడిపోయాడు. మా నాన్న విచారగ్రస్తుడై ఉండడము మా అమ్మ కనిపెట్టి "నాకూ, నా బిడ్డలకూ యెల్లప్పుడూ సౌఖ్యం కలిగించాలనే మీ తాపత్రయం. అలాంటి మిమ్మల్ని యేడ్పించి మీ కంట నీరు పెట్టించినందుకు నన్ను క్షమించండి. ఇంతకన్న మీకెక్కువగా ధన్యవాదాలు చెప్పుకోలేను. ఇంతకన్నా మరోవిధంగా మీ రుణం తీర్చుకోలేను. నాయందు యింత దీర్ఘకాలంగా మీరు చూపిన ప్రేమాదరాలు మరిచి పోలేను. మీతో అనేక సందర్భాల్లో అనేక విషయాలమీద భేదాభి

ప్రాయం ప్రకటిస్తూవచ్చాను. ఎన్నోసార్లు వళ్లుతెలియక మిమ్మల్ని తీవ్రంగా మందలించాగూడా. అయినా మీయందు నాకున్న ప్రేమ అపారం; ఎంతమాత్రం శంకించవద్దు. నేను మీ బహిఃప్రాణమని విశ్వసించండి. పెండ్లాడినది మొదలు యీనాటివరకు బయటకిపోకుండా నిరాడంబరమైన ప్రేమాదరాలు చూపించాను మీయందు. ఏభార్యా ప్రేమించనంత నిష్కల్మష హృదయంతో గాఢంగా ప్రేమించాను మిమ్మల్ని" అన్నది మా అమ్మ.

ఆ ధోరణిలో మా అమ్మ మాట్లాడ్డం మా నాన్న వినలేకపోయాడు. ఆమె నోటిపైన తన చేయివేసి ఆమెను మాట్లాడకుండా నివారించడానికి ప్రయత్నించాడు. కాని ఆమె ధోరణి ఆగ లేదు.

"దయచేసి నా ధోరణిని ఆపబోకండి! నన్ను స్వేచ్ఛగా మాట్లాడనివ్వండి. ఇంకా ఎక్కువసేపు మాట్లాడే శక్తిలేదు, మాటాడగలిగినంతవరకు ధారాళంగా మాట్లాడనివ్వండి! అన్నది మా అమ్మ ఆయన్ను బతిమాలుతూ.

" లేదమ్మా! నీవు చనిపోవు! నిజంగా చనిపోవు! నీ శరీరం త్వరలోనే బాగు పడుతుందమ్మా!" అన్నాను వెక్కి వెక్కి యేడుస్తూ. లోపలినుంచి పొంగి పొరలివచ్చే దుఃఖాన్ని అణచుకోలేక పోయాను.

"లేదురా నాన్నా! త్వరలో యీ లోకం విడిచి పోతున్నాను. అయితే ఒక విషయం మాత్రం జ్ఞాపకముంచుకోండి. నా ప్రాణం కన్నా వెయ్యి రెట్లెక్కువగా మిమ్మల్నందర్ని ప్రేమిస్తున్నాను. నా బిడ్డలందరూ నాకేదో ఒరిగించి తమ్వి తలకెత్తుతారని కలలు కన్నాను. అయితే, మంచికో, చెడ్డకో, ప్రతి బిడ్డకూ వ్యక్తిత్వం, స్వతంత్ర ఆలోచన ఉన్నాయనే సత్యాన్ని మరచిపోయాను. వాళ్లమనోనిశ్చయాలనూ అర్థంచేసుకోలేక పోయాను. నా భావాలనూ, నిర్ణయాలనూ బలాత్కారంగా

వాళ్లపై రుద్దడానికి ప్రయత్నించాను. కాని నాకా హక్కు లేదు. అలాంటి వృధా ప్రయత్నాలు చేసినందుకు యెంతో బాధపడుతున్నాను" అన్నది మా అమ్మ ఆవేదనతో పశ్చాత్తాప పడుతూ.

నా కళ్లవెంట కడివెడు నీళ్లు కారినట్లు కారాయి. నా హృదయం చెదిరి పోయింది. నాదృష్టిలో యేదో లోపం వచ్చింది. చూపు స్పష్టంగా కానరావడంలేదు. నా కళ్ళ యెదటవున్న బుడ్డిదీపం కొండెక్కుతుపోతు న్నట్లుంది నా దృష్టికి. అయితే మా అమ్మ కంఠ ధ్వని అంతకంతకు ఖంగు ఖంగు మంటున్నది. ఆమె నోటివెంట వచ్చే ప్రతి మాటా స్పష్టంగా, స్ఫుటంగా ఉంది.

"ఆంటూ తోనూ, లక్ష్మి తోనూ క్షమార్పణ కోరుకుంటున్నానని చెప్పండి. నేను పాపిష్టిదాన్ని! నిర్దాక్షిణ్యంగా బిడ్డల్ని యింటినుండి బయిటకు గెంటించివేశాను. ఏక్షణాన వాళ్లిద్దరూ నా కళ్లముందు వచ్చి వాలుతారా అని వెయ్యి దేవుళ్లను మొక్కుతున్నాను. ఎంత ఘోర తప్పిదం చేశానా అని యిప్పుడు పశ్చాత్తాప పడుతున్నాను. నేనొక ఆదర్శవంతమైన క్యాథలిక్కు మతస్థురాలనని నన్ను నేనే పొగడుకుండే దాన్ని. కాని యిప్పుడు మంచానపడి రోగంతో తీసుకుంటూంటే నిజం నాకే తెలిసివచ్చింది. ప్రతినిత్యా చర్చికి పోయి గంటలకు గంటలు ప్రార్థించడం ఒక్కటే మన మతసిద్ధాంతాల్లో ప్రధాన విషయం కాదు. క్షమ, ప్రేమ అలవర్చుకోవడమే క్రైస్తవమతంలో ప్రాథమికసూత్రాలు. నేను చేసిన అపరాధం భగవంతుడు క్షమిస్తాడని ఆశిస్తున్నాను. మేరీ ఆండ్రియానో, కారల్, సీజర్, చికోలతో నా మాటగా చెప్పండి, నా కడుపులో యేకోశానా వాళ్ళను ద్వేషిస్తూ చనిపోలేదనీ. ఆఖరు క్షణం వరకూ వాళ్ళను ప్రేమిస్తూనే ప్రాణం వదిలాననీ వాళ్ళతో మరీ మరీ చెప్పండి. వాళ్ళ మనస్సు కేదైనా నేను బాధ కలిగించి ఉంటే. నేను

క్షమించమని కోరినట్లుగా చెప్పండి. నాకు స్వర్గసుఖం కలిగేట్టుగా భగవంతుణ్ణి ప్రార్థించమని వాళ్లందరితో చెప్పండి!" అన్నది మా అమ్మ.

మా నాన్నకు మాట పెగిలి రాలే దెంత సేపటికీ. చివరకు గద్గద కంఠంతో, "వాళ్ళు పసిబిడ్డలు; నిన్ను వాళ్ల క్షమించే దేమిటే వెర్రిదానా" అన్నాడు.

"అవునండీ, వాళ్ళే నన్ను క్షమించాలి, నేను వాళ్ళను పెట్టిన బాధలకు నన్ను వాళ్ళే క్షమించాలి. ఈ ప్రపంచంలో యే మానవుడూ పరిపూర్ణుడు కాడు. తెలిసో తెలియకో మనం అనేక తప్పులు చేస్తాం. ఈ తప్పిదాలకు క్షమార్పణ వేడుకోడం మన విధ్యుక్తధర్మం కాదూ!" అన్నది మా అమ్మ.

మా అమ్మ నా వంకకు తిరిగి, తన వద్దకు రమ్మని పిలిచింది నన్ను. నా చేయి గట్టిగా పట్టుకుని, "నీవు పెరిగి పెద్దవాడవై విద్యాబుద్ధులు నేర్చుకోవాలి నాయనా! మానసికంగా, శారీరకంగా పుష్టి సంపాదించుకోవాలి. స్థిర సంకల్పుడవుగా తయారుకావాలి. నీ మీదే మీ నాన్న ఆధారపడి ఆశలు పెట్టుకున్నాడు. ఆయన కష్ట భారాన్నీ, ఆయన విచారాన్నీ నీవు పంచుకుని ఆయనకు తోడునీడై నడుచుకో. నీ శక్తికొద్ది ఆయనకు సహాయపడు. దేవుడు నిన్ను తప్పక ఆశీర్వదిస్తాడు నాయనా! ఆశీర్వదిస్తాడు ముమ్మాటికీ" అన్నది.

నా రెండు కళ్ళూ నీళ్ళతో నిండి వున్నాయి. గొంతులో అవ్యక్తమైన బాధ యేర్పడింది. నా ప్రాణముండగా మా అమ్మను చనిపోనివ్వనని ఆమెతో ధైర్యం చెప్పాలని లోలోపల ఆరాటపడుతున్నాను. కాని నోట వెంట ఒక్క అక్షరం గూడా పెగిలిరావడం లేదు. నా తెలివి తక్కువ ఆలోచనకూ, తెలివితక్కువ మాటలకూ, నాకే నవ్వు వచ్చింది

మళ్ళీ. ఆమె మీది ప్రేమాతిశయమే నన్నావిధంగా ఆలోచించేట్లు చేసింది. కంటికీ మంటికీ యేకధారగా ప్రవహిస్తున్న నా కళ్ళకు మా అమ్మ యెంతో అలిసిపోయి, ప్రమాదావస్థలో ఉన్నట్లు తోచింది. ఆమె ఆకృతి చూసి నే నెంతో భయపడ్డాను.

మా అమ్మ స్వరం మరింత సన్నగిలిం దిప్పుడు. నాకు పూర్తిగా అలసట వచ్చిందండీ టాబ్! ఏదో చెప్పలేని అపస్మారకం నన్ను ఆవరిస్తున్నట్లూ, నాలో ఉన్నశక్తంతా నన్ను విడిచి పోతున్నట్లూంది. నన్ను వదలకండి. నేను వళ్లు మరచి నిద్రపోయేవరకూ నన్ను గట్టిగా పట్టుకోండి.

మా నాన్న మా అమ్మ చేయి మళ్ళీ గట్టిగా పట్టుకొని, "లేదు లేదు! నిన్ను వదిలిపెట్టను! గట్టిగా బిగించి పట్టుకున్నాను. నిద్ర పో! వళ్ళు మరిచి హాయిగా నిద్రపో! విశ్రాంతితోనే నీ రోగం టక్కున కుదురుతుంది. ఒక్కరాత్రి ఒళ్ళు మరచి పూర్తి విశ్రాంతి తీసుకుంటే, నీ రోగం మటుమాయమౌతుంది" అన్నాడు మా నాన్న.

మా అమ్మ మా నాన్నవంక అదేపనిగా కరుణార్ద్ర హృదయంతో చూడసాగింది. చూసి చూసి నీరసంగా ఒక్క చిరునవ్వు నవ్వింది. "మీకు ధన్యవాదాలు టాబ్! నా అవసానదశ వరకూ నా పక్కనే ఉండి, నన్ను ఉత్సాహపరుస్తూ, నాలో ఆశను రగిల్చారు. మీ ఋణం నేను తీర్చుకోలేను. మళ్ళీమళ్ళీ నీకు ధన్యవాదాలర్పిస్తున్నాను. నే నెక్కడున్నా గోవా స్వాతంత్ర్యం కోసం మీరు కంటున్న కలలు ఫలించేట్లు దేవుడిని ప్రార్థిస్తుంటాను. మీ ఆశయాలు సిద్ధించేట్లు దేవుడిచేత ఆశీర్వాదాలిప్పిస్తాను. నేను మూఢురాలినై ప్రవర్తించాను. మీ రాజకీయాలనూ, మీ వ్యాఖ్యానాలనూ సానుభూతి దృష్టితో అర్ధంచేసుకోలేక అసహ్యించు

కున్నందుకు విచారిస్తున్నాను. మీ విశాలదృష్టీ, మీ ఉన్నతభావాలూ నాకీనాడు అర్థమైనాయి. నా వాదన తప్పనీ, మీ అభిప్రాయాలే సరైనవనీ యిప్పుడు గ్రహించగల్గాను" అన్నది మా అమ్మ.

అంతకంతకూ మా అమ్మ కంఠస్వరం మరీ నీరసపడ్డది. కడసారిగా ఆమె కంఠంనుండి పెగిలివచ్చిన మాటల్లో జీవం ఉన్నట్లే లేదు. కళ్ళు మూతలు పడిపోతున్నాయి. చివరిసారిగా ఉచ్చరించిన మాట మరో లోకంనుంచి వినవచ్చినట్లుగా ఉంది. అంతలో ఆమె గాఢ నిద్రావస్థలో మునిగిపోయింది. ఆమె కండ్లు ప్రశాంతంగా మూయడం నేనూ, మా నాన్నా పరిశీలిస్తూనే ఉన్నాం. మా అమ్మ మంచం పైగా మా యెదుట గోడకు తగిలించి ఉన్న మేరీ చిత్తరువు మీద మా దృష్టి మళ్ళింది. చిరాయుపులుగా అందర్నీ దీవించమని మనస్సుల్లో దేవుణ్ణి ప్రార్థించాం.

కానీ మా ప్రార్థన లేవీ ఫలించలేదు. దేవుడికి మాపై దయ రాలేదు. ఆ రాత్రింతా పడక్కుర్చీల్లోనే తలవాల్చి, మా నాన్నా, నేనూ జాగరణ చేశాం. మధ్యమధ్య మా అమ్మకు మెలకువ వచ్చి, యేమైనా కావాలని అడుగుతుందేమో అని తలలు పైకెత్తి చూస్తూ ఉన్నాం. కాని ఆమె కడసారి గాఢనిద్రలో ఉన్నట్లు మాకు తోచింది. ఒక్కసారైనా మెలకువ రాకపోతుందా, పల్లెత్తు మాటైనా మాతో మాట్లాడకపోతుందా అని గంపెడాశతో ఉన్నాం. ఆశలన్నీ నిరాశలైనాయి.

ఉదయానికల్లా మా అమ్మకు పూర్తిగా అపస్మారకం యేర్పడి చైతన్యం ఉడిగిపోయినట్లు తెలుసుకున్నాం. ఆమె లక్షణాల్నిబట్టి బ్రహ్మాండమైన మూర్ఛలో మునిగినట్లుంది. డాక్టర్ను కబురుచేసి పిలిపించాం. అవసానదశ వచ్చిందని ఆయన చెప్పివేశాడు. క్రితం రాత్రి

మాట్లాడిన మాటలే ఆమె ఆఖరు మాటలు. ఇహ యీ మూర్ఛనుండి కోలుకుని జీవించే ఆశలేశమైనా లేదని మా అందరికీ, స్పష్టమైంది. మానాన్న పురోహితుణ్ణి పిలిపించాడు. అవసాన దశలో జరిపించవలసిన కర్మాకాండనంతా ఆయనచేత క్రమబద్ధంగా చేయించాడు మా నాన్న.

ఆ పగలల్లా మా యిరుగు పొరుగు బంధుమిత్రులందరూ మా అమ్మ మంచం చుట్టూ కూర్చుని ప్రార్థనలు జరిపారు. ఈ ప్రార్థనలు విన్నా, ఆ దృశ్యం చూసినా, మృత్యుదేవత మా యింటిని చుట్టుముట్టి మమ్మల్ని కబళించడానికి సిద్ధమైందా అన్నంత భయం వేసింది. విషాద కరమైన ఆ వాతావరణాన్ని సహించడం నాకు దుస్తరమైంది. వెంటనే పక్కగదిలోకి వెళ్లాను. తన అద్భుత మహిమచేత యెలాగైనా మా అమ్మను మృత్యు ముఖంనుంచి తప్పించమని దేవుణ్ణి ప్రార్థించాను. విసుగనేది లేక గంటలకొద్దీ ప్రార్థనలు జరిపాను. వెయ్యి చిల్లర దేవుళ్ళ కూడా మొక్కి నాపక్షాన పరమాత్మునికి అడ్డపడి మా అమ్మను యెలాగైనా బతికించమని వేడుకున్నాను. ఇంత దీర్ఘంగా, యింత దీక్షతో యిదివరకెన్నడూ నేను దేవుణ్ణి ప్రార్థించి యెరుగను. అలిసిపోయి, మనస్సు కేంద్రీకరించలేని పరిస్థితిగూడా యేర్పడ్డది. ఒకటి రెండు నిమిషాలు యీలోగా విశ్రాంతికోసం కిటికీనుంచి బయటికి తొంగిచూశాను. అప్పుడే సూర్యాస్తమయం కాబోతున్నది. విచిత్రమైన శబ్దం చేస్తూ ఒక గాలి కెరటం వీధి బయట వీస్తూంది. గ్రామం అంతా చీకట్లు కమ్ముకొస్తున్నది. మృత్యు దేవత విలయ నృత్యం చేస్తూ మమ్మల్ని కబళించడానికి వస్తున్నదా అన్నట్లు, కాళరాత్రి మా కళ్ళకు ప్రళయ భీకరంగా కన్పించింది. మా అమ్మ జీవిస్తుందన్న కడపటి ఆశగూడా అంతరించింది నాలో. నా ఊహలన్నీ మటుమాయమైనాయి. నేనక్కడ క్షణం నిల్చోలేక పోయాను. నా పక్కవద్దకుపోయి కూలబడ్డాను. భగ

వంతుడు నా మొరలాలకించే స్థితిలో లేడని తేలిపోయింది. నేనుపడ్డ శ్రమంతా వృధాశ్రమ అని తెలిసిపోయింది. ఇంతవరకు ఒక్కసారైనా భగవంతుణ్ణి స్మరించని నేను, నా అవసరాన్ని పురస్కరించుకుని ప్రార్థించినంత మాత్రానే, ఆయన నాకోరికలెలా తీర్చగలడనుకుంటాను ? మనకు కష్టాలు వచ్చినప్పుడు మాత్రమే భగవంతుడు మనకు జ్ఞాపకం వచ్చి, సుఖసంపదలతో తులతూగుతున్నప్పుడు ఆయన్ను మరిచిపోతే అలాంటి అవకాశ వాదులకు దేవుడెందుకు మేలు చేయాలి ? మన అవకాశాన్ని, మన వీలునుబట్టి దైవాన్ని కొలిచేట్లయితే, మన భక్తి దొంగ భక్తి అనిపించుకోదా ? మనం వంచకులం కామా ?

రాత్రి పొద్దు పోయింది. రాత్రివేళ్ళల్లోనే మృత్యువు మనల్నెందుకువరిస్తుంది ? చీకట్లో దొంగ యిల్లు ప్రవేశించినట్లు, సూర్యాస్తమయం కాగానే దుఃఖముగూడా మనల్ని యెందుకు వెంటాడుతుంది ? మా అమ్మ పడుకునే గదిని గాడాంధకారం ఆవరించినకొద్దీ, ఆమె తల వద్దనున్న మైనపు వత్తి దీపము మరింత ప్రకాశవంతంగా వెలుగుతున్నట్లు కన్పించింది. మా అమ్మ ఆకస్మికంగా కళ్లు తెరిచి "టాబ్, టాబ్ !" అని రెండుసార్లు మా నాన్నను పిలిచింది. కాని మా నాన్న ఆమె పక్కవద్దకు వచ్చేరాకముందే, ఆమె మమ్మల్ని విడిచి వెళ్ళిపోయింది.

శుష్కించి, పాలిపోయిన శరీరంతో, పెదవులమీద చిరునవ్వు చిందులాడుతూన్న మా అమ్మ ఒక్కక్షణంలో శవంగా మారిపోయింది. సృష్టివైచిత్ర్యం వర్ణించలేం. మా అమ్మకు శాశ్వతశాంతి యీ నాటికి లభించింది. ఈ స్థితిలో మా అమ్మను అదేపనిగా చూస్తూంటే, నా చిన్న తనపు చేష్టలు ఒక్కసారిగా జ్ఞప్తికి వచ్చాయి. మళ్ళీ పసివాడినై మా

అమ్మను ప్రశ్నపరంపరలతో విసిగిస్తున్నట్లూ, వర్షంలో తడిసి ఆట పాటలతో ఆమెకు కోపంతెప్పిస్తున్నట్లూ. బడికిపోక మకురుతనం చేస్తున్నట్లూ, యింకేవో అల్లరిపనులతో మా అమ్మను కవ్విస్తున్నట్లూ అనిపించింది నాకు. ఆనాటి సంఘటనలన్నీ చటుక్కున నా దృష్టికివచ్చి, ఆమెకానాడు అంతబాధ యెందుకు కలిగించానా అని నాలోనాకు దుఃఖం పొర్లివచ్చింది.

ధారావాహినిగా ప్రవహించే నా కళ్ళనీళ్ళుగూడా, నేనూ, నా అన్నచెల్లెలూ మా అమ్మకు కలిగించిన మానసిక, శారీరక బాధలనూ, ఆవేదనలనూ యెన్నటికీ తుడిచివేయలేమని నేను భావించాను.

———

# ౧౨

చావంటే ఏమిటి ?

ఈ లోకంలో మానవుని కష్టపరంపరలను అంతంచేసి, రాబోయే జన్మలో సుఖశాంతులకు అవకాశం కల్గిస్తుందా మరణం ? అశాశ్వత మైన, దుఃఖభాజనమైన యీ లోకంనుంచి ఆత్మను శాశ్వతమైన, సుఖ ప్రదమైన స్వర్గలోకంలోకి చేరవేసే ద్వారం వంటిదా మరణం ? లేకపోతే పాంచభౌతికమైన యీ శరీరం మరణంతోనే సర్వమూ నామరూపాలు లేకుండా నశించి పోతుందా ?

ఒక్క సంవత్సరంకాలంలోనే మృత్యుదేవత మాయింట్లో రెండు నిండు ప్రాణాలను బలిగొన్నది. నా హృదయంలో ఆరనిచిచ్చు పెట్టింది నేనెప్పుడూ ఆ విషాద సంఘటనలనే తలచుకుని కుళ్ళిపోతూంటాను. మా నాన్న పొలంపోయినప్పుడూ, మరో పనిమీద పోయినప్పుడూ వరం డాలో కూర్చొని ఒంటరిగా మరణరహస్యాన్ని గూర్చి ఆటే ఆలోచి స్తుంటాను. మరణం వల్లనే మానవుడికి పరలోకంలో సర్వసౌఖ్యాలూ లభించబోతుంటే, ప్రజలు చావంటే యెందుకు భయపడుతారో అర్థం కావడంలేదు.

నిత్యజీవితంలో జరుగుతున్న పరస్పర సంఘర్షణలూ, వైరు ధ్యాలూ, విచారిస్తే, యేది నిజమో, యేది అబద్ధమో తోచక గాభరా పడుతున్నాను.

ఇవ్వాళ వరండాలో కూర్చుని వయస్సు మళ్ళిన అగస్టా అంతిమ దినాల్నిగూర్చి జ్ఞాపకం తెచ్చుకున్నాను. ప్రేమాస్పదురాలూ, దైవభక్తు రాలు, పుణ్యాత్మురాలు అయిన అగస్టాగూడా చావంటే అంత భయపడ్డానికి కారణం యేమిటా అని ఆశ్చర్యపోయాను. అగస్టా చెప్పిన విషయాలన్నీ నాకు జ్ఞాపకం ఉన్నాయి. ఆమె నా కెప్పుడూ రాబోయే జన్మను గురించీ, స్వర్గసౌఖ్యాలను గురించీ, వాటి అమరత్వాన్ని గురించీ వర్ణిస్తుండేది. అదే నిజమైన, నిష్కళంకమైన, శాశ్వతమైన ప్రేమ, సౌఖ్యం అని అభివర్ణించేది. ఒక మహా సామ్రాజ్యాన్ని జయించి మానవుని హృదయంలో మానవత్వం, కరుణ మృగ్యమైతే ఆ మానవునికి శాశ్వత సౌఖ్యం యెలా లభ్యమౌతుంది! అంచేతనే తోడి మానవులను ప్రేమించమనీ, విధేయత, ఆదరణ, సహనం సమ్యక్ దృష్టి అలవర్చుకోమనీ, యీ సన్మార్గంద్వారానే స్వర్గసౌఖ్యం సాధ్యమౌతుందని అగస్టా నాతో తరచుగా చెబుతుండేది.

ఈ ప్రపంచములో యెవరికైనా స్వర్గ సౌఖ్యానికి అర్హత ఉన్నదా అని ప్రశ్నిస్తే, తప్పకుండా అగస్టాకు అలాంటి అర్హత ఉన్నదని చెప్పి తీరాలి. ప్రతి వ్యక్తీ ఆమెను దయతో ఆదరించేవాడు. పరిపూర్ణ మానవుడికుండాల్సిన ఉత్తమ లక్షణాలన్నీ ఆమెలో మూర్తీభవించాయి. ఒక వ్యక్తికి గూడా ఆమె యెలాంటి అపకారం చేసి యెరగదు. ఒక్క మనిషినిగూడా పరుష వాక్యం ఆడి యెరగదు. దాతృత్వం ఆమెకు అలంకారం వంటిది! ప్రేమ, మానవత్వం, కరుణ, వినయ విధేయతలు, సౌమ్యం మొదలైన సద్గుణాలన్నీ అగస్టాలో పాదుకున్నాయా అన్నట్లుంది.

ఆమె "కాన్సర్" వ్యాధితో చాలా రోజులు బాధపడ్డది. కొన్ని మాసాలకన్నా ఆమె జీవించదని వైద్యుడు తేల్చి చెప్పాడు. ఈ భయం కర వార్త విని చచ్చిపోతాను కాబోలని కుళ్లిపోయింది దిగులుతో.

కాటికి కాళ్ళు చాచిన ముసిలిది అగస్టా. మొగుడు లేడు. ధనవంతురాలూగాదు. రోజుకు ఒక్కపూట యింతతిని, జవసత్వాలుడిగి వొరుడైపోయింది పాపం! ఈ ప్రపంచంలో యింకాబతికి యేం సుఖం అనుభవిద్దామని జీవితంపైన ఆమెకింత ఆశో నాకు బోధపడదు. ఒక్క గాను ఒక్కబిడ్డ పుట్టి, పెరిగి, యెన్నో సంవత్సరాల క్రితమే చని పోయాడు. తర్వాత కొద్దికాలానికే భర్తకూడా పోయాడు. అప్పటినుండీ ఆమెను దుఃఖం పీడిస్తూనే ఉంది. ఎలాగో ఆమె జీవితం గూడా కడ తేర్చుకోడానికి కష్టపడితేగాని ఆ ఒక్కపూట మెతుకులైనా దొరకవు.

ఇన్ని అగచాట్లు పడుతున్నా, జీవితంమీద ఆమెకు మమకారం వదల్లా. చావంటే ఆమెకీస్థితిలోగూడా భయమే.

చావంటే బెదిరిపోయె యిలాంటి వాళ్ళు యీ గ్రామంలో యిం కెందరో ఉన్నారు. వీళ్ళ ఆఖరుదినాలు యెలా గడుపుతున్నారో, వాళ్ళ మనస్తత్వం యీ స్థితిలో యెలా పనిచేస్తున్నదో, ఆలోచిస్తూ యీ వరం డాలో కూర్చుని కాలం గడుపుతున్నాను. నా ఆలోచనలన్నీ మరణం మీదనే కేంద్రీకరించి ఉన్నాను. మరణానికి భయపడనన్న మా అమ్మ గూడా తీరా చావు సమీపించేసరికీ యెంత భయపడ్డదో అనిపిస్తుంది నాకు. గుక్కతిప్పుకోకుండా మాట్లాడిన ఆరాత్రి పూట, మృత్యు భయంతో మా అమ్మకళ్లు యెలా జేవురుమన్నవో, ఆభయం కప్పి పుచ్చుకోడానికి ఆమె యెలా ప్రయత్నించిందో, భయంతో వణికి పోతున్న యీ ప్రపంచాన్ని విడిచి వెళ్ళడానికి మనస్కొడక, నా చేతిని

గట్టిగా పట్టుకుని, విడిచిపెట్టడానికి నిరాకరించిందో నా కిప్పటికీ, యెప్పటికీ జ్ఞాపకం ఉంటుంది.

మరి చావంటే ఏమిటి? చావుకు ఎందుకు భయపడాలి? ఈ ప్రశ్నల్నే మళ్ళీ మళ్ళీ యీనాటివరకూ నన్ను నేనే వేసుకుంటున్నాను. ఈ ప్రశ్నలకు సరైన సమాధానం యీనాటివరకూ తోచనూ లేదు. మరెవరైనా తెలియజెప్పనూ లేదు. మృత్యు రహస్యాన్నిగూర్చి యెవరైనా చెప్పగలవారున్నారా?

నేనొక్కణ్ణే వరండాలో ఒంటరిగా కూర్చుని సమాధానం తోచక తల బద్దలు కొట్టుకుంటున్నాను. మా నాన్న యెప్పటిలా పొలం పోతూనే ఉన్నాడు. కష్టాలు పడుతూనే ఉన్నాడు. మాసాలూ, సంవత్సరాలూ, దొర్లిపోతున్నాయి. మా నాన్న పొలం చాకిరీ మరింత కష్టమైంది. కిరాయికి కూలీలు దొరకక్క కరవైనారు. సాయంకాలం ఆయ్యే సరికల్లా కళ్ళు లోతుకు పీక్కొనిపోయి, కాళ్ళీడ్చుకుంటూ మా నాన్న యింటికి వస్తున్నాడు. ఆయన్ను చూసి నా కళ్ళవెంట నీళ్ళు గిర్రున తిరిగేవి. నేనుగూడా యితర యువకుల్లా కష్టించి పనిచేసే శక్తి యెప్పుడు సంపాదించుకుంటానా, యెప్పుడు మా నాన్నకు చేదోడువాదోడుగా ఉండి ఆయన కష్టాల్లో భాగం పంచుకుంటానా అని తీవ్రంగా ఆలోచించాను. నా మనస్సులో యిలాంటి ఆలోచనలు యింత బలంగా నన్నెప్పుడూ ఆందోళన పరచలేదు.

మా నాన్నకు హృదయభారం యెక్కువైంది. లోలోపల విచారంతో కుంగిపోతున్నాడు. నలభై సంవత్సరాలుగా మా నాన్నతో కాపురం చేసి, ఆదర్శప్రాయమైన భార్య అనిపించుకున్న మా అమ్మ లేని కొరతనూ, తన ఒంటరితనాన్నీ తలంచుకొని క్షోభించిపోవడం నేన్ను

కనిపెట్టాను. అయినా సాయంత్రం యింటికి వచ్చేసరికల్లా, ఆయన విచారం మాకు తెలియనివ్వక పైకి ఉత్సాహంగా కనిపించేవాడు. పొలాల్లో ప్రతి రోజూ జరుగుతున్న పనుల్ని గురించీ, మా గ్రామ విషయాల్ని గురించీ యెప్పటికప్పుడు మా నాన్న నాకు చెబుతూండేవాడు. కాని వీటన్నిటినీ మించిన గొప్ప సంఘటనలు భారతదేశంలో జరుగుతున్నాయనీ, యీ సంఘటనలే గోవా భవితవ్యాన్నిగూడా తీర్చి దిద్దగలవనీ నాకు వివరిస్తూండేవాడు. మా గ్రామ ప్రజలూ, గోవాలోని యితర ప్రాంతీయులు యీ సంఘటనల్నిగూర్చి శ్రద్ధా సక్తులు ప్రకటిస్తున్నారని మా నాన్న సంతోషించేవాడు. అనతికాలంలోనే భారతదేశానికి స్వాతంత్ర్యము సిద్ధించక తప్పదని మా నాన్న ఘంటా పథంగా చెప్పగలిగాడు.

రెండు సంవత్సరాలుగా భారతదేశంలో కొనసాగుతూ వచ్చిన అనిశ్చిత పరిస్థితి తొలిగిపోయింది. అప్పట్లో బ్రిటిష్ మంత్రివర్గంలో ఇండియా కార్యదర్శిగా ఉన్న అమెరీ తన ప్రతిపాదనలు ప్రాతిపదికగా భారతదేశానికి నూతన రాజ్యాంగ చట్టం తయారు చేసి యిస్తామనీ, దాన్ని అమలు జరపమనీ జైళ్ళ బయట ఉన్న మితవాద నాయకులతో సంప్రదింపులు జరిపి, వారిపై వత్తిడి తెచ్చాడు. బ్రహ్మాండంగా సాగిపోతున్న విప్లవోద్యమం ఫలితంగా వేలకొద్దీ, లక్షలకొద్దీ భక్తులు జైళ్ళపాలైనారు. అమెరీ తలపెట్టిన రాజీ సంప్రదింపులు విఫలమైనాయి. ఆనాటినుండీ వెంట వెంటనే ప్రధానమైన సంఘటనలు జరుగుతూ వచ్చాయి. కారాగృహంలో గాంధిజీ యిరవై ఒక్క రోజులు నిరాహార దీక్ష సాగించడం మూలంగా, ఆయనకు తీవ్రమైన అనారోగ్య పరిస్థితి యేర్పడ్డది. ఈ కారణంచేత ప్రభుత్వం ఆయన్ను విడుదల చేయాల్సి వచ్చింది. మూడు నెలల తర్వాత కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సభ్యులు గూడా విడుదల చేయబడ్డారు. యూరప్‌లో సంఘటనలు త్వరిత గమ

నంతో పరుగెత్తుతున్నాయి. జర్మనీ పతనం నేడో రేపో అన్నట్టుగా ఉన్నది. భారతదేశపు పరిస్థితిని పునఃపరిశీలించాలని చర్చిల్ ఆలోచించాడు. జాతీయ ప్రభుత్వాన్ని నిర్మాణం చేసే ఉద్దేశ్యంతో భారతదేశంలోని వివిధ రాజకీయ పక్షాల ప్రతినిధులతో బ్రిటిష్ ప్రభుత్వం సంప్రదింపులు సాగించింది.

భారతదేశంలో విప్లవ సంఘటనలను గూర్చి వింటున్న మా నాన్నకు కావలసినంత ఉపశమనం కలిగింది. వాటిని గురించి చర్చిస్తున్నప్పుడల్లా ఆయనకు కలిగే ఆనందం యింతంతాకాదు.

"ఒరేయ్ అబ్బాయ్! నీవే చూస్తావు పోర్చుగీసు వాళ్ళు గూడా మూటాముల్లా కట్టుకుని గోవానుంచి త్వరలో వెళ్ళిపోవడం!" అన్నాడు ఒకరోజున మానాన్న. ఆనాడే బ్రిటన్‌లో లేబర్ పార్టీ యెన్నికల్లో గెల్చినట్లు వార్త వచ్చింది.

"భారతదేశంనుంచి బ్రిటిష్ ప్రభుత్వం నిష్క్రమించడానికీ, గోవానుండి పోర్చుగీసు వాళ్లు వెళ్ళిపోవడానికీ సంబంధం యేమిటి నాన్నా?" అడిగాను అర్థం కాక.

"అర్థంకాలేదురా నీకు? సామ్రాజ్యవాదుల రోజులు అంతరించాయి, సూర్యుడస్తమించని బ్రిటిష్‌సామ్రాజ్య వాదుల రోజులు అంతరించాయి. సూర్యుడస్తమించని బ్రిటీష్‌సామ్రాజ్యమే భారతప్రజల విప్లవధాటికి అదిరిపోతుంటే, యీ పోర్చుగీస్ ప్రభువులా యిక్కడ నిలబడేది!" అన్నాడు మా నాన్న.

"అయితే నాన్నా, నీవు ఒకవిషయం మరచావు! బ్రిటిష్‌పాలన అంతం కావడానికి భారతీయుల విప్లవోద్యమం కారణం. వాళ్ళు బ్రహ్మాండమైన పోరాటాలను అనేక సంవత్సరాలనుండీ నడిపి, అస

మానమైన త్యాగాలు చేసారు. వాళ్ళకు శక్తివంతమైన నాయకత్వంగూడా లభించింది సకాలంలో. పోర్చుగీసువాళ్ళు గోవానుండి వెళ్ళిపోవడానికి మన ప్రజలేమైనా వీసమెత్తు త్యాగం చేశాగూ చెప్పునాన్నా?"

"నీవన్నది నిజమేరా అబ్బాయి! మనం చేసిందేమీలేదు. చేయ గలిగిందిగూడా యేమీలేదు. కాని మనం భారతీయులనుండి ఉత్సాహం తెచ్చుకోవాలి. వారిని ఆశయంగా పెట్టుకుని మన ప్రజలంతా ఐక్యం కావాలి. గోవా ప్రజల్లో ఐక్యత సిద్ధించిన నాడు పోర్చుగీసు వాళ్ళమీద తిరుగుబాటు చేయగలమని ఆశిస్తున్నాను. ఆపరిస్థితుల్లో మనకు తప్ప కుండా భారతదేశంనుండి సహాయ సహకారాలు అందుతాయి."

మా నాన్న ఊహకూ, కోరికకూ అనుగుణ్యంగానే గోవా చరిత్రగూడా కొద్దినెలల తర్వాత తిరిగి వ్రాయబడడం ప్రారంభమైంది. 1942 "క్విట్ ఇండియా" ఉద్యమ నాయకుల్లో ఒకరైన డాక్టర్ రామ మనోహర లోహియా గోవాలో ప్రవేశించాడనీ, పోర్చుగీసు పాలకులు ప్రవేశపెట్టిన నిరంకుశ శాసనాలను రద్దు చేయించడానికై గోవాలో ప్రజా ఉద్యమం ప్రారంభం చేసే ఆలోచనలో ఉన్నాడనీ, వార్తలు వ్యాపించాయి. గోవా ప్రముఖు లనేక మంది లోహియాతో సంప్రదించ డానికి వెళ్లారనీ, వాక్సభా పత్రికా స్వాతంత్ర్యాలను అరికడుతూ పోర్చు గీసు ప్రభుత్వం అమలు జరిపిన నిషేధపు ఉత్తరువులను ఉల్లంఘిస్తూ బహిరంగ సభలో ఉపన్యసించడానికి లోహియా సంసిద్ధుడైనాడనీ వార్తలు విన్నాం.

ఈ వార్త వినగానే మా నాన్న అనుభవించిన ఆనందం యీ మధ్య యెన్నడూ అనుభవించలేదు. కొత్త తేజస్సు, కొత్త చైతన్యం, కొత్త ధైర్యసైర్యాలు ఆయనలో మొలకలెత్తినట్లు కన్పించాడు. ఆ

సాయంత్రం మా నాన్న డాక్టర్ అక్వినోతో మాట్లాడుతున్నప్పుడు నవ్యోత్సాహంతో ఉట్టిపడే నవయువకుడిలా కనిపించా డాయన.

"రేపు నేను మార్గో వెడుతున్నాను. ఏమైనా జరగనీ! యెన్ని కష్టాలైనా రానీ! రేపటి సభకు నేను వెళ్ళి తీరాల్సిందే!" అన్నాడు మా నాన్న ఉత్సాహంతో.

"వినండి టాబ్ నేను చెప్పేది! మీ గుండె అంతబలమైనది కాదు. ప్రస్తుతం మీరున్న నీరస స్థితిలో, ఉద్రేకమైన ఆలోచనలూ, కార్యక్రమాలు మీకు బొత్తిగా గిట్టవు. మీ ఆరోగ్యం దెబ్బ తిని పోతుంది. మీ శ్రేయోభిలాషిగా, మిత్రుడుగా, మీ డాక్టర్‌గా నేను సలహా యిస్తున్నాను సభకు పోవద్దని. అదీకాక పొలం పనులు ముమ్మరంగా ఉన్నాయని మీరే అన్నారు గదూ!" అన్నాడు డాక్టర్ అక్వినో.

"పాడుపొలం పన్లెలా పోతేనేం! ఎప్పుడూ ఉన్నవేగా ఆపన్లు! నాగుండె యెలా అయిపోతేనేం! రేపటి మహాసభకు హాజరై తీరాల్సిందేనండీ! ఈ లోకంలో యెవ్వడూ నన్నాపలేడు పోకుండా!" అన్నాడు మానాన్న రోషంతో.

"ఏమండీ! అంతబ్రహ్మాండమైన సభలో లోహియా ఉపన్యసిస్తుంటే పోలీసులు దద్దమ్మల్లా గుడ్లప్పజెప్పి చూస్తూ నిలబడతారా మీపిచ్చిగాని! అనిగాడు డాక్టర్ అక్వినో తీవ్రమైన అనుమానం వెలిబుచ్చుతూ. "మీకొచ్చే ప్రమాదమేమీ ఉండదనుకోండి! నామాట నమ్మండి! ఆయన్నుమాత్రం తీవ్రమైన చిక్కుల్లో పెడతారు. అదీగాక ఒక్కమనిషేం చేయగలడు చెప్పండి! పోనీ, మన ప్రజలేమైనా ముందుకొచ్చి ఆయనకు అండగా నిలబడగలరా? ఏమో! నాకను మానమే!"

"ఆవిషయం నాకు తెలియదు. నాకెన్ని కష్టాలైనా రానీ! నేను ఒక్కణ్ణయినా సరే! ఆయన ప్రక్కనే నిలబడి అన్ని విధాలా ఆయనకు అండగా ఉంటాను. నేనక్కడకు వెళ్ళడంగూడా అందుకే." అన్నాడు మా నాన్న లెక్కచేయనట్లు.

మర్నాడు తెల్లవారు ఝామునే మా నాన్న నిద్రలేచి జరూరు పొలంపన్లన్నీ పూర్తిచేసుకొని మధ్యాహ్నానికల్లా తిరిగి యింటికొచ్చాడు. ఆదరాబాదరా నాలుగు మెతుకులు నోట్లోవేసుకుని, మార్గానికు ప్రయాణమై వెళ్ళాడు.

"నీవు తప్పకుండా వెళ్లాలా నాన్నా? నీగుండె ప్రస్తుతమున్న పరిస్థితిలో ఉద్రేకాలూ, ఆవేశాలూ పనికిరావని డాక్టర్ సలహా యిచ్చాడు జ్ఞాపకం ఉందా?" అన్నాను. ఆఖరు నిమిషంలో నామాట వినైనా ప్రయాణం సర్దుకుంటాడేమో అని ఆశించాను.

మా నాన్న నావంక వాత్సల్యంతో పారచూసి, ప్రతిమాటా తూచి మాట్లాడాడు. "నాకొచ్చిన వయస్సుకు, నాకున్న రాజకీయ భావాలకూ, ఉన్నతమైన ఆశయానికీ అవసరమైన త్యాగం చేయకపోతే నా జీవితానికి పరమార్థం అంటూ ఉండదు. నాబోటి ముసలివాడికి చావంటే భయమెందుకుండాలి!" అన్నాడు మా నాన్న ఆవేశంతో.

"అలా అయితే నా గతేం కావాలి నాన్నా?" అడిగినాను ఆతురతతో. "ఇప్పుడు నాకు మిగిలింది నీవొక్కడివే! నీ ప్రాణాని కేదైనా ప్రమాదం వాటిల్లితే, యిహ నన్నెవరు ఆదరిస్తారు? ఎవరు ఆదుకుంటారు నాన్నా?"

"అబ్బాయ్! నేను మాత్రం శాశ్వతంగా యీ ప్రపంచంలో ఉట్టిగట్టుకొని ఊరేగు తానటా? రేపో మాపో నేనూ నీనుంచి దూరమై

దాటిపోవాల్సిన వాడినే. ఎప్పుడైతేనేంరా పోయేదానికి! ఇంతకూ బతికిన నాల్గురోజులూ శక్తి ఉన్నంతలో యేదో ఒక ఘనకార్యం చేసి మరీ పోవాలి!"

హడావిడిగా గుడ్డలు వేసుకుని, బూట్లు తొడుక్కుంటున్నాడు మా నాన్న. నా చిన్నతనంలో మా నాన్న బూట్లు వేసుకునేప్పుడు హుషార్లో కూన రాగాలు తీస్తుండేవాడు. ఆనాటి కూనరాగం మళ్ళీ యీ రోజు విన్నాను. ఆయన యివ్వాళ విపరీతమైన ఆనందాతిశయంలో మునిగి ఉన్నాడు. అలా ఉండడం నాకెంతో సంతోషం కలిగించిందికూడా. ఇంత ఉత్సాహంలో ప్రయాణం కాబోతున్న మా నాన్నను ఆపివేయడం నాకు మనస్కరించలేదు. అందుకని సుఖంగా వెళ్ళి, సుఖంగా తిరిగిరమ్మని మా నాన్నను పంపించాను.

"అయితే నీవు వాళ్ళతో కలిసిపోననీ, దూరాన ఉండి మాత్రమే పరిస్థితుల్ని పరిశీలించి తిరిగి వెంటనే యింటికి వస్తాననీ నాకు వాగ్దాన మివ్వాలి నాన్నా!" అన్నాను ఆయన మెట్లు దిగి కిందికి పోతుండగా. మా నాన్న వెనక్కి తిరిగి నన్ను చూసి చిరునవ్వుతో, "అబ్బాయ్! ఒక్క విషయం మాత్రం నీకు గట్టిగా వాగ్దాన మివ్వగలను; నేను తప్పక తిరిగి వస్తానని!" అన్నాడు మా నాన్న.

నీలాకాశంలో సూర్యభగవానుడు దేదీప్యమానంగా వెలిగిపోతున్నాడు. మామూలుగా జూన్‌నెలలో చేస్తుండే మబ్బులు యీ రోజున కనిపించలేదు. క్రితంరోజునే జోరుగా వర్షం కురవడం చేత నేల యింకా తడితడిగానే ఉంది. భూమిలో నుండి మధురమైన కమ్మని వాసన గుప్పించి కొడుతున్నది. గాలికి చెట్లకొమ్మలు పసిపిల్లల్లా అటూ యిటూ కొట్టుకుంటూ గందరగోళం చేస్తున్నట్లున్నాయి.

మా నాన్న ప్రయాణమై పోతున్నప్పుడు నేనాపే దిగులు పళ్ళేదు. పైగా ఆయన్ను ఉత్సాహంతో ప్రయాణంచేసి సాగనంపి వచ్చాను. కాని సాయంకాలం కావస్తున్నప్పట్నుంచీ, నాలో అశాంతీ, ఆందోళన అధికం కావడం ప్రారంభించాయి. ఈ బలహీనతను పారదోలడం నావల్ల కాలేదు. పరుగెత్తుదామనీ, దుముకుదామనీ, నీళ్ళ గుంటలో దొర్లాడిన కుక్క నేలపై పడి పొర్లినట్లు పొర్లాడుదామనీ, నాకాలోచన తోచింది. అంతలో పుట్టినకోర్కె ఉన్నట్లుండి అకస్మాత్తుగా మాయ మైంది. నాలో యెందుకావిచ్చి ఉహ కలిగిందో నాకర్థం కాలేదు. అంతలోనే నన్ను ఒకవిధమైన మైకం ఆవహించింది. నా బ్రతుకువల్ల నెవరికీ, యేవిధమైన ప్రయోజనం లేదనీ, నేనరోగ్యంగా ఉన్నందు వల్ల నా తండ్రికి కలిగే మేలులేకపోగా ఆశాభంగం మాత్రం కావలసి నంతగా గలిగిస్తున్నాననీ అనుకున్నాను. అస్తమానమై చీకటి కమ్ము కొచ్చింది. నేను వంటరివాడనై విచారంలో మునిగిపోయాను. మా అమ్మా, రూత్ ఒక్కసారిగా జ్ఞాపకం వచ్చారు. మా బాల్యంలో మేం గడిపిన రోజులు కళ్ళకు కట్టినట్లు ప్రత్యక్షమైనాయి. ఆనందమయమైన ఆ బాల్యజీవితం నా ఊహాచిత్రంలో ప్రత్యక్షమైనప్పుడు నేను తన్మయ త్వం చెందాను.

సాయంకాలమైంది. చర్చిగంట మోగగానే యెక్కడెక్కడివాళ్లు పనులు ముగించుకొని యింటిముఖం పట్టారు. పసిబిడ్డలు గూడా ఆడు కునే ఆటలు ఆపి, యిళ్ళకు వచ్చి పెద్ద వాళ్ళతో చేరి ప్రార్థనలు చేస్తు న్నారు. పగలల్లా చెమటోడ్చి పొలంలో పనులుచేసిన రైతుకూలీ జన సామాన్యం రాత్రిభోజనాలు ముగించుకుని ప్రియురాండ్రితో కలిసి సుఖ నిద్రకు పడ్డారు.

నాకు ఒక్కసారిగా చిన్నతనపు సంఘటనలు స్ఫురణకువచ్చాయి. చీకటిపడగానే మా చెల్లి రూత్ తరుచుగా గోడచాటున నక్కి నాతోను, మా సీజరుతోనూ తాను ఆటలాడుతూ యింకా వెనకనే వున్నట్లు మా అమ్మకు చెప్పమంటుండేది. మా అమ్మ మండిపడి "చూడు రూత్‌ను యివ్వాళ యేంచేస్తానో ! దానికివ్వాళ మూడింది. నా చేతుల్లో !" అంటూ కేకలు పెట్టేది. ఇంతలో రూత్ గోడచాటునుండి అమాంతంగ మా అమ్మ ముందు ప్రత్యక్షమయ్యేది. మా అమ్మ నిర్ఘాంతపోయి, వెర్రి బాగుల దానిలా చూసేది. ఈ తమాషా సంఘటనలన్నీ ఆ సాయంకాలం నా కళ్ళముందు ప్రత్యక్షమైనాయి.

ఇలాంటి అల్లరి పనులు సాధారణంగా ప్రతి సాయంత్రం చేస్తూ మా అమ్మను కవ్వించేవాళ్ళం; విసిగించేవాళ్ళం. తలుపుల చాటునా, గోడలచాటునా నక్కి ఆమెను యెన్నోసార్లు ఝడిపించేవాళ్ళం. ఇదంతా ఆమెకు కోపం తెప్పించడానికీ, ఆమె కోపాన్ని చూసి ఆనందించ డానికీ, దీపాలు ముట్టించగానే నోటితో ఉప్పున ఊదేవాళ్ళం. సాయం కాలం కాగానే మా అందర్లో యెవరు ముందు స్నానం చేయాలో పందాలు వేసుకొని, ఒకళ్ళతో మరొకళ్ళ కీచులాడుకుంటూ, యిల్లంతా ఒక కొలిక్కి తెచ్చేవాళ్ళం. స్నానం చేసేప్పుడు బావిదగ్గర మేం చేసే అల్లరి విని, యిరుగు పొరుగు వాళ్ళంతా మేం కొట్లాడుకుంటున్నామని గోడలమీదినుండి మా దొడ్లోకి తొంగిచూసేవాళ్ళు.

బాల్యంలో నిత్యమూ జరిగే యీ అల్లరీ, యీ రద్దీ నా మనస్సులో యిప్పుడు ఒక్కసారిగా తలపుకు వచ్చింది. నాలో ఒక వంక ఆనందం మరొకవంక విచారం కల్గింది. అవన్నీ చిన్నప్పటి సంఘటనలు. నాటి నుండి నేటివరకూ ఎంత దీర్ఘ ప్రయాణం చేశాం: ఎన్ని అనుభవాలు

గడిపాం. ఎన్నెన్ని విషాదపూరితమైన పరిణామాలు సంభవించాయి. మా అమ్మ రూత్ చర్చి ఆవరణలోని గోరీల దొడ్డిలో శాశ్వత నిద్ర పోతున్నారుగద ! నా అన్నదమ్ములూ, మేరియా, పుట్టిన యిల్లు విడిచి దూరదేశములో కాలం గడుపుతున్నారుగద ! నన్ను కనిపెట్టుకుని, నా ఒక్కడిమీదనే తన ఆశలన్నీ కేంద్రీకరించిన మా నాన్న ఒక్కడూ పొలంలో పగలల్లా పని చేసి చేసి సాయంకాలం చీకటిపడి బక్క చిక్కిన ప్రాణంతో కాళ్ళీడ్చుకుంటూ యింటికి వస్తాడు.

మా నాన్న యెందుకు యింతవరకూ యింటికి రాక ఆలస్యం చేశాడు. అంతకంతకూ కారుచీకటి వ్యాపిస్తూంది. ఎటు చూచినా భయం వేస్తూంది. ఇంకా మా నాన్న యింటికి రాలేదని నా మనస్సులో ఆందోళన హెచ్చుతూంది. కారుమేఘాలు ఆకాశంను అలముకుంటున్నాయి. మధ్య మధ్య ఉరుములూ, మెరుపులూ నా గుండె తల్లడిల్ల జేస్తున్నాయి. వర్షం యిప్పుడా, యింకా కాసేపటికా అన్నట్లుంది. మా నాన్న గొడుగు తీసుకొని పోయాడా ? ఆయన క్షేమంగానే ఉన్నాడుగదా !

రాత్రి యెనిమిది గంటలైంది. చనిపోయినవాళ్ళ మనశ్శాంతికై ప్రార్థనలు చేసేందుకు చర్చిగంట మోగింది. కూలీలు రైతులూ సారాయి దుకాణం నుంచి మా యింటిపక్కగా తిరుగుముఖం పట్టి పెద్దగా మాట్లాడుకుంటూ పోతున్నారు. వాళ్ళల్లో ఒకడు పాడే పాటకు తాత్కాలికంగా నా దిగులు మరచిపోయాను. నవ్వడం గూడా ప్రారంభించాను. ఆ పాటకు యతీ, ప్రాసా లేదు. అతనే స్వంతగా తయారు చేసిన పాటలా ఉంది. మొదటినుంచీ చివరవరకూ పాటంతా బూతులపంచాంగం. మొగుడికోసం తపించి, తపించి పెండ్లికాని ఒక చక్కని గుంట గత్యంతరం లేక చివరకేంచేస్తుందో తెలియజేస్తుంది పాట.

కాని మా నాన్న యేడీ ?

రాత్రి పొద్దు పోయింది. అప్పటివరకూ ఆయన్న యింటికి రాక పోవడం వల్ల, నా మనస్సులో చెప్పలేనన్ని పాడు ఆలోచనలు పుట్టు కొచ్చాయి. సారాయి దుకాణంనుంచి తిరిగి వచ్చిన కూలీ, రైతులు, నా మనస్సులోకి సారాయికి సంబంధించిన ఆలోచనలు గూడా తెచ్చి పెట్టారు. మా నాన్నగూడా వీళ్ళతోపాటు తెగతాగి. ఒళ్లు తెలియక రోడ్డు పక్క యెక్కడైనా పడి దొర్లుతున్నాడేమో అని చెడ్డ ఊహ పుట్టింది నా మనస్సులో. మా నాన్న దుఃఖాన్ని మరచిపోవడానికి యిటీవల విప రీతంగా తాగడం మొదలుపెట్టాడు రాత్రిళ్లు. కష్టాలు దిగమింగడానికై యీ దురలవాటు చేసుకున్నందుకు ఆయన్ను పల్లెత్తు మాట గూడా అనే వాణ్ణికాదు. తాగుడు అలవాటు చేసుకున్న తర్వాత తాత్కాలికంగానైనా ఆయనకు మనశ్శాంతి కలిగింది పాపం! తాగుడు లేకపోతే, గుండె పగిలి యెప్పుడో చనిపోయేవాడే.

కళ్లు చిల్లులు పడేట్లు కనిపెట్టుకుని కూర్చుని కూర్చుని విసుగెత్తి పోయింది ప్రాణం. నిద్రలేక కళ్ళు వాచిపోయాయి. ఇంతలో రోడ్డు వెంట మా యింటి వేపుగా యెవరో వస్తున్నట్లు అలికిడి తగిలింది. నా కండ్లు పెద్దంగా చేసి ఆ వేపు చూచేను. ఆ వచ్చేమనిషేమైనా మాట్లాడు తాడేమోనని చెవులు దొరగిల బెట్టుకొని వింటున్నాను అనిశ్చిత స్థితిలో. ఇంతకూ ఆ వచ్చేమనిషి డాక్టరు ఆక్వినో.

"ఏయ్! ఎవరైనా ఉన్నారా అక్కడ?" అని పిలిచాడు డాక్టర్ చీకట్లోనుంచి.

"అవునండీ డాక్టరుగారూ! నే నిక్కడే ఉన్నాను." అని సమా ధానమిచ్చి, మా నాన్న యింతవరకూ యింటికి రాలేదని ఆయనకు తెలియజేశాను.

ఆయన కంఠస్వరంలో ఆశాభంగం ద్యోతకమైంది "ఇంక రానే లేదా ? ఆయనేమీ చిక్కుల్లో పళ్ళేదుగదా !" అన్నాడు డాక్టరు. మెట్లెక్కి వచ్చి పడకకుర్చీలో కూర్చున్నాడు.

"ఎలాంటి చిక్కులండీ డాక్టరుగారూ మీ రూహించింది ?" అడిగాను గాబరాతో భయపడి.

"ఓ ! ఈ పోర్చుగీసువాళ్లు అటు రాజతంత్రజ్ఞులూకాదు ! యిటు స్థిరబుద్ధి గలవాళ్ళు కారు ! ఏమి చేయలేని అసమర్థులు గూడా ! నిరాయుధులైన ప్రజలపైన కాల్పులు గూడా జరపడానికి జంకని కటిక మూర్ఖ శిఖామణులు వాళ్లు !" అన్నాడు డాక్టరు.

"వాళ్ళలాంటి పని చేస్తారా డాక్టరుగారూ ?" నా మనస్సు కుదుట వడే సమాధానం ఆయన చెబుతాడని నా ఆశ.

"ఏమో ! వాళ్ళేంచేస్తారో యెవరు చెప్పగలరు ? అసలు మీ నాన్నను అక్కడికి పోవద్దనే చెప్పానుగా నేను. మరాయన విన్నాడూ ! అయిపోయిందేమో అయిపోయింది ! మీ నాన్న యింటికి రాగానే నేనో సారి ఆయన్ని రమ్మన్నానని చెప్పు ! మార్గంలో యేమి జరిగిందీ పూస గుచ్చినట్లు వినాలనుంది నాకు !" అన్నాడు డాక్టరు.

నా మనస్సుకు ఊరట కల్పించడానికి బదులుగా డాక్టరు నా బాధను మరింత యెక్కువ చేశాడు. ఆయన నన్ను విడిచి వెళ్ళిపోగానే, నా ఆతురత మరింత యెక్కువైంది. ఇంకో రెండు గంటలు వరండాలోనే కూర్చుని మా నాన్న అప్పటికైనా తిరిగివచ్చి నా మనోవ్యధ తీర్చుతాడేమో అని ఆసతో యెదురు చూస్తున్నాను.

అలసటతో ఆవలింతలు వచ్చి నిద్రపోయాను. తెల్లవారుఝామున కుక్కల అరుపులకు నాకు మళ్ళీ మెలకువ వచ్చింది. నిప్పుపుల్లి వెలి

గించి మా నాన్న వచ్చాడేమో అని యిల్లంతా కలియచూశాను. ఆయన యెక్కడా కనిపించకపోవడం చూసి ఆంటోనియో మా అమ్మకోసం కొనితెచ్చిపెట్టిన అలారంగడియారం వంక .నా దృష్టి మరలించాను. తెల్లవారుఝాము రెండున్నర గంటలైంది. అంత పొద్దుపోయేవరకు మానాన్న యెక్కడుంటాడా అని ఆలోచించాను.

ఆ తర్వాత వెంటనే "మర్రింకో" అనే మా పెంపుడు కుక్క ఒకటే మొరగడం మొదలెట్టింది నోరు నొప్పిలేనట్లు. ఒక నిమిషం అయిన తర్వాత ఆ వస్తున్న మనిషిని గుర్తుపట్టిందా అన్నట్లు మొరిగే మొరిగే కుక్క ఒక్కసారిగా కటుక్కున ఆపివేసింది. ఆ మనిషి యెవరోకాదు; మా నాన్నే! ఆయన మునివేళ్ళమీద గదిలోకి నడచి వచ్చాడు. పెద్దగా నడిస్తే నేను లేస్తానని భయంతో. నిద్ర పట్టకుండా కొట్టుకుంటున్న నేను ఆయన వాలకాన్నీ, ఆయన నడకనూ గమనిస్తూనే ఉన్నాను. అసలు మెలుకువతోటే ఉన్న నాకు మెళకువ తెప్పించ కూడదని కిక్కురుమనకుండా యింట్లో ప్రవేశించిన మా నాన్నను చూసి నాలో నాకు నవ్వు వచ్చింది.

"నీవు మెళకువతోటే వున్నావురా అబ్బాయి? గాఢ నిద్రపోయావనుకున్నానే!" అంటూ మా నాన్న చెప్పులకోసము వెతుక్కుంటున్నాడు.

"దీపం వెలిగించు నాన్నా! నేను నిద్ర పోతున్నాననుకున్నావేమో! ఎప్పుడో మేలుకున్నా నేను! బహిరంగసభ యెలాజరిగింది నాన్నా?" అని అడిగాను.

"బహిరంగ సభా! అద్భుతంగా జరిగిందిరా!" అని జవాబిచ్చాడే గాని, దీపం వెలిగించడానికి ప్రయత్నించలా.

"దీపం యెందుకు ముట్టించవు నాన్నా? ఎందుకలా చీకట్లో తవుళ్లాడుకుంటావు?"

"అంతా బాగానే ఉందిరా! చీకట్లో గూడా చూడగలను నేను! తెలుసునా?"

"నీ మాటల్లో అర్థంలేదు నాన్నా! చీకట్లో చూడగలుగితే ఎందుకలా తవుళ్లాడుకుంటావు మరి చెప్పు?"

దీపం వెలిగించమని మా నాన్నను ఒకటే పోరు పెట్టాను ఊపిరాడనివ్వకుండా. చివరకాయన వెలిగించక తప్పలేదు. తవుళ్లాడి తవుళ్లాడి. చివరకు దీపంబుడ్డి ఉన్న బల్ల వద్దకే వచ్చి చేరాడు. నా వైపు ఆయన వీపుపెట్టి నిలుబడ్డాడు. గోడమీద పడ్డ ఆయన నీడ తాడిచెట్టు ప్రమాణంతో ఉన్నట్లు భీకరంగా కన్పించింది.

"ఇప్పుడు బాగుంది చక్కగా! అన్నాడు గదినిండ వెలుతురు చూసి. "ఇహ చెప్పు నాన్నా యిప్పుడు ఆ సభను గురించి!"

"ఇప్పుడు గాదురా అబ్బాయ్! నీవు పడుకుని నిద్రపో! అంతా వివరంగా రేపు చెబుతాలే! అంటూ మా నాన్న అక్కడే నిలబడున్నాడు వీపు నా వైపే పెట్టి."ఆ కథంతా పూర్తిగా చెప్పాలంటే, యేళ్లూ పూళ్లూ పడుతుందిరా! ఇప్పుడు తెమిలేది కాదు." అన్నాడు మా నాన్న.

షర్టు గుండీలు విప్పుకుంటున్నట్లు నటిస్తూ, దీపం వేపే మొహం పెట్టి మా నాన్న కాసేపక్కడే నిలబడ్డాడు. నా వేపు తిరగడానికి ఆయన ప్రయత్నమే చేయలేదు. నాకెందుకో అనుమానం కలిగింది.

"నాన్నా! మంచంమీద సావకాశంగా కూర్చుని బూట్లు విప్పుకోరాదూ. ఇంతసేపూ అటు ముఖం పెట్టుకుని నిలబడే ఉన్నావేం? నీవింత అలసి పోయావు గదా! కాసేపయినా చతికిల బడి విశ్రాంతి

తీసుకోరాదూ ?" టేబిల్ వద్ద నిల్చుని ఉన్న మా నాన్న ఒక్క అంగుళ మైనా అటూ యిటూ కదల్లా. నాలో అనుమానం బలమైంది. మంచం మీదినుండి క్రిందికి దూకి మా నాన్న వద్దకు వెళ్లాను. మా నాన్న విచిత్ర వైఖరంతా అప్పుడర్థమైంది నాకు. ఆయన కోటు ముందు భాగ మంతా నెత్తురు ముద్ధయింది. ఆయన యెడమ చెంపమీద పెద్దగాయం తగిలి; రక్తం యింకా స్రవిస్తూనే ఉంది.

గద్గద కంఠంతో నా నోటి వెంట సరిగా మాట రాక, "ఓరి భగవంతుడా ! ఎంత పని చేశావు ! ఏం జరిగింది నాన్న ! ఏం జరి గింది ? ఈ రక్తమంతా యేమిటి ? నా కళ్లు తిరిగిపోతున్నాయి నాన్నా !" అన్నాను, మా నాన్న సమాధానం చెప్పేలోగానే, నేనుకుంటుకుంటూ గదిలోకి వెళ్లాను. గాయం కడిగికట్టు కట్టడానికి కోటాతో నీళ్లూ, తెల్లని గుడ్డా పేలికా తెచ్చుకున్నాను.

"అదేమంత ప్రమాదకరమైనది కాదురా ! కంగారు పడబోకు. మరేం పర్వాలేదు" అన్నాడు మా నాన్న గాయం కడుగుతుండగా. "చిన్న గాయంలేరా అది ! రేపటికల్లా అది మాని పోతుంది. ఈ చిన్న గాయానికే యింత కంగారుపడతావేంరా ?"

"కాని అక్కడేం జరిగింది నాన్నా ? అసలా గాయం అక్కడ యెలా తగిలింది నీకు ?"

"మరేం పర్వాలేదని చెబితినిగదరా ! దాన్ని గురించి నీవేమీ గాభరాపడబోకు ! అన్నాడు యేమీ బాధ లేనట్లు. ఆయనెంత తేలిగ్గా త్రోసి పారేద్దామని ప్రయత్నించినా, ఆయన ముఖవైఖర్ని బట్టి, ఆయ నెంతో బాధపడుతున్నట్టు అర్థమైంది నాకు.

"ఎలా తగిలింది నాన్నా అంటే చెప్పవేం?" నిన్నెవరుకొట్టారు. మా నాన్న దృష్టి గోడమీద కేంద్రీకరిస్తూ, పళ్లు బిగించి ప్రతి మాటా నెమ్మదిగా ఆచి ఆచి పలికాడు. "ఒక పోలీసు కానిస్టేబిల్ కొట్టాడు రా నన్ను!"

"ఎందుకు నాన్నా ? ఎందుకుకొట్టాడు నాన్నా ?"

"జైహింద్ ! అని అన్నందుకు కొట్టాడురా నాయనా !

---

౧౩

మార్గోనగర జీవితం ప్రశాంతంగా సాగిపోతూంది. అంగడి వీధులన్నీ పట్టణానికొక పక్కా, నివాస గృహాలన్నీ మరో పక్కా ఉన్నాయి. మునిసిపల్ ఆఫీసు, పోలీసు ప్రధాన కార్యాలయం, పోస్టాఫీసు, ట్రెజరీ నగరానికి మధ్యగా ఉన్న ప్రశాంత వాతావరణంలో ఒకదాని సరసనే మరొకటి చతురాకారంలో నిర్మించబడున్నాయి. వయస్సు మళ్లిన ఆడవాళ్లందరూ సాయింత్రం వరండాల్లో ఊగుడు కుర్చీల్లో కూర్చుని, వీధులవెంట పోయే మోటారుకార్లనూ, బస్సులనూ. చూస్తూ ఆనందిస్తుంటారు. మగపిల్లలూ, ఆడపిల్లలూ వీధుల్లో ఆడుకుంటునో, లేక మేడమీదెక్కి కోతి కొమ్మచ్చు లాడుకుంటునో, కబుర్లు చెప్పుకుంటూనో కాలక్షేపం చేస్తున్నారు హాయిగా.

నగర ప్రజలు క్రమశిక్షణతో యెవరి పనులు వారు సరిదిద్దుకుంటూ ప్రశాంత జీవితం గడుపుతున్నారు. ఒడిదుడుకులు, ఉద్రేకాలు, ఆవేశాలు మచ్చుకైనా కన్పించవు. రాకపోకలు అజమాయిషీచేయడం, వీధులవెంట గస్తీతిరగడం తప్పితే, పోలీసు ఉద్యోగులకు మరేపనే లేదు. ఎవరైనా చెదురువాటుగా తప్పతాగో, కోడిపిల్లల్నో, గడ్డి మోపుల్నో దొంగతనం చేసి పోలీసువాళ్ల కళ్లు పడడం తప్పితే, నగరంలో పెద్ద యెత్తున గలాటాలేవి లేవు. హత్యలూ, బంది పోట్లూ మోసాలూ మార్గోలో మచ్చుగ్గూడా లేవు. పోలీసు అధికార్లకు గోళ్లు గిల్లుక్కుంటూ కూర్చోడంతప్ప మరి పనీపాటా సున్న. అప్పుడప్పుడూ తోచక పక్కనే ఉన్న లయోల హైస్కూలు, పాప్యులర్ హైస్కూళ్ల

విద్యార్థులు చేస్తుండే అల్లరిని ఆఫీసు కిటికీ గుండాచూస్తూ ఆనందిస్తూ ఉండేవాడు పోలీసు అధికారి.

జూన్ 18వ తేదీ వరకూ మార్గో వాతావరణం యిలాగే ప్రశాంతంగా ఉంటూ వచ్చింది. ఇంతలో రామమనోహర లోహియా రంగంమీదకొచ్చాడు. నిరాశ, నిస్సహాయతలతో కర్తవ్యతా మూఢులై ఉన్న మా ప్రజల్ని ఉత్సాహపరచి కార్యరంగంలోకి దుమికేట్లు చేయడానికి ప్రయత్నించాడు.

అంతవరకు గాఢనిద్రావస్థలో ఉన్న మార్గో నగరం ఆకస్మికంగా మేలుకొని తమ భవిష్యత్తును గూర్చి ఆలోచించసాగారు.

ఆ రోజు సూర్యోదయంనుండీ వీథి మూలల్లో గుంపులు గుంపులుగా ప్రజలు పోగై గుస గుసలు ప్రారంభించారు. వాతావరణం అనిశ్చితంగా ఉంది. ఏ నిమిషాన యేం జరగబోతున్నదో యెవరికీ తెలియదు. పోలీసు కమీషనర్ తనయింటిప్పద్దనుండి పోలీసు కార్యాలయానికి పోతూండగా దారిపొడుగునా ప్రజలు "జైహింద్" నినాదానాలు చేస్తున్నట్లు అతనికి వినిపించింది. మొట్టమొదట్లో నినాదాల పట్ల నిర్లక్ష్యం వహించాడు తనకు పట్టనట్లుగా. అంతకంతకూ "జైహింద్" నినాదాలు వెంట వెంటనే పెద్ద గొంతుకలతో వినబడ్డాయి. స్కూలు విద్యార్థులు గూడా అందుకున్నారు. కమీషనరు క్రింది అధికారిని పిలిచి, నినాదాల అర్థం అడిగాడు. కాని అతడు అర్థం వివరించి చెప్పలేక పోయాడు.

"మీకు గూడా తెలియదూ దీని అర్థం? అన్నాడు పోలీసు కమీషనర్ ఆశ్చర్యంతో. "మీరు పుట్టినప్పట్నుంచీ యీ దేశంలో ఉన్నారు. అయినా "జైహింద్!" అంటే అర్థంతెలియదూ? ఎలాంటి మనుష్యులని చెప్పాలి మిమ్మల్ని!"

పోలీసు కమీషనర్ తెలివైన పోర్చుగీసు యువకుడు. చలాకీ మనిషిగూడా. వలస రాజ్యాలను పరిపాలించడంలో సామర్థ్యం, నేర్పరితనం గల వ్యక్తి. గోవాకు రెండేండ్ల క్రితం వచ్చాడు. ఇక్కడి పరిపాలనా పద్ధతులూ, యిక్కడి ప్రజల మనస్తత్వాలూ అర్థం చేసుకోడానికి పూర్తిగా ప్రయత్నించాడు. అయితే గోవాలోనే పుట్టి స్వభాషా సంప్రదాయాల్ని గూడా విస్మరించి పోర్చుగీసు జాతీయులనే తలదన్నినంతగా వాళ్ళలో లీనమైపోయిన తన క్రింది అధికారి మనస్తత్వాన్ని మాత్రం అతడర్థం చేసుకోలేకపోయాడు.

పోలీసు కమీషనర్ అన్నమాటకు సార్జెంటు కినిసి భుజా లెగురవేశాడు. ముక్కింతలావు చేశాడు. "ఆ మాటల కర్థం నా కెలా తెలుస్తుందనుకుంటారు మీరు? అది పోర్చుగీసు భాష కాదు గదండీ! అది ఆ పాడు భారతీయ భాషలలో ఒకటి. దాన్ని తెలుసుకోనూలేదు; తెలుసుకోవలిసిన అవసరమూ లేదు!" అంటూ దేశాయిని పిలిచి "జైహింద్" అర్థం అడిగాడు.

దేశాయి తక్షణమే మిలటిరీ ఖత్తులో నడిచివచ్చి సెల్యూట్ చేశాడు. "జై హింద్" అంటే "భారతదేశం చిరకాలం వర్థిల్లుగాక!" అని అర్థం చెప్పాడు విధేయతగా. ఆ మాటకు వ్యుత్పత్తి గూడా వివరించాడు. కమీషనర్ మధ్యలో నివారించి అరగంట సేపట్లో పోలీసు కాన్‌స్టెబుల్సును, ఇతరసిబ్బందినీ ఆఫీసు ఆవరణలో సమావేశపర్చమని ఆజ్ఞ జారీచేశాడు.

మార్గోనగరం అంతటా ఆందోళన, ఉద్రేకం యెక్కువైనాయి. రోడ్లమీద జనం వేలాదిగా గుంపులు గూడి లోహియా ఉపన్యాసాన్ని గూర్చి చర్చించుకుంటున్నారు. అదివరదాకా పరమ విధేయులుగా, చట్టబద్ధులుగా పోర్చుగీసు అధికార్లకక్రింద మానాభిమానాలు చంపుకుని పడి

వున్న గోవాపౌరులు ఆకస్మికంగా నవచైతన్యం పొంది ఉత్తేజితులై నారు. వీధులలో అనంతంగా గుమిగూడి నినాదాలు చేస్తున్న ప్రజల్ని కమీషనర్ కిటికీలోనుండి కనిపెడుతున్నాడు. ఉన్నట్లుండి అనుకోకుండా గోవా ప్రజల్లో యింతపెద్ద మార్పు రావడానికి కారణమేమిటా అని ఆశ్చర్యపోతున్నాడు.

ఈ లోగా పోలీసు బలగమంతా కార్యాలయావరణలో సమావేశ మైనారు. మధ్యాహ్నం రెండు గంటలకు మార్గో నగరంలోని వివిధ ప్రాంతాలలో ట్రాఫిక్ డ్యూటీ పోలీసులూ, గస్తీ డ్యూటీ పోలీసులూ ఆదరా బాదరా కార్యాలయానికి చేరుకున్నారు. పోలీసు కమీషనరు తన క్రింది ఉద్యోగులనూ, కాన్‌స్టేబిల్సనూ ఉద్దేశించి ఉపన్యసించారు.

కమీషనర్ కనుబొమలు ముడుస్తూ "మనం ప్రమాదకరమైన పరిస్థితుల్ని యెదుర్కొంటున్నాం. మనమంతా ధైర్య సాహసాలతో, పట్టుదలతో, వ్యవహరించాల్సి ఉంటుంది. భారతనాయకు డొకడు యీ సాయంత్రం మన పట్టణంలో పోలీసు ఆజ్ఞలను ధిక్కరించి బహిరంగ సభలో ఉపన్యసించడానికి సిద్ధంగా ఉన్నాడు. మార్గో ప్రజలు పూర్తి ఉత్సాహముతో ఉన్నారు. వేలాది ప్రజలు బహిరంగ సభకు హాజరు కావ డానికి సిద్ధపడుతున్నట్లు వార్తలు చేరుతున్నాయి. మిమ్మల్నందర్నీ యిక్కడ సమావేశపర్చి మీ కర్తవ్యాన్ని బోధించడానికి నిశ్చయించు కున్నాను. గోవా ప్రజల సవాలుకు తగిన ప్రత్యుత్తరం యిచ్చితీరాలి. మీరు నిర్వహించాల్సిఉన్న కర్తవ్యం యిది. ఒక మరతుపాకిని రోడ్డు పక్కా, మరోదాన్ని మునిసిపల్ ఆఫీసు మూలా యెక్కుపెట్టించు ఉంచండి. రైఫిళ్లూ, రివాల్వర్లూ గుండ్లతో నింపి సిద్ధంగా ఉండండి!" అని హెచ్చరించాడు.

ఆయుధశాలాధికారి వెంటనే అందుకొని "అయితే మందుగుండు సామాను మనదగ్గర లేదండి సార్! అవసరమైన మందుసామగ్రి లోగడగూడా మనవద్ద యెప్పుడూ లేదండీసార్," అన్నాడు చావు కబురు చల్లగా చెప్పినట్లు.

"మందుగుండు సామాగ్రి లేదా?" అన్నాడు కమీషనరు ఆగ్రహంతో. అతనికి కోపంతోపాటు ఆశ్చర్యంగూడా వేసింది. "ఇదీ ఒక పోలీసుస్టేషనులోజమా! ఏమి పోలీసుస్టేషనయ్యాయిది! ఏమి పరిపాలన యిదంతా ఛీ! ఛీ!

సమయస్ఫూర్తిగల సార్జెంటు పోలీసు కమీషనరుకు చక్కని సలహాయిచ్చాడు. సమయానికి అక్కరకొచ్చాడతను.

"ఏంభయపడకండి సార్! అంతా సక్రమంగానే నిర్వహించ గలం, మీరేచూస్తారుగా!" అన్నాడు ధైర్యంగా. "మాగ్గోప్రజల మనస్తత్వం నేనుబాగా యెరుగుదును. మన మరతుపాకులూ, రైఫిల్లు చూచీ చూడడంతోటే వీళ్లు గజగజ వణకిపోతారు, పీళ్ళు వట్టి పిరికి పందలండి! తుపాకుల్లో తూటాలున్నాయో లేవో గూడా వీళ్ళు తెలుసు కునే అవకాశంలేదు".

సార్జెంటు చెప్పిన ఆలోచన తక్కిన పోలీసుఅధికార్లకునచ్చింది. కాని కమీషనరు ఒక్కడే ఆలోచనలోపడ్డాడు. అతనూహించినప్రమాద పరిస్థితిని యెలా యెదుర్కొనడమా అనేదే అతనిసమస్య. ఇదివర కతను యిలాంటిచిక్కుల్లో యెప్పుడూపడ్లేదు. బాధ్యతగల ప్రధానాధి కారి కావడంవల్ల, పరిస్థితి చేయిదాటిపోకుండా చేసుకొనడమే అతని ఆందోళన. ఇంతలో సాల్సెటీనుండి జిల్లాఅధికారి అక్కడికివచ్చాడు. పోలీసు కమీషనరును ఉత్సాహపరచి, అతనికి ధైర్యం కలిగించ బోయాడు.

"ఈ జనాన్ని చూసి మీరేమి భయపడకండి. వీళ్ళకసలుధైర్యం పగలకోసిచూసినా యేకోశానాలేదు. నిజం చెబుతున్నాను వినండి! నా బోటివాడిమొహం వీళ్ళకోసారి కనిపిస్తేచాలు. ప్రాణాలు దక్కించుకోడానికి ఒకటే పరుగుదీస్తారు. వీళ్ళవట్టి పిరికిపందలండీ పిరికిపందలు! వీళ్ళకు భయపడేవాళ్ళను మిమ్మల్ని ఒక్కర్ని చూస్తున్నాను యింతవరకు. ఇహ లోహియాసంగతా? ఒక్కదెబ్బకు వాళ్ళ అమ్మమ్మపద్దకు పాలు తాగడానికి పరుగెత్తేట్లుచేయనూ! తానుగూడా ఒకమహానాయకుణ్ణని మిడిసిపడుతున్నాడు. మార్గోఅంటే బొంబాయనుకున్నాడో లేక ఢిల్లీ అనుకున్నాడో! మనల్నిచూసి బ్రిటిష్‌వాళ్ళనుకున్నాడేమో బెదరించడానికి! దేవునిదయ ఉండాలిగాని, వాణ్ణిరానీయండి. నాతో ముఖాముఖిగా బాబో యెందుకు అడుగుపెట్టానాగ్రోనాలో భగవంతుడా!" అనుకునేట్లు చేస్తానుచూడండి నా తడాఖా!" అన్నాడు జిల్లాఅధికారి డప్పాలు కొడుతూ.

జిల్లాఅధికారి డాబులూ, డప్పాలూ పోలీసు కమీషనరుకు కొత్త కాదు. ఇతని డప్పాలు పోలీసు సార్జెంటుపథకం కమీషనరుకు ధైర్యం కలిగించలేకపోయినాయి. అతని యెదుట ప్రత్యక్షంగా సుశిక్షితులైన పోలీసు సిబ్బందీ, మందుగుండు సామగ్రి, ఆయుధాలూ ఉంటేగాని అతనికి పూర్తిధైర్యం చిక్కదు. అతను ఉత్తరకుమారప్రజ్ఞలు నమ్మే మనిషికాదు. ఇలాంటి ప్రమాదపరిస్థితిని యెదుర్కొనాలంటే అంగబలం, ఆయుధబలంతప్ప ఒట్టిమాటలు నిరర్థకమని అతని నమ్మకం. అలాంటి సమయానికి ఆయత్తం కాకపోవడంవల్ల అతనికి నిరాశ తోచింది.

ఆకాశం కారుమేఘాలతో నిండివుంది. వర్షం యిప్పుడో యింకాసేపటికో అన్నట్లుంది. పోలీసు కమీషనర్ కిటికీవద్ద నిలబడి

తండోపతండాలుగా ప్రజలు మునిసిపల్ ఆఫీసువేపు నడవడంచూస్తు న్నారు. వర్షపుజల్లు పడడం ప్రారంభించింది. ఈజల్లే చిలికి చిలికి కుంభవర్షంఅయితే పోలీసుకమీషనరు యెంత సంతోషించేవాడో. బహి రంగసభకు యింకా కొంచెం వ్యవధిఉంటే, పంజిమ్‌నుంచి కావలసి నంత మందుసామగ్రి, సాల్సెటీలోఉన్న పోలీసు మంది మార్బలాన్నీ హుటాహుటీగా తెప్పించేవాడే పోలీసు కమీషనర్.

సాయంకాలం 4-15 నిమిషాలయింది. లోహియా బండిమీద బహిరంగ సభాస్థలానికి వచ్చాడు. ఆయన్నుచూసి ప్రజలందరూ సంతో షంతో నిట్టూర్పు విడిచారు. జిల్లాకలెక్టరు లోహియా బండిదగ్గరకు వచ్చి, బండి దిగవద్దనీ, అదేబండిలో తాను వచ్చినదిక్కుగా వెనక్కు తిరిగిపొమ్మని తెలియజేశాడు. పోర్చుగీసు భాషలో అధికారదర్పంతో మాట్లాడిన జిల్లాకలెక్టరు లోహియాను బండిదిగకుండా చేయాలని విశ్వ ప్రయత్నం చేశాడు.

లోహియా అతన్ని లెక్కచేయలేదు. తనశరీరంపైన వాలిన ఈగమాదిరిగా అతన్ని పక్కకు నెట్టివేసి, బహిరంగ సభాస్థలానికి సాగి పోయాడు. తమకళ్ళయెదుట జిల్లాకలెక్టరును ధిక్కరించినందులకు లోహియాను ప్రజలు అభినందించారు. ఈ సంఘటనతో ప్రజలకు ధైర్యంవచ్చింది. అధికార్లను తాముగూడా లెక్కచేయగూడదని అను కున్నారు. పెల్లుబికే ఉత్సాహోద్రేకాలతో ప్రజలు లోహియావద్దకు పరుగెత్తుకొచ్చి అతనిమెడలో పూలదండలు వేశారు. "లోహియాకు జై!" "మహాత్మ గాంధికి జై!", "జైహింద్" అని దిక్కులుపిక్క టిల్లేటట్లు నినాదాలు చేశారు. ఈ నినాదాలకు కమీషనర్ మొదలైన అధికార్లు ఉగ్రులైపోయారు. జిల్లాకలెక్టరుకు అరికాలిమంట నెత్తి కెక్కింది.

జిల్లా కలెక్టరు ప్రజాసమూహాన్నీ, లోహియాను చూచి, ఆగ్రహ పరవశుడైనాడు. ఒళ్ళుతెలియని కోపంతో చిందులుతొక్కుచున్నాడు. జేబులోఉన్న రివాల్వారు బయటికిలాగి ప్రజలవేపుకు చూపిస్తూ గురి యెక్కుపెట్టాడు.

"అప్పుడేం జరిగిందినాన్నా? కాల్చాడా?" అన్నాను. జరిగిన సంఘటన పూసగుచ్చినట్లు మానాన్న వర్ణిస్తుంటే, ఆయన ఆపాద మస్తకం ఆగ్రహావేశాలతో కంపించిపోతున్నట్లు కనిపించాడు. నేను గూడా తర్వాత యేంజరిగిందో వినాలని తహతహలాడుతూ చెవులు రిక్కపొడుచుకొని కూర్చున్నాను.

"నీమీద గురిపెట్టి కాల్చినట్లే అనుకుంటున్నావురా నీవావేశంలో ! నీమీద కాదులే!" అన్నాడు మానాన్న పరిహాసంగా. రివాల్వారప్పుడు పట్టుకుని కాల్చడానికి సిద్ధంగా ఉన్న అధికారిని "తగ్గు బాలయ్యా తగ్గు" అన్నట్లు అతన్ని శాంతపరచి బహిరంగ సభలో అమర్చబడ్డ వేదిక యెక్కి ప్రజాసమూహాన్ని ఉద్దేశిస్తూ మహోపన్యాసం ప్రారంభించాడు లోహియా.

ఎక్కడ చూసినా నిశబ్దం. చీమచిటుక్కుమన్నా వినిపించేట్లుంది. ఉపన్యాసం మొదలెట్టి రెండునిమిషాలన్నా కాలేదు. ప్రజలు తమదృష్టినీ తమ మనస్సులనూ లోహియా మీదా కేంద్రీకరించి వింటున్నారు. ఇంతలో పోలీసు కమీషనర్ వచ్చి లోహియాను అరెస్టుచేశారు. "లోహియాపైన అధికారి చేతులుపడగానే ప్రజలు యెంత రౌద్రాకారం దాల్చారో నీవు ఊహించలేవురా ! ఇదివరకటి గోవన్లేనా అనిపించింది నాకు. నన్ను నేనే నమ్మలేకపోయాను. అంతనిస్సహాయత, నిస్పృహ, నిరాశలతో బానిసలుగా ఉండే గోవా ప్రజల్లో యెంతమహత్తరమైన

మార్పువచ్చిందో తలచుకుంటే శరీరం పులకరిస్తుందిరా!" అన్నాడు మానాన్న.

"అరెస్టు చేయగానే ప్రజలేం చేశారు టాట్?" అడిగాడు డాక్టరు అక్వినో ఉత్సాహంతో.

ప్రజలు ఆగ్రహావేశాలతో అట్టుడికినట్లు ఉడికిపోయారు. లోహియాను తీసుకుని పోయిన పోలీసు ప్రధానకార్యాలయం వేపు ప్రవాహంలా సాగిపోయి కార్యాలయం మీద విరుచుకుపడ్డారు. లోహియాను విడిచిపెట్టకపోతే, కార్యాలయాన్ని ధ్వంసం చేస్తామని భయపెట్టారు.

లోహియా అరెస్టువార్త ఊరంతా వ్యాపించింది. ప్రజానీకంలో అపూర్వమైన సంచలనం బయలుదేరింది. వెంటనే నగరంలో అన్ని దుకాణాలూ మూసివేయ బడ్డాయి. పోలీసు స్టేషను చుట్టూ గుమిగూడిన వేలకొద్దీ ప్రజల్ని చూసి అధికార్లు బెదిరిపోయారు. లాటీచార్జి చేయడం ప్రారంభించారు. కాని ప్రజలు బెదిరిపోలేదు. తుపాకి గుళ్ళను గూడా ప్రతిఘటించడానికి యీనాడు సిద్ధమైనారు. పరిస్థితి చేయిదాటి పోతుందని పోలీసుకమీషనర్ భయపడి పోతున్నాడు. ప్రజల్ని శాంతపరిచి యిళ్ళకు తిరిగి పోవలసిందిగా సలహాయివ్వమని లోహియాను కోరాడు. ఈసదవకాశం లోహియా పూర్తిగా వినియోగించ దలచాడు. ఎన్ని త్యాగాలకైనా సిద్ధమై పోరాటం నిర్విరామంగా సాగించమని ప్రజల్ని ఉద్రేకపరుస్తూ లోహియా గంభీరోపన్యాసం యిచ్చాడు.

లోహియావల్ల మోసపోయానని పోలీసు కమీషనర్ తెలుసుకున్నాడు. ఉగ్రుడైపోయాడు అంతలో విచ్చలవిడిగా, వెనకాముందూ ఆలోచించక హింసాకాండ ఉపయోగించమని అనుచరుల కాజ్ఞాపించాడతను.

పోలీసుస్టేషను ముందు ప్రజలు నిమిష నిమిషానికి విపరీతంగా పెరిగి పోవడం మొదలెట్టారు. ఏ నిమిషాన యేప్రమాదం సంభవిస్తుందో అని కమీషనర్ వణికిపోతున్నాడు. రాజధాని నగరంతో సంప్రదించి అక్కడి ఆజ్ఞల ప్రకారం లోహియాను పంజిమ్ నగరానికి తరలించారు.

లోహియాను తమదృష్టినుంచి వేరుచేశారనే ఉద్రేకంతో ప్రజల ప్రతీకార ధోరణి మిన్నుముట్టింది. పోలీసు స్టేషన్‌పైన రాళ్ళు రువ్వడం సాగించారు. అనేకమంది యువకులు ముందుకొచ్చి గంభీరోపన్యాసాలతో ప్రజలను ఉద్రేకపరచారు. ప్రభుత్వం వీళ్ళందర్నీ జైళ్ళలో నిర్బంధించింది.

అరెస్టుచేయబడ్డ యువతిని పోలీసు అధికారి తీవ్రంగా బాధించాడు. ఎన్నో అవమానాల పాల్చేశారు. పోలీలు దురాగతాలపట్ల ప్రజలు రౌద్రాకారం దాల్చారు. ఆ యువతిని పోలీసులు క్రింద పడేసి యీడ్చుకుని పోవడం ప్రజలు చూశారు. పోలీసుల మీద అమాంతంగా పడి అందినవారిని అందినట్లు చావబాది వదలిపెట్టారు. పోలీసులు ప్రతీకారం జరిపారు. తుపాకీమడిమలతోనూ,బాకులతోనూ పొడిచి కసితీర్చుకున్నారు.

మానాన్న పట్టరాని కోపంతో పళ్ళుబిగబట్టి, "ప్రజలమీద పోలీసు వాళ్లు యెంత క్రూరంగా ప్రతీకారం తీర్చుకున్నారో నీ వూహించలేవు. నేనా దృశ్యం చూళ్ళేక పోయాను. పోలీసువాళ్ళు ప్రజల్ని కొంతవరకు చెదరగొట్టిన తర్వాత పోలీసు కార్యాలయంముందుగా నేను సాగిపోతూ, "జైహింద్ !" అని నినాదం చేశాను".

"ఎందుకలా నినాదం చేశావు నాన్నా?" అన్నాను మానాన్న సాహసానికి నేను బాధపడుతూ.

మా నాన్న నిట్టనిలువుగా నిలబడి నా కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు. "పోలీస్ వాళ్ళరాక్షస కృత్యాలకు నాకు ఒళ్లు తెలియని ఆగ్రహం వచ్చిందిరా అబ్బాయ్! ఆ సమయంలో నా దగ్గిర తుపాకే ఉంటే, వరసబెట్టి పోలీసు గ్యాంగంతా కాల్చిపారేసేవాణ్ణి! వెంటనే ఒకకానిస్టేబిల్ నా వద్దకు పరుగెత్తుకుని వచ్చి, నోరు ముయ్యమని ఆజ్ఞాపించాడు. కాని నేను వింటేగా! వెంట వెంటనే ఆగ్రహం పట్టలేక పదిసార్లయినా నినాదాలు చేశాను. మరో కానిస్టేబిల్‌వచ్చి నా పెడరెక్కలు విరిచికట్టి పోలీసు స్టేషనుకు యీడ్చుకుని పోయారు. నిర్దాక్షిణ్యంగా చావకొట్టి వదిలి పెట్టారు" అన్నాడు మానాన్న.

పోలీసు వాళ్ళపైన మానాన్నకు రేగిన ఆగ్రహం యిరితా అంతా కాదు. ఆయన ఆవేశం, ఆక్రోశం మిన్నుముట్టాయి. కనుబొమలు ముడిచి, పళ్లు పటపట కొరుకుతున్నాడు. ఆ సమయంలో తెల్లవాడెవడైనా కంటికి కనిపిస్తే చాలు నమిలి మింగేటట్లున్నాడు మానాన్న. మార్నాడు నేనూ, డాక్టర్ ఆక్వినో మావరండాలో కూర్చుని మాట్లాడుతూండగా, 18 జూన్, 1946 తేదీనాడు జరిగిన చిరస్మరణీయమైన సంఘటనలన్నీ మానాన్న వివరించాడు. చెంపమీది గాయం ఆయనకు భరించలేనిబాధ కలిగిస్తున్నా, ఆ నాటి సంఘన వివరాలన్నీ ఒక్కటీ పోరుబోకుండా చెప్పడం ప్రారంభించాడు. లోహియా అరెస్టు తర్వాత పట్టణంలో జరిగిన హర్తాల్‌ను గురించీ, ఆ రాత్రి నగరమంతటా బయల్దేరిన అలజడిని గురించీ, దిక్కులు ప్రతిధ్వనించే నినాదాలను గూర్చీ మా నాన్న తెలియజేశాడు.

సగర్వంతోనూ, సంతృప్తితోనూ మా నాన్న మాట్లాడుతూ, "స్వాతంత్ర్య జ్యోతి వెలిగింది, ఈ ఉదయంగూడా మార్గో వెళ్ళి ప్రజల

వీరోచిత కార్యకలాపాలను కళ్లారా చూసి ఆనందిస్తే బాగుండునను కున్నాను!" అన్నాడు.

"మరీమరీ వెర్రి పోకడలు పోకండి! అతిగా కల్పించుకోకండి! మీరు యిల్లు కదిలి బయటికి వెళ్ళే స్థితిలో యెంత మాత్రమూ లేరు" అని హెచ్చరించాడు డాక్టర్ ఆక్వినో.

"ఊరికే ఉద్రేకంగా అలా అన్నాను. నేను వెళ్ళడం లేదండీ డాక్టరుగారూ! నాకూ ఒంట్లో బాగున్నట్లు లేదు. ఈ దవడపోటు నన్ను నమిలివేస్తున్నది!" అన్నాడు మా నాన్న బాధపడుతూ.

"మొట్టమొదట్లో నేను సలహా యిచ్చినప్పుడే మీరు వెళ్ళడం మానేస్తే బాగుండేదిగదా! ఈ అవస్థ కాస్తా తప్పిపోయేది, మీరు నా మాట వింటేగా! ఆ నాడు మీకున్న ఉద్రేకం అలాంటిది!" అన్నాడు డాక్టర్.

మా నాన్న కనుబొమ్మలు ముడిచి డాక్టర్‌వంక అదేపనిగా రోషంతో చూశాడు. "నేను మార్గోలో పోలీసువాళ్ళచేత దెబ్బలు తిని వచ్చినందుకు విచారపడుతున్నాననుకున్నారా? నా సంగతి మీకేమీ తెలియదన్నమాట! ముసలితనంలో మంచానబడి తీసుకుని చచ్చేకన్న, తుపాకి దెబ్బతిని చచ్చినా నాకు సంతోషమే. ఈ విప్లవ పోరాటంలో వందలకొద్దీ తుపాకి దెబ్బలన్నా సంతోషంతో భరిస్తా. మిత్రులుగా, శ్రేయోభిలాషులుగా మన యిళ్లు చేరి యిల్లు వాసాలు లెక్కపెడుతున్న పోర్చుగీసు పాలకుల పీడ నుండి త్వరలో గోవా విముక్తిచెందడ మొక్కటే నా కోరిక!" అన్నాడు.

జూన్ నెల్లో రైతులు పొలాల్లో విత్తనాలు ఎదబెట్టినట్లే, కొత్తగా తెరవబడ్డ స్కూళ్ళలో ఉపాధ్యాయులుగూడా కొద్దో గొప్పో పిల్లల తల

కాయల్లో నాలు గఢరం ముక్కలు యెక్కిస్తున్నారు. ఈ మాసంలో రైతులు విత్తనాలు యెదజెట్టే కార్యక్రమంలో పూర్తిగా నిమగ్నులై వుంటారు. గ్రామాలన్నీ సంచలనంగా ఉంటాయి. అలాగే జూన్ నెల్లో మొలకవేసిన స్వాతంత్ర్యోద్యమం అనతికాలంలో పెరిగి పెద్దదై, శాఖోప శాఖలుగా గోవా అంతటా వ్యాపించే శుభ సమయం అది. జూన్ తప్పితే మరోమాసంలో యిలాంటి సదవకాశం లభించడం అసాధ్యం. మర్నాడు డాక్టరు లోహియాను గోవా సరిహద్దులవరకు తీసుకునిపోయి విడిపించారు పోలీసు అధికార్లు. అయినా ప్రజల్లో ఉత్సాహం సడల్లేదు. ఎవరంతట వాళ్ళే నాయకత్వం వహించి మొక్కవోని ధైర్యసాహసాలతో ప్రభుత్వాజ్ఞను ప్రతిఘటించడానికి తండోపతండాలుగా ముందుకొచ్చారు. కొన్నాళ్ళ వరకూ మార్గో నగరం యుద్ధరంగంగా తయారైంది. ప్రజలు ప్రతిరోజూ సభలు జరపడం, ప్రభుత్వాధికార్లు దౌర్జన్యంగా సభలను భగ్నంచేసి అరెస్టులు సాగించడం — ఇదీనిత్య కార్యక్రమం.

"జై హింద్" నినాదం పోర్చుగీసు వలస రాజ్యాధిపతులకు శాపమై కూర్చున్నది. ఎర్రగుడ్డ చూసి యెద్దు బెదిరినట్లు, గాంధీ టోపీ అంటే పోర్చుగీసు అధికార్లకు తలనొప్పిగా పరిణమించింది. "జైహింద్" నినాదాలిచ్చిన వాళ్ళనూ, గాంధీటోపీ పెట్టుకున్నవాళ్ళనూ పోలీసు అధికార్లు తమ కార్యాలయానికి లాక్కొనిపోయి ఒళ్ళు తెలియకుండబాదడం మొదలెట్టారు. "సాలజార్ వర్ధిల్లాలి" అని బలత్కారంగా వాళ్ళచేత కేకలేయించారు. తిరగబడ్డ వాళ్ళను తుపాకి మడమలతో పొడిచారు. కొందరికి తలలు నున్నగా గొరిగించి, తారు పూశారు. మరికొందరిని చెప్పరాని అవమానాలూ, చిత్రహింసల పాల్జేశారు.

అయినా ప్రజల ధైర్యసాహసాలు చెక్కుచెదరలేదు, ప్రభుత్వాధికార్లు క్రూర దౌర్జన్యకాండ కొనసాగించినా, ప్రజలు సభలు జరుపు

కుంటూనే ఉన్నారు. జాతీయ పతాకాలను ప్రతిష్టిస్తూనే ఉన్నారు. ఊరేగింపులూ, ఉత్సవాలూ సాగిస్తూనే వున్నారు. రానున్న విషపరిణామాలను లెక్క చేయకుండా మా ప్రజలు మాపుకా నుండి కంకోవియ్ వరకూ, పాండా నుండి సన్వోర్టయ్‌వరకూ సభలూ, సమావేశాలూ, ఊరేగింపులూ, ఉత్సవాలూ జరుపుతూన్నారు.

ఒక వారం జరిగిన తర్వాత, మా నాన్న మళ్ళీ మార్గో వెళ్ళి కొందరు జాతీయవాదులతో సంప్రదించి వచ్చాడు. మా గ్రామంలో గూడా ఒక సభ జరపడానికి నిర్ణయించబడ్డది. ఆ సభకు వేలాదిగా ప్రజలు హాజరు కావాలని మా నాన్న కోరిక. అంచేత చర్చి పక్కనే పెద్ద మైదానంలో సభ యేర్పాటు చేయడానికి నిర్ణయమైంది. ఆదివారం ఉదయం తొమ్మిది గంటలకు సభ జరగాలి. అప్పటికల్లా చర్చి ప్రార్థనలు పూర్తవుతాయి. పోర్చుగీసు దౌర్జన్యకాండను ఖండిస్తూ, పౌరహక్కులను ప్రతిష్ఠించమని కోరడమే యీ సభ ప్రధానోద్దేశ్యం. అంచేత మా నాన్న మా గ్రామంలో యింటింటికీ వెళ్ళి సభకు రావలసిందిగా ప్రచారంచేసి వచ్చాడు.

మా నాన్నతో మాట్లాడిన ప్రతివ్యక్తీ సభకు విధిగా హాజరుకావడ మొక్కటేగాక, తన శక్తికొద్దీ సహాయ సహకారాలు గూడా అందిస్తామని వాగ్దానం చేశాడు. కార్నీలియో, పేనులియో, మరాండో వంటి మిత్రులు సభలో మాట్లాడతామని గూడా మాట యిచ్చారు.

కాని ఆ ఉదయం చర్చిలోనుండి ప్రజలు బయటకురాగానే, సభా స్థలానికి వెళ్ళడానికి బదులు, మా నాన్నవేపుగూడా చూడకుండా, నేరుగా యింటి ముఖం పట్టి వెళ్ళిపోయారు. ఇహ మా నాన్న మనస్సు యెలా వుంటుందో ఊహించుకోండి. ఆయన ఉత్సాహం, ధైర్య స్థైర్యాలు ఢల్లబడ్డాయి. ముఖం చెమటలుకారడం ప్రారంభించింది. రణరంగంలో

పరాజితుడైన వీరుడిలా ఉంది ఆయన వాలకం. అరగంటసేపట్లో చర్చి ఆవరణ నిర్మానుష్యమైంది. ఒక మూల నిలబడి మా నాన్నవంక ద్వేషంతో, క్రౌర్యంతో, అపహాస్యంతో చురచుర చూస్తున్న గ్రామ మునసబు, మతగురువు, సొంటానా మాత్రమే అక్కడున్నారు.

సభ జరక్కుండా భగ్నం చేసిందెవరో మా నాన్నకు అప్పుడర్థమైంది. ఆ తర్వాత కొంతసేపటికి సభకు హాజరుకావద్దని మునసబూ, సొంటానా ప్రజల్ని బెదరించినట్లు ఎవరో మా నాన్నకు చెప్పారు. దానితో మా నాన్న ఆశాభంగం, అవమానం భరించలేక తలవంచుకున్నాడు.

కాని ఉద్యమం నిర్విఘ్నంగా కొనసాగుతూనే వుంది. పదిహేను రోజుల క్రితమే బ్రాగాంకాకున్హాను అరెస్టు చేసి, రీజియనల్ మిలిటరీ కోర్టు అధికార్లు ఎనిమిదేళ్ళ కఠినశిక్ష విధించారు. అప్పటివరకూ పోర్చుగీసు రాక్షసపాలకుల నగ్నస్వరూపం మా ప్రజలకు పూర్తిగా అర్థం కాలేదు. బ్రాగాంకా నిష్కల్మషమైన జాతీయవాదీ, దేశభక్తుడూ, సాలజార్ ప్రభుత్వాన్ని ఖండించి, పోర్చుగీసుపాలనను కూలదోయడానికై ప్రజలను తిరుగుబాటుకు పురిగొల్పాడని అతనిమీద నేరారోపణ.

దారుణమైన జైలు శిక్షలు మా ప్రజల్లో మరింతగా క్రోధోద్వేగాన్ని పెంచివేసింది. పూర్వంకన్నా పట్టుదలగా, దీక్షతో ప్రజలు ఉత్సవాలూ, సభలూ, సమావేశాలూ జరపడం ప్రారంభించారు. పెద్దవాళ్ళను చూసి, పసిబిడ్డలుకూడా చిన్న చిన్న ఊరేగింపులు జరపడంసాగించారు. పసిపిల్లల్నిగూడా జాలివిడిచి చితకకొట్టి చిందరవందరచేశారు అధికార్లు. కాని తర్వాత పోలీసు దౌర్జన్యాలు భరించలేనంతగా శృతిమించాయి. ఇది విని లోహియా తిరిగి గోవాకు వస్తున్నాడనీ, ప్రభుత్వం చేసిన

సవాలుకు సమాధానం చెప్పడానికి సిద్ధమౌతున్నాడనీ మాకు హటాత్తుగా సమాచారం అందింది. మళ్ళీ మా ప్రజల్లో ఆశ, గుండెనిబ్బరం పుంజుకున్నాయి. వేలాదిగా ప్రజలు రైల్వేస్టేషనుకు బయల్దేరారు లోహియాను సన్మానించడానికి. మార్గో స్టేషను నినాదాలతో కిటకిట్లాడుతున్నది. కాని దురదృష్టవశాత్తు కోలెయ్‌వద్ద మార్గమధ్యంలోనే పోలీసు అధికార్లు పొంచి ఉండి లోహియాన్ను అరెస్టుచేశారని తెలిసింది.

లోహియాను రెండురోజులవరకూ ఆగ్వాడా దుర్గంలో అధికార్లు నిర్బంధంలో ఉంచారు. ఈవార్త మా ప్రజల చెవినపడ్డది. పోర్చుగీస్ సామ్రాజ్యవాదులు మా జాతీయోద్యమాన్ని కూకటివేళ్ళతో నిర్మూలించడానికే నిశ్చయించుకున్నట్లు గ్రహించుకున్నారు. భావిపరిస్థితి యేమిటా అని ఆందోళన పడసాగారు. గోవాలోవున్న బ్రిటిష్‌కాన్సల్ రాయబారం ఫలితంగా డాక్టర్ లోహియా విడుదలైనాడు. కాని గోవాప్రజలు గోవా పరిపాలనపై యెన్నటికీ చేయిచేసుకోకుండా ప్రభుత్వాధీనంలో ఉన్న సమస్త పశుబలాన్నీ ప్రయోగించి క్రూరహింసాకాండ అమలుజరిపారు దానితో ప్రజల ఉత్సాహం పూర్తిగా దెబ్బతినిపోయింది. అనేకమంది దేశభక్తుల్ని విచారణచేసి, దీర్ఘ కారాగారశిక్షలు విధించింది ప్రభుత్వం. గాంధీజీ శిష్యుడైన పురుషోత్తమ కాకోద్కర్‌కు తొమ్మిది సంవత్సరాలూ, స్కూల్ టీచర్ లక్ష్మీకాంత భేబర్‌కు ఆరు సంవత్సరాలూ, డాక్టర్ రామ హెగ్డేకి యెనిమిది సంవత్సరాలూ, పేరుపడ్డ లాయరూ, పత్రికా రచయితా అయిన ఇగ్నాసియోలాయోలాకు నాలుగు సంవత్సరాలూ ఖైదు శిక్షలు విధించబడ్డాయి.

ఈలోగా గోవాలో చెలరేగిన విపరీత విపత్కరపరిస్థితిని అదుపులో పెట్టడానికై ప్రత్యేక తర్ఫీదుతో ఆరితేరిన మిలిటరీ అధికార్లతోనూ

సమస్త ఆయుధబలంతోనూ అదనపుసైనికులతోనూ పోర్చుగల్‌నుండి ఒక యుద్ధనౌకగూడా గోవా తీరానికివచ్చిచేరింది.

యూరపియన్, నీగ్రో సైనికులతో నిండిన యీ రాక్షససైన్యం ఆయుధాలు ధరించి వీధులవెంట బారులుతీరి కవాతుచేస్తూ పోతున్నారు. ఆ దృశ్యంచూసి మా ప్రజలకు గుండెలుజారాయి. తమను సర్వనాశనం చేయడానికే ప్రభుత్వం తలపెట్టిందని మా ప్రజలు భయభ్రాంతులై పోయారు.

నిస్సహాయస్థితిలో, నిరాశా, నిస్పృహలతొ మాప్రజలీవిషాద వాతావరణంలో మునిగిపోయారు.

---

## ౧౪

గోవా అంతటా పోర్చుగీసు హింసాకాండ విలయనృత్యం చేస్తూంది,

ఇళ్ళసోదాలూ, జైలుశిక్షలు, లాటీచార్జీలు, తుపాకిగుండ్ల పోట్లు నిత్యకృత్యాలైనాయి. ప్రజలు భయభ్రాంతులై దద్దరిల్లిపోతున్నారు. నలుగురుకలిసి మాట్లాడుకోడానికి వీల్లేదు. 144-వ, సెక్షన్ అమల్లో ఉంది, నోరువిప్పి బయటికిమాట్లాడేధైర్యం చాలక గుసగుసలాడుకొనడం ప్రారంభించారు. జాతీయవాదులు గురిచేయబడ్డ దారుణశిక్షలకు ప్రజల ఉత్సాహం నీరుకారిపోయింది. గుండెనిబ్బరం సడలింది. లొంగుబాటుతత్వం. నిస్సహాయస్థితి వాళ్ళలో పాదుకున్నాయి.

రిపబ్లిక్ దినాల్లో గ్రామాధికార్లు కేవలం నామమాత్రులైన అలంకారప్రాయులుమాత్రమే. కాగా యిప్పుడమల్లోకివచ్చిన నియంతృత్వం క్రింద మునసబు, కరణాలు ప్రభుత్వానికి గూఢచారులుగా మారారు. దేశభక్తులూ, స్వాతంత్ర్యప్రియులైనవారి చహారాలు కనిపెడుతూ, ప్రజల సంభాషణ చాటుమాటున పొంచివుండి వింటూ, సేకరించిన సమాచారాన్ని పోలీసుఅధికారులకు వెంటవెంటనే చేరవేయడం వీళ్ళ ఉద్యోగం.

మాగ్రామానికి మొత్తంగా ఆస్కారియో అల్వేర్స్ అనేవ్యక్తిని మునసబుగా నియమించింది పోర్చుగీసుప్రభుత్వం. ఈ ప్రమాద పరిస్థితిలో తమనునమ్మిన బంట్లనే గ్రామాధికార్లుగా నియమించదలచింది

ప్రభుత్వం. లేకపోతే ప్రభుత్వం పదికాలాలపాటు పదిలంగా నిలవ లేదని వాళ్ళభయం. అంచేత ప్రతిగ్రామంలో యేరియేరి తమమన స్సుకునచ్చిన బంట్లను నియమించింది ప్రభుత్వం. ఆల్వేర్సువంటి అతినమ్మకమైన సేవకుడు మాగ్రామంలో మరెవరూలేరు. అందుకే అతనికీపట్టం గట్టింది.

ఆల్వేర్స్ తనపై అధికార్లకు నూటికినూరుపాళ్ళు కృతజ్ఞత ప్రకటించుకోడానికి నిశ్చయించుకున్నాడు, కూలీలనూ, రైతులనూ మా నాన్నతో కలిసిమెలిసి తిరగవద్దనీ, మాటలాడవద్దనీ హెచ్చరించాడు. తనఆజ్ఞలకు వ్యతిరేకంగా నడిస్తే, జైలునిర్బంధం తప్పదనిగూడా భయపెట్టడం ప్రారంభించాడు. నాలుగుశతాబ్దాలుగా పోర్చుగీసుపాలకులు గోవాకుచేసిన అఖండసేవకు కృతజ్ఞతాభిమానాలు ప్రకటించాలని మత గురువులసహాయంతో ప్రజానీకంలో ఊపిరి సలుపని ప్రచారంచేశాడు. చర్చిలో, చర్చిబయటగూడా పోర్చుగీసు క్రైస్తవమిషనరీలుచేసిన మత బోధన ఉగ్గడిస్తు మతగురువు దీర్ఘమైన గంభీరోపన్యాసాలివ్వడం సాగించాడు. పోర్చుగీసు మిషనరీల సహకారంలేకపోతే, మేమంతా విగ్రహారాధకులుగానే ఉండిపోవలసివచ్చేదని వాళ్ళను స్తోత్రపాఠం చేయడం మొదలెట్టాడు.

ఆనాడు సభ విచ్ఛిన్నమైపోయిన తర్వాత నాలుగుమాసాలకు, ఒకనాటి ఆదివారం గ్రామమునసబు మానాన్నను పలకరిస్తూ, నీవునీవంటి వాళ్ళు ఒకలక్షమంది పోగైవచ్చినా పోర్చుగీసువాళ్ళ నేమీచేయలేరు తెలిసిందా?" అన్నాడు లేనిమీసం మెలివేస్తు. అప్పుడే ప్రార్ధన అయి పోయింది, మునసబూ, డబ్బున్న ఘరానారైతులూ చర్చిగుమ్మంముందు మాట్లాడుతూ నిలబడున్నారు. ఇంటికి తిరిగివస్తున్న మానాన్నను మున

సబు దగ్గిరకు పిలిచి బుద్ధిపూర్వకంగా కవ్వించదలచి, ద్వేషంతో యెగతాళిగా మాట్లాడ్డం ప్రారంభించాడు.

కొన్నిమాసాలుగా మానాన్న మునసబుతో మాట్లాడ్డమె మానివేశాడు. మునసబు పరిహాసంచేయడంవిని ఆశ్చర్యపోయాడు. ఒక అరనిమిషం మాటలకు వెతుక్కుని మానాన్న వ్యగ్యంగా సమాధానమిచ్చాడు,

"గోవాలో నీబోటిగాళ్లు అత్యధిక సంఖ్యాకులుంచి నావంటి వాళ్ళు బహుకొద్దిమంది మాత్రమే ఉండడం సంభవిస్తే, పోర్చుగీసువాళ్ళు మన దేశం విడిచి యెన్నటికీ పోరు తెలిసిందా! ఏం జరగబోతున్నదో, యెలాంటి పరిణామాలు రాబోతున్నయో నీకు తెలిసుండికూడా యెందు కనవసర ప్రశ్నలు వేస్తావు మునసబూ!"

గ్రామమునసబు తనచుట్టూఉన్న వాళ్ళవంక చూసి రికంటుగా నవ్వాడు. మానాన్నవంక తిరిగి, "ఈ ప్రశ్న నిన్ను వేసింది నన్ను బతికించు కోటానిక్కాదు. నీక్షేమం కోరే అలా ప్రశ్నించాను! ఇప్పటికైనా నీ శ్రమ వృధాశ్రమ అని నీవు గ్రహిస్తావో లేదో అని కదిలించాను. గోవాపోయి భారతదేశంలో కలిస్తే యేం జరుగుతుందో తెలుసానీకు?" అన్నాడు.

"ఏం జరుగుతుందేం? మనల్నందర్నీ ఉరితీస్తారా?" అడిగాడు మా నాన్న వ్యంగ్యంగా,

"ఉరితీయరేమోగాని, మన మతానికి మాత్రం ప్రమాదం వచ్చితీరుతుంది! మనల్ని మతద్వేషంతో పీడించి చంపుతారు తెలిసిందా?"

గొర్రెల్లా సరేనన్నట్టుగా తలలూపారు మోతుబరి రైతులందరూ.

మా నాన్న కోపంతో, "మునసబూ, మరేం పర్వాలేదు. మన మతానికొచ్చిన పర్వాయేమీలేదు. మనమతం ప్రమాదంలోపడ్డట్లు మనల్ని నమ్మించి మనవోళ్ళతో వెర్రికేకలేయించడమే మన పోర్చుగీసు పాలకుల పన్నాగం. ఇంతకన్న దారుణమైన అన్యాయం మరొకటిలేదు. అది సామ్రాజ్యవాదుల కుటిల రాజనీతి. ప్రపంచంలో యేమతానికీ యెవరి వల్లా ప్రమాదం వాటిల్లేపరిస్థితి లేదీనాడు. పైపెచ్చు వివిధమతాలవారి వెర్రి ఆవేశాలూ, స్పర్థలే ప్రపంచశాంతికి ప్రమాదమైన ముప్పుతెచ్చి పెడుతున్నాయి! అన్నాడు.

అక్కడచేరిన ముఠాలో ప్రతిఒక్కడూ మా నాన్న వెలిబుచ్చిన అభిప్రాయానికి అసమ్మతి ప్రకటించాడు. లోలోన మా నాన్న ధోరణి చూసి గొణుక్కోవడం ప్రారంభించారు. మా నాన్న తన భావాలనూ, తన అభిప్రాయాలనూ నిర్మొగమాటంగా, నిర్భయంగా కుండ పగల కొట్టినట్లు వెల్లడించేవాడు. ఆయనకదో ఆనందం, సంతృప్తి. గ్రామ పెత్తందార్లందరూ చిర్రుబుర్రులాడుతూ చిందులెయ్యడం ప్రారంభించారు, నిలచినచోట పాదం నిలవడంలేదు. గంగవెర్రులెత్తినట్లు ఆవేశపడేవాళ్ళూ, పళ్లు పటపట కొరికేవాళ్ళూ, ఓరకంట చూసేవాళ్ళూ అకాసేపట్లో రకరకాలుగా ప్రవర్తించారు.

"నీవలా సాహసంతో మాట్లాడ్డం నాకాశ్చర్యం వేస్తుంది. కాటికి కాలుచాచిన నీదోటిగాడుకూడా దేవుణ్ణీ, మతాన్నీ చులకనచేసి నోటికి వచ్చినట్లు మాట్లాడ్డం క్షేమంకాదు. నీవు అగౌరవపరచి, చులకనచేసేది ఒక్క దేవుణ్ణేకాదు! మనకింత విజ్ఞానమిచ్చి, మహత్తరమైన క్రైస్తవ మతాన్ని ప్రసాదించిన పోర్చుగీసు వాళ్ళకుక్కూడా కృతజ్ఞత చూపక దూషిస్తున్నావు!" అన్నాడు మునసబు దైవభక్తుళ్ళాగా నటిస్తూ.

మా నాన్న భుజాలెగరవేసి, "ఈరోజున మతాలరూ. దేవుడికీ సంబంధం యేమిటయ్యా ? మరి........" అన్నాడు కనుబొమలు పైకెత్తి కండ్లు చిన్నవిచేస్తూ. ద్వేషం ఉట్టిపడే కంఠస్వరంతో "మనకు మహా వరప్రసాదం యిచ్చారన్నారే ఆ పోర్చుగీసు ప్రభువులు ! వాళ్ళకు మతం అంటే ఒక్క అక్షరమైనా తెలుసా అని నా సందేహం !"

మునసబు పైనబడి కొట్టవచ్చే అట్టహాసంచేశాడు, "ఎందుకలా నోటికి వచ్చినట్లు వాగుతావు ? డాక్టర్ సాలజార్ ప్రతి ఉదయం చర్చికి పోయి ప్రార్థనలు చేసుకోవడంలా ! అతను ఆదర్శవంతుడైన క్యాథొలిక్కని నీకు తెలియకపోతే యిప్పటికైనా తెలుసుకో చెబుతున్నా !"

నేనంతా విన్నానయ్యా ! నాకంతా తెలుసు ! మీసాలజార్‌కుగానీ అతని సలహాదార్లకుగానీ చివరకు అతని గురువులకుగానీ క్రైస్తవ మతాన్నిగూర్చి ఒక్క అక్షరంముక్కగూడా తెలియదని ఘంటాపథంగా చెబుతున్నా విను !" అన్నాడు మా నాన్న.

మళ్ళీ గుసగుసలూ, రుసరుసలూ ప్రారంభమైనాయి. మా నాన్న మీద అందరూ తీవ్రదృక్కులను కేంద్రీకరించారు. చురచుర చూడ్డం ప్రారంభించారు.

మునసబు మండిపడి, "దేవుడన్నా, మతమన్నా యింతనిర్లక్ష్యమా నీకు! ఇంతపొగరు బలిసిందంటయ్యానీకు! సాలజార్‌నే యింత అవమానంగా మాట్లాడ్డానికి నీ నోరెలాఆడింది! ఆయున దైవభక్తినే అనుమానిస్తున్నావా!" అన్నాడు.

మానాన్న పళ్ళు పటపటకొరికి అందరివంకా తీవ్రంగాచూశాడు. "ప్రజల జన్మహక్కునూ, వాక్సభాస్వాతంత్ర్యాలను హరించేయేలాంటి కొమ్ములుతిరిగినవాణ్ణైనా నేను గౌరవించను. వాళ్ళంతా నాదృష్టిలో

క్రూర నిరంకుశులూ, అడవిమనుష్యులుగా జమకడ్తాను. ఆ మీ సాలజార్‌కు క్రైస్తవమత ప్రాథమిక సిద్ధాంతాలుగూడా తెలియ. నా నిశ్చితాభిప్రాయం.

మానాన్న చేసిన సింహగర్జనకు అక్కడివాళ్ళంతా విస్మయం చెందారు. వీళ్లైతే ఆయన్ను అమాంతం మింగివేయాలన్నంతకోపం వచ్చింది. చురచురచూపులతో ఒక్కక్షణంగూడా నిలవకుండా వెళ్ళిపోయారు చీదరించుకుంటూ. మానాన్న మనస్తత్వం పరిశీలిద్దామని ఒక్క మునసబుమాత్రమే అక్కడ ఉండిపోయాడు.

"నిన్ను చూస్తే జాలివేస్తున్నది టాబ్ ! నీవంటి మూర్ఖుణ్ణి నే నెక్కడా చూళ్ళేదు. నీవేమోఅనుకుంటున్నావుగాని. పోర్చుగీసుప్రభుత్వాన్ని యిక్కడ్నుంచి కదలించేవాళ్ళు యింతవరకు పుట్టలా, ఇక పుట్టబోరుగూడా, నీవు వట్టిభ్రమలోపడి కొట్టుకుంటున్నావంతే. భగవంతుడి దయ ఉన్నంతకాలం, యూరపియన్, నీగ్రోసైన్యాల రక్షణ ఉన్నంతవరకూ, నీబోటి కొమ్ములుతిరిగిన మగాళ్ళు లక్షమందియేకమై వచ్చినా, పోర్చుగీసువాళ్ళ కుంటివేలుగూడా కదిలించలేరు తెలిసిందా!" అన్నాడు మునసబు.

"అయితే యూరపియన్ నీగ్రో సైన్యాలు మన దేశంలో తిష్ఠ వేసుకొని కూర్చోవడం నీకూ సంతోషమన్నమాట. మన ప్రజలకు తినడానికి తిండికైనా లేకుండా వీళ్ళు దోచుకుంటున్నారన్న సంగతి నీకు తెలుసా మునసబూ ?" అడిగాడు మా నాన్న.

"దాన్ని గురించి నీవేమీ బాధ పడవద్దు. వాళ్ళకోసం మనం కొంత త్యాగం చేయడం న్యాయం, ధర్మం కూడా. వాళ్లు మన స్వాతంత్ర్యాన్ని, ధన, మాన, ప్రాణాన్నీ రక్షించడానికయ్యే యిక్కడఉన్నది!" అన్నాడు మునసబు.

రక్షించడమంటే నీ అభిప్రాయమేమిటో కొంచెం చెప్పు సబూ!"

"నిజంగానయ్యా! మన ప్రజల్ని, మన ఆస్తిపాస్తుల్ని, మన మతాన్ని రక్షించడానికేనయ్యా, పోర్చుగీసు ప్రభుత్వం, వాళ్ళ సైన్యం యిక్కడ ఉన్నది! మన శత్రువులనుండి మనల్ని కాపాడడానికే నయ్యా అదనపు బలాలు గూడా వచ్చి దిగాయి పోర్చుగల్‌నుంచి!"

"వాళ్ళ రాకను గూర్చి నీవు మనస్ఫూర్తిగా సంతసిస్తున్నట్లు న్నావుగదూ మునసబూ?" అన్నాడు మా నాన్న ద్వేషం కక్కుతూ.

నిజంగా సంతోషిస్తున్నాను! వాళ్ళకు హృదయ పూర్వకంగా స్వాగత మిస్తున్నాను."

మాసాలు గడిచిపోయాయి. శవపేటిక వెంట వచ్చే బంధు మిత్రుల్లా పోర్చుగీసు రాక్షససైన్యాలు మా గోవాకు జట్లు జట్లుగా వచ్చి పడుతున్నాయి. జనవరినెల. జూన్‌లో ప్రారంభమైన మా ఉద్యమం పూర్తిగా దెబ్బతినిపోయింది. అయినా భారతదేశంలో సంఘటనలు కొత్తస్వరూపం తీసుకుంటున్నాయి. వాటి ప్రభావం మాపైన మహత్తరంగా పడుతూంది. గవర్నర్ జనరల్ లార్డువేవెల్‌స్థానే లార్డుమౌంటు బాటన్ పదవీ స్వీకారం చేశాడు. భారతదేశంనుంచి బ్రిటీష్ నిష్క్రమణ చురుకుగా సాగేట్లు చేయడానికే మౌంటుబాటెన్ ఇండియాకు వచ్చాడని పుకార్లు వ్యాపించాయి. ఈ నూతన పరిణామాల వల్ల గోవాలో గూడా జాతీయోద్యమం తిరిగి తలెత్తుతుందన్న భయంతో పోర్చుగీసు ప్రభుత్వం సాయుధదళాలను అదనంగా సరఫరా చేయడం సాగించింది. ఈ దళాలు తరుచుగా గ్రామాలలో కవాతు ప్రదర్శనాలు చేస్తున్నాయి. ఉద్యమం తిరిగి తలెత్తేట్టయితే నిర్దాక్షిణ్యంగా శిక్షిస్తామని ప్రజల్ని తీవ్రంగా హెచ్చరిస్తున్నారు, మణుగు బరువున్న మిలిటరీ

బూట్లు వేసుకుని, ప్రజల్ని యీసడిస్తూ అహంకారంతో వీధుల వెంట కవాతు చేస్తున్న పోర్చుగీసు సైనికులు మా ప్రజల పాలిట భయంకర రాక్షసుల్లా తయారైనారు. ఈ ప్రపంచాన్నంతా వాళ్ళే శాసిస్తున్నట్లు అధికార గర్వంతో విర్రవీగుతున్నారు పోర్చుగీసు సైనికులు.

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించబోతున్నందుకు మా నాన్న ఒక వంక సంతోషిస్తున్నా, గోవాలో సంభవిస్తున్న విషపరిణామాలకు ఆయన హృదయం తల్లడిల్లిపోయింది. పోలీసుల హింసాకాండా, తీవ్ర నిర్బంధవిధానం మా ప్రజల మనోధైర్యాన్నీ, ఉత్సాహాన్నీ, స్వాతంత్ర్య కాంక్షను కూడా నీరసింపజేసింది. అప్పట్లో తిరుగుబాటు తలెత్తే అవకాశాలన్నీ పూర్తిగా సన్నగిల్లాయి. ఎవరితో మాట్లాడినా; నిరాశా, నిస్పృహ స్పష్టంగా ద్యోతకమైనాయి. ఈ కష్టాలు చాలవా అన్నట్లు మా యువతులనూ, స్త్రీలనూ సైనికులు బలత్కారిస్తున్నట్లూ, చెరుస్తున్నట్లు ప్రజల్లో నైతిక పతనం కలిగిస్తున్నట్లు వార్త లందుతున్నాయి.

ఒక రోజున మా నాన్న మునసబు యింటికెళ్ళి "మిలిటరీవాళ్ళు మన స్త్రీలను చెరుస్తున్నట్లు నీకూడా వార్తలు చేర్తున్నాయనుకుంటున్నాను. వాళ్ళు మన దేశానికి వచ్చింది మనల్ని ఉద్ధరించడానికన్నట్లు ఉబలాటపడుతున్నావు గదూ! దీనికేంచెబుతావిప్పుడు ? మన ధన ప్రాణాలకే కాకుండా మన స్త్రీల మానాన్నిగూడా హరిస్తున్నారీ నీచులు!" అన్నాడు.

"ఈ చెప్పుడు మాటలు నేను నమ్మనయ్యా ! ఇదంతా నీబోటి ద్రోహుల అబద్ధ ప్రచారం. ప్రభుత్వాన్నీ, సైనికుల్నీ అవమాన పరచడానికి నీవు పన్నిన పన్నుగడ యిది. నేను అనేకమంది సైనికుల్ని కలిసి మాట్లాడాను. వాళ్ళ నిజాయితీ. వాళ్ళ మర్యాదా నాకు తెలుసు.

వాళ్ళందరూ పెద్దమనుష్యులయ్యా పెద్దమనుష్యులు!" అన్నాడు మునసబు.

"అయితే చెప్పుడు మాటలు నీవు నమ్మవన్నమాట! అంతే గదూ!"

"అంతే! ఒక్క అక్షరం గూడా నమ్మను! నీబోటి తిరుగుబాటుదార్ల, అరాజకవాదుల మాటలు యెందుకు నమ్ముతాను. ఏ పత్రికలలోనైనా యీ వార్తలు ప్రకటించారా నేను నమ్మడానికి?"

"ఓయి మునసబూ! ఇలాంటి వార్తల్ని పత్రికలెలా ప్రకటిస్తాయి? పత్రికలపైన కరుకుకత్తుల్లా నిషేదాజ్ఞ లున్నాయని నీకు తెలియదూ? ఈ ఆజ్ఞలున్నంతకాలం యిలాంటి వార్తలను సాహసించి ప్రకటించడం అసంభం. ప్రభుత్వం సహిస్తుందా అలా చేస్తే?" అన్నాడు మా నాన్న.

మా నాన్న నెత్తిన నోరుపెట్టుకొని యెంత వాదించినా పోర్చుగీసు సైనికులు యీ నీచకార్యానికీ దిగజారరని మునసబు నమ్మకం. పై పెచ్చు తప్పుడు ప్రచారం చేయడం చాలక తనముందుకు వచ్చి మిలిటరీవాళ్ళ నడతను గూర్చి నేరారోపణ చేసినందుకు మా నాన్నమీద విరుచుకుపడ్డాడు.

"జాగ్రత్తగా నడచుకో టాట్! నీకు మళ్ళ సలహాయిస్తున్నాను. అనవసరంగా చేతులారా నీకై నీవు ప్రమాదం తెచ్చుకుంటున్నావు. ఇప్పుడు నీవున్న కష్టపరిస్థితులలో నాబోటివాడుంటే అసలు రాజకీయాల జోలికే పోయేవాణ్ణికాదు. భార్యా, కూతురూ చచ్చి, కొడుకు కుంటివాడై, ఒక కొడుకు ఆఫ్రికాలో ఉంటూ నీ అతీగతీ పట్టించుకొనడం మానేశాడు, మరో కొడుకు హిందువులపిల్లను లేవదీసుకొనిపోయాడు. ఇంకొ

కడు నీ పద్ధతులు గిట్టక దూరమైపోయినాడు. ఎవరిగతివాళ్ళదైంది. నీవు యిన్ని అగచాట్లు యీ ముసలితనంలో పడుతున్నా జ్ఞానం రాలేదే మయ్యా !" అని మునసబు హెచ్చరించాడు.

మునసబుగారి ధోరణి పూర్తయేదాకా మానాన్న మాట్లాళ్ళేదు. తర్వాత ఒక్క అరనిముషంఆగి ఆవేశంఅణచుకొని నిబ్బరంతో ప్రతి మాటా తూచిమాట్లాడుతూ మునసబువంకచూసి, "నీవు వట్టి పందితో సమానం. బజార్లోకుక్క నీకన్న వెయ్యిరెట్లు మెరుగు. నిన్ను ముట్టుకున్నవాళ్ళకూ్కడా మహాపాపం అంటుతుంది. నీవు బానిసగా మురిగిమురిగి చావవలసినవాడివే. స్వాతంత్ర్యవాయువులు పీల్చేఅదృష్టం నీకుపట్టదు. గోవాకు స్వాతంత్ర్యమే సిద్ధిస్తే, ప్రజలు నిన్ను పెడరెక్కలు విరిచికట్టి, కత్తికోకండ కోయకమానుతారా? నీశవాన్ని కాకులకూ, గద్దలకూ, రాబందులకూ వేసి కసిదీర్చుకుంటారు. నీవు బజారులంజకుపుట్టిన వట్టి పరమనీచుడివి.........."

మానాన్నతిట్టిన కటికితిట్లకు మునసబు ఉగ్రుడైపోయాడు. కుర్చీ మీదనుంచిలేస్తూ ఆయనమాటలకు అడ్డుతగిలి, "నీకు కావలసిన ప్రాయశ్చిత్తం త్వరలోనే జరుగుతుందిలే. నీవు మనసారా కోరి తెచ్చుకుంటున్నావు ; అంతపని జరిగి తీరుతుందినీకు. దేవుడు నీమీద కన్నుతెరిచాళ్ళే" అంటూ పెడబొబ్బలుపెట్టి, తలుపులు బద్దలయ్యేట్లు టాంగున బిగించివేశాడు.

పదిహేను రోజులతర్వాత మునసబు అన్నట్లే జరిగింది.

ఒకరోజు ఉదయం మానాన్న పొలంపోతుండగా యిద్దరుపోలీసు జమాన్లు మాయింటికివచ్చి, మార్గో పోలీసుఅధికార్లు యేవో ప్రశ్నలడగడానికి పిలుచుకురమ్మన్నారని మానాన్నకు తెలియజేశారు. మానాన్న

ప్రశాంతహృదయంతో పోలీసుజవాన్లు యిచ్చిన నోటీసులను అందుకుని చదువుకున్నాడు. నోటీసులతో జవాన్లు మా ఆవరణలో అడుగుపెట్ట గానే కంగారుతో గజగజ వణికిపోయాను.

"నాన్నా, నిన్నుగూడా వాళ్ళమాదిరే ద్వీపాంతర శిక్షవేసిపంపిస్తే నాగతేంకావాలి! నాజీవితం ఎలాగడపాలినాన్నా" అని అడిగాను విప రీతమైన ఆందోళనతో.

మానాన్న నన్ను దగ్గరకుతీసుకొని ఓదార్చుతూ, "నాయనా, నీకువచ్చిన పర్వాయేంలేదురా! న్యాయంకోసం, ధర్మంకోసం, స్వాతం త్ర్యంకోసం, మీనాన్న జైల్లో ప్రాణం విడిచాడంటే నీవంటివాడు నిజంగా గర్వించాలి. వృద్ధాప్యంలో మంచంలోతీసుకుని చచ్చేకన్నా, అది మంచి చావు గాదటర్రా నాయానా?" అన్నాడు.

మానాన్నను తీసుకెళ్ళి ఒక దొంగలకొట్లో పడేశారు. అది వరకే, ఆకొట్లో ఒక బందిపోటుదొంగా, భార్యను చెండుకతిన్న మరొక క్రిమినల్ ఖైదీ నిర్బంధంలో ఉన్నారు. మానాన్ననుగూడా వాళ్ళతో జతచేశారు. ఆమరునాడు పోలీసుకమీషనరుముందు ఆయన్ను హాజరు పెట్టారు. కమీషనర్ మానాన్ననుచూసి ఆశ్చర్యపోయాడు.

"ఎందుకయ్యా నీకీఅవస్థ. నీవంటముసలాడికి బుద్ధివస్తుందను కున్నాను. ఉడుకురక్తంగల పొగరుబోతుకుర్రాళ్ళకు బుద్ధిలేకపోతే లేకపోవచ్చు. వయస్సుమళ్ళిన నీకెలా లేకపోయిందయ్యా జ్ఞానం! నాబోటివాడుగూడా నమ్మలేకుండా ఉన్నాడే!" అన్నాడు పోలీసు కమీషనర్.

మానాన్న మారుమాట్లాళ్ళేదు. మర్యాదకోసం అంటూయిచ్చిన కుర్చీలో కూర్చుంటూ కమీషనర్ పంక అదేపనిగా తేరిపారచూడ్డం

మొదలెట్టాడు. అడిగిన ప్రతిప్రశ్నకు సూటిగా సమాధానమివ్వడానికి మానాన్న సిద్ధంగా ఉన్నాడు.

"మమ్మలి యెందుకయ్యా అలాద్వేషిస్తావు? నేనూ మావాళ్ళు నీకుచేసిన అపకారంయేమిటో చెప్పు!" అడిగాడు కమీషనర్ మెత్తగా ప్రశాంతంగా.

"నేను పోర్చుగల్ప్రజలను యెప్పుడూ ద్వేషించను. ద్వేషించి నట్లు యెవరన్నారు? మమ్మల్ని బానిసలుగా చేసి, మాపైనయెక్కి, మమ్మల్నిపీడించే ప్రభుత్వంతోనే మాపోరాటం! ఆప్రభుత్వానికిమాత్రమే నేను శత్రువును!" అన్నాడు మానాన్న.

"ఆప్రభుత్వమే మా పోర్చుగల్లోకూడా రాజ్యం యేలుతున్న దిగా! మేమెంత పోర్చుగీస్ జాతీయులమో, మీరుగూడా అంతే! అలాంటప్పుడు మిమ్మల్ని బానిసలుగాచేశామని నీకెలా అనబుద్ధయిం దయ్యా?" అని సులభంగా వివరించినట్లు తేల్చివేశాడు కమీషనర్.

"ఇలాంటి దుర్భరపరిస్థితులే పోర్చుగల్లోకూడావుంటే, మీ పోర్చుగల్ ప్రజల్నిగూర్చి నిజంగా నేను జాలిపడి విచారిస్తాను. నేనే తెల్లవాడినైయుండి పోర్చుగీసుపౌరుడుగా మీదేశంలో జీవిస్తున్నట్లయితే ప్రభుత్వాన్ని ప్రతిఘటించి, ప్రజాస్వామ్య పాలనకోసం పోరాటం ప్రారంభించేవాణ్ణి!" అన్నాడు మానాన్న.

"అయితే పోర్చుగల్ ప్రభుత్వం ప్రజాస్వామ్య ప్రభుత్వం కాదనా నీ అభిప్రాయం? మారాజ్యాంగచట్టం ప్రజాస్వామ్య సిద్ధాం తాలపైనే ఆధారపడిఉంది. మా సాలజార్గూడా ప్రపంచంలోని ఉత్తమ ప్రజాస్వామ్యవాదుల్లో ఒకడు తెలిసిందా?" అన్నాడు కమిష

నర్. ప్రజాస్వామ్యమంటే తనఒక్కడికే అర్థంతెలిసినట్లు నటించా డతను.

"ప్రజా స్వామ్యానికి మీరు చెప్పిన నిర్వచనం నిజమైతే, నే నీనాడు నరకంలో ఉన్నట్లే భావిస్తే సరిపోతుంది" అన్నాడు మా నాన్న సూటిగా.

కమిషనర్ ఒకనిమిషం మానాన్నవంక నోరు మెదపకుండా చూశాడు. అతని ముఖం కందగడ్డలా ఎర్రబారింది. కోపంతో లోలోపల కుమిలిపోతున్నాడు. మళ్ళీ మా నాన్నవంక చూసి:

"నీవయస్సెంతయ్యా !"

"అరవై యెనిమిదేళ్ళు"

"అయితే ముసలాడివన్నమాట! ఏమంటావ్?"

"అవును ! బానిస మనస్తత్వం గల మనిషికి చిరకాలం బ్రతికే వయస్సే నావయస్సు. ఈ నాడు మా దేశపు పరిస్థితుల్ని పరిశీలించి చూస్తే నేనెప్పుడో చనిపోయి ఉండాల్సింది !" అన్నాడు మానాన్న.

అప్పటికీ పోలీసు కమిషనర్ నిబ్బరంతో శాంతంగానే ఉన్నాడు, జరుగుతున్న సంభాషణ వివరాలను అక్కడే కూర్చుని వ్రాసుకుంటున్న సార్జెంటు మానాన్న అవిధేయతకు ఆగ్రహించుకున్నాడు. మరింత మర్యాదగా మాట్లాడమని మానాన్నను హెచ్చరించాడు.

"నా అంతర్వాణి ప్రబోధించినట్లు మాట్లాడుతాను. నేను భయ పడుతూ మాత్రం మాట్లాడేవాణ్ణి కాదు. ఇప్పుడు నాకున్న వయస్సుకు ఒక్క దేవుణ్ణి చూసే భయపడాలిగాని, మరెవ్వర్నీ చూసికాదు!" అన్నాడు మానాన్న నిర్భయంగా.

"చేప్పడంటే నీకు భయమేనా? కమ్యూనిస్టు వైఉండిగూడా దేవుణ్ని గురించి మాట్లాడతావేమయ్యా?" అన్నాడు సార్జెంట్. మత ప్రిసక్తి తెచ్చినందుకూ, మతం మీద చర్చ జరుగుతున్నందుకూ అతను సంతోషించాడు.

ప్రితి జాతీయ వాదినీ, దేశభక్తుణ్ణీ, అభ్యుదయ వాదినీ పోర్చు గీసు ప్రిభుత్వం కమ్యూనిస్టుగా జమగట్టడం మా ప్రిజలందరికీ బాగా తెలుసు. పోర్చుగీసు వాళ్ళకు కమ్యూనిజం అంటే గుండెదడ. కమ్యూ నిజం అనే నల్లముసుగును ప్రితిజాతీయ వాదికీ తొడిగి అతని అంతు తేల్చుకుందామని అధికార్లు పూనుకున్నారు. గోవాలో రోడ్లు నడవడానికి దుర్భరంగా ఉన్నాయని యెవరైనా విమర్శిస్తే. వాడు కమ్యూనిస్టు; పోర్చుగీస్ అధికార్లు సోమరిపోతులు, దురహంకారులు, పనికిమాలిన వాళ్ళని యింకొకడంటే, వాడొక కమ్యూనిస్టు. కస్టమ్స్ అధికార్ల మీద యెవరైనా నేరాలు చెబితే, వాడు గూడా కమ్యూనిస్టే. కమ్యూనిజం పెను భూతంలా పోర్చుగీసు సామ్రాజ్య వాదులను రాత్రింబగళ్ళు కలలో గూడా పీడిస్తూనే ఉంటుంది. కమ్యూనిజం గోవాలో యజ్ఞపశువుగా చిత్రించబడుతూంది. చివర కెంతమట్టుకు వచ్చిందో చూడండి. పిల్లలు యిళ్ళల్లో అల్లరి చేస్తుంటే పెద్దవాళ్ళు కేకలేస్తున్నా వాళ్ళను పట్టుకుని కమ్యూనిస్టుగా పడదిట్టే దుస్థితి యేర్పడ్డది.

సార్జెంటు మానాన్నను కమ్యూనిస్టని పిలిచినంత మాత్రాన ఆయన ఆశ్చర్యపళ్ళేదు. అతన్ని మానాన్న ద్వేషంతో చురచుర చూసి, "నీవు పందివి కావడమెంత నిజమో, నేను కమ్యూనిస్టును కావటం గూడా అంతేనిజం!" అన్నాడు.

సార్జెంటు గుడ్లెర్రిచేసి కంపించిపోతున్నాడు కోపంతో. పోలీసు కమీషనరు అతన్ని కోపం తమాయించుకొమని సంజ్ఞచేశాడు. మానాన్నను తిరిగి ప్రశ్నిస్తూ, "నీవు కమ్యూనిస్టువి కాకపోతే, మతాన్నీ, మతగురువులనూ యెందకయ్యా దూయబట్టుతావు ? నీవెప్పుడూ మతగురువుల్నీ, దేవుణ్నీ దూషిస్తుంటే, నీ భార్య దుఃఖం భరించలేక గుండె బద్దలై చనిపోయిందని విన్నాను ! నిజమేనా ?"

మానాన్న కుర్చీనుండి అమాంతంగా దూకి, "అది పట్టిఅబద్ధం!" అని గర్జించాడు. నేనెప్పుడూ దేవుణ్ణి దూషించలేదు. కాని మాగోవాలో కొంతమంది అనుసరిస్తున్న మతాచారాలనూ, మూఢ నమ్మకాలనూ, మాకు దాపరించిన మతగురువుల పద్ధతులనూ విమర్శించిన మాట నిజమే. దేవుణ్ణి గురించి క్రైస్తవ మతాన్ని గురించి పల్లెత్తుమాట గూడా అని యెరగను. క్రైస్తవుడనైనందుకు పైగా నేనెంతో గర్విస్తున్నాను. దీనికి భిన్నంగా యెవరేమాట చెప్పినా పట్టి పచ్చి అబద్దాలకోరని గట్టిగా చెప్పగలను."

"రిపబ్లిక్ హయాంలోగూడా పోర్చుగీసు ప్రభుత్వాన్ని నీవు ద్వేషించినమాట నిజమేనయ్యా ?"

"నిజమే ! ప్రతిదేశం, ప్రతిజాతీ స్వయంగా పరిపాలించుకునే పవిత్రహక్కు కలిగిఉండాలని నేనెప్పుడూ విశ్వసిస్తాను. అందుకే మా గోవాను పోర్చుగీసు ప్రభుత్వం పరిపాలించడం నేను సహించను. సామ్రాజ్య వాదం యే ముసుగు వేసుకున్నా నేను ద్వేషిస్తాను. ఈ కారణం తప్పితే, పోర్చుగల్ మాగోవాకు చేసిన అపకారమేముంది ?" అన్నాడు మానాన్న.

మా నాన్న ధోరణివల్ల గోవాప్రజలు పోర్చుగీస్ పాలకుల యెడల కృతఘ్నులై ఉన్నారని ఆశ్చర్య పోయాడు పోలీసు కమీషనర్,

మానాన్న వంకచూసి, "పోర్చుగీసు ప్రభుత్వం మీకేవిధమైన ఉపకారమూ చేయనేలేదా ?" అన్నాడు.

"ఏమీ చేయలేదు ! మా ప్రజల ఐక్యతను విచ్ఛిన్నం చేసి, జాతీయ చైతన్యాన్ని నాశనం చేయడం తప్ప, అంతకన్నా మరేదీ చేయలేదు మీ ప్రభుత్వం. మా క్షేమం దృష్టిలో ఉంచుకుని యే మాత్రం మేలైనా చేసిఉండే, వేలకొద్దీ మా ప్రజలు యీనాటికి పొట్టలు చేతపట్టుకుని పరాయిదేశాలకు వలసపోవలసిన దుర్గతి యెందుకు దాపురించేది?"

"అంచేత మమ్మల్ని యిక్కణ్ణుంచి తరిమివేయడం ఒక్కటే పరిష్కార మార్గమనా నీ అభిప్రాయం ?"

"అక్షరాలా మమ్మాటికీ అంతే ! ఒక్క మీ పోర్చుగీసువాళ్ళే కాదు ! మీతోపాటు మిగతాసామ్రాజ్య వాదులుగూడా ఆసియా, ఆఫ్రికా ఖండాలనుండి త్వరలో మూటముల్లే కట్టుకుని తర్లిపోక తప్పదు. ఈ దేశాల ప్రజలు తమ భవిష్యత్తును తామే రూపొందించుకోక తప్పదు" అన్నాడు మానాన్న.

వ్రాసుకుంటూ కూర్చున్న సార్జెంటు కమీషనర్ చెవిలో యేదో ఊదాడు. అంతటితో కమీషనర్ ప్రశ్నల సరళి మారింది. అతని ముఖ కవళికలు యెర్రబారినాయి. కంఠధ్వనిలో తీవ్రత హెచ్చింది.

"నీ మీది నేరాలు అతి ప్రమాదకరమైనవి. నీవు స్వయంగా అంగీకరించిన దాన్ని బట్టే, ప్రజల్లో ప్రభుత్వ వ్యతిరేక ప్రచారంచేసినట్లూ, ప్రభుత్వంపైన తిరుగుబాటుకు రెచ్చగొట్టినట్లూ స్పష్టమైంది. నీకు పూర్వం అరెస్టయినవాళ్లు ఒక్క పౌరహక్కులు మాత్రం అంగీకరిస్తే చాలని సంతృప్తిపడ్డారు. కాని నీ విషయం వేరు. నీవు ఘోరమైన రాజద్రోహివి. నీకు తగిన శిక్ష విధించితీరాలి. నీ తప్పిదాన్ని యిప్పుడైనా గ్రహించావా ?" అన్నాడు కమీషనరు.

కమీషనరు అన్న ప్రతిమాటా మా నాన్న రెప్పవాల్చకుండా శ్రద్ధగా ఆలకించాడు. పోతవిగ్రహంలా నిలబడిపోయా డాయన. కమీషనర్ మాట్లాడ్డం అయిపోగానే, మా నాన్న ప్రారంభించాడు :

"నే ననే ప్రతిమాటా యెంతో ఆలోచించి తూచి మరీ అంటున్నాను. నేను ఆత్మసాక్షిగా మనస్సులో మాటను నిర్భయంగా అంటున్నందుకు మీరు విధించబోయే శిక్ష గూడా తీవ్రంగా వుంటుందని నాకు తెలుసు. తక్కినవాళ్ళు ఒక్క పౌరహక్కులతోనే సంతృప్తిపడదలిస్తే, అది వాళ్ళ యిష్టం. నేను మాత్రం పోర్చుగీసువాళ్ళు మూటా ముల్లెగట్టుకుని మా దేశం వదలి వెళ్ళిపోవాలని కోరుతున్నాను. మా దేశాన్ని మేమే పాలించుకుని, సుభిక్షంచేసుకోవాలని మా ఆశయం. మా కృషి విఫలమైతే అది మా స్వ విషయం. దాన్ని గురించి మేమే ఆలోచించుకోవాలి. మా సమస్యల్ని మేమే చర్చించుకుని మా యిష్టప్రకారం పరిష్కరించుకోవాలి. మా విజయసాధనకు యేయే మార్గాలు అవలంబించాలో అదంతా మా స్వ విషయం. మా ప్రయత్నంలో ఒకవేళ తాత్కాలికంగా చిక్కులేర్పడితే, వాటిని మేము అధిగమించడానికి సర్వవిధాలా కృషిచేసుకుంటాం. ఏ పరిస్థితుల్లో గూడా యింత చెడిపోయే దేమీ లేదు".

అంతవరకూ నిగ్రహంతో ప్రశాంతంగా వున్న కమీషనర్ సహనం కోల్పోయాడు. మా నాన్నవంక చుర చుర చూశాడు. టేబిల్ పైన ఉన్న ఫైల్లోనుంచి ఒక కాగితం తీసి మా నాన్నను సంబోధిస్తూ, "ఏం మాట్లాడుతున్నావో ముందు బాగా ఆలోచించి మరీ మాట్లాడు. తర్వాత పశ్చాత్తాపపడితే ప్రయోజనం లేదు. వయస్సు మళ్ళినవాడివనీ, అవిటికొడుకును కనిపెట్టుకుని యింటివద్దనే కూర్చునే రోజులు వచ్చాయనే విషయం నీవు మరచిపోవద్దు జాగ్రత్త !" అన్నాడు.

"అవిటి కొడుకు" అన్నమాట మా నాన్న చెవినపడగానే మా నాన్నకు ఆగ్రిహం వచ్చింది. కాని యెలాగో తమాయించుకున్నాడు. కుర్చీ రెండు చేతులను గట్టిగా బిగపట్టుకుని కమీషనరు మీద నుంచి తన దృష్టిని కిటికీ మీద కేంద్రీకరించాడు. కమీషనరు అన్నమాటకు అతని పైనే దృష్టి నిగిడ్చి చూస్తే, అతని మీద చేయిచేసుకోవలసినంత ఆగ్రిహం వస్తుందేమో అని మా నాన్న జంకాడు. ఆయన కిటికీవైపు చూస్తూ ఉండగానే, కమీషనర్ మళ్ళీ ప్రిశ్నల వర్షం కురిపించాడు.

"నీ కూతుళ్ళలో ఒకావిడ కాన్వెంట్ హాస్పిటల్లో నర్సుగా చేరిన మాట నిజమేనా?"

"అవును. అయితే యేం?"

"కాన్వెంట్‌లో చేరాల్సిన పరిస్థితి యెందు కేర్పడ్డది? ఆ పిల్ల వివాహ సంబంధం విచ్ఛిన్నం కావడానికి కారణం నీవు కాదూ? నీ భార్యకు కలిగిన దుఃఖం మాట కేమంటావు? భోజనాలముందు దేవుణ్ణీ, మతాన్నీ నీవు తిట్టిపోస్తుంటే, నీ భార్య సహించలేక యెన్నిసార్లు భోజనం మాని లేచిపోయింది? హిందువుల పిల్లను నీ కొడుకు పెళ్ళాడిన విషయం యేమిటి? నీవు కాదూ ఆ వివాహాన్ని ప్రోత్సాహపరచింది. ఆ వివాహం వల్ల కాదూ నీ భార్య గుండె దిగులుతో చనిపోయింది? ఆఫ్రికాలో వున్న నీ కొడుకు సంగతేమిటి? అతను పోర్చుగీసు పద్ధతుల్నే మెచ్చుకుని, నీవు అవలంబించే పద్ధతుల్ని అసహ్యించు కున్నాట్టగా! నీకు ఉత్తరాలు గూడా వ్రాయడం మానివేశాట్టగా! ఇన్ని విపరీత సంఘటనలూ, విషపరిణామాలూ మీ కుటుంబంలో యెందుకు జరిగాయి?" అడిగాడు కమీషనరు.

ఊపిరాడకుండా రాళ్ళ వర్షం కురిసినట్లు ప్రిశ్నల వర్షం కురిపించాడు కమీషనరు. మా యింట్లో సంభవించిన విషాద సంఘటనల

కన్నిటికీ మా నాన్న ఒక్కడే బాధ్యుడని నిందించాడు. మా నాన్న కమీషనరు అన్న మాటలన్నీ శ్రద్ధగా ఆలకించాడు మారు మాట్లాడక. జరిగిన గాథ కమీషనరుకు యెలా తెలిసిందని ఆశ్చర్యపోయాడు తల పంచుకుని. అతని మాటల్లో సత్యంగూడా కొంత ఉన్నదేమో అని అనుమానించాడు. మా కుటుంబ కష్టాలన్నిటికీ నిజంగా తానే కారకుణ్ణేమో అని తనలో తాను ప్రశ్నించుకొనడం మొదలెట్టాడు. తనలో తనకు కలిగిన ఆవేదన, అనుమానాలూ యిన్నన్నీ కావు. ఏ సమాధానమూ యివ్వడానికి ఆయనకు తోచలేదు. మూగనోము పట్టాడు కాసేపు. తనపై మోపిన నేరాలను అంగీకరించడమా, లేక నిరాకరించడమా అన్న ప్రశ్న ఒక్కటే మా నాన్నను బాధిస్తూన్నది.

"ఎలా కాదని త్రోసిపుచ్చగలవు? నిజాన్ని అబద్ధంగా యెలా మార్చగలవు? కాదని త్రోసిపుచ్చావా, జన్మాంతం నిన్ను నీ ప్రజలే అబద్ధాలకోరుగా జమగడతారు'' అన్నాడు కమీషనర్ సంతోషంతో ఉప్పొంగిపోతూ.

అప్పటికీ మా నాన్న జవాబివ్వలేదు. ఆయన ఆలోచన గ్రామమునసబుమీద కేంద్రీకరించాడు. కుటుంబరహస్యాలన్నీ కమీషనరుకు వెల్లడిచేసింది మునసబేనని గట్టిగా అనుమానించాడు,

"ఈ గాథంతా మా కెలా తెలిసిందని నీ వాశ్చర్యపోతున్నట్లున్నావు! అంతేనా?'' అన్నాడు కమీషనర్ విజయగర్వంతో.

మా నాన్న మెల్లగా కళ్లు పైకెత్తి కమీషనర్ వంక చూడకుండానే అతన్ని ఉద్దేశించి, నేనేమీ ఆశ్చర్యపడడంలేదు. మా కుటుంబంమీదా, మా ప్రజలమీదా మీరు ప్రయోగించిన గూఢచారిపద్ధతి తల్చుకుంటే ఆశ్చర్యపడవల్సిందేమీ లేదు" అన్నాడు.

"గూఢచారులా ! ఏం గూఢచారులు ? ఎవర్ని చూసి అనుకుంటు న్నావు గూఢచారులని?" అడిగాడు కమీషనరు గర్వంగా, కుర్చీలోనుండి లేచి పక్క గది గుమ్మంవద్దకుపోయి, తలుపు తెరిచాడు. "ఇతన్ని కూడా గూఢచారనే అంటావా"?

అక్కడే ప్రత్యక్షమైనాడు మా తమ్ముడు రాబర్టో. వాడి పొగరు, వాడి గర్వం, వాడి దురహంకారం, వాడి రాజసం పోర్చుగీసు వాళ్ళను తల తన్నినట్లున్నాయి. ఇప్పుడే పోర్చుగల్ నుండి ఓడ దిగిన తెల్లదొరలా ఉన్నాడు వాడు. మా నాన్నను వాడు అలక్ష్యంతో, ద్వేషంతో, చుర చుర చూస్తూ చీదరించుకున్నాడు. వాడి కళ్ళకు మా నాన్న శత్రువులా ఉన్నాడు కాబోలు !

మా నాన్న కళ్ళవెంట నీళ్లు బొటబొట కారడం ప్రారంభించాయి. ఎంతో కష్టంతో గుడ్లలో నీరు గుడ్లల్లోనే కుక్కున్నాడు. ఆయన కూర్చున్న కుర్చీ రెండు చేతులనూ తన శక్తినంతా ఉపయోగించి గట్టిగా పట్టుకున్నాడు. మెల్లగా లేచి నిటారుగా నిలబడ్డాడు. కళ్ళు పెద్దవిగాచేసి యెదట ఉన్న కొడుకు మొహం ఒక నిమిషం బాగా తేరిపారచూశాడు. క్రైస్తవ భక్తుల్లా నటిస్తూ, తన ముందు నిలిచి ఉన్నవాళ్ళంతా వినేట్టుగా బైబిల్ నుంచి కొన్ని కీర్తనలు వల్లించాడు కళ్లుమూసుకుని. మా నాన్నను చూసి ద్వేషంతో చీదరించుకుంటున్న నా తమ్ముడు రాబర్టో మా నాన్నా పాడుతున్న కీర్తనలు విని తలవంచుకున్నాడు.

పోలీసు కమీషనర్ మా నాన్నను నిర్బంధంనుండి వదలి యింటికి వెళ్ళిపొమ్మన్నాడు. మా నాన్నపై మోపిన నేరాలకు యిరవై సంవత్సరాల కఠిన శిక్ష పడాల్సి ఉన్నా, ఆయన వయస్సును చూసి దయదాల్చి పంపి వేశాడు కమీషనర్. ముసలితనంలో రాజకీయ సంబంధమైన గొడవలూ, చిక్కులూ తెచ్చిపెట్టుకోవద్దనీ, పిల్లల్ని కనిపెట్టుకుని యింటివద్దనే వుండి దైవచింతనతో కాలం గడపమనీ కమీషనర్ మా నాన్నకు సలహా యిచ్చి పంపివేశాడు.

నే నీ పరిస్థితుల్లో నీ వయస్సులో వుంటే, దేవుణ్ని తల్చు కుంటూ యింటిపట్టున ప్రశాంతంగా కూర్చునేవాణ్ణి, నీవుకానీ, వేలకొద్ది నీబోటి గోవన్లు కానీ, పోర్చుగీసు ప్రభుత్వాన్ని కదిలించలేరు. ఎందుకు వచ్చిన వృధా ప్రయాస! గోవా పోర్చుగల్ అంతర్భాగం, అదెన్నడో తేలిపోయింది. అది చారిత్రిక సత్యం గూడా. ఎన్ని కుక్కలు మొరి గినా, జరుగబోయేది గూడా అంతే. ఈ విషయం నీవు బాగా జ్ఞాపక ముంచుకో!" అంటూ ఉపదేశించి పంపించివేశాడు మా నాన్నను కమీషనర్.

మా తమ్ముడు తలపెట్టిన ద్రోహానికి మా నాన్న వళ్ళు భగ భగ మండిపోయింది. అవమానం సహించలేకపోయాడు. తన కడుపున పుట్టిన కొడుకు యింత ఘోరకలికి పాల్పడ్డాడే అని విస్మయం చెందాడు. కమీషనరుకు యెదురు మాట చెప్పలేకపోయాడు. ఆయన తల గిరగిర తిరిగిపోతున్నట్లుంది. ఉత్సాహం అంతకు ముందే ఆయన్ని విడిచి

పోయింది. దించిన తల పైకెత్తకుండా సూటిగా యింటిముఖం పట్టాడు మా నాన్న.

"నా కడుపున పుట్టిన కొడుకు నా కింత పని చేస్తాడా! నా కడుపునపుట్టిన కొడుకు........"

మధ్యాహ్నం పొద్దు కొంచెం వాటమళ్ళినా, యెండ మాడ్చి వేస్తూనేవుంది. ఇంతలో మా నాన్న యింటికి వచ్చాడు. ఇంటికి క్షేమంగానే తిరిగివచ్చాడుగదా అని సంతోషించాను. కాని మెట్లెక్కి వరండాలోకి వస్తుండగా విచారసూచంగా ఉన్న మానాన్న ముఖం చూసి భయంవేసింది నాకు. నా గుండెల్లో రాయి పడ్డంత దిగులుపుట్టుకొచ్చింది. ఇంత హృదయభారంతో తిరిగివచ్చిన మా నాన్నకేం ప్రమాదం సంభవించిందో అని ఆశ్చర్యపోయాను. అంతలో యెంతో ముసలితనం వచ్చినట్లుగా ఉంది ఆయన వాలకం. ఊపిరి సాఫీగా పీల్చలేని స్థితిలో ఉన్నట్లు తోచింది నా మనస్సుకు.

"నాన్నా! నిన్ను వాళ్ళు కొట్టారా? చిత్రహింస పెట్టారానాన్న" అన్నాను కౌగలించుకొని.

"లేదురా నాయనా! నన్ను కొట్టనూలేదు, హింసించనూలేదు" అంటూ టోపీ, గొడుగు నేలమీదిసిరి పడక్కుర్చీలో కూలబడ్డాడు మా నాన్న. "అబ్బాయ్! పెద్ద గ్లాసుతో మంచి నీళ్ళు పట్టుకురానాయనా! త్వరగా పోయి తీసుకురా!"

"వాళ్లు నిన్ను కొట్టారానాన్నా? ఎందుకలా సుస్తీగా కన్పిస్తున్నావు?" అడిగాను మళ్ళీ.

ఒక్క గుక్కలో గ్లాసెడు నీళ్ళుతాగేశాడు. పడక్కుర్చీలో కాళ్ళు పూర్తిగా జాపుకొని కండ్లుమూసి పడుకున్నాడు.

"ఏమిటి నాన్నా నీకొచ్చిన బాధ? డాక్టరును పిలిచేదా?" మా నాన్నవద్దకు పోయి ఆయన చేతులు పట్టుకొని చూశాను.

నా మాట లాయనకు వినిపించినట్లులేదు. తన కొడుకు తనకే తలపెట్టిన ద్రోహాన్ని తలపోసుకొని గొణుక్కుంటూ ఒళ్ళెరుగని నిద్రలో పడ్డాడు మా నాన్న.

నిద్రలేచిన తర్వాత పోలీసుస్టేషనులో యేం జరిగిందీ వివరంగా చెప్పాడు మా నాన్న. మా అమ్మా, రూత్‌ల మరణంకన్నా, రోబర్టో పితృద్రోహమే మా నాన్న హృదయాన్ని కుంగదీసిందని తెలుసుకున్నాను. మా నాన్న ఆ ఘోర సంఘటన మరచిపోలేకపోయాడు. వంటరిగా ఉన్నప్పుడల్లా ఆ విషయాన్నే తలుచుకొని కుమిలిపోతుండేవాడు.

మా ...నుండి వచ్చిన రెండు రోజుల తర్వాత "నా కొడుకే నా కెదురు తి... డన్న దుర్వార్త వినడానికి మీ అమ్మ యింతవరకు బతక్కుండా ...న్నదో దాటిపోయినందుకు ఆమె ధన్యురాలు. నా కడుపున పుట్టిన కొడుకా యింత ద్రోహానికి ఒడికట్టింది!"

మా నాన్నకు కష్టపురోజులు ప్రారంభమైనాయి. మా పొలం పనులు చేయడం మానేయమని మునసబు కూలీలను హెచ్చరించాడు. మా పనులంటుకుంటే వాళ్ళకు శిక్షలు తప్పవని కూడా భయపెట్టాడు. మునసబు యిన్నాళ్లుగా మామీద పగదీర్చుకోడానికి అదనుకోసం నిరీక్షించుకొని కూర్చున్నాడు. ఈనాడతనికి అవకాశం చిక్కింది. మా నాన్నతో కలిసి మాట్లాడిన వాళ్ళనూ, ఆయనకు సహకారం చేసినవాళ్ళనూ అరెస్టు చేయమని జిల్లాకలెక్టరునుండి ఆర్డర్లు జారీఅయినట్లు పోలీసు అధికార్లు

గ్రామంలో టమటమా కొట్టించారు. ఆర్డరు ఫలితంగా మా నాన్నతో మాట్లాడ్డం అందరూ మానేశారు.

సాంఘిక బహిష్కారానికి మా నాన్న ఆందోళన పడ్డట్లు పైకి కన్పించలేదు. అయినా లోలోపల ఆయన బాధ పడుతున్నట్లు నేను కనిపెట్టగలిగాను. పొలంనుంచి ఆయన యింటికి వచ్చేప్పటికి తరుచుగా ఆయన అలిసిపోయి ఉండేవాడు. నడవడానికి కూడా ఓపిక ఉండేది గాదు. పడక్కుర్చీలో పడుకుని యేమేమో విచారంతో ఆలోచించేవాడు. విచారం మరీ మిక్కుటమైనప్పుడు మరచిపోవడానికి యింత తాగి మత్తుగా పడిఉండేవాడు.

"చెరువుగట్టుపైగా యింటికి తిరిగి వస్తూంటే ఇసిడార్, డామింగ్ నా కెదురై యేం చేశారో తెలుసురా ?" అన్నాడు మానాన్న, గొంతులో ఆయన కళ్ళుపెట్టుకుని మాట్లాడినట్లుంది కంఠస్వరం వింటూంటే. మొహాలటు తిప్పుకుని పది అంగల్లో ఐపులేకుండా పోయినారు అక్కణ్ణుంచి. చిన్నప్పట్నుంచి వాళ్ళ క్షేమం కోరి, వాళ్ళకెన్నో ఉపకారాలు చేసిపెట్టాను గదా ! వాళ్ళకెంతో ఆప్తమిత్రుణ్ణిగదా ! అలాంటి మిత్రులు గూడా నన్నింత చిన్నచూపు చూడటమా ! వాళ్ళు యెలా చేయగలిగారీ పని ?"

"కాని వాళ్ళు చదువురాని కూలీలు నాన్నా ! అధికార్ల బెదిరింపులకు భయపడి లొంగిపోవడం సహజం. అంతకన్న వాళ్ళేంజేస్తారు ? నీమూలంగా లాటీదెబ్బలు తిని జైళ్ళపాలు కమ్మంటావా చెప్పునాన్నా?"

గోవాప్రజలందర్నీ కష్టాలు చుట్టవేసుకున్నాయి. గ్రామాధికారులందరూ ప్రజలపైన గూఢచారితనం చేయడం ప్రారంభించారు. వా

క్కడికి పోయినా, ఎవరితో మాట్లాడినా పసికట్టడం ప్రారంభిం చారు. గ్రామాధికారులందించే రహస్య సమాచారంమీద పోలీసు అధి కారులు అనుమానమున్న వ్యక్తులను పోలీసు స్టేషన్లకు పిలిపించి నెలల పర్యంతం నిర్బంధంలో ఉంచడం, అమానుషంగా చావబాదడం, విచా రణలేకుండా శిక్షలు విధించడం సాగించారు. పోర్చుగీసు సైనికులు గ్రామాలలో విచ్చలవిడిగా వీధులవెంట తిరుగుతూ కనిపించిన ప్రతి యువతిని చెరచడం మామూలైంది. అక్రమంగా రైతుల్నీ, కూలీలనూ హింసించడం నిత్యకృత్యమైంది. అన్యాయాన్నీ, అధర్మాన్నీ సహించ లేని తిరుగుబాటుతత్వం గలవాళ్లు ప్రజల పాట్లూ, స్త్రీల అవమానాలూ భరించలేకపోతున్నారు. అనేకమంది దేశభక్తులు అప్పుడే గోవా వదిలి భారతదేశానికి ప్రయాణమై పోతున్నారు. వాళ్ళకున్న ఆశల్లా ఒక్కటే. భారతభూమినుంచి పోర్చుగీసు ప్రభుత్వంమీద పోరాటం సాగించడమే.

"జాతీయవాదులలో కొందరైనా భారతదేశం ప్రయాణమైపోవడం శుభప్రదమైన పరిణామం. మన దుర్భర బానిస స్థితిని భారతదేశ పత్రి కలలోనయినా ప్రకటించడాని కవకాశం కలుగుతుంది" అన్నాడు మానాన్న. పోర్చుగీసు నిరంకుశ విధానాన్ని విమర్శించినందుకు రెండు భారతీయ పత్రికలను గోవాలో ప్రకటించకుండా నిషేధించిందని మా నాన్నకు తెలిసింది. "అయితే గోవా స్వాతంత్ర్య సమరం గోవాలోనే మొలకెత్తి బలపడాలిరా! తల్లిపాలు బిడ్డకెంత బలమో, స్వస్థలంలో మొలకెత్తి విజృంభించిన స్వాతంత్ర్యోద్యమం అంత త్వరలో ఫలప్రద మవుతుంది. మన ప్రజలే మళ్ళీ ధైర్యంపుంజుకుని తిరుగుబాటుకు తయారు కావాలి" అన్నాడు మా నాన్న.

"మన ప్రజ లిప్పట్లో తలెత్తి తిరుగుబాటుకు తయారౌతారని ఎలా ఊహించగలం నాన్నా? పోలీసు దురాంతరాలవల్ల ప్రజల ధైర్య

సాహసాలూ, మనోనిబ్బరం సడలిపోయింది. వాళ్ళిప్పట్లో కోలుకోరనే నా నమ్మకం."

"మళ్ళీ తిరుగుబాటుకు యెలా తయారు కాగలరో నేను విడమర్చి చెప్పలేను. కాని తెగించి సాహసంతో ముందుకు దూకాలి. వేడిలోనే తిరిగి మళ్ళీ పోరాటం ప్రారంభం కావాలి. పోరాట తత్వం ప్రజలలో పూర్తిగా సమసిపోతే, శతాబ్దాల వరకూ మన వారు తలెత్తుకుని తిరుగ లేరు. ఉత్సాహము, ఉద్రేకం అడుగంటకముందే లేచి మళ్ళీ నిలబడాలి. నేను ముసలివాడనైపోయాను ఆలోచన చెప్పేస్థితిలో గూడా లేను. మానసికంగా దౌర్బల్యస్థితిలో పడ్డాను. మళ్ళీ యౌవనం వస్తే బాగుండు ననిపిస్తున్నది." అంటూ మా నాన్న నిస్సహాయ స్థితిలో నిట్టూర్పు విడిచాడు.

రోజులు గడిచిపోతున్నాయి. ఎవ్వరిసహాయం, సహకారాలూ లేకుండానే మా నాన్న పొలం పనులు కష్టపడి చేసుకుంటున్నాడు. త్వరలోనే ప్రజలు తిరుగుబాటుకు తయారవుతారని ఆశాభావం వెల్ల డిస్తున్నాడు. ఆయనలో యిన్నాళ్ళనుంచీ పెల్లుబికిన ఉత్సాహం, ఉద్వే గం ఆకస్మికంగా అడుగంటినట్లుంది. పోర్చుగీసువాళ్ళమీద మా నాన్నకు ద్వేషం ఆయన్ను కార్యశూరునిగా చేయడానికి బదులుగా, ఆయన్ను మరింత కుంగదీసి విచార సాగరంలో ముంచివేసింది. సాయంకాలం పూట ఒక్కొక్క రోజున కుర్చీలో పడుకుని అదేపనిగా ఆలోచిస్తూ ఆరిపోయిన పోరాట జ్వాలలు తిరిగి త్వరలోనే రగుల్కొని తీరుతాయని తనలో తానే ధైర్యం చెప్పుకొని సంతోషిస్తుండేవాడు మా నాన్న.

"గోవాకెంత దురదృష్టం పట్టింది. నాయకుడని చెప్పుకోదగ్గ వ్యక్తి మనకు ఒక్కడయినా లేకపోవడం యెంత శోచనీయం. సేనా

నాయకుడు లేని సైన్యం లక్షలకొద్దీ ఉన్నా యేం ప్రయోజనం ? మన ప్రజలీనాడు ఆ స్థితిలో ఉన్నారు. జయం యెలా సాధ్యమౌతుం దీపరిస్థితులలో ?" అన్నాడు మా నాన్న ఒక రోజున ఆందోళనపడుతూ.

సంవత్సర మంతట్లో ఏప్రియల్ నెల మాకు సంతోషకరమైన నెల. ఈ దిగుల్లో, యీ విచారంలో ఆనెల ఎలా గడచిపోయిందో మాకు తెలియకుండానే గడిచిపోయింది. మే నెల ప్రారంభమైంది. తేజోవంత మైన సూర్యకిరణాలుగూడా మా ఉత్సాహాన్నీ, ఉత్తేజాన్నీ రేకెత్తించలేక పోయినాయి. ఎప్పటిమాదిరే మా నాన్న పొలం పోతూవస్తున్నాడు. ఆయన పొలంపన్లు క్రమబద్ధంగా సాగించుకుని పోతూనే ఉన్నాడు. పోర్చుగీసు అధికార్ల చేతిలో మా నాన్నకు శిక్షతప్పదని మునసబు ఆశిం చాడు. శిక్ష తప్పించుకుని తిరిగి యింటికొచ్చి మామూలుగా పొలంపన్లు చేసుకొనడం గ్రామాధికారి కన్నుకుట్టింది. ఎలాగైనా మా నాన్నకుకష్టాలు కల్పించాలని మునసబు పగపట్టాడు. సాంఘిక బహిష్కారంవల్ల మా నాన్నకు తగినశాస్తి కాలేదనుకున్నాడు. దానివల్ల అతని కడుపుమంట చల్లార్లేదు. మా నాన్నను అన్నివేపులనుండీ కష్టాలు ఒకేసారి చుట్టు ముట్టాలని మునసబు పథకంవేశాడు. నాలుగురాత్రిళ్ళు వరుసగా మా యింటిమీద రాళ్ళు రువ్వించి పెంకులన్నీ నుగ్గునుగ్గు చేయించాడు. తలు పులూ, కిటికీల అద్దాలూ ముక్కలుముక్కలైనాయి. ఇది చాలనట్లుగా ఊరిబయట నిరుటి సంవత్సరం నాటిన కొబ్బరి. మామిడి, పనసమొక్క లను ఊడపెరికించి నాశనం చేయించాడు.

మొక్కలకు నీళ్ళుపోత పోయబోయిన మేరియానా రొజుకుంటూ యింటికి పరుగెత్తుకొచ్చి, "బాబూ ! బాబూ ! యింకేముంది ! మన తోటంతా సర్వనాశనమైపోయింది బాబూ ! అంతా పోయింది బాబూ ! అని కేకలుపెట్టింది యేడుస్తూ.

మా నాన్న గాభరాలో యెటూ తోచక, "మొక్క లెక్కడికి పోయినాయి? ఏమైపోయినాయి మేరియా? ఏం జరిగిందో నిదానంగా చెప్పమ్మా! ఏడవబోకు", అన్నాడు.

"తోటంతా నాశనం చేశారండీ! ఒక్క మొక్కైనా లేకుండా వాళ్ళ మొదళ్ళార్చుకున్నారండీ బాబూ!" అన్నది వణుకుతూ.

ఉన్నవాడున్నట్లుగా పైపంచా అయినా లేకుండా మానాన్న ఒక్క పరుగుతీశాడు తోటవేపుకు. తడబడిపోతున్న కాళ్ళతో మా నాన్న పరుగు తీస్తుంటే మా నాన్నకు సహాయపడలేని నేనింకా యెందుకు బతికున్నానా అని నాలో ఆవేదనపుట్టింది. వృద్ధాప్యంలో మా నాన్న కెన్ని అగచాట్లు వచ్చాయి, ఆయన్ను తలుచుకుంటేనే నా శరీరం ఝల్లుమంటున్నది. తనకళ్ళతో స్వయంగా యేంజరిగిందో చూడాలనుకున్నాడు మా నాన్న. గంట తర్వాత ఆయన యింటికి తిరిగివచ్చాడు. ఆయన ముఖాన జీవకళ లేదు. ఆయన ఉత్సాహం చచ్చిపోయింది. నాతో మాట్లాడలేకపోయాడు. నేనడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పలేనిస్థితి యేర్పడ్డది. నిర్దాక్షిణ్యంగా విరిచి ముక్కలుచేసిన మామిడిమొక్కల తుంపులుమాత్రం మా నాన్న గుప్పిట్లో ఉన్నాయి. ఆయన కళ్ళవెంట బొటబొట నీళ్ళుకారుతున్నాయి. మా నాన్న యీ మొక్కలను ప్రేమతో పసిబిడ్డలను పెంచినట్లుగా పెంచుకున్నాడు. ఈ మొక్కలు పెరిగి పెద్దవై ఫలించితే, మా కుటుంబానికి కావలసినంత ఆదాయం వస్తుందిగదా అని తరచుగా నాకుచెప్పేవాడు మా నాన్న.

ఇప్పుడు వాటి స్వరూపమేలేదు. అంతా స్మశానమైపోయింది.

కాని ఆయనకష్టా లిప్పటికీ పూర్తికాలేదు. కొన్ని రోజులతర్వాత మా పొలంనిండా రాళ్ళూ, గాజుపెంకులూ విరజిమ్మి ఉన్నట్లు తెలుసుకున్నాం. కొన్ని సంవత్సరాలుగా బీడుపడున్న ఆ భూమిని దున్ని, కలుష

తీసి, పదునుచేశాం. అంతకు క్రితం దాంట్లో ఉన్న రాళ్ళూ, రప్పలూ, గడ్డీ, గాదం యేరి ఒకమూల కుప్పగా పోయించాం. ఎవరో దుర్మార్గులు ఆ కుప్పలను చెల్లాచెదరుచేసి, బాగుచేసుకున్న పొలంనిండా మళ్ళీ రాళ్ళను విరజిమ్మారు.

"ఇంకా యెంతకాలం భరించేది యీ దుండగాలు!" అన్నాడు మా నాన్న. చెడగొట్టేవి చెడగొడుతూంటే యీ ఉదయంవరకూ కొంత వరకైనా మానాన్న సహనంతో బాగుచేసుకుపోతూనే ఉన్నాడు. "ఇంకా యెన్నాళ్ళు అంతులేకుండా మరమ్మత్తు చేసుకుపోయేదిరా అబ్బాయ్? ఇహ నావల్లకాదు!" అన్నాడు మా నాన్న నిర్వేదంతో.

ఎంత ఆపుకుందామన్నా ఆయన కళ్ళవెంట నీళ్ళు రాలనే రాలుతున్నాయి. ఆయనకెంతో ఆవేదన పుడితేగాని కళ్ళవెంట నీళ్ళురావు. ఆయన ముఖంచూస్తుంటే నా హృదయం బద్దలైపోతున్నది. కాని అవిటివాణ్ని. కుర్రాణ్ని నేనేంచేయగలనుగనక. ఒక్కటేవిచిత్రం! ఈ నిస్సహాయ స్థితిలో, యీ కష్టదశలోగూడా మా నాన్న యెవర్నీ నిందించలేదు. పల్లెత్తుమాట అనలేదు. నారక్తం ఒకవంక ఉడికిపోయి ప్రతీకారం కోసం పరితపిస్తుంటే, మానాన్న సహనాన్నీ, శాంతాన్నీచూసి నాకాశ్చర్య కల్గింది.

మర్నాడు పగలల్లా రాళ్ళూ రప్పా, చెత్తా చెదారం కనిపించినంత వరకు యేరిపారబోసినా, రాత్రి యెప్పటికిమల్లే రాళ్ళతో పొలంనిండి పోయింది ఈవిధంగా అయిదురోజులు గడిచింది. మానాన్న సహనం కోల్పోయాడు. రాత్రిళ్ళు పొలంకాపలాకాచి తుంటరులను పట్టుకోవాలని నిశ్చయించుకున్నాడు.

మా నాన్న ఆ సాయంకాలం తుపాకీ తోటాలతో నింపాడు "వాళ్ల చిక్కితేజాలు తుపాకితో కాల్చివేస్తాను. ముందు హెచ్చరికగూడాచేయను. వాళ్ళు చస్తేచచ్చారుగాని, వాళ్ళ ఆత్మలకుమాత్రం దేవుడు శాంతి యివ్వాలని ప్రార్థిస్తున్నాను" అన్నాడు.

రాత్రి పదిగంటలైంది. ఊరంతా మాటుమణిగింది. గాఢాంధకారం పొలాలనూ, గ్రామాలన్నీ ఆవరించింది. నేను మానాన్న పొలానికి బయల్దేరి పోతున్నాం. నాకు రోగంవచ్చిన తర్వాత మా నాన్నతో కలిసి పొలం పోవడం యిదే మొదటిసారి. ఇదివరలో నా అంతట నేనే తన వెంట వస్తానని యెన్నోసార్లడిగాను. అప్పుడు మా నాన్న తనతో రావద్దనేవాడు. ఇవ్వాళ ఆయన తనంతట తానే కోరి నన్ను వెంట తీసుకుని పోతున్నాడు.

"ఇవ్వాళ రాత్రి నాతోగూడా పొలంరావాలిరా అబ్బాయ్" అన్నాడు బ్రతిమాలుతున్నట్లుగా. ఊరికేతోడుకోసం నన్నుకూడా రమ్మంటున్నాడని నాకు తెలుసు. "నీకు నిద్రాభంగం కలిగించడానికి నాకేమాత్రం యిష్టం లేదుకాని, యివ్వాళమాత్రం, నాతోరావాలిరా" అన్నాడు.

మా నాన్నతో పొలం పోవడం అంటే నాకు యెంతో సరదా. సంతోషంతో ఉప్పొంగిపోయి సరే అన్నాను. పదిగంటలు కావడం తోటే, చీకట్లో బయిల్దేరాం. మా నాన్న ముందూ నేనువెనకా. మా నాన్న తుపాకి భుజంమీద ఏటవాలుగా పెట్టుకుని నడుస్తూంటే ముసలిసైనికుడిలా ఉన్నాడు. ఆయన వెంటనే నేను నాకర్రల మీద తప్పటడుగులు వేసుకుంటూ బయల్దేరి పోయాను. నీలాకాశంలో లక్షలకొద్ది నక్షత్రాలు మిణుకు మిణుకులాడుతూ ప్రకాశిస్తున్నాయి. గ్రామమంతా గాఢనిద్రలో వుంది. పిల్లవాయువులకు రేగిన నా వెంట్రుకలు నాట్యం చేస్తున్నట్లు

న్నాయి. మానవ హృదయంలో గూడా సుస్థిర శాంతి పాదు కుంటే యెంత ఆనందమయంగా ఉందేదనిపించింది.

గ్రామ పొలిమేరలు దాటి చెరువు గట్టుమీద కొచ్చాం. "ఇవ్వాళ నాతుపాకితో వాళ్లతలలు బద్దలుగా పగిలి తీరుతాయి !" అన్నాడు మళ్ల మా నాన్న. ఆయన గొంతు వింటూంటే అలసిపోయి ఆవేశంతో అన్న మాటలుగా తోచాయి నాకు.

"ఒకనిమిషం యిక్కడ విశ్రాంతి తీసుకుని మళ్ళిసాగిపోదాం నాన్న !" అన్నాను.

"అలిసిపోయావురా అప్పుడే ? తప్పకుండా అలిసివుంటావు ! నేను యెంత అనాలోచితమైన పనిచేశాను ! అర్ధరాత్రివేళ యీ పొలా ల్లో పడేసి చీకట్లో నీవంటి అవిటివాణ్ణి లాక్కొనిరావడం నాదే పొర పాటురా !"

"లేదు నాన్నా ! నేను అలిసిపోలేదు ! నీవు అలిసిపోయావేమో అని అలా అన్నా నాన్నా"!

"నాకా అలసట ! నాసమాధిలో కావలసినంత విశ్రాంతి దొరుకు తుంది. నన్నుగురించి, నా అలసటను గురించీ నీవేమీ గాభరాపడవద్దు. నీవు నిజంగా అలిసిపోకపోతే వెడదాం పద !"

మళ్ళీనడక సాగించాం. మా నాన్న చీటికీమాటికీ ప్రమాణాలు, శపథాలూ చేస్తున్నాడు. నేనుకూడా రావడంవల్ల మా నాన్నకేవిధంగా సహాయపడగలనని నాలో నేనుఆశ్చర్యపోతూ ఆలోచించుకుంటున్నాను. నావంటి అవిటి వాడేంచేయగలడు ?

చివరకు పొలంచేరుకున్నాం. మా నాన్న పొలం అంతా ఒక సారి తిరిగి చూశాడు. దుండగులప్పటికింకా రాలేదు. ఒక తాటిచెట్టు

కింద కూర్చుని పొంచి ఉండడానికి మేం ఆలోచించాం. నన్నక్కడ కూర్చోమని మా నాన్న ఆజ్ఞాపించాడు. నాకొచ్చిన భయమేమీలేదని నాకు ధైర్యంచెప్పి, గట్టుదాటి కిందకి దిగిపోయాడు.

"ఎక్కడికి పోతున్నావు నాన్నా?" అడిగాను గాభరాతో "ఒక్క నిమిషం ఉండరానాయనా! ఇప్పుడేతిరిగివస్తాను" అంటూ చీకట్లో మా నాన్న అదృశ్యమైపోయాడు.

నాప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని నాలుగైదు నిమిషాలు అక్కడే కూర్చున్నాను. మా నాన్న యెక్కడికి పోయిఉంటాడాఅని ఆశ్చర్యపోతూ ఆలోచిస్తున్నాను. ఇంతలో ఆయన వచ్చేసరికి ఒక్కనిట్టూర్పు విడిచాను.

మళ్ళీ మా నాన్న నన్ను వంటరిగా విడిచిపోడనే నమ్మకంతో, "ఎక్కడికి వెళ్లావు నాన్న? అని అడిగాను." ఎవరైనా కంట పడతారేమోఅని ఓక్కసారి పొలంచుట్టు చుట్టివచ్చాను. అంతే! చాకలివాళ్ల కుంటదాకా గూడా వెళ్ళివచ్చాను. ఎవ్వరూ కనపళ్ళేదు," అంటూ నాపక్కనేకూర్చున్నాడు మా నాన్న.

"ఎవ్వరూ కనిపించరేదా నాన్నా?"

"ఒక్క పురుగ్గూడా లేదు. మనం తుపాకితో రావడం పసిగట్టి, యీ రాత్రి యెవరూ రారేమోగూడా!" అన్నాడు మా నాన్న.

అప్పుడే మా వెనుకవప్రక్క యెవరో నడిచివస్తున్న శబ్దం వినవచ్చింది. వెంటనే నన్ను మాట్లాడవద్దని సంజ్ఞచేస్తూ, మా నాన్న నా నోరు మూశాడు. ఆయన నేలమీద బోరగిలా పడుకుని నన్నుగూడా అలాగే చేయమన్నాడు. దుండగులకు మేం కనిపించకుండా ఉండేందుకై అలా చేయాలని మా నాన్న అన్నాడు. శబ్దం మరింత దగ్గరగా వినవచ్చింది. అకస్మాత్తుగా మళ్ళీ ఆగిపోయింది. మేం అక్కడ పొంచి

వున్నట్లు వాళ్లు కనిపెట్టారేమో అనుకున్నాం. తర్వాత రెండు నిమిషాల వరకూ శబ్దం రానేలేదు. మా నాన్న బోరగిలా పడుకునే పొట్టమీదుగా ముందుకు పాకిపోతున్నాడు.

"నీకు కనిపిస్తున్నారా యెవరైనా నాన్నా ?" అన్నాను మెల్లిగా.

"లేదురా! కాని మాట్లాడబోకు! ఒక నిమిషం నిశ్శబ్దంగా వుండు."

మే మిద్దరం చెవులు రిక్కించుకుని, కళ్ళు పెద్దవి చేసి, రెండు నిమిషాలు అవస్థపడ్డాం మళ్ళీ శబ్దం వినవస్తుందేమో అని. ఆవు మేత మేసి నెమరువేస్తున్న శబ్దం వినవచ్చింది. మా నాన్న పకపకా నవ్వి, "దీని దుంపతెగ! ఆవురా! అనవసరంగా యెంత అలజడి చేసిందిరా!" అన్నాడు మా నాన్న.

ఎప్పటిలా మే మిద్దరం మామూలు స్థానాల్లో కూర్చున్నాం. ఇది వరలో పది- పన్నెండు సార్లు అడిగిన ప్రశ్నలేన్నే మళ్ళీ అడిగాడు మా నాన్న.

"నేను మన మతాన్ని విమర్శించినందువల్ల మీ అమ్మ దుఃఖంతో చనిపోయిందటర్రా ? నీ ఉద్దేశ్యం ఏమిటిరా అబ్బాయి ?"

"ఎందుకు నాన్నా అర్ధరాత్రివేళ మళ్ళీ ఆ ప్రశ్న వేస్తావు ?"

"ఊరికనేరా ! తెలుసుకుందామని ఉంది నాకు. నా పద్ధతులు తన కిష్టం లేకపోయినా, చికో ఉత్తరాలు వ్రాయడం మానేసింది?.......... మేరియా పెళ్ళి సంబంధం భగ్నం కావడానికి నేనా బాధ్యుణ్ణి? నేనేనటర్రా .......... నేనేనా ............... తెలిసినంతవరకు ఉన్న దున్నట్లు చెప్పు నాయనా !"

పోలీసు స్టేషన్‌లో కమీషనర్ అన్న మాటలు మా నాన్న సుల ఛంగా మరచిపోలేక పోయాడు. ఆ మాటలు మా నాన్న మెదడును సమ్మెటపోటులా చీటికి మాటికి తగులుతూనే ఉన్నాయి. వాటిని తలుచు కుని ఆయనకు దుఃఖం పొంగిపొరలి వస్తున్నది. ఆ నాటినుండి యీ ప్రశ్నలే మా నాన్న అడుగుతున్నాడు నన్ను. మా కుటుంబంలో జరిగిన యే ఒక్క సంఘటనకూ మా నాన్న కారకుడు కాడని యెన్నో సార్లు ఆయనకు నచ్చచెప్పాను. కాని ఆయన మనస్సుకు శాంతి కలగలేదు ఆయన కే మాత్రం తృప్తి కలగలేదు. పోలీసు కమీషనరు మోపిన నేరాలన్నిటికీ చాలావరకు తానే బాధ్యుడనని తనలో తానే చర్చించుకుని, నిర్ణయించుకుండేవాడు. ఎంతో మహా పాపాన్ని చేశాననే ఆలోచన అప్పుడప్పుడూ ఆయన జ్ఞప్తికి వచ్చి ఆయన మనస్సును కలతపెడు తోంది. ఆయన హృదయాన్ని దహించివేస్తోంది. ఆయన నిద్రలోగూడా ఆ ప్రశ్నల్ని తిరిగి తిరిగి వల్లించడం అనేకసార్లు విన్నాను.

మరో గంట, గంటన్నర వరకూ యిద్దరం అక్కడే కాచుకుని కూర్చున్నాం. అంతవరకూ యేమీ సంభవించలేదు. ఎవరి జాడా విన రాలేదు. నాకు విసుగుపుట్టి నిద్రపోదామనిపించింది. మా నాన్నగూడా నన్ను నిద్రపొమ్మని తొందరపెట్టి, తా నక్కడే మేలుకుని కావలికాస్తూ కూర్చున్నాడు.

"ఎవరైనా కంటబడగానే లేపు నాన్నా!" అన్నాను. అక్కడే గోరువెచ్చగా వున్న నేలమీద ముడుచుకొని నిద్రపోయాను.

నాలుగు గంటలు ఒళ్లు మరచి నిద్రపోయిన తర్వాత నాకు మెల కువ వచ్చింది. నేను నిద్రపోయే ముందు యెలా కూర్చుని ఉన్నాడో, అదేస్థితిలో నిద్ర లేచేటప్పటికీ కూర్చుని ఉన్నాడు. పెద్దవాడైన మా నాన్న మెలకువతో వుండగా, నేను హాయిగా నిద్రపోవడం యెంతో

తప్పు చేసినట్లు తోచింది నాకు. తెల్లవార్లూ స్థానం తప్పకుండా ఉక్కు స్తంభంలా తిష్టవేసుకుని కూర్చునే ఉన్నాడు. ఆయన ఆలోచనలూ, ఆందోళనలూ ఒకవేపున వేధిస్తూ వున్నా, తన ఉనికికీ తన కుటుంబం ఉనికికీ ప్రాణాధారమైన భూమిని ప్రాణాలిచ్చైనా కాపాడుకునే దీక్షతో మా నాన్న అక్కడే కాచుకుని కూర్చున్నాడు. నేను నిద్రలేచి పిలిచి నప్పుడే మా నాన్న నా వంక తిరిగి. "నీవు నిద్ర లేచావురా ? బాగా నిద్ర పట్టిందా ?" అని అడిగాడు.

"నిద్ర పట్టింది నాన్నా" అన్నాను నాలో నేను సిగ్గుపడి. "నే నెంత స్వలాభపరుణ్ని ! కొన్ని గంటలకు ముందే నేను మేల్కొని నీకు విశ్రాంతి కల్పించి ఉండాల్సింది. అలాగే స్థాణువులా తెల్లవార్లూ కూర్చు న్నావా నాన్నా ?"

"మరేం పర్వాలేదు లేరా ! ఇక్కడ కాకపోయినా, యింటిదగ్గ రైనా నాకీ రాత్రి నిద్రపట్టేది కాదు. అసలు కళ్లు మూతపడేవి కావంటే నమ్ము!" అన్నాడు మా నాన్న.

"అయితే ఆ తుంటరు లెవ్వరూ యింతవరకూ రాలేదన్న మాటేగా ?"

"లేదురా ! ఆ గాడిదకొడుకులు ముందుగా మన ప్లాను తెలుసు కున్నారేమో ! కాని యెలా తెలిసుంటుంది వాళ్ళకు ? నా కర్థం కావడం లేదు. ఇంతకూ ఆ దుర్మార్గుల అదృష్టం మంచిది తప్పించుకున్నందుకు"

"అబ్బ ! యెంత జాలి నాన్నా నీకు వాళ్ళమీద !" అన్నాను.

"వాళ్ళు రానందుకు జాలి దలుస్తున్నాను. అయిపోనేంలే ! మరేం పర్వాలేదు! తెల్లవారు ఝామువరకూ యిక్కడే కాచుకుని కూర్చుందాం.

తెలతెలవారుతూండగా తూర్పుదిక్కు దృశ్యం నీ కెంత ఆనందం కల్గిస్తుందో చూడు. ఆ దృశ్యాన్ని చూసి నీ వెంత ఉత్సాహపడతావో నీవే చూద్దువు గాని.''

తూర్పు దిక్కున ఆకాశం అరుణవర్ణంలో నుంచి పసుపురంగులోకి పరిణామం చెందుతూంది. మధురమైన సువాసనలు విరజిమ్ముతూ మందమారుతం వీస్తున్నది. అంతలోనే సూర్య కిరణాలు ఆకాశాన్ని చీల్చుకుని ప్రసరించడం మొదలెట్టాయి. సూర్యబింబం పై భాగం మా కళ్ళ కగపడేసరికి, ఆ అద్భుత దృశ్యాన్ని చూసి మా కెక్కడలేని ఆనందం వెల్లివిరిసింది. లేచి నిలబడి, "నాన్నా! ఇంటికి పెడదాం పద యిప్పుడే!'' అన్నాను.

మా నాన్న మాట్లాడ్లేదు. ఇదివర కెన్నడూ చూసి ఆనందించని ఈ మనోహరదృశ్యాన్ని అట్టే తేరిపారచూస్తున్నాడు. ఒకటి రెండు నిమిషాలైన తర్వాత మా నాన్న ముఖం వంక చూశాను. ఆయన నొసలు మీద లోతైన చార లేర్పడ్డాయి. వయస్సును మించిన ముసలితనం ఆయనలో ప్రవేశించింది. నరాల పటుత్వం సన్నగిలి, అలిసిపోయినట్లు ఆయాసపడుతున్నాడు. కనురెప్పలు వాల్చకుండా గుడ్లనిండా నీళ్లు కుక్కుకుంటూన్న మా నాన్నవంక పారచూస్తుంటే, నా హృదయం తల్లడిల్లిపోయి ఆవేదన అధికం గావడం ప్రారంభించింది.

"ఏం నాన్నా నీవు రావూ? అన్నాను మళ్ళీ.

నా మాట మా నాన్న వినిపించుకున్నట్లు లేదు. సూర్యబింబంవంక అప్పటికీ దృష్టి సారించి చూస్తూనే ఉన్నాడాయన. ఆయన ఆలోచనలూ భావాలూ యెలా పరుగిడుతున్నాయో నాకు పూర్తిగా అర్థమైతే బాగుండుననిపించింది. నేను ఆయన యెదుట నిలబడి ఉన్నాననే చైతన్యంగూడా

లేనట్లుంది మా నాన్నకు. నేను మాట్లాడే యే ఒక్క మాటా వినపడ నంత కటిక చెవుడు ఆయన్ను ఆవేశించినట్లుంది. నేను మళ్ళీ కూలబడి పరిశుభ్రమైన గాలిని ఊపిరితిత్తులనిండా పీల్చుకుంటూ, మైళ్ళవరకూ వ్యాపించిన పంట పొలాలను చూసి ఆనందిస్తున్నాను.

ఆ దృశ్యం నేత్రానందంగా ఉంది. సూర్యుడు పైపైకి ప్రయాణం చేస్తూ వస్తున్నాడు. ప్రారంభంలో అరుణవర్ణంలోవున్న సూర్యకాంతులు క్రమేణా తెలుపుగా మారుతున్నాయి. దానితోపాటు పొలాల రంగు గూడా మారుతూ అంతకంతకు అందంగా కనిపించాయి. మా గ్రామ రైతాంగం యీ పొలాలనే తమ ప్రాణసమంగా యెంచుకొని సంవత్స రాంతం వరకు సరిపోయే పాడిపంటలను పుష్కలంగా ప్రసాదించమని వెయ్యి దేవుళ్ళను వెయ్యి విధాలుగా ప్రార్థిస్తారు. మా పేద రైతాంగాన్ని అప్రధానమైన, అనాగరికులైన, నిరక్షరకుక్షులైన పాటకజనంగా ఘరానా పెద్దలంతా జమకడతారు. ఉన్నతవర్గాలవారి ప్రమాణాల ప్రకారం మా రైతు కూలీలు యెందుకూ పనికిరాని చవటలు. అయితేనేం. మా వాళ్లను ప్రాణప్రదంగా చూసుకుంటాన్నేను. సమస్త సంపదలకూ మా రైతాం గమే మూలాధారమని నా నమ్మకం. వాళ్ళు లేనిది లోకమే లేదు. వాళ్ళను చిన్నచూపుచూడడం మనకు ఆత్మహత్యవంటిదని నా విశ్వాసం.

పట్టణ ప్రజలు వ్యవహారజ్ఞానం గలవారమనీ, లౌకిక వ్యాపా రంలో ఆరితేరినవాళ్ళమనీ, నాగరికులమనీ, అధునాతనులమనీ విర్ర వీగుతుంటారు. చిరస్మరణీయమైన ఘనకార్యాలను వారేం చేయగలరో, యేం చేశారో గూడా నా కర్థం కావడంలేదు. వాళ్ళ హృదయాలమీద చేతులు వేసుకుని వాళ్ళే యీ ప్రశ్నకు సమాధానం చెప్పుకోవాలి!

జామెడు పొద్దెక్కింది. రైతులు అన్నాలు తిని, ఎద్దుల్ని నాగళ్ళకు కట్టుకుని పొలాలకు వస్తున్నారు. మా నాన్న మళ్ళీ భూలోకానికి దిగి వచ్చినట్లు, కూర్చున్న మనిషి కాస్తా యింటికి బయల్దేరి పోవడానికి లేచి నిలబడ్డాడు.

"ఇంటికి వెళ్ళిపోదాం పదరా! ఇప్పటికే ఆలస్యమైంది" అంటూ కింద వున్న తుపాకిని చేతికందుకుని నడక ప్రారంభించాడు.

ఎద్దుల్ని పీలైనంత చురుగ్గా తోలడానికి రైతులు "అరె-రె-రె-రె" అని శబ్దంచేస్తూ అదిలిస్తున్నారు. ఆశబ్దంవిని ఆనందిస్తూ యిద్దరం యింటిముఖం పట్టాం. మానాన్న బెల్లంకొట్టిన రాయిలా మాట్లాడనేలేదు. "సిల్వర్‌పాండ్" వద్దకు రాగానే, ఒక పెద్దకొంగ నీళ్ళలో దూకి చేపను తన్నుకుపోవడం చూసి ఆశ్చర్యపోయాను. నాదృష్టంతా ఆ కొంగమీదనే లగ్నమైంది. ఆ చేపను చప్పరించివేసి మరోచేపను పట్టుకుందామని మళ్ళీ సరస్సు మీదవాలింది. జీవితచక్రం అంటే యిది గదా అని చటుక్కున జ్ఞాపకం వచ్చిందినాకు. పక్షులు చేపల్ని మింగివేస్తుంటే, పెద్దచేపలు చిన్నచేపల్ని ఐపులేకుండా కాజేసుకుపోతున్నాయి. బలవత్తరమైన జంతువులు బలహీనమైన జంతువుల్ని ఆహారంగా చేసుకుంటున్నాయి. అన్నిటికన్నా తెలివైన మానవుడు అటు జంతుజాలాన్నీ, పక్షిజాలాన్నీ, చేపల్నీ కలిపి మొత్తంగా భోజనం చేస్తున్నాడు. సృష్టివైచిత్ర్యం యిదీ!

మా నాన్నా నేను యింటికిపోయే దార్లో అనేకమంది మాకెదురైనారు. ఎవరూ మాతో మాట్లాళ్ళేదు. ప్రజలీవిధంగా మమ్మల్ని నిర్దాక్షిణ్యంగా బహిష్కరించినందుకు మా నాన్న మనోభావాలెలా పనిచేస్తున్నాయో అని ఆయన ముఖంవంక చూశాను. ఆయన బాధపడ్డట్లు నాకెక్కడా తోచలేదు. వాళ్ళుమాకెదురైనారనీ, మమ్మల్నిచూసి ముఖాలు

ముడుచుకున్నారనీ. ఆయన మనస్సుకు పట్టలేదు. ఆయన ఆలోచనంతా మరెక్కడోఉంది. ఇంటికి వచ్చేసరికి మానాన్న పూర్తిగా అలిసిపోయి నాడు. మేరియానో కప్పు టీ తెచ్చి యిచ్చింది మా నాన్నకు. టీ కప్పు పట్టుకుని వణికిపోతూ ఆయన పడక్కుర్చీలో కూలబడ్డాడు. ఆయన నిలబడ్డకాసేపూ పాదాలు వణికిపోతూ, తడబడుతూనే ఉన్నాయి. ఇంకోక్షణం అలాగే ఉంటే, పడిపోయేవాడేమో అనిపించింది.

"నాన్నా, నీయిష్టంవచ్చినంతసేపు విశ్రాంతి తీసుకో! హాయిగా కంటినిండా నిద్రపో నాన్నా! నీకు పూర్తి విశ్రాంతి లేకపోతే, ఆరోగ్యం కుదటపడేట్లు లేదు! రేపురాత్రి మళ్ళీ నిద్రకాయాలామరి!" అన్నాను.

"నాకా విశ్రాంతి నాయనా! నాకిప్పుడు విశ్రాంతి దొరకడం అసంభవం. త్వరలోనే మళ్ళీ పొలం పోవాలిరా! నన్ను కట్టుకుపోయే టంత పని యిక్కడ" అన్నాడు మానాన్న మరో ప్రపంచంలోనుంచి మాట్లాడినట్లు.

"అలాగా నాన్నా! ఇవ్వాళటికి పనిచాలించి విశ్రాంతి తీసుకో రాదూ! రేపుచేసుకోవచ్చును మిగిలినపని!"

"అలాకాదురా నాయనా! త్వరలో నాకు కావలసినంత విశ్రాంతి దొరకబోతున్నది" అన్నాడు మానాన్న గట్టిగా. "వర్షాలు కురవగానే పనీపాటలుండవు. అప్పుడు విశ్రాంతి తీసుకోవచ్చుగా! ఇప్పుడు క్షణం విశ్రాంతి దొరకదు. రాళ్ళూ రప్పలూ పొలంనిండా పేరుకుని ఉన్నాయి. కొన్నైనా యీపగలు ఏరిపారెయ్యక తప్పదురా!"

"అయితే నీవంత అలిసిపోయావే! అంత నీరసంగాగూడా ఉన్నావు! ఎలాపనిచేయగలవు నాన్నా! ఎందుకలా ఒళ్ళు విరగ్గొట్టు

కుంటావు నాన్నా యీపరిస్థితుల్లోగూడా? అయితే నేనుగూడా నీవెంట వస్తానుపద। నాకు చేతనైన సహాయం నేను చేస్తాన్నీకు" అన్నాను.

"సరేలే! సరేలే! నాకూసహాయం అవసరమే యివ్వాళ. ముందు నన్నుపోనీ. తర్వాత నెమ్మదిగా నీవు వత్తువుగాని. ఇంకో అరగంటఉంది బయల్దేరవచ్చులేనేను. నీవన్నదిగూడా బాగానేఉంది."

మానాన్న తోలుసంచిలో చుట్టపొగాకు దోపుకున్నాడు. చొక్కా-మార్చుకున్నాడు. మళ్ళీ పొలం బయల్దేరి పోవడానికి సిద్ధమౌతున్నాడు. అవిటివాణ్ణి కావడంచేతగదా యింత కష్టదశలో ఉన్నముసిలితండ్రికి అక్కర రాలేకపోయానని నాలోనేను వ్యధపడ్డాను. మా నాన్న యిప్పుడున్న అవస్థల్లో, వృద్ధాప్యదశలో ఆయన్ను యింటివద్ద కూర్చోబెట్టి, పొలం పన్లు అందుకోవలసిన నేను, కుంటివాణ్ణి కావడంవల్లగదా, ఆయన పడలేనిబాధలు పడాల్సొచ్చింది। ఒక్కసారిగా ఆంటోనియో, రాబర్టో, ఫ్రాన్సిస్కో, ఆద్రియానో మొదలైనవాళ్ళంతా జ్ఞప్తికివచ్చారు. మావాళ్ళంతా యీసమయములో యింటికివచ్చి ఆయన్ను కనిపెట్టుకుని ఉపచారాలు చేస్తుంటే యెంతో బాగుండు ననిపించింది. నాఅన్నదమ్ము లందరూ యింటివద్దనేఉంటే, మాయింటిపైనా, మాపొలాలపైనా రాళ్ళు రువ్వడానికి దమ్ములుండేవా? మా లేగోటను పీకివేసి, మాపొలాలను ధ్వంసముచేయుటానికి ఆ దుర్మార్గులు సాహసించగలిగేవాళ్ళా?

ఒకనాడు ఆనందంతో తొణికిసలాడే మాయింట్లో దురదృష్టదేవత నగ్నంగా విలయ తాండవంచేయడానికి కారణం యేమిటీ? గోవా అంతటిలోకీ గర్వించదగిన మణిపూసవంటి మాగ్రామం యీనాడు యెడారిగా మారి, విషాదస్వరూపం ధరించడానికి కారణం యేమిటీ?

నాలోనేనే యీప్రశ్నలు వేసుకొంటూ, నాకుతోచిన సమాధా నాలుగూడా నేనేచెప్పుకుంటూ వరండాలో కూర్చుని దుఃఖోపశమనం చేసుకోడానికి ప్రయత్నించాను.

మానాన్న వెళ్ళిన గంటసేపటికి నేనుగూడా పొలం బయల్దేరి పోయాను.

మే నెల పగలెంతో ప్రకాశమానంగా ఉంది. ఒక్కొక్కయిల్లూ దాటిపోతూంటే, వంటగదులపైనా పొగఉంగరాలుగా తిరుగుతూ పైపైకి యెగిసిపోవడం చూస్తున్నాను. నేనుపోతూంటే, కుక్కలు నన్నుచూసి మొరగడం ప్రారంభించాయి. సమీపిస్తున్నకొద్దీ దార్లో నిలబడున్న కోళ్ళు యెగిరి పక్కకు తప్పుకొనడం మొదలెట్టాయి. ఇళ్ళబయట పసి బిడ్డలు బురదలో చిందులు తొక్కుతూ ఆడుకుంటున్నారు. ఇసుక దిబ్బ లమీద చేరి పిచ్చుకగూళ్ళు కట్టుకుంటున్నారు. కట్టుకున్నగూళ్ళు ఒక్క నిమిషంలోనే కూలిపోవడంచూసి, పిల్లలు చీకాకుపడుతున్నారు. గోలీ లాడేవాళ్ళూ, బిళ్ళంగోడు ఆడేవాళ్ళూ దార్లో యెందరో కనిపించారు. ఒక్కసారి అమాంతంగా నేనుపిల్లవాడినైపోతే యెంత హాయిగా ఉండే దనిపించింది నాకు.

నడిచి నడిచి చివరకు పొలం చేరుకున్నాను. రైతులూ, కూలీలూ చెమటలు దిగజారేట్లు గడ్డపారలతో తవ్వుతూ, తవ్వుడుకు యెదురు తిరి గినచోట నీళ్ళతో నానబెడుతూ శ్రమపడుతున్నారు. శ్రమించి పనిచే స్తున్నప్పుడు వాళ్ళ ఆలోచనలు యెలాఉంటాయో తెలుసుకోవాలని నాకా రాటం కల్గింది. నాకు కొంచెం యీడొచ్చినప్పట్నుంచీ కష్టజీవుల ఆలో చనలూ, ఆశలూ, కోరికలూ యెలాఉంటాయో అనుకుంటూండేవాణ్ణి. ఏవో ఆలోచనలు వాళ్ళను బాధించేవనీ, యేవోకొన్ని కోరికలు వాళ్ళను మానసికంగానైనా సంతోషపెట్టేవనీ నేను ఊహించేవాణ్ణి. అయితే

యెలాంటి ఆలోచనలో, యెలాంటి కోరికలో ఖచ్చితంగా నేను చెప్పలేను.

ఈ క్షణంలో మా నాన్న మనస్సులో యే ఆలోచనలున్నాయో! అవి కూడా తెలుసుకోవాలని ఆతురతపడుతూ, త్వరత్వరగా నడిచి పొలం తక్షణమే చేరుకోవాలనిపించింది. రోబర్టో చేసిన పితృద్రోహాన్ని తలుచుకుని ఆవేదనపడుతున్నాడో, లేక మాఅమ్మా, రూత్‌లు జ్ఞాపకానికివచ్చి బాధపడుతున్నాడో, అదీయిదీకాక గోవా స్వాతంత్ర్య సిద్ధినిగురించి తియ్యని కలలుకంటూ ఆనందిస్తున్నాడో నేనూహించలేక పోయాను. నామస్సు పరిపరివిధాల పరుగెత్తింది. కొద్దిరోజుల క్రితమే మా నాన్న భారతస్వాతంత్ర్యాన్ని గురించి నాతోమాట్లాడాడు. ఆరోజున ఆయనమనస్సు యెంత నిర్మలంగా ఉంది! ఇప్పుడు మేనెలగదా! ఆగష్టు యింకా యెంతోకాలంలేదు. భారతదేశం విముక్తమయినతర్వాత సంవత్సరంలోగానే పోర్చుగల్ ప్రభుత్వం గోవా విడిచివెళ్ళక తప్పదని మా నాన్న నాతో యెప్పుడూ వాదిస్తూఉండేవాడు.

మానాన్న మనస్సులో యిప్పుడుగూడా యీ ఆలోచనలే ఉండి ఉండవచ్చునా ?

పొలం చేరుకోగానే, సూర్యకిరణాల కెదురుగా కళ్ళమీద చేయి అడ్డంపెట్టుకుని మానాన్నకోసం వెదికాను. ఆయన యెక్కడాకనిపించ లేదు. ఎండవేడిమికి కెక్కడైనా చెట్టునీడ తలదాచుకున్నాడేమో అను కున్నాను. అలసిపోయి నీరసంతో బాధపడుతున్న మానాన్న తప్ప కుండా యేచెట్టునీడనో విశ్రాంతి తీసుకుంటున్నాడనుకున్నాను. ఏచెట్టు క్రింద వెదకినా ఆయన కన్పించలేదు. మరోమార్గాన తిరిగి యింటికి చేరిఉంటాడా ?

త్వరత్వరగా నడిచి యెత్తుగాఉన్న చెరువుగట్టెక్కి పార చూశాను. అక్కణ్ణుంచి దృష్టిసారించిచూస్తే మాపొలాలన్నీ స్పష్టంగా కనిపిస్తాయి. నాదృష్టి పూర్తిగా నిగిడ్చి చూడగా మాపొలం నట్టనడుమగా వెల్లకిలా పడుకుని ఆకాశవంక ముఖంపెట్టి ఉన్నట్లు చూశాను మానాన్నను.

నాకుంటికాళ్ళల్లో శక్తి ఉన్నంతమట్టుకు ఒక్క పరుగు దీశాను మానాన్నపద్దకు. కాని అప్పటికే కాలాతీతమై పోయింది.

మానాన్న చనిపోనే పోయినాడు !

ఆయన పారా, గడ్డాపలుగూ ఆయన పక్కనే పడున్నాయి. ప్రాణప్రదంగా ప్రేమించిన మాపొలం మట్టిని గట్టిగాబిగించి గుప్పెట నిండా పట్టుకున్నాడు. ఏ మట్టిని తన ప్రాణంగా యెంచుకుని ప్రేమించాడో, యే మన్నులో నుంచి తాను ఉద్భవించాడో, యే మన్నుకోసం స్వాతంత్ర్య సమరంలో యెలాంటి ప్రమాదాన్నయినా యెదుర్కోడానికి వెనుదీయలేదో, యే మన్నుకోసం ధనవంతుల ద్వేషాన్నీ, క్రౌర్యాన్నీ, బహిష్కారాయుధాన్నీ ప్రతిఘటించాడో ఆ పవిత్రమైన మన్నును గుప్పెట్లో బిగబట్టుకొనే ప్రాణాలర్పించాడు మా నాన్న.

---

# ౧౬

మే నెల మంట గాడ్పులకు చెట్ల వేళ్ళుగూడా మలమల మాడి పోతున్నాయి. సూర్యభగవానుడు గూడా మామీద అంత నిర్దయగా ఉన్నాడు. ఎండకు మా పొలాలు గూడా బీటలువారాయి. వందగజాలు నడిచేప్పటికే కాళ్ళు బొబ్బలెక్కి గుడ్డలు ముద్దయ్యేట్లు దిగచెమటలు పోస్తున్నాయి.

మేనెల దాదాపు చివర్లోపడ్డట్టే. అయినా యెండతీవ్రత అంతగా తగ్గలేదు. ఆకాశాన మచ్చుకైనా ఒక్క మబ్బుతునక లేదు. నిర్మలంగా ఉన్న నీలాకాశాన్ని చూసి ఆనందించాను. అయితే యెక్కడా కను చూపు మేరలో వర్షంపడే ఆశ కన్పించలేదు. ఎండ గాడ్పులకు చెరువులూ, కుంటలూ అన్ని యెండిపోయాయి. వర్షానికి నోళ్ళు తెరుచుకుని యెదురుచూస్తున్నాయి. వర్షం కురిస్తేగాని పశువులకు పచ్చిగడ్డి కాస్కార ముండదు. చెరువులకింద ధాన్యం పండించుకునే మావంటి రైతులకు వర్షాధారం తప్పితే మరో మార్గం లేదు బ్రతకడానికి.

మా నాన్న స్వర్గస్థుడై అప్పటికి వారంరోజులైంది. మా అమ్మ సమాధి పక్కనే మా నాన్నగూడ సమాధి నిర్మించాం. స్వేచ్ఛావాయువు లన్నా, పంటపొలాలన్నా అమితంగా ప్రేమించే మా నాన్న యిరుకైన శవపేటికలో ముడుచుకొనిపోయి యీ సమాధిలో శాశ్వత నిద్ర అనుభవించవలసి వచ్చిందిగదా।

సాయంత్రం కావస్తూంది. నేను వరండాలో కూర్చొని ఆడపంది తన బిడ్డలతో కలిసి చెట్లక్రిందరాలిన మామిడిపండ్లను పీక్కొని తినడం

చూస్తున్నాను. ఆకలిగొన్న ఆవులమందలు, ఉత్సాహం వచ్చి దుమ్ము లేపుకుంటూ రోడ్డువెంటనే పని యిళ్ళకు చేరుకుంటున్నాయి. పచ్చని గడ్డిపోచైనా పంటికి తగలక క్షోభిల్లిపోతున్నాయి పాపం! ముగ్గురు యూరపియన్ సైనికులు రోడ్డు వెంట సైకిళ్ళమీద పోతూండడము చూశాను. పోతూ పోతూ వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు, వాళ్ళ కెదురుగా వస్తున్న కస్టోడియోను చూసి, సైకిళ్ళు దిగారు. "పుంజో కోళ్ళు అమ్మకానికి దొరుకుతాయా" అని అడిగారతన్ని.

కస్టోడియో వట్టి సోమరిపోతూ, తిరుగుబోతు గూడ. ఒక్క నాడైనా యింత కష్టించి పని చేసిన పాపాన పోలేదు. ఎప్పుడూ ఆడ పిల్లల్ని వేటాడ్డం, వాళ్ళను అవస్థలు పెట్టి చిక్కులపాలుజేయడం అతని ఉద్యోగం.

"అవునండీ అయ్యా! దొరుకుతాయి! మేమంతా కోళ్ళను పెంచుకుంటాం" అన్నాడు కస్టోడియో వణుకుతూ వచ్చీ రాని పోర్చుగీసు భాషలో.

"ఓహో అలాగా!" అంటూ వాళ్ళల్లో ఒకడు కస్టోడియోను చేతితో సంజ్ఞచేసి దగ్గరకు పిలచాడు. "మరి ఆడపిల్లల మాటేమిటి?" అన్నాడు చెవిలో రహస్యంగా.

కస్టోడియో వికటంగా చిరునవ్వు నవ్వాడు. అది అతని మనస్సుకు నచ్చిన విషయం. ఆడపిల్లల విషయంలో ఊళ్ళో మగకుర్రాళ్ళంతా పోటా పోటీలతో కొట్టుకొని చస్తుంటే, పరాయి వాళ్ళకు, అందులో తెల్లవాళ్ళకు, బొత్తిగా ఆస్కారం లేదన్నట్లు నవ్వుతూ పెదవి విరిచాడు కస్టోడియో. హాస్యంగా మాట్లాడుతూ, "చక్కని ఆడగుంటల్ని

గూడా పెంచుతాం. అయితే వాళ్ళంతా మా వూళ్ళోవాళ్ళే అనుభవించా లండీ!" అంటూ అక్కడినుంచి చటుక్కున తప్పించుకుని దాటి పోయాడు.

సోల్జర్లు యింకా కొన్ని గజాలు ముందుకు సాగి వచ్చారు. అక్కడున్న కొయ్యస్తంభానికి ఆనించారు వాళ్ళ సైకిళ్ళు. చుట్టూవున్న కిటికీల వేపూ, వరండాలవైపూ కలియచూశారు. వాళ్ళ చూపులు పక్కయింటి అమ్మాయి ఎలీజామీద పడ్డాయి. ఎలీజా ఎస్పిరాంకో కూతురు. ఆ పిల్ల ఇంటి గడపలమీద కూర్చుని గుమ్మంలో యెండబోసిన కందులకు కావలి కాస్తోంది. సైనికులు ముగ్గురూ తిన్నగా ఎలీజా వద్దకు ఓరచూపులు చూస్తూ వచ్చారు. కోళ్ళేమయినా అమ్మకాని కున్నాయా అని అడిగారు.

ఎలీజా తల్లిని కేకేసి పిలిచింది. తల్లి లోపల్నుండివచ్చి ముగ్గురు సైనికుల్ని చూసి బెదిరిపోయింది. "వాళ్ళకు కోళ్ళు కావాలటమ్మా అమ్మకానికి. మనకోళ్లున్నాయిగా, అమ్ముదాం?" అన్నది ఎలీజా.

భయంతో వణికిపోతూన్న ఎస్పిరాంకో కోళ్ళ మాట వినగానే యెక్కడలేని సంతోషం వచ్చింది. ఈ అవకాశం చూసుకొని కోళ్ళను మంచి లాభసాటి బేరానికి నెట్టెయ్యొచ్చుగదా అనుకొని ఒక్క చిరునవ్వు నవ్వింది. ముగ్గురు సైనికుల్ని లోపలికి వచ్చి కూర్చోమని మర్యాద చేసింది.

సైనికులు, తానాశించినధరకు కొనుక్కొని పోతారనే నమ్మకంతో "మా కోళ్లు యీ వూళ్ళోకల్లా చాలా పెద్దవి. కావాలంటే మా ఇంట్లో బాతులుగూడా ఉన్నాయి. మీకు బాతులు వద్దూ? మరి గుడ్లమాటేమిటి?" అంటూ ఎస్పిరాంకో లాలనగా సంభాషణ సాగించింది.

కూతురుమీద సైనికులు కన్నువేశారని ఎస్పిరాంకో కనిపెట్టలేదు. లాభాలు లెక్కవేసుకోవడంలోనే సరిపోయిందామెకు. సోల్జర్లను యింట్లో గుండా దొడ్డిగుమ్మంలోకి తీసుకొనిపోతున్నది. ఒక సైనికుడు తన కూతుర్ని కటుక్కున కౌగలించుకోడానికి ప్రయత్నించినట్లు ఎస్పిరాంకో కనిపెట్టింది. ఆమెకు మండిపోయింది. చేతిలోఉన్న చీపురుకట్టతో వాళ్ళ వెంట తగిలి, బజారులోకి తరిమేసింది ఒక్క క్షణంలో.

"తిరుగుబోతు గాడిదకొడుకుల్లారా! ప్రాణాలు దక్కించుకుని బయటపడ్డారు! చిక్కారా గుడ్లు పీకిపారేస్తా" అని పొలికేకలు పెడుతూ వీధిలోకి పరుగెత్తింది ఎస్పిరాంకో. అప్పటికే సైనికులు సందు మలుపు తిరిగిపోయారు, ఎస్పిరాంకో తన కూతురు చేయి పట్టుకుని గ్రామ మునసబు దగ్గరకు యీడ్చుకొని పోయింది.

జరిగిన కథంతా మునసబువిని అపహాస్యంగా చిరునవ్వునవ్వాడు. "అర్థం లేని మాటలు చెబుతావేం! ఈ పోర్చుగీసు సైనికుల్ని అపార్థం చేసుకుని అలా మాట్లాడుతున్నావు తెలిసిందా! కొస్త ఉంటే గంపంత చేసి చెబుతున్నావు! పోర్చుగీసువాళ్ళంటే యెవరో తెలుసునా నీకు! మనకు స్నేహితులవంటివాళ్లు. ఒకవేళ యెవరైనా నీ కూతురుమీద చేయి వేశారేమో! ఇంతలోనే యేం ప్రమాదం ముంచుకొచ్చిందీ? పెళ్లాల్నీ, బిడ్డల్నీ విడచి వీళ్లు దేశంగానిదేశం వచ్చారు! మనకామాత్రం జాలీ, దయా ఉండొద్దూ వాళ్ళమీద? మనల్ని రక్షించి సహాయపడ్డానికి కదూ ఇంత దూరమూ వాళ్లొచ్చింది? కూతురుమీద చేయివేస్తే యింతలోనే నీ సొమ్మేమైనా పోయిందా?" అన్నాడు మునసబు యెగతాళిగా.

"ఏమిటీ! నీ నోరేమైనా కొవ్వెక్కిందా? సిగ్గూ, అభిమానం, ఆత్మగౌరవం లేదూ నీకు! నీ కూతుళ్ళను ఇలా అవమానిస్తే నీవు సహిస్తావా?" అని దూషణకు దిగింది ఎస్పిరాంకో.

---

ఇంతలో లిబోరియా విచారణ వచ్చింది. హత్యాప్రయత్నం చేసినట్లూ, ప్రభుత్వంపైన ప్రజల్ని రెచ్చగొట్టి తిరుగుబాటుకు ప్రేరేపించినట్లూ లిబోరియాపైన నేరాలు ఆరోపించబడ్డాయి. విచారణ తంతు నాటకములా ముగిసింది. ప్రభుత్వానికి ఒక్కరూ సాక్ష్యం చెప్పడానికి నిరాకరించారు. చివరకు అతనికి నాలుగు సంవత్సరాల కఠిన శిక్ష విధించబడ్డది. ఎంత అన్యాయమో చూడండి! మా వాళ్ళకీ శిక్షసంగతి తెలియగానే, పోర్చుగీసువాళ్ళ పచ్చి రక్తాన్ని యెప్పుడు చవిచూద్దామా అన్నంత కోపం వచ్చింది. కాని నిరాయుధులైన మా ప్రజలేంచేయగలరు? పశుబలంతో రాజ్యమేలే పోర్చుగీసు ప్రభుత్వంమీద యేవిధంగా పగ సాధించుకోగలరు?

మా ప్రజలకు మా నాన్న అప్పుడు జ్ఞప్తికి వచ్చాడు. మా నాన్న చావు విని ఆనాడు సంతోషించిన వాళ్ళంతా యీ నాడు ఆయన్ను తలచుకుని విచారిస్తున్నారు. ఇప్పుడాయన సజీవంగా ఉంటే బ్రతికిపోదుమని పశ్చాత్తాపపడ్డారు. ఆయన భావాలూ, ఆయన నిర్ణయాలూ సరైనవనీ, న్యాయమైనవనీ యీనాడు తెల్సుకోగలుగుతున్నారు. మా నాన్నకు బద్ధశత్రువైన మునసబు కూడా యీ రోజున పశ్చాత్తప్తుడై బోరున యేడ్వడంమొదలెట్టాడు. తన కూతుర్ని సోల్జర్లు చెరచడంతో, మా నాన్న పదే పదే చాటుతూ వచ్చిన పరమ సత్యాలను మునసబు యిప్పుడు పూర్తిగా నమ్మగలిగాడు. చేతులారా ఆయన ప్రాణాలు తీయడానికి తాను పరోక్షంగా కారకుడ నైనానని లోలోపల తననే నిందించుకున్నాడు.

మా నాన్న కోరుకున్న ప్రతికారం పోర్చుగీసువాళ్ళకు ప్రతీకారం జరిగింది. ఆయన బ్రతికుండగా కాకపోయినా చనిపోయిగూడా పగ దీర్చుకున్నాడు. ఆయన ధార్మిక తత్వాన్నీ, పవిత్రాత్మనూ ప్రకృతిమాత వేయి నోళ్ళతో నిజమని రుజువు చేసింది,

అర్ధరాత్రి గ్రామమంతా ఒళ్ళు మరచి నిద్రిస్తున్నది. పోర్చుగీసు ప్రభుత్వానికీ, పోర్చుగీసు సైన్యానికీ దాసులై, మానాభిమానాలు విడిచి ప్రవర్తించిన సొంటానా మొదలయిన ధనిక భూస్వాముల యిళ్ళపైన యెడతెరిపిలేని రాళ్ళవర్షం కురిసింది. తలుపులూ, దర్వాజాలు, కిటికీ అద్దాలూ రాళ్ళతాకిడికి నుగ్గునుగ్గయిపోయాయి. వాళ్ళ గడ్డి వాములుగూడా భస్మీపటలమైనాయి.

చొప్పవాములు భగభగ మండుతూంటే, అరుణ కాంతులు గ్రామమంతటా ప్రసరించాయి. అగాస్టినో, డిమిటీరియో, మరేడుగురు రైతులూ కలసి ధాన్యం మూటలు భుజాలకు తగిలించుకుని రోడ్డువెంటనే భారతదేశపు సరిహద్దులకు ప్రయాణమై పోతున్నారు. వాళ్ళను వెంటాడి పట్టుకొనడం భూస్వాముల తరమూగాదు; పోరుగీసు అధికార్ల తరముగాదు.

---

# ఉపసంహారం

ప్రియాణం యింతటితో ముగిసింది. నేనొక్కడినే యీ యింటి కంతటికీ మిగిలి జీవించి ఉన్నాను. కిటికీ వద్ద ఒక్కణ్ణె కూర్చుని ఆకాశ మార్గాన ప్రియాణంచేసే రకరకాల రంగు మేఘాలను పరిశీలిస్తున్నాను. నా చిన్నతనంలో యీ మేఘాలన్నీ ఉన్నితో తయారయ్యేవనుకునేవాణ్ణి. ఒక యెత్తయిన పర్వతశిఖరం మీద బ్రిహ్మాండమైన ఆకారంగల రాక్షసుడు లక్షలకొద్ది గొర్రెలను కాచుకుంటూ అప్పుడప్పుడూ టన్నులకొద్ది ఉన్నిని ఆకాశంలోకి యెగజిమ్మేవాడనీ, యెగజిమ్మబడిన ఉన్ని క్రమేణా మేఘాలుగా మారాయనీ, నా చిన్నతనంలో కల్పించిన కట్టుకథల్ని నమ్మేవాణ్ణి. మా బాల్యంలో మేఘాలు మమ్మల్ని యెంతో ఆకర్షించేవి. మళ్ళీ నేను పసివాణ్ణిగా మారి, ఊహాప్రిపంచంలో జీవిస్తే హాయిగా ఉండుననిపిస్తుంది. యదార్థమైన యీ ప్రిత్యక్ష ప్రిపంచంలో కష్టాలేమిటో, దుఃఖాలేమిటో చవిచూస్తూనే ఉన్నాం. వాటివల్లజనించే నిరాశా, నిస్పృహలు గూడా కొంతవర కనుభవించాం.

కిటికీ గూట్లో కూర్చుని బాహ్యప్రిపంచం చూస్తున్నాను. మా యింటిచుట్టూ వున్న బ్రిహ్మాండమైన వృక్షాల్నిగూడా చూసి ఆనందిస్తున్నాను. నా ఊహ తెలిసినప్పట్నుంచీ, యీ నాటి వరకూ ఆ వృక్షాలు అక్కడే ఉన్నాయి స్థిరంగా; నేను దాటిపోయిన తర్వాతగూడా అక్కడే ఉంటాయని నా నమ్మకం. ఈ యిల్లూ, యింటి చుట్టూ వున్న చెట్టు చేమలూ యదార్థమైనవీ, స్థిరమైనవిగా కన్పిస్తున్నాయి. జీవితం ఒక్కటే క్షణభంగురమూ, అశాశ్వతమైనదిగా తోస్తున్నది నా మనస్సుకు.

అదిగో అక్కడే చూడండి ఒక జామచెట్టుగూడా ఉంది. జామ పండ్ల బరువుభారానికి కొమ్మలన్నీ నేలకానేట్లు వాలుతుండేవి. జామకాయ ముదిరి పక్వానికి రాగానే కమ్మని వాసనలు విరజిమ్మేది. ఈ సువాసన ఫర్లాంగు దూరం వరకూ వ్యాపించేదిగూడా. ఈ కమ్మని వాసనకు మా నోళ్ళూరి కర్రలతో తపీతపీమని పండ్లన్నీ రాలగొట్టేవాళ్ళం. ఈ జామ చెట్టంటే మా కెంత ప్రేమనుకున్నారు! పెద్ద కొమ్మ ఒకదాన్ని చూసి లావుపాటి తాడుతో ఉయ్యాల కట్టుకుని తెల్లవారుఝాము మొదలు చీకటి పడ్డదాకా విసుగూ విరామం లేక ఒకటే ఊగుతూ ఉండేవాళ్ళం. పాపం ఆ జామచెట్టును యెన్ని విధాల యెన్నెన్ని బాధలు పెట్టామో! మా అందరిలోకి సీజరు చెట్లకు తెచ్చిన చేటు యింతంతగాదు. అస్తమానం వా డా చెట్లమీదనే కూర్చొని కత్తులతో గాట్లు పెట్టి, కొమ్మలకున్న ఆకు లను తుంచి పారవేసి మొండాలుగా చేసో, తన మనస్సుకు తృప్తి కలిగించుకుని ఆనందించేవాడు.

అలాంటి సీజరు యీ నాడు పతగురుపై యెక్కడో దూర దేశంలో జీవితం వెళ్ళదీస్తున్నాడు.

ఈ నాడు ఆ జామచెట్టును గాట్లుపెట్టే వాళ్ళూ, ఆకులు తుంచి పారేసేవాళ్ళూ, ఉయ్యాల వేసుకుని ఊగేవాళ్ళూ యెవ్వరూ లేరు గదా! కొమ్మలకు ఆనలు వేసి, ఆనలకు రెమ్మలు వేసి, బ్రహ్మాండమైన వృక్షంగా పెరిగి యెలా ఆనందం అనుభవిస్తున్నదో చూడండి! ఈ వృక్షాలన్నీ మా జీవితంలో అంతర్భాగమనీ, మా కుటుంబానికి అనుభవ మైన కష్టాలన్నిట్లో కొద్దో గొప్పో యీ వృక్షాలుగూడా భాగం పంచు కున్నాయనీ నా దృఢవిశ్వాసం. ఏమో! ఎవరేం చెప్పగలరు!

అదుగో యెడమ ప్రక్క నిటారుగా పెరిగి ఉంది బ్రహ్మాండ మైన మామిడిచెట్టు. బాల్యంలో మేమంతా యీ చెట్టుకింద చేరి,

ఓ చెట్టూ, చెట్టూ! మా కో మామిడిపండు పడేయ్యవూ? నీకు కాయ సొన పోసి, మేం కమ్మని పండు తింటాం సుమా!" అంటూ ఆనందించేవాళ్ళం. ఇంతలో మామిడి పండు పడగానే, దాని సొన మామిడి చెట్టు దోసెప పూసి, మా విధిని మేం నిర్వర్తించి, మా మాట నిలబెట్టుకున్నామని తృప్తిపడేవాళ్ళం.

పిల్లలుగా ఉన్నప్పుడు యెవరేమాట చెప్పినా, ఆ మాటలు నమ్మి యెంతో హాయిగా ఉండేవాళ్ళం. ఈ యింటి నీడ కిందా, యీ చెట్ల నీడ కిందా యెలాంటి మధురమైన కలలు కన్నాం! ఎంత అద్భుతమైన సంఘటనలు చూశాం! భవిష్యత్తును యెంత ఆనందమయంగా రూపొందించుకోడానికి ప్రయత్నించాం! మా కలలన్నీ పగటికల లైనందుకు విచారించక మరి చేసేదేముంది!

మా దొడ్లో యింకా అనేక యితర చెట్లుగూడా ఉన్నాయి. పనస చెట్లు, దిరిసెన చెట్లు, దానిమ్మ, మర్రి, కొబ్బరి మొదలైనవెన్నో ఉన్నాయి. నా చిన్నతనం నుంచీ యీ నాటి వరకూ ఒక్క చెట్టయినా దెబ్బతినకుండా అలాగే బ్రతికి ఉన్నాయి. అవి యెంత పుష్టిగా, యెంత ఆరోగ్యంగా, యెంత దీర్ఘకాలం బతికిపున్నాయో చూస్తుంటే, ముచ్చట వేస్తుంది. వాటితో మన జీవితాలను పోల్చి చూస్తే. యివి బుద్బుదప్రాయమైనవని నా మనస్సు కలా తోస్తున్నది. ఏమో! నా అభిప్రాయం సరైనదో కాదో!

ఒకొక్కొక్కప్పుడు కుర్చీలో పడుకుని నాలో నేను ఆశ్చర్యంతో ఆలోచిస్తూంటాను. గుండెలు కొట్టుకొనడం ఆగిపోయినా, జీవాత్మ యీ శరీరాన్ని వదలి పోవడాని కిష్టంలేక పెనుగులాడుతుం దేమా అని! ఎందువల్లనో? జీవాత్మే గుండెకాయా; లేక గుండెకాయే జీవాత్మా? ఈ

సమస్యను పరిశీలించడానికీ, పరిష్కార మార్గం కనుక్కోడానికీ అనేక సార్లు ప్రయత్నించాను. కాని యింతవరకు యదార్థ విషయం తెలుసుకో లేకపోయాను. లేకపోతే; అసలు జీవాత్మ అనేది లేనే లేదా? అన్నీ సందేహాలే!

మొన్న మొన్నటి వరకూ మేం అనుభవించని కష్టా లంటూ ఉన్నాయా! చిన్నతనంలో మా రూత్ జడ అల్లుకున్న రిబ్బన్లు యిప్పటికీ నా కళ్ళలో మెసులుతూనే ఉన్నాయి. రాత్రిం బగళ్ళూ ఆ వంకెమీదనే నా కవి ప్రత్యక్షమౌతూ ఉంటాయి. మా అమ్మె ఆ వంకెమీద వాటిని వేలాడదీయడం నేను కండ్లారా చూశాను. ఆ రిబ్బన్లు చూస్తుంటే, ఇంద్ర ధనుస్సు ఎప్పుడూ నా ముందు ప్రకాశిస్తున్నట్లే ఉంటుంది. జూన్ నెల్లో ఒక్కనాడు ఇంద్రధనుస్సు చూసి మా యిరుగు పొరుగు పిల్ల లందరితో మేమంతా మా యింటిముందు గుమిగూడి సంతోషంతో, "ఓ ఇంద్రధనుస్సా! ఇంకొంచెంసేపు అక్కడేవుండి మాకు ఆనందం కలుగజేయవూ!" అంటూ కేరింతాలు కొట్టడం యిప్పటికీ జ్ఞాపకం వుంది. ఒక్క రూత్ మాత్రమే ఇంద్రధనుస్సుకన్నా తన రిబ్బన్లే అందంగా వున్నాయని గర్వంతో మురుసుకునేది. రూత్ ఆ రోజుల్లో బహు కొంటెతనంగా ఉండేది. ఆకతాయి చేష్టలతో మమ్మల్నందర్నీ కడుపుబ్బేట్లు నవ్విస్తూండేది. అయినదానికీ, కానిదానికీ ఒకటే అల్లరి చేస్తుంటే, ఒక్కొక్కపుడు మా అమ్మతోసహా మేమంతా దాన్ని కసురుకునే వాళ్ళం.

రూత్ మాంచి ఆరోగ్యంగానూ, బలంగానూ, ఉత్సాహంగానూ ఉండేది. ఎన్నెన్ని కబుర్లు చెప్పేదో, యెంతఅల్లరీ, చిలిపితనం చేసేదో, యెంత నవ్వించేదో, చదువులోగూడా అంత తెలివితేటలూ, చురుకుదనం చూపించేది, దానికి తెలిసినన్ని మాయోపాయాలూ, జిత్తులమారి ఆలోచ

నలూ మాలో నెవరికీ తెలియదు. దాన్ని ఒక విద్యుల్లత అని పిలిస్తే సరిపోతుందేమో! మగపిల్లలకన్నా గడుసుదనంగా ప్రవర్తించేదంటే నమ్మండి. ఒకనాటి ఉదయం మేం ఒక స్నేహితుని యింటికి పెండ్లికి వెళ్ళి తిరిగి యింటికి వస్తున్నాం. మాతోకూడా వస్తున్న రాయ్ అనే కుర్రాడు మా రూత్‌ను ముద్దుపెట్టుకున్నాడు దార్లోనే. మొహమైనా అటూ యిటూ తిప్పకుండా మొద్దులా చూస్తూ ఊరుకుంది. ఇద్దర్నీ నేను కటి క్కీన పట్టుకుని మందలించాను. అంతటితో పోనివ్వకుండా మా అమ్మతోగూడా చెబుతానని బెదిరించాను. ఆ నాటినుండీ ఒక సంవత్సరం పదాకా, పాపం, రూత్ నాకు బానిసలా అయింది. నేను చేయమన్న పని చేసిపెట్టేది. నిల్చోమంటే నిల్చునేది. కూర్చోమంటే కూర్చునేది. ఆ వ్యవహారాన్ని గురించి మా అమ్మకు చెప్పకుండా, పిప్పరమెంట్లూ, అరాయా, పేడలూ నాకు లంచంగా యిచ్చింది రూత్. దాన్ని అలా బెదిరించి లంచాలు గుంజినందుకు నా కెంతో చిన్నతనం వేసింది తర్వాత తర్వాత.

అలాంటి మా రూత్ చర్చి ఆవరణలోని సమాధిలో శాశ్వత నిద్రలో వుందీ నాడు.

మా గదిలో టేబిల్ మీదమా ఫ్రాన్సిస్కో స్వయంగా తయారు చేసిన కొయ్యబండి యిప్పటికీ ఉంది. ఆ ఆట బండిని చూసుకుని వాడు గర్వపడేవాడు దాన్ని తానే తయారుచేశానని. మమ్మల్నెవర్నీ తాకనిచ్చే వాడు గాదు పగలగొడతామనే భయంతో. ఈ నాడా బండినిండా దుమ్ము పేరుకుని ఉంది. దాన్ని తలిచే దిక్కులేదు. దుమ్ము దులిపి శుభ్రించేసే నాథుడు లేడీ నాడు. ఆ ఫ్రాన్సిస్కో యీ రోజున బతికుండిగూడా చచ్చినవాడితో సమంగా ఆఫ్రికాలో పడివున్నాడు. మా కో ఉత్తరం ముక్క వ్రాయాలనిగానీ, మా క్షేమ సమాచారాలు తెలుసుకోవాలనిగానీ,

వాడి కీషన్మాత్రం మనస్సులో లేదు. ఇక్కడుండగా వాడూ మంచి బుద్ధిమంతుడులా ఉండేవాడే! మానాన్నతోపాటు పొలంపోయి ఆయనతో పాటు కష్టించి పనిచేసేవాడే! అతి విధేయతగా, నిరాడంబరంగా సంచరించుకునే వాడే! అలాంటి అమాయకుడు ఆఫ్రికాలో అడుగుపెట్టగానే వాడి-వైఖరే పూర్తిగా మారిపోయింది. వాడి దుర్నడత మూలంగా మా నాన్నకూ, మా అమ్మకూ చెప్పనలవికాని విచారం యేర్పడింది.

మా యింట్లో యేవైపుచూసినా, యేవస్తువుచూసినా, మేరియా, ఆంటోనియా, ఆప్రియానో, రాబర్టో, కార్లస్, సీజర్ జ్ఞాపకం వస్తారు. వాళ్ళంతా తిరిగి యిక్కడ సమావేశమైతే, మళ్ళీ మాయిల్లు యెంత కన్నుల పండగ్గా ఉంటుందో! ఆ పొడుగుపాటి బల్లకు అటూ యిటూ మానాన్నా, అమ్మా మేముకూర్చుని భోనాలుచేసేవాళ్ళం పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ. ఆ బల్లతో మా కిప్పుడు పని తీరిపోయింది. దుమ్ము కొట్టుకొని ఆలనాపాలనా లేక ఒక మూల పడున్నదిప్పుడు. మా నాన్నా, మా అమ్మా ఆ చర్చి ఆవరణలో మరోమూల సమాధుల్లో శాశ్వత శాంతి అనుభవిస్తున్నారు!

భోజనాల సమయంలో మా నాన్న గొంతు అందరికన్నా పెద్దదిగా వినబడేది. ఆయనది చాలా గంభీరమైన కంఠస్వరమని గూడా ఊళ్లో అంతా అనుకుంటుండేవాళ్లు. ఆ సమయంలో మా నాన్న చెప్పే కథలూ, గాథలూ, ప్రక్కిటి పురాణాలూ, ఆయన చేసే పరిహాసాలూ యిప్పటికీ, యెప్పటికీ నా చెవుల్లో ప్రతిధ్వనిస్తాయి.

ఒక్క మా అమ్మే పాపం మా నాన్నను సరిగా అర్థంచేసుకో లేక పోయింది. అది తల్చుకుంటే యెంతో విచారం వేస్తుంది. అయినా మా నాన్నంటే మా అమ్మ కెంత ప్రేమ! తన ప్రాణంకన్నా వెయ్యి రెట్లెక్కువగా ప్రేమించేది మా అమ్మ పిల్లల్నందర్నీ. మేం పిల్లలమంతా

ఆ పొడుగు పాటి వరుసపుటేవ పడుకుని ఉన్నప్పుడు మా అమ్మ ఆ గది లోకి వచ్చి మేం ప్రశాంతంగా నిద్రపోతున్నామని భ్రమపడుతూ మా తలలు ముద్దుపెట్టుకునేది. దిండ్లపైన శిలువ ఆకారంలో వేలుతో బొమ్మను గీచి, ముంగాళ్ళమీద చడీచప్పుడూ కాకుండా తిరిగి వెళ్ళిపోయేది. ఈతమాషా యెన్నిసార్లు కనిపెట్టలేదు నేను! ఆనాడు మేమంతా ప్రశాంతంగా నిద్రపోతున్న దృశ్యాన్నిచూసి మా అమ్మ యెంత ఆనందించిందో! అలాంటి మా అమ్మకు మేమంతా కలిసి యెంత హృదయభారం తెచ్చి పెట్టాం!

మా యింటి పక్క ఉన్న రోడ్డు మెత్తని దుమ్ముతో ఆనాడెంత చీదరగా, రోతగా ఉండేదో, యీనాడూ అలాగే ఖరాబుగా ఉందిగద! నా జీవితంలో నైనా యీ రోడ్డు బాగుపడడం చూస్తానో, చూడనో!

మా గోవాలో దశాబ్దాలు గడచిపోయినా, మారకుండా, చిరస్మరణీయంగా ఉండే దృశ్యాలు ఒక్క రోడ్లే. బంధుమిత్రులనేకులు చనిపోతున్నారు. అనేకులు పరదేశాల పాలైపోయారు. ఇళ్ళన్నీ పాడు పడ్డాయి. వీధులన్నీ నిర్మానుష్యమైనాయి. గోడలూ, గొడ్డెలూ, యిళ్ళ కప్పులూ కూలిపోతున్నాయి. ఒకప్పుడు ఆనందోత్సాహాలు వెల్లివిరిసిన యీ గ్రామంలో యీనాడు నిరాశా, నిస్పృహాలు ఆవరించాయి. మా గ్రామం యిన్నిన్నిమార్పులకు గురైనా, రోడ్లుమాత్రం యథాపూర్వ స్థితిలోనే ఉన్నాయి.

గోవా అంతట్లోనూ మావూరురోడ్డంత పాడురోడ్డు మరెచ్చటా లేదని మా ప్రజలిప్పటికీ విచారిస్తుంటారు. వాళ్ళనే మాటల్లో అబద్ధమేముంది?

మా యిల్లుగూడా పూర్వమున్నస్థితిలో యిప్పుడులేదు. పెంకులు పగిలిపోయి, యిల్లు కురవడం మొదలుపెట్టింది. దూలాలూ, వాసాలూ

పుచ్చిపోతున్నాయి. గోడలు బీటలు వారిపోతున్నాయి క్రమంగా. మరమ్మతు చేయించడం అసాధ్యమైంది. శరీరం పోషించుకున్నట్లే, యింటినీ పోషించుకోకపోతే, యెంతగట్టి యిల్లయినా కొన్నాళ్ళకు దసిలిపోక మానదుగదా! శిథిలావస్థలో ఉన్నమాయింట్లో వంటరిగా కూర్చుని విచారించడమే చివరకు నా ఉద్యోగమైయింది. నిమిషాలూ, గంటలూ, రోజులూ లెక్కపెట్టుకుని జీవితం వెళ్ళదీస్తున్నాను. మాయింటి పక్కగా పోతూన్న రోడ్డుకూ, నాజీవితానికీ యెంతో సన్నిహిత సంబంధమున్నట్లు నాలో ఆలోచన బయల్దేరింది. పాతమిత్రుడెవరైనా ఆరోడ్డు వెంట వస్తున్నాడేమో అని ఆశతో, ఆతురతతో, మధ్యమధ్య నిరాశతో యెదురుచూస్తున్నానీరోజున. చిన్ననాటి మధురస్మృతులను జ్ఞప్తికితెచ్చే అప్తుడెవరైనా కంటపడతాడేమో, కొంత దుఃఖోపశమనం చేసుకుందామని ఆశపడ్డాను. కాని నాబాధ నివారించే యేమిత్రుడైనా వస్తేగా!

పూర్వం జరిగిన విషయాన్ని స్మరించుకుని ఒకవంక ఆనందించడం, మరొకవంక విచారించడం మానవ జీవితానికి సహజ లక్షణాలు. అదొక విచిత్రమైన ఆలోచనావస్థ. దానిలోని సుఖ దుఃఖాలు అనుభవించేవాళ్ళకే అర్థమౌతాయి. ఆరోడ్డువంక అదేపనిగా చూస్తుంటే, నాచిన్నతనంలో జరిగిన విచిత్రసంఘటనలన్నీ ఒకటొకటిగా విశాలమైన నా స్మృతిపథంలోకి వరుసగా వస్తున్నాయి. మానాన్న గోవాలోని రోడ్లను పోర్చుగీసు ప్రభుత్వంతో పోల్చేవాడు. ఠఃరెండూగూడా తమ ప్రయాణాన్ని యెక్కడో దూరాన్నుంచి ప్రారంభించి మాతలలపైన జల్లలకొద్దీ దుమ్మును ప్రతిరోజూ కుమ్మరిస్తూన్నా యంటూండేవాడు. పోర్చుగీసు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించేందుకై యెక్కడెక్కడి పోలికలూతెచ్చి మానాన్నతూర్పారపట్టేవాడు. ఆయన విమర్శలూ, ఆయన పరిహాసాలూ, ఆయన నర్మగర్భాలూ, వ్యంగ్య వ్యాఖ్యానాలూ నాచెవుల్లో

గింగురుమంటున్నాయి. ఆమాటలన్నీ నిన్నమొన్న అన్నట్లుగా ఉన్నాయి నామనస్సుకు.

ఆనాడుదయం అనస్తాసియో రోడ్డుమీద కన్పించినప్పుడు నన్ను తీసుకెళ్ళి వాళ్ళ ఆవుమీడను చూపించమని నేను అదేపనిగా వేధించడం జ్ఞాపకంవచ్చింది. ఇంతలో యెన్నిసంవత్సరాలు దొర్లుకుని పోయాయి. నిన్నమొన్న జరిగినట్లుగా ఉంది నాకాసంఘటన. ఒకనాడు క్రైస్తవ ఉత్సవ సందర్భంలో రైబీరియో రెండు సారాయిబుడ్లూ గటగట తాగి వొళ్లుతెలియక మురికిగుంటలో పడిపోయిన సంఘటన యెన్నటికీ మరవలేను. ఆ దృశ్యాన్నిచూసి మేమంతా పొట్టలుబ్బేట్లు నవ్వాంగూడా. ఆ రైబీరియో యీనాడేమైపోయాడు? ఆనాడు ఊరేగింపులో బారులుతీరి హుషారుగా నడుస్తున్న తతిమ్మ మిత్రులందరూ యీనాడెక్కడున్నారు?

నా బాల్యమిత్రులందరూ యీనాడెక్కడికి పోయారో! ఎక్కడ తలదాచుకున్నారో! మానోల్, అనస్తాసియో, ఫ్లసంత్, బాబా, అనిసిటో, కాన్‌స్టాన్సియో, జయరాం, ఆర్టిమిసియా, యింకా యెందరెందరో! యేమైనారు వీళ్ళంతా! ప్రతినిత్యంవాళ్ళు నాకంటపడుతూ, యేవో కబుర్లు చెబుతూనే ఉండేవాళ్ళు. వాళ్ళవల్ల నేనెన్నో మంచిమంచి విషయాలు నేర్చుకున్నాగూడా. ఒక్కరోజైనా వాళ్ళను చూడకపోతే, నా మనస్సు నిలిచేది కాదు. పోర్చుగీసు కిరాతకుల చేతుల్లో చనిపోయిన వాళ్ళు వీళ్ళల్లో చాలామందున్నారు. వాళ్ళులేకపోతే నాకీవూరు యెడారిగా కన్పిస్తున్నది. ఈ శూన్యంలో జీవించడం అసాధ్యంగా ఉంది. వాళ్ళంతా నా క్షేమంకోరే సన్నిహిత సహచరులు ఆప్తమిత్రులు, ఒక పెద్దకుటుంబంలా జీవించే మా గ్రామప్రజల్లో వాళ్ళంతా మాతో సోదరభావంతో కలిసి మెలిసి వుండేవాళ్ళు ఆరోజుల్లో.

దూరానా యెవరో మా కత్యంతప్రియమైన ఒక పాటపాడు తున్నట్లు వినవచ్చింది. ఈపాటంటే మా అమ్మ చెవికోసుకునేది. ఎన్ని సార్లువిన్నా ఆమెకుతనివితీరేదికాదు. కంఠస్వరం యెంతో శ్రావ్యంగా, మధురంగా, ఉంది. ఈపాటను వినేఅదృష్టం లేకుండా మా అమ్మలా నేనూ ఎప్పుడో ఒకనాడు దాటిపోతానేమోఅని విచారించాను. మా నాన్న ఒకపంజరం తయారుచేసి దాన్లో ఒక బుల్‌బుల్‌పిట్టను పెంచేవాడు. ఆ పంజరం, ఆ బుల్‌బుల్‌పిట్టా అవిగో అక్కడే నాముందు ప్రత్యక్షంగా కనుపిస్తున్నాయి. పంజరంమీద ఒకపిచ్చుకవచ్చివారి బుల్‌బుల్‌కోసం సమీపంలోనే ఆహారంపెట్టి ఉన్న పళ్లెంవంక అసూయతో ఓరచూపు చూడడం మొదలెట్టింది. పంజరంలో బంధించబడున్న బుల్‌బుల్‌కు ఆహారం అందకపోవడంచేత అదితిందామని ప్రయత్నంచేయలేదు. పిచ్చుక స్వేచ్ఛగా జీవిస్తున్నందుకు దాన్నిచూసి బుల్‌బుల్ అసూయ పడుతున్నది. ఈరెండుపిట్టల మనస్తత్వాలూ చూస్తే, మానవుల మనస్త త్వానికీ వీటికీ యెంతసన్నిహితత్వం ఉందో బోధపడుతుంది. తమకున్న దానితో సంతృప్తిపడలేక, పక్కవాడిని కొల్లగొట్టే మనస్తత్వంకాక మరేమౌతుంది!

వరండాలో కూర్చుని ఉంటే, చెలమలోనుంచి నీరూరినట్లు లెక్క లేనన్ని ఆలోచనలు పుట్టుకువస్తున్నాయి. చిన్నతనపు సంఘటనలు స్ఫుర ణకువచ్చి నామనస్సు చీకాకుపెడుతున్నాయి. లక్ష్మితో కలసి ఆంటో నియో యిల్లువదిలివెళ్లిపోయిన తర్వాత పూర్వం మా యింటికున్న కళా కాంతులు నశించిపోయాయి. ఆ సంఘటన్ను విశ్లేషికబుద్ధితో దీర్ఘంగా ఆలోచిస్తే, మా యింటికిపట్టిన యీఘోరదుస్థితికి ఆంటోనియో యెంత మాత్రం బాధ్యుడుకాడని నేను ఘంటాపథంగా చెప్పగలను. లక్ష్మీమీద వానికి కలిగినప్రేమ కాకతాళీయంగా జరిగిన సంఘటన.

రిపబ్లిక్ ఓనాళ్లో మా ప్రజలు కనీసం మానవులుగా పరిగణించ బడేవాళ్లు. రిపబ్లిక్ ప్రభుత్వం అంతరించగానే, మా ప్రజలపాట్లు చెప్పనలవికానంత ఘోరంగా పరిణమించాయి. పోర్చుగీసు పాలకుల్లో సామ్రాజ్యకాంక్ష, క్రౌర్యం, నిరంకుశత్వం, ఉద్రేతిమించాయి. దానితో పాటు గోవాలోగూండా ప్రభుత్వానికి గులాంలనేకులు తయారైనారు. మా ప్రజలను జలగల్లా పీల్చుకుతినే ధనికభూస్వాములు పోర్చుగీసు వాళ్లకు నమ్మినబంట్లై నీచంగా ప్రవర్తించడం మొదలెట్టారు, దానితో అసహనం, అశాంతి గోవాఅంతటా తలెత్తాయి. పోర్చుగల్‌లో నియంతృత్వం స్థాపించగానే, గోవాలో హత్యాకాండవిలయనృత్యం చేసింది. గోవా యిప్పుడొక బ్రహ్మాండమైనా కారాగృహంగా మారింది. వ్యక్తిస్వాతంత్ర్యం, పౌరసత్వ హక్కులూ సర్వనాశన మైనాయి. నరహంతకులు క్రూర నిరంకుశత్వానికి మా ప్రజావాణి లొంగిపోయి నిరువుగప్పిన నిప్పులా రవులు కుంటున్నది.

నాముందు ప్రత్యక్షంగా యిప్పుడే యిద్దరుసోల్జర్లు రోడ్డుమీద బూట్లకాళ్లతో బాదుకుంటూ పోతున్నారు. మా లొంగుబాటు తత్వాన్నీ, వీళ్లింకా ప్రపంచానికి ఋజువుచేస్తున్నారు. వాళ్లు మా యింటిపక్కగా నడిచిపోతుంటే, నేనూ, వందలకొద్ది మా ప్రజలతో కలిసి నోటికిశక్తున్న మట్టుకు శాపనార్థాలు పెట్టడంతప్ప మరోవిధంగా ప్రస్తుత దశలో ప్రతీ కారంతీర్చుకోలేం.

ఈ నియంతృత్వపాలన కింద అంతకన్నా మేమేంచేయగలం! పోర్చుగీసు ప్రభుత్వంపైన జయప్రదంగా తిరుగుబాటు లేవదీయాలంటే, అదిగోవాగడ్డమీదనే బయల్దేరాలి. అయితే నిరాయుధులై నిర్వీర్యులైన మా ప్రజలు యెలాతిరుగుబాటు చేయగలరు?

భారతదేశం స్వాతంత్ర్యం సంపాదించుకుంది. ఆసియా. ఆఫ్రికా. ఖండాలు సామ్రాజ్యవాదంమీద ప్రచండంగా యెదురుతిరుగుతున్నాయి. పరాదీనదేశాలన్నీ సుసంఘటితమై స్వాతంత్ర్యంకొరకు తుదిపోరాటం జరుపుతున్నాయి. రాజనీతిలో శతాబ్దాలుగా ముందంజవేసిన బ్రిటన్, ఫ్రెన్సులు ప్రజాభిప్రాయానికి తల ఒగ్గక తప్పలేదు. కాని పోర్చుగీస్ ప్రభుత్వం యింకా పాతపద్ధతుల్నే అనుసరిస్తు, క్రూరనిర్బంధ విధానం అమలు జరుపుతూంది. మమ్మల్ని పూర్తిగా లొంగదీసి మా స్వాతంత్ర్య కాంక్షనుగూడ నిర్మూలించడానికీ. మా మనోనిబ్బరాన్ని ధ్వంసం చేయడానికీ ప్రతినిత్యా పోర్చుగీసుఅధికార్లు సైనికదళాలను మా గ్రామాలకు సరఫరాచేస్తున్నారు.గోవా పోర్చుగల్‌లో అంతర్భాగమనే సాహసంకల్గింది వాళ్లకీనాడు. ఈనాటికీ పోర్చుగీసుఅధికార్లు మనఆప్తమిత్రులనీ, మన రక్షకులనీ నమ్మే దేశద్రోహులు మనగోవాలో ఉన్నారు! ఎంత సిగ్గుచేటు! ఎంతఅవమానం!

సూర్యాస్తమయం కాబోతుంది. ఇంకా అరగంటలో కారుచీకట్లు గూడా మా గ్రామాన్నీ, మా యింటినీ కమ్మబోతున్నాయి. లంకంత యింట్లో నేనొక్కణ్ణిఅయిపోయాను. ఏకాకిగా జీవితంవెళ్లబోస్తున్న నాకు రోజులుగడిచేదెలాగో తోచడంలేదు.చుట్టుపక్కల యిండ్లన్నీ గబ్బిలాలకు వప్పజెప్పి మా ప్రజలు స్వతంత్రంగా బతకడానికి భారతదేశానికి తరలిపోయారు. వాతావరణమంతా అయోమయంగా, నిరాశాజనకంగా, భయంభయంగా ఉంది. త్వరలో నా బ్రతుకూ్కడా తెల్లవారుతుందేమో అనుకున్నాను.

కాని పరిణామాలు ఎలా జరగబోతున్నాయో యేంచెప్పగలం గనక! మా అదృష్టంకలిసివచ్చి త్వరలో పోర్చుగీసు కిరాతకుల్ని గోవా నుంచి బయటకి గెంటివేయడం సంభవిస్తే, మా యిళ్లన్నీ మా ప్రజలతో

యెప్పటివలె నిత్యకల్యాణం, పచ్చతోరణంగా మారుతాయి. మా గ్రామమంతా మళ్లీ కళకళలాడుతూంది. మా పొలాలన్నీ పుష్కలంగా పండి మా గాదెలు నిండుతాయి. మళ్లీ మా ప్రజలు ఉత్సాహం, సంతోషం, ఆనందంతో నాట్యం చేస్తారు. బానిస జీవితంలో పడరాని పాట్లుపడే మా ప్రజలు నవచైతన్యంతో పునర్జన్మ యెత్తుతారు. అయితే ఆ శుభదినం వచ్చేవరకూ నేను బతికి ఉంటానో ఉండనో మరి! అయితే నా సమాధి మీదుగా దాటిపోయే ప్రతిగోవాపౌరుడూ, మా నాన్న ఆశించినట్లు, తప్పని సరిగా, విధిగా, స్వతంత్ర పౌరుడౌతాడనిమాత్రం తెలుసుకుని ఆనందించగలను. ఆ శుభోదయం యెప్పుడుకలుగుతుందా అని గంపెడాశతో నిరీక్షించుకుని ఉన్నాను.

సమాప్తం.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B153 |
| పుస్తకం పేరు | మాతృ భూమి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 485 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4,152,496 |
| లేని పేజీలు | 477 TO 484.209,210 |
| తయారు చేసినది | Munisha |
| పేజీలు విడదీసినది | Munisha |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |